# శ్రీ మదాంధ్ర

# రామాయణము

అయోధ్యా కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము



ప్రణీతము

**పోచిరాజు కామేశ్వర రావు**

# శ్రీ మదాంధ్ర

# రామాయణము

అయోధ్యా కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము

ప్రణీతము

పోచిరాజు కామేశ్వర రావు

# శ్రీమదాంధ్ర రామాయణము

(మూలము: శ్రీవాల్మీకి రామాయణము)

## అయోధ్యా కాండము

## సర్గము 1.

కం. ఇన వంశార్ణవ సోమా!
జనకాత్మజ హృద్విహార! జనక వచో వ
ర్ధన! లక్ష్మణ నిత్యార్చిత!
ఘనాంగ! కోదండ రామ! కరుణా వనధీ! 1.

శ్రీరాముని గుణగణముల వర్ణన, సద్గుణములకు మురిసి రాజ్యార్హత నెంచి దశరథుఁడు రామునకు యౌవరాజ్య పట్టాభిషేకము సేయఁ దలంచి పౌరులను జానపదులను మంత్రులను బురోహితులను సామంత రాజులను రాజ సభకు నాహ్వానించుట.

కం. చన మేనమామ యింటికి
ననుజుని శత్రుఘ్ను భరతుఁ డాదర మొప్పన్
ఘను నిత్య రిపుఘ్నునిఁ దాఁ
గొని చనియె ననఘుఁడు నెమ్మిఁ గూర్మి చెలంగన్ 2.

కం. అనుజునిఁ గూడి వసించెను
దన తాత తదశ్వపతియుఁ దన మాతులుఁడున్
ఘన వాత్సల్యమ్మునఁ జూ
డ నాత్మజాభమ్ము తమ్మట సతము ప్రీతిన్ 3.

మ. తగ సంతృప్తి మనోరథమ్ము లవి నిత్యమ్మెల్ల నీడేరినన్
నగరంబం దట భ్రాత లిద్దఱును భూనాథుం బితన్ వృద్ధునిన్
వగ చిత్తమ్మున మీఱఁ దల్తు రట సంభావ్యమ్మునం దల్చు నా
జగతీనాథుఁడుఁ బాశి శక్ర నిభులన్ శత్రుఘ్నుఁ దత్సోదరున్ 4.

తే.గీ. నలువురు పురుషర్షభులు ఘన బల విక్ర
మాన్వితులు నిజాం గోద్భ వామల భుజములు
నాల్గు నాఁగ నిష్టు లగుచు వెల్గుదు రని
దశరథుండు దలఁచును నిత్యం బెడంద 5.

ఆ.వె. వారి లోనఁ గూడఁ బరమ ముదావహుఁ
డయ్యె రాముఁ డా మహా ప్రభా వ
పుండు సద్గుణాన్వితుండు భూతములకుఁ
బద్మసంభవు వలెఁ బతికి నెంచ 6.

కం. దను జాధీశుని రావణు
నని వధియింపంగఁ గోర నమరులు తన్నున్
మను జావనిఁ బుట్టెం దగ
సనాతనుఁడు విష్ణువు కడు సంరంభమునన్ 7.

కం. సుతులం దేజస్వంతుని
సతి కౌసల్య కని వెల్గె సత్యదితీ దే
వి తనయు దేవశ్రేష్ఠుని
జితబలుఁ గని వెల్గి నటుల శ్రీరాము ఘనున్ 8.

ఉ. ఆతఁడు రూపవంతుఁడు మహా బలవంతుఁ డమత్సరుండు ధా
త్రీ తల మందు నందన తతిం గనఁ దుల్య విహీనుఁడే గుణ
వ్రాతము లందుఁ దండ్రి సరి పన్నుగ శాంతి మనస్కుఁ డెప్పుడున్
వీత ముఖుం డగుం బరుష వేష్టిత భాషికిఁ దా మృదూక్తియే 9.

చం. కనఁ దనివోవుఁ జేయ నుపకారము నల్పము నొక్క టైననుం
గనలఁడు వానిఁ జేయ నపకారము లెంచఁడు వందలన్ దమ
మ్మునఁ గడు పెద్ద వారి సతముం దగు జ్ఞాన వయో గుణాలిలోఁ
గన వచియించుఁ గైదువులు క్రన్నన నేర్చెడు మధ్య వేళలన్ 10.

ఉ. వీరుఁడు బుద్ధిమంతుఁడును వీర్యము గర్వము నీయ దింతయున్
మూరుచుఁ బల్కుఁ దా నలరి ముందుగఁ బల్కులఁ దీపి నిండఁగా 11.

నేరికి నిత్యమున్ హితములే వచియింపఁ డసత్య మెన్నఁడున్
గౌరవ మిచ్చుఁ బండిత నికాయము వృద్ధులఁ గాంచ నెమ్మినిన్

చం. జనులకుఁ బ్రీతి పాత్రుఁడు ప్రజా చయమం దను రాగ ముండు నీ
తనికి దయా మయుండు కడు ధర్మ విదుండు జితాగ్రహుండు దీ
న నిచయ మందుఁ జూపును ఘనమ్ముగ సద్దయ నిద్ధ శుద్ధుడుం
దనరును నిగ్రహమ్మున సతమ్ము ధరామర పూజకుండునున్ 12.

చం. నిజ కుల యుక్త బుద్ధి మది నిండును మెచ్చును క్షాత్రధర్మమున్
ఋజు వగు కీర్తి స్వర్గ ఫల మిచ్చు నటంచును నమ్ము నిత్యముం
బ్రజలకుఁ గీ డొసంగు పనులన్ రుచియింపఁడు పండితుండు దా
ను జవిగొనండు సుద్దులను నొవ్విడ వాగ్మి నిభంపు వక్తయే 13.

చం. తరుణుఁ డరోగుఁ డగ్ర్య తను ధారి వచో నిపుణుండు దేశ కా
ల రుచిర వేది విశ్రుత నరజ్ఞ వరేణ్యుఁడు ముజ్జగమ్మునం
దరుదుగ నిర్మితుండు విమలాత్ముఁడు సద్గుణ భాసితుండు దా
గురుతర వృత్తిఁ బౌరులకుఁ గూర్మిని బాహ్యచ రాసువుల్ భువిన్ 14.

తే.గీ. విద్యలు ముగించి వేదాంగ వేద నిచయ
మభ్యసించి ధనుర్విద్య యందు మించి
తండ్రి రాముఁడు భరత సోదరుఁడు వెలిఁగె
మంగళ కుల సంజాతుఁ డుత్తుంగ భుజుఁడు 15.

ఉ. సాధు వదీన చిత్త వర సత్య వచో రత వాగృజుక్తియున్
సాధు వయోజ నాగ్ని ముఖ సంతత ధర్మవరార్థ దర్శ నా
రాధన సక్త చిత్తుఁడు కరమ్ము సుధర్మ సుకామ విత్త వి
ద్యాధిక వేది ధీనిధి మహాస్మృతిమంతుఁడు రాఘువుం డిలన్ 16.

తే.గీ. లౌకి కోత్సవ కార్య నిర్వహణ మందు
నైపుణుఁడు కృతకల్పుఁడు నమ్ర తాధి
కుండు సంవృత రూపుఁడు గుప్త మంత్రుఁ
డింక సన్మిత్ర సంయుతుఁ డెల్లపుడును 17.

ఆ.వె. రిత్తవోవ నేర పెత్తఱి నాతని
కోప హర్షము లనఘునివి యాతఁ
డెఱుఁగు నిచ్చునట్టి యీయఁ గూడని వేళ
లంచితముగ డెంద మందు నెంచ 18.

చం. వర దృఢ భక్తి సుస్థిరము ప్రజ్ఞయు దుర్వచనమ్ము లాడఁ డీ
నర వరుఁ డెన్నఁ డేనియు ననర్థము లెవ్వియు నొల్లఁ డప్రమ
త్త రతిఁ జెలంగు నోమరిగఁ దాఁ గనిపింపఁడు స్వీయ దోషముల్
పరజన దోషజాలములు పన్నుగ నెర్గును నిశ్చయమ్ముగన్ 19.

తే.గీ. నేరు శ్రుతులు కృతజ్ఞత నిండి యుండుఁ
బురుషులందు భేదమ్ముల నరయఁ గలఁడు
నరుల దండింపఁ గరుణింప న్యాయ రీతిఁ
దా విచక్షణుండు మిగుల ధరణి లోన 20.

తే.గీ. మంచిఁ బెంచు గ్రహించుఁ దా నంచితముగ
నిగ్రహ మెఱుఁగు రాబడినిఁ దగఁ బెంపఁ
దగు నుపాయముల నెఱుఁగు ధర్మ యుతము
వ్యయము పాటించు పద్ధతి నరయఁ గలఁడు 21.

ఉ. ఉత్తముఁ డయ్యె శాస్త్రముల నున్నత మిశ్రమ శాస్త్ర కోటినిన్
విత్తము ధర్మసమ్మతము ప్రీతి గ్రహించి సుఖమ్ము లింపుగా
సత్తఁ జరించి యొల్ల కలసత్వము నించుక వొందుచుండు దా
నిత్తెము హస్త విద్యలను నెమ్మి నెఱుంగును వేడ్క లన్నిటిన్ 22.

ఆ.వె. సంపద తగఁ బంచ జన సంచయమ్మున
రీతు లమిత మెఱుఁగుఁ బ్రీతిఁ గుంజ
ర హయ రాజములను రయముగ నెక్కుట
లొంగఁ దీసి కొనెడు భంగి నెఱుఁగు 23.

తే.గీ. శ్రేష్ఠుఁ డెన్నఁగ విలుకాండ్ర శిక్షి తాతి
రథులకును మేటి యౌ నిద్ధరా తలమ్ము
నందు నెదురుకొన నడువ నడరి నడుప 24.

సేనఁ జూక చక్యమ్ముగఁ దా నెఱుంగు

తే.గీ. ఆజి నెంచంగఁ గ్రుద్ధ సురాసురుల క
జేయుఁ డనసూయుఁడు ఘనుఁడు జిత రుషుండు
విగత మత్సరుండు నిగర్వి వీత కాల
వశుఁడు నే ప్రాణులను గించపఱుపఁ డెపుడు 25.

ఉ. ఇట్టి విశిష్ట సద్గుణము లెల్ల విరాజిలఁ బౌర కోటికిం
బట్టి ధరాధినాథునకుఁ బన్నుగ సమ్మతుఁ డయ్యె నంత న
జ్జెట్టియె ముజ్జగమ్మున వచింప క్షమన్ ధర వాగ్మి బుద్ధిలో
దిట్ట తనమ్ము నందు ద్యుపతిం బురుడించును రాఘవుం డహో 26.

తే.గీ. ప్రజల కుద్దీప్తుఁడై దశరథునకు జన
కునకుఁ బ్రీతికరుండయి గుణముల వెలిఁ
గె రఘురాముఁడు వీక్షింపఁ గిరణ పంక్తి
దీప్త దినకరు భంగిని దివ్యముగను 27.

కం. సుర దేవాభు నజేయుని
వరవ్రత విభవుని వీరు వసుధా సతియే
వరియించె నంత రాముని
ధరాధినాథునిగ నిజ హృదయమం దెలమిన్ 28.

ఆ.వె. ఇయ్యనేక గుణము లెల్లను వీక్షించి
రాఘవేంద్రుఁడు దశరథుఁడు చింత
సేసె డెంద మందు శిక్షిత శాత్రవుం
డంగజ వరు నందు నలర నెమ్మి 29.

తే.గీ. దీర్ఘజీవి వృద్ధుఁడ నే క్షితి నలరంగ
రాముని నరేంద్రునిగ నే నరయుచుఁ బ్రీతి
నొందఁ గలవాఁడనె యనుచు డెంద మందుఁ
బొడమె నొక్క యాలోచన మడరి యంత 30.

తే.గీ. ఎట్టు లభిషిక్తు సుతుఁ గాంతు నెలమి నంచుఁ 31.

బ్రియతముని( జిత్త మందు పరిపరి నైన
ములఁ దిరుగుచుండె జింతయె మూరి పెక్కు
తడవ లా దశరథునకు నెడము లేక

చం. జగముల వృద్ధి గోరు ననిశమ్మును భూతము లందుఁ బ్రేమఁ జూ
పుఁ గరుణ నుంచి లోకులకుఁ బుత్రకుఁ డిష్టుఁడు మించి నన్ను నిం
ద్ర గరిమ వర్షదాత గతి దా గుణ రాశిని నన్ను మించుఁ ద
ల్పఁగ నిజ వీర్య బుద్ధులను వజ్రి యమద్వయ వాగ్మి తుల్యుఁడే 32.

కం. ధృతిని మహీధర తుల్యుని
క్షితిని నధిష్టించి సుతునిఁ జింతించి వయో
గతి సుఖముగ నిం కేఁగెద
మతి తృప్తిల్లఁగ దివికి సమధిక ప్రీతిన్ 33.

చం. వివిధము లన్య రాజుల నవీక్షితముల్ సుగుణమ్ము లొక్కనిం
గవియ నమేయముల్ తిగ జగమ్ముల నుత్తమముల్ రఘూత్తముం
డవిరళ కీర్తిమంతుఁ గని యవ్వసుధాపతి నిశ్చయించి మం
త్రి వరులఁ గూడి యెంచె నిఁకఁ బ్రీతి మదిన్ యువరాజు నాఁగఁ బో 34.

తే.గీ. కాంచి దివి భువి నంతరిక్షముల రాజు
భయదములు ఘోరతమము లుత్పాతము లగ
పడఁగ మేధావి రాఘవుం డడలి కరము
చెప్పెఁ దన్ను ముదిమి యెల్లఁ గప్ప నపుడు 35.

ఆ.వె. పూర్ణ చంద్ర ముఖుఁడు పుత్రుఁడు రాముఁడు
తనదు శోక మార్పఁ దగెడి వాఁడు
లోకములకు నిష్టుఁ డా కమలాక్షుఁడు
నాఁ దలంచె నెడఁద మోదముగను 36.

ఆ.వె. నృపుఁడు దశరథుండు నిజ శుభము ప్రజల
శ్రేయ మెంచి ప్రియము చెలఁగఁ దగిన
కాల మరుగుదెంచ ఘనుఁడు ధర్మాత్ముఁడు
త్వరిత పడెను భక్తి పరఁగ మదిని 37.

మ. నరనాథుం డనఘుండు జానపద నానా పట్ట ణావాసులన్
ధరణీ ఖండ ధరాధినాథులను బ్రత్యక్షమ్ము కా ముఖ్యులం
ద్వర శాసించెను గేక యాధిపుని నా వైదేహుఁ దక్కంగ విం
దురు వా రిద్ద అనంతరమ్మని మదిం దోఁపంగ సంరంభియై 38.

కం. వారి గృహోభర ణాదులఁ
దోరముగా సత్కరించి తూర్ణము రాఁగన్
వారి నడుమ భూషితుఁడై
యా రాజు వెలింగెఁ బ్రజల నబ్జజు భంగిన్ 39.

ఆ.వె. రాజు కూర్చొనఁగ వర రిపు నిషూదనుం
డంత శేష నృపులు సంతసమునఁ
బౌర సమ్మ తాధిపతులు కదిసి యాస
నము లలంకరించిరి మగఁ డీయ 40.

కం. వివి ధాసనముల నభిముఖ
ము విభుండు దశరథునకు నృపు లరసి రాజున్
సవినయ మాసీను లయిరి
యవనీ పతి సత్కృతముల నలరి భృశమ్మున్ 41.

కం. అల నాగరికులు జానప
దులు ధరణీశ్వరులు మానదులు తన చుట్టున్
విలసిల్ల నా దశరథుఁడు
వెలిఁగె సురలతో బలారి వెల్గిన భంగిన్ 42.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నొకటవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 2.

దశరథుఁడు సభాసదులకు రామునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయఁ దలఁచి నట్లు చెప్పి వారి యభిప్రాయముల నర్థింప రాముని గుణ గణములు వర్ణించి యెల్లరు సంతోషమున నంగీకరించుట.

కం. పరిషత్తుఁ గని నరేంద్రుఁడు
సురుచిరముగ స్వాగతంపు సూక్తుల ననియెన్
కర ముద్ధర్షణము హితము
బురవాసులకు నొడఁగూర్చు ముఖ్య వచనముల్ 1.

మ. నృప సంఘాతముఁ గాంచి పల్కె ఘన వన్నిర్ఘోష భేరీ ని భా
నుప మాహ్లాద రసాన్వితస్వన గిరా యుక్తాతి గాంభీర్యముల్
నృపశార్దూలుఁడు మారు మ్రోగ సభలో నిర్ద్వంద్వ భాష్యమ్ములన్
నృప సల్లక్షణ యుక్త సద్వచనముల్ నిర్విఘ్న భంగిం దగన్ 2.

కం. విదితము గద మీకు సభా
సదులార తనయ నిభమ్ము చక్కని రీతిన్
సదయన్ మా పూర్వకులు స
ముదముగఁ బాలించు టెల్లఁ బుడమిని మిమ్మున్ 3.

కం. మిన్నుఁగ సుఖముల కర్హము
పన్నుగ నిక్ష్వాకు రాజ పాలిత ధాత్రిం
గ్రన్నన శ్రేయము లందఁగ
మన్ననఁ గాంచంగ నెంతు మదిలో సతమున్ 4.

తే.గీ. పూర్వ రాజన్యుల పగిది మూరి నేను
వారి దారి వరించితి పాలనమున
నాదు శక్తి మేర ననిద్ర మేదినీ త
లమ్ము పాలించితిని కాదె నెమ్మి తోడ 5.

చం. తను విది పూర్ణ లోకహిత తత్పరతా గతి సంచరింపఁగన్
ఘన రజ తాతపత్ర పరికల్పిత సౌఖ్యపు ఛాయ లోన ని
ల్చి నర వరావనన్ ముదిమి సేరె శరీరము నందు మిక్కిలిం 6.

జనఁగ సహస్ర వర్షములు శ్రాంతి వరించును నాదు మే నిఁకన్

తే.గీ. రాజగుణ యుక్తులకుఁ గాక యోజ నింద్రి
యముల నిగ్రహింపఁగ రాని యట్టి వారి
కెల్ల భరియింప రాని యహీన ధర్మ
భారమును మోసి యలసితిఁ దీరముగను 7.

కం. సుతు నుంచి ప్రజా హితమున
కతుల పరాక్రముని నిచటి యవనిసురుల స
మ్మతి సర్వుల చక్కఁగ నిఁక
వితతపు విశ్రాంతి నుండ వేడ్క జనించెన్ 8.

ఉ. నా గుణరాశి నెల్ల జననమ్మునఁ దాఁగొనె జ్యేష్ఠ సూనుఁడే
తూఁగు బలారికిం దలఁప దుస్సహ వీర్య గుణమ్ము నందు ను
ద్వేగ రిపువ్రజాలి ఘనవేశ్మ విభూతి సముండు పుష్యమీ
యోగ నిశీథినీపతికి యుక్తుఁడు వొందఁగ యౌవరాజ్యమే 9.

తే.గీ. ధర్మ బద్ధుల శ్రేష్ఠుఁ డతనికిఁ బురుష
పుంగవుఁడు యౌవరాజ్యము నంగజునకు
రామునకు నీయ నెంతును లక్ష్మణాగ్ర
జునకు భాగ్యవంతున కిఁక సురుచిరముగ 10.

ఆ.వె. అర్హుఁ డితఁడు తగ నగర్హిత చరితుండు
ముజ్జగములు మించి సజ్జన గణ
వినయుఁడు ఘనుఁడు ఘన విభుఁ డయి పాలింప
నుత్తమ పతి నాఁగ నొప్పు మిగుల 11.

కం. పుడమి నియమించి నాతనిఁ
గడు వేగమ్ముగఁ దనయునిఁ గాంతునిగా నే
నడరుదు నిఁక వీత క్లే
శుఁడనై యా శ్రేయ మలర సుఖము దలిర్పన్ 12.

మ. తగు నాకంచును దీని మీ రరయ మత్సచ్చింతి తాలోచనం 13.

దగు మీ రీయఁగ నాకు సమ్మతము వక్తవ్యమ్ము కాదేని నేఁ
దగఁ జేయం దగు కార్య మిత్తఱిఁ దగం దర్కించి చిత్తమ్ములన్
నెగడున్ శ్రేయము తద్దయై తలఁచినన్ నిష్పక్షపాతమ్ముగా

తే.గీ. జల్లు కురియి మేఘమ్ముల పెల్లు గాంచి
మురిసి నినదించు నెమళులఁ బోలి రాజు
లెల్ల నభినందన లిడి నరేంద్రునకుఁ జె
లంగిరి కరతాళములఁ బల్కంగ నట్లు 14.

తే.గీ. స్పృహ ముప్పొంగ సభ్యులు సేయ మిక్కు
టముగ హర్ష రావమ్ములు ఢమఢమ యన
మారు మ్రోగ దశదిశలఁ దోరముగను
దద్దరిల్లెను సౌధమ్ము తద్ద యంత 15.

ఉ. భావము ధర్మ మర్థముల బాగుగ నేరిన రాజు పల్కులన్
వావిరి నెర్గి బ్రాహ్మణులు పౌరులు జానప దాదు లెల్లరున్
పేవురు గూడి చర్చలను బ్రీతిని నేక మనస్కులై తగన్
భూవరు తోడఁ బల్కిరి సమోదము వృద్ధునిఁ గాంచి రాఘువున్ 16.

ఆ.వె. వేల యేండ్లు గడువ వృద్ధుఁడ వైతివి
పార్థివేంద్ర! రామభద్రు నింక
యౌవరాజ్య మందు నానందముగ నిల్పు
మార్య! నీదు పుత్రు ననఘు చరితు 17.

కం. వరియింతు మా మహాబా
హు రఘువరేణ్యుని మహాబ లోన్నతు రాముం
గరివర యాన విహారిని
నరవరు ఛత్రావృతాస్యు నలినదళాక్షున్ 18.

చం. అన విని హర్ష మంది మది నైనను నేరని వాని రీతినిం
గనుగొను నిచ్చఁ బల్కె నిటు కాంతుఁడు రాజవరేణ్యులార నే
ననఁగనె వేగ పల్కితిరి యాత్మజు నింపుగ రాజుఁ జేయుఁడీ
యని యను మానమేర్పడె నిజాత్మ వచింపుఁడు సత్య మెల్లరున్ 19.

కం. పరిపాలింప సధర్మము
ధరాతలము నేను మీరు తనయుని యువ రా
జ రమణునిగఁ జూడఁ దలం
తు రెట్లు వినిపించుఁడీ కుతూహల మయ్యెన్ 20.

చం. అన విని పౌర జానపదు లందఱు రాజు మహాత్ముతోఁ దగన్
వినయము మీఱ పల్కి రిటు పెక్కు శుభప్రదముల్ గుణమ్ములం
దనరును నీదు నందనుఁడు తద్దయు దేవసముండు ధీరుడున్
విను మవి యెల్లఁ జెప్పెదము ప్రీతి ముదావహ మా గుణావళిన్ 21.

ఆ.వె. నృపవరేణ్య శక్ర నిభుఁడు దివ్య గుణము
లందు ఘనుఁడు రాముఁ డవని సత్య
వర పరాక్రముండు పరము డిక్ష్వాకు న
రేంద్ర నివహ మందు నెల్లఁ గాంచ 22.

ఆ.వె. లోక మందు సత్పురుషుఁడు రాముఁడు సత్య
ధర్మ రతుఁడు స్వయము ధర్మ మింక
శ్రీ యు రాముఁ గూడి చెలఁగి పాఱుచు నుండు
సంతతమ్ము భువినిఁ జారు తరము 23.

తే.గీ. ప్రజల రంజింపఁ గలువల రాజుఁ బోలు
నోర్పు నందు మించు ననంగ నొప్పుఁ బుడమి
బుద్ధి లోన బృహస్పతిఁ బోలు నెంచ
శౌర్య మందెంచ సాక్షాత్తు శక్రుఁ బోలు 24.

తే.గీ. సత్య సంధుఁ డసూయ నుంచంగ నొల్లఁ
డెడఁద ధర్మవిదుఁడు కృతజ్ఞుఁడు జితేంద్రి
యుండు శీలవంతుఁడును క్షాంతుండు మృదు వ
చనుఁడు దీనానునయ రత సజ్జనుండు 25.

తే.గీ. మెత్త నైన వాఁడు సుదృఢ చిత్తుఁడు ప్రియ
వాదుఁ డెల్ల భూతములకు బ్రాహ్మణుల వి 26.

బుధుల వృద్ధుల సేవించు మూరి కీర్తి
తేజ మందుచే వర్ధిల్లు స్థిరముగ భువి

కం. భువిఁ ద్రిద శాసుర వర మా
నవుల సదస్త్రాఖిలముల నైపుణుఁ డురు శ
స్త్ర విదుఁ డరసె విధి వత్సాం
గ వేదములు విద్య లెల్లఁ గమనీయముగన్ 27.

కం. ఘన ధీనిధి సంగీత
మ్ము నందు శ్రేష్ఠుండు ధాత్రిఁ బుణ్యపు వంశ
మ్మున నుదయించెను సాధువు
ఘనాత్ముఁడు భరతున కన్న కాకుత్స్థుండే 28.

తే.గీ. విప్ర శిక్షితుం డిల ధర్మ విత్త నిపుణు
లందు శ్రేష్ఠుండు సౌమిత్రు ననుజుఁ గూడి
యాజి కేఁగి రాజ్యార్థమ యందు జయము
నంది కాని తిరిగి రాఁడు వందితుండు 29.

చం. సమరము నుండి సత్వరము స్యందన మందు గజమ్ముపైఁ జరిం
చి మరలి వచ్చి పౌరులను స్వీయ జనమ్ముల భంగిఁ బ్రీతి సౌ
ఖ్య మడుగుఁ బుత్ర దారల భటావలి శిష్యుల యగ్ని తోడుతం
గ్రమముగఁ బుత్రుఁ దండ్రి వలెఁ గంజదళాక్షుఁడు రాముఁ డింపుగన్ 30.

కం. తగ మీ శిష్యులు సేవల
ను గర్మములఁ జేయుదురె యనుదినము శ్రద్ధన్
మగధీరుఁడు రఘురాముఁ డ
డుగు నిట్టులు మమ్మరసి విడువక సతమ్మున్ 31.

ఆ.వె. కష్టముల జనులను గాంచిన దుఃఖించు
భృశము జాలి వుట్ట హృదయ మందు
నుత్సవముల నంద ఋండ సంతస మందుఁ
దండ్రి వోలె నతఁడు తద్దయు నృప! 32.

ఆ.వె. నవ్వుచు మును పల్కు నెవ్వరితో నైన
ధర్మ మంద నిల్చు నిర్మలుండు
ఘన ధనుర్ధరుండు కలహమ్ము కోరఁడు
శ్రేయము లొనఁగూర్చు నాయతముగ 33.

తే.గీ. తర్క మందుఁ గరము దిట్ట తాదృశ ధిష
ణుండు సుభ్రూ విలసితుండు చండ శౌర్య
వీర్య విక్రమ గుణముల విష్ణు నిభుఁడు
రక్త లోచన లోకాభి రాముఁ డతఁడు 34.

తే.గీ. ప్రజలఁ బాలించు విద్యలోఁ బ్రజ్ఞ కలదు
రాగములకు లొంగఁడు సుంత రాముఁ డేల
ముజ్జగము శక్తిమంతుఁడు పుడమి నెల్ల
నేల నర్హుఁ డనఁగఁ జెప్ప నేల యింక 35.

తే.గీ. ఎన్నఁ గోప మనుగ్రహ మెన్నఁ డేని
రిత్త వో నేర వితనికి నెత్తఱి నయి
న సమయంగఁ జేయును వధ్యు నయము నరసి
చంపఁ దగని వాని పయి రోషమ్ము గొనఁడు 36.

తే.గీ. ప్రీతి నెవ్వనిపైఁ జెందు విత్త మిచ్చి
తృప్తి పఱచు నాతని నంశు దీప్త సూర్యు
భంగి జనముదావహములై పరఁగు స్వీయ
శాంతి గుణముల వెల్గును సంతతమ్ము 37.

కం. సుర దేవాభు గుణవిభవు
వర సత్యపరాక్రము ఘను వసుధా సతియే
వరియించె నంత రాముని
ధరాధినాథునిగ నిజ హృదయమం దెలమిన్ 38.

తే.గీ. నిజమునఁ గుమార గుణయుక్తుఁడు జనియించె
భాగ్య మన రఘురాముఁడు పన్నుగ నిడ
నీకు శ్రేయ మదృష్టము నెగడి కశ్య 39.

పుఁడు మరీచున కప్పుడు పుట్టినట్లు

ఉ. రాముని సుస్థ మాయువు బలమ్ముల వృద్ధిని మిక్కుటమ్ముగం
బ్రేమగఁ గోరుకొండ్రు మది పేల్పులు దైత్య భుజంగ మానవుల్
సామర లోక గాయనులు నందఱు రాష్ట్ర పురమ్ము లందు పౌ
రామల చిత్త జానపదు లావలి లోపలి వార లందఱున్ 40.

కం. రమణులు వృద్ధులు తరుణులు
నమస్కరింతు రుదయమ్ము నవ్రుత సాయం
సమయము యశస్వి రాముని
కమలాత్మునకై సకల సురావళి సతమున్ 41.

తే.గీ. వారి ప్రార్థనఁ బృథ్వీశ మూర నీదు
కరుణ యిందీవరశ్యాము ఘను రిపుఘ్ను
రాము యౌవరాజ్య పదవి రాజ తనయుఁ
జూడఁ గోరుచు నుంటిమి సురుచిరముగ 42.

ఆ.వె. దేవ తుల్యు ననఘు దేవ! నీదు సుతు ను
దార కలితు జన హిత రత చిత్తు
నరసి మా హితమ్ము నభిషిక్తుఁ జేయ న
ర్హుఁడవు నీవు రాము నొప్పిదముగ 43.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు రెండవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 3.

దశరథుఁడు వసిష్ఠ వామదేవులను రామ పట్టాభిషేక కార్యములను నిర్వహింప మని సంభారములను

సమకూర్ప మని యాదేశించుట, రాముని సభకు గొనితేర సుమంత్రునిఁ బంపి వచ్చిన రాముని నుపదేశించుట.

కం. అంజలి బద్ధుల వారిని
రంజిల్లి గ్రహించి పంక్తిరథుఁడు ముదమునన్
మంజుల వాక్కుల ననియె స
మంజస హితములు ప్రియములు మన్నన తోడన్ 1.

తే.గీ. అంద ఱిష్టపడఁగఁ గాంచ యౌవరాజ్య
పదవి నా జ్యేష్ఠ పుత్రుని నెదఁ జెలంగెఁ
బ్రీతి మిక్కుటముగ నాకు వెలసె నతుల
మగుచు నాప్రభావము దాన నధికతరము 2.

కం. అని సమ్మానించి తగ ధృ
తినిఁ గాంచి వసిష్ఠ వామదేవ ద్విజులన్
వినుచుండఁగఁ దన్ను నృపతి
వినుత యశస్వి పలికెను గభీర వచనముల్ 3.

తే.గీ. ఇది పవిత్ర చైత్రము పుష్పి తేద్ధ వనము
రామ యౌవరా జ్యార్థ కర్మముల నెల్ల
నిర్వహింప నర్హులు మీ రని పలుకంగ
మిన్ను ముట్టెను జనఘోష మన్నిదిశల 4.

కం. సద్దుమణుఁగ జన ఘోషము
తద్దయు ప్రీతి ముని నాథు ధరణీసురులం
బెద్ద వసిష్ఠుని తోడన్
సుద్దు లిటుల ఱేఁడు పల్కె శుభదాయకముల్ 5.

కం. అభిషేకింపఁగ రాముని
నిభ నిభ గమను వలసిన మునివరేణ్య! పనుల్
శుభ సంభారమ్ములతో
విభవ మలర నర్హు లీరు వెసఁ బంచ నిటన్ 6.

ఉ. విని వసు ధాధినాథుఁ డన విప్రవరేణ్య వసిష్ఠుఁ డంతటం
గని సముఖమ్మునం దనరి కాంతున కింపుగ నంజలించి ని
ల్చిన వర కార్యయుక్తులను జెన్నుగ నాజ్ఞల నిచ్చె వారికిన్
ఘనముగ నిట్లు రామునకుఁ గట్టగఁ బట్టము రాజు నాజ్ఞనున్ 7.

సీ. రాజాగ్ని హోత్ర హర్మ్యమ్మున నుదయమ్ము నందు వలయును మీ కందు నుంచ
రత్న రాసులు సువర్ణమ్ము లింక బలులు సర్వౌషధమ్ములు స్వచ్ఛ మైన
మాలలు పేలాలు మధువు వెన్నను విడివిడిగఁ గ్రొత్త వగుపచ్చడము లరద
ములు సకలాయుధమ్ములు చతురంగబలమ్ములు గజము సలక్షణమును
తే.గీ. జామరమ్ములు తెల్లని ఛత్రము ధ్వజ
ము శత శాతకుంభము లగ్నిఁ బోలు నవియు
నింకఁ గాంచన శృంగ వృషేంద్రము పులి
చర్మము సమగ్ర ముండంగ సత్వరమ్ము 8.

చం. ఇతరము లింకయున్ వలయు నెల్లను దే వలె వస్తుజాలమున్
వితతము ద్వార జాలములు వీడుల నంతిపురమ్ము లందు నం
చితముగ నద్ది గంధము విశేషపు వాసన లీన ధూపముల్
మతి నలరించు రీతి నిడి మంచివి మాలల నుంచఁగా వలెన్ 9.

తే.గీ. అన్నము ప్రశస్తము దధిదోహ్య కృత సమ్య
గన్నములు విప్రులు శత సహస్ర సంఖ్య
లకు సరి యగు నట్టులను వలసిన రీతిఁ
జక్కఁగ సమకూర్ప వలయు సత్వరమ్ము 10.

ఆ.వె. సత్కరించి విప్ర సత్తములను రే పు
దయము ఘృతము దధి యుతమ్ము నీయ
వలయు దక్షిణలును బన్నుగఁ బేలాలు
పుష్కలముగఁ గదలి ముదము తోడ 11.

కం. ఉదయింపఁగ రేపు రవియె
పదిలపు సుద్దులను మించి పలుకగ వలయుం
గద ద్విజులను నియమింపుఁడు
పదపడి యాసనము లుంచ వలయును జుమ్మీ 12.

తే.గీ. కట్టుఁడు పతాకములు రాజ గతులు దడుపుఁ
డంబువులఁ జక్కఁగ నట జనాలి గణిక
ల సమలంకృతల ద్వితీయ రమ్య కక్ష్య
నిలువఁ బంపుఁడు దివ్యంపు నృపగృహమున 13.

కం. గుడులం దన్నము భక్ష్యము
లడరి సదక్షిణల దండ లానందముగన్
విడివిడిగ నూనఁ దగ ని
ల్పుడు యోగ్యుల నెంచి రుచిరముగ పేపేగన్ 14.

తే.గీ. పొడవు కత్తి ధరించిన ముఖ్య యోధు
లూని క్రొత్త బట్టలు భూవరోత్త మాంగ
ణమ్ము నప్రమత్తతఁ ద్వరితమ్ము చేరి
యుండ వలయు నచ్చోటను మండితముగ 15.

ఆ.వె. విప్రు లిద్ద అట్లు క్షిప్రము చేయ వ
లసిన యట్టివి పనులం ద్వరితము
పనిచి చెప్పి రంతఁ బార్థునకు మిగిలి
నట్టి పనులుఁ జేసి రాదరముగ 16.

కం. తనిసి ముదము వడసి భృశ
మ్ము నృపోత్తముఁ జేరి విప్ర పుంగవు లంతం
బను లెల్లఁ జేసితిమి మే
మనిరి యథోక్త వచనముల నవనీశునితో 17.

మ. ద్యుతిమంతుండు నరేంద్రుఁ డంతట సుమంత్రుం బిల్చి సంప్రీతి నా
కృత చిత్తుండు సుతుండు రాము నిట వీక్షింపంగ పే తెమ్మనం
బతి యాదేశము వూని యట్ల యని యా ప్రఖ్యాత సూతుండు నం
చిత వీరున్ రథికవ్ర జాధికునిఁ దెచ్చెన్ శ్రేష్ఠపుం దేరునన్ 18.

ఉ. ఉత్తర దక్షిణెం ద్ర్యపర యుక్త నరేంద్రులు గొల్చుచుండి రా
సత్తము లార్యు లన్యులును శైల వనాంతర వాసు లింక మ్లే 19.

చ్ఛోత్తమ రాజవర్యులు మహోన్నత పంక్తిరథుండు వృద్ధ రా
ట్సత్తము నింద్రు దేవతలు చక్కగఁ గొల్చెడు చంద మొప్పగన్

కం. ప్రాసాదమ్మునఁ దా నట
భాసిల్లుచు రాజఋషి సభ మరుత్తులతో
వాసవు వలె వారలతో
పే సుతు నరదమున వచ్చు వీరుం జూచెన్ 20.

సీ. గంధర్వ పతిఁ బోలు కమనీయ రూపుని విశ్వ విఖ్యాతైక వీర వరునిఁ
బొడవైన చేతులఁ గడు దొడ్డ బల్లిదు మత్తమాతంగ గమనము వానిఁ
జలువజాతిని మించు చక్క నయిన మోము వానిఁ బ్రియముగఁ గన్పట్టు వాని
నంద చందమ్ముల నలరెడు గుణములఁ జూచు మగల దృష్టి దోఁచు వాని
తే.గీ. నెండ మ్రగ్గిన జనులకు నెలమి నిచ్చు
మబ్బు పగిది వచ్చెడి వాని నబ్బురముగఁ
జూచు చుండి రాముని జ్యేష్ఠ సుతుని దశర
థుండు రాజ వరుండు నేరండు తనియ 21.

కం. చేయూత దింపి రాముని
నా యరదము నుండి చక్క నాతఁడు చనఁగన్
స్వీయ పితృ సమీపమ్మున
కే యంజలుఁడై సుమంత్రుఁ డేఁగెను వెనుకన్ 22.

ఉ. ఆతఁడు వెండి కొండ సరి హర్మ్యము నెక్కెఁ గనంగఁ దండ్రినిన్
సూతుఁడు తోడు రాఁగ వర శూరుఁడు రాముఁడు చేరి రాజునుం
బ్రీతిని నంజలించి కడు వేగము నామము నుచ్చరించి తా
నాతత భక్తి మ్రొక్కెఁ దగ నా ధరణీశు పదమ్ము లంటుచున్ 23.

చం. సుతుని నమస్కరింప దరిఁ జూచి కృతాంజలుఁ జేరఁదీసి ప్రే
మ తనరఁ గేల నంటుచుఁ గుమారుని బిట్టుగఁ గౌఁగిలించి ర
త్నతతుల వెల్గు నాసనము తద్దయుఁ బెద్దది జాతరూప భూ
షితము నొసంగె నొప్పిదము శీఘ్రము రామున కిచ్చమెచ్చుచున్ 24.

ఉ. గద్దియ కిచ్చె వెల్గు నిజ కాంతుల రాముఁడు మేరు శృంగికిం 25.

దద్దిన రత్న మిచ్చిన విధమ్ముగఁ బ్రీతి నలంకరించి యా
పెద్ద సభా నివేశ మట వెల్గెను రాముని కాంతి రాశిచేఁ
దద్దయు శార దాభ్రము సతారక సగ్రహ చంద్రుతో వలెన్

ఉ. అద్దము నందుఁ దన్ను గని నట్టుల నాత్మజుఁ గాంచి తల్చెఁ ద
న్నద్దిన యట్టు లుండఁ గడు హర్షము వొందెను బల్కె నవ్వుచున్
సుద్దులు కొన్ని పుత్రునకు సువ్రత కశ్యపుఁ డింద్రు తోడుతం
దద్దయుఁ బ్రీతిఁ జెప్పిన విధమ్ముగఁ బుత్రుల యందు మేటికిన్ 26.

ఉ. పుట్టితి వింపుగాఁ దగిన పుత్రుని గాఁ దగి నట్టి దైన నా
పట్టపు రాణికిం బరమ పావనికిం బ్రియ మీయ నా కెదన్
దట్టపు హర్ష మందె జన తండము నీదు గుణాలి చేతఁ గాఁ
బట్టి సుపుష్య యోగమునఁ బట్టము నందుమ యౌవరాజ్యమున్ 27.

చం. ప్రకృతి గుణోన్న తుండవు నరప్రవరుండవు నమ్రపుం గుమా
రకుఁడవె యైన స్నేహము కరమ్ము సెలంగ వచింతు నీకుఁ బు
త్రక హితభాషణమ్ములు సతమ్ము జయించు నిజేంద్రియాళిఁ గో
రికలను గిన్కలం గలుగు రిత్తగనౌ యలవాట్లు మానుమా 28.

కం. కనిపించెడు కనిపింపని
వి నడతల నమాత్యుల జన బృందమ్ములఁ జ
క్కని రీతి నెల్లరకుఁ బ్రీ
తిని నిమ్ము తనివి కరమ్ము తీర సతమ్మున్ 29.

ఉ. గాదెలు నాయు ధాలయ నికాయము చక్కఁగఁ బెంచి సంతతం
బాదర మొప్పఁ బౌర నిచయమ్మును బ్రీతిని నుంచి నిత్యమున్
మేదినిఁ జేయఁ బాలనము మిత్రులు మెత్తురు రాజు నా సుధన్
మోదము చెందెడిన్ సురల వోఁడిమి నట్టుల నీవు నుండుమా 30.

కం. అది విని ప్రియకారకులు సు
హృదు లా రామునకుఁ ద్వరిత మేఁగి విషయ మా
సుదతికిఁ గౌసల్యా సతి
కిఁ దగ నివేదించిరి సతికి ముదం బీయన్ 31.

ఆ.వె. ప్రియము చెప్ప రామ దయితులు కౌసల్య
మురిసి యీయఁ బంచె ముదిత వివిధ
రత్నములు సువర్ణ రాసులు గోవులు
వారి కెల్ల నంత వారిజాక్షి 32.

కం. నృపతికి నమస్కరించి ర
ఘుపతి యరద మెక్కి వేగ కూర్మి జనులు త
న్నపరిమితము పూజింపన్
విపుల నిజ గృహమున కేఁగె వెలిఁగి ముదమునన్ 33.

కం. విని రాజు వచనములు తీ
రిన కోరికతో భృశము మురిసి రాజాజ్ఞం
గొని వేశ్మముల కరిగి సుర
లను బూజించిరి నియతిఁ బుర నరులు భక్తిన్ 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు మూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 4.

మంత్రులతో సంప్రదించి దశరథుఁడు తిరిగి రాముని సుమంత్రుచేఁ బిలిపించుకొని మరునాఁ డతనికిఁ దాను గన్న దుర్నిమిత్తములను దెలిపి యౌవరాజ్య పట్టాభిషేక మని తెల్ప రాముఁడు సుమిత్ర సీత లక్ష్మణులతో నున్న తల్లి వద్ద కేఁగి యాశీర్వచనములు పొంది సీతతోఁ గూడి నిజ గృహమున కేఁగుట.

ఉ. పౌరులు నిష్క్రమింప మఱి పన్నుగ మంత్రులతోడ నింపుగా
భూరమణుండు సల్పి తగ ముఖ్యపు మంతనముల్ గడించి నా
తోరపు నిశ్చయజ్ఞుఁ డతి తూర్ణము రాముని యౌవరాజ్యమం
దారయ రేపు బుష్యమిని నంచుఁ దలంచెను దల్చి యంతటన్ 1.

ఆ.వె. గృహము లోని కేఁగి నృపవరుండు దశర
థుఁడు సుమంత్రుఁ బంచె వడిఁ దిరిగి కు
మారు రామునిఁ గొనితేర సముఖమున
కెలమి నలిన నేత్రుఁ బలుక నెంచి 2.

కం. తలఁ దాల్చి రాజు నాజ్ఞఁ గ
దలె సూతుఁడు శీఘ్రమ యరదముపై హర్షం
బలర సుమంత్రుఁడు రాముని
నిలయమునకు వేగ రామునిం గొనితేరన్ 3.

తే.గీ. తిరిగి సూతుని రాకను దెలుప ద్వార
పాలకులు విని శంకించి యేల యనుచు
రమ్మనఁగ రాఁగఁ గతమును రాముఁ డనియెఁ
జెప్పుడు తిరిగి రాక కశేష మనుచు 4.

ఆ.వె. పల్కె సూతుఁ డంతఁ బన్నుగఁ జూడ నెం
చె రఘుపుంగవ నిను ధరణి విభుఁడు
వెడల వెడల కుంట వీర! నీ వర్థుఁడ
వింక నిర్ణయింప నెడఁద ననుచు 5.

కం. విని యా పల్కులు రాముఁడు
చనెఁ ద్వరితమ్ముగ నరేంద్ర సత్తము వీక్షిం
ప నరోత్తముండు రాజ భ
వనమ్మునకు నాత్ర మడర వనజాక్షుండే 6.

ఉ. వచ్చెను నందనుం డనఁగఁ బార్థుడు ప్రీతిని నాలకించి పే
యిచ్చె ననుజ్ఞఁ జేరఁగ వచింపఁగ సుద్దులు కొన్నియంతటన్
వచ్చి సుతుండు దూరమునఁ బన్నుగఁ దండ్రినిఁ గాంచి యంజలిన్
మెచ్చఁగఁ దండ్రి నిల్చెను సమీపము నందు సభక్తి యంతటన్ 7.

కం. ప్రణమిల్లు నిజ తనయు నను
గుణ మెత్తి కవుఁగిలి నుంచి కూర్మి చెలంగన్ 8.

మణిమయ పీఠ మిడి పలికె
గణనీయ గుణ గణునకు నికాశేంద్రునకున్

ఉ. రామ! చిరమ్ము మంటిని కరమ్ముగ వృద్ధుఁడ నైతిఁ బొందితిం
గామిత భోగ కామములు గ్రన్ననఁ జేసితిఁ బెక్కు జన్నముల్
ప్రేమ నొసంగి దక్షిణలు పెల్లుగ నన్న సముచ్చయమ్ములున్
భూమి నతుల్య పుత్రు నిను బూరుష పుంగవ! కంటి నిష్టునిన్ 9.

ఉ. చేసితి నిష్టు లింపుగను జేరి పఠించితి వేదశాస్త్రముల్
త్రాసము లేక యిష్ట సుఖదమ్ములు వొందితి నిచ్చమెచ్చఁగన్
భూసుర దేవ మౌని పితృ పుణ్య ఋణమ్ములు తీర్చియుంటి నేఁ
జేసిన యప్పులం బుడమి శీఘ్రము తీర్చితి నెల్లఁ బుత్రకా 10.

తే.గీ. కార్య మొండు లే దొనరింపఁ గాంచ నాకుఁ
జేయ నీ యౌవ రాజ్యాభిషేక మొకటి
దక్క యిఁక నా నుడివి నది మక్కువ నొన
రింప నర్హుండవు కుమార! పెంపు తోడ 11.

కం. ప్రజ లెల్ల నిన్ను భూపతి
గఁ జూడఁ గాక్షింత్రు నేఁడు గాన కుమారా
స్వజ నాభిమతం బెంచి త
గఁ జేయుదు నిను యువరాజుగ రఘువరేణ్యా! 12.

చం. అదియును గాక రామ! కలలం దశుభమ్ములు గాంచుచుంటి నిం
క దినము లందు నుల్కలును గర్జలతోఁ బిడుగుల్ ధరిత్రిపై
బెదరఁగఁ గూలు చుండెఁ బరివేష్టితు లా కుజ రాహు లుద్ధతిన్
స దినకర గ్రహమ్ము మమ జన్మ నభస్సదు దారుణమ్ముగన్ 13.

తే.గీ. జోస్యులు పలికి రట్టు లసువుల పోక
నరపతి కనఁగ నొండు ఘనంపు టాప
దలు కలుగు టొండు నట్టివి తనర నగును
రామ సాధారణమ్ముగ భూమి పైన 14.

తే.గీ. ఎంత దనుక నా హృదయమ్ము సుంత మార
కుండు నంత లోపున రామ! యొప్పుగ నభి
షిక్తుఁడవు కమ్ము ప్రాణుల చిత్తము లవి
చంచలమ్ము లగును జుమ్మి యెంచ భృశము 15.

ఉ. చంద్రుఁడు నేఁడు కన్పడును జక్క పునర్వసుఁ గూడి సంత తా
తంద్ర! విలాసి పుష్యమినిఁ దప్పక కూడఁ గలండు రేపు తా
రేంద్ర సుయోగ మందు సుత! యీ యభిషేకము నొందు మింపుగా
నింద్ర నిభమ్ము నా హృదయ మిందుకు వేగిరపెట్టు చుండెఁ జూ 16.

ఉ. కావున నేటి నుండి నిజ కాంతయుఁ జక్క నియంత్రి తాత్మలన్
నీవు కుశాస్తరమ్ములను నిద్రిలుఁడీ యుపవాస బద్ధులై
వావిరి యప్రమత్త సఖ వారము నుంచుము రక్ష నీయఁగా
నీ విధ కార్య సంతతికి నేర్పడు విఘ్నము లెన్నియే నిలన్ 17.

చం. భరతుఁడు తమ్ముఁడెంత తటి పట్టణ బాహ్యము నందు నుండునో
పరగును బ్రాప్తకాలముగఁ బట్టము కట్టఁగ నీకు నాఁ దలం
తు రుచిర బుద్ధి యాతఁ డిలఁ దోరము సచ్చరితుండు ధర్మ మం
దు రతిని నుండు నింద్రియ జితుండు దయానిధి జ్యేష్ఠ భక్తుఁడున్ 18.

కం. అయిన ననిత్యము మానవు
ని యంతరంగ మని యెంతు నే నెదఁ దగు వా
రయిన గుణమ్ముల ధర్ములు
నయినఁ బ్రసన్నులు నయిన నిజాత్మల రామా! 19.

తే.గీ. జరుగు నభిషేకమే రేపు చక్కఁగ నని
చను మిఁక ననంగఁ దాఁ గొని యనుమతి జన
కునకు వందనముల నిడి కూర్మి సుతుఁడు
రాముఁ డేఁగె వేశ్మమునకు రమ్యముగను 20.

ఆ.వె. స్థిర మన నృపతి యభిషేకము తనకుఁ ద
త్క్షణమ రాముఁ డంతఁ దరలి తనదు
గృహమునకును దల్లి గృహము కదిసి యంతి 21.

పురము లోని కేఁగె ముదము తోడ

కం. అచ్చట నర్చన నగరునఁ
బచ్చడమును దల్లిఁ గట్టఁ బట్టుది రాముం
డచ్చపు మౌనమున దనరి
యిచ్చను శ్రేయమ్ము గోరు నింతినిఁ గాంచెన్ 22.

ఉ. సీతను దెచ్చి రచ్చటకు శ్రీరఘు రాముని పట్ట మెర్గి సం
ప్రీతిని మున్న లక్ష్మణ సుమిత్రలు వచ్చిరి వేగ మత్తఱిన్
మాత నిమీలితాక్షి యయి మన్నన నుండె సుమిత్రయుం దగన్
సీతయు లక్ష్మణుం డలరి సేవలు చేయుచు నుండఁ బ్రీతిమై 23.

తే.గీ. పుష్యమీ శుభ తారను బుత్రు వినుత
విమలు యౌవరాజ్యాభిషేక మని విని పు
రుషు జనార్దను ధ్యానించె లోకనాథు
నాదరమునఁ బ్రాణాయామ మందు నుండి 24.

చం. నియమము లందు నిష్ఠగను నిల్చిన తల్లిని జేరి రాఘవుం
డె యడరి పల్కె హర్షమున నిట్టుల యమ్మ! నరేంద్రుఁ డింపుగా
రయమున రాజ్య పాలనము రమ్యము గా నొనరింపఁ బంచెఁ దం
డ్రియె యభిషేక మిచ్చట వడిం దలపెట్టెను రేపు ప్రీతినిన్ 25.

తే.గీ. సీతఁ గూడి యుపవసింప రాతిరి వల
యుఁ దగ నాకని వచియించె నొజ్జ లింక
ఋత్విజులఁ గూడి జనకుండు సత్వరమ్ము
వలయు మంగళంపుఁ బనులు పరఁగ నిమ్ము 26.

కం. విని యా మాటను జిర కా
ల నిజేప్సితము జనని కనుల ముదశ్రులు రా
ల నిజాత్మజునిఁ గని వచిం
చెను గౌసల్య వచనములు శీఘ్రము యిట్లున్ 27.

తే.గీ. వత్స! చిరకాల మిల రామ బ్రతుకు మయ్య 28.

యరులు నీకు నెల్లరు హితు లౌదు రయ్య
నాదు బంధులకు సుమిత్ర బంధువులకు
నడరి వైభవమ్ము వడసి హర్ష మిమ్ము

ఆ.వె. పుట్టి తీవు పుత్ర! పుణ్య నక్షత్రమ్ము
నందు నాకు గుణము లందు మించ
సంతసించెఁ దండ్రి సంతతమ్ము నృపతి
నిన్ను గాంచి యాత్మ మిన్నగాను 29.

తే.గీ. భక్తి పురుషోత్తముని పయి వమ్ము కాదు
నాది భువి నౌర నలినేక్షణ నిజ మరయ
రమణి వరియించె నిక్ష్వాకు రాజ్యలక్ష్మి
నిన్ను నందన యింపుగ నేఁడు మురిసి 30.

తే.గీ. తల్లి మాటలు విని యంత నుల్లసిల్లి
యపుడు తన్నరయుచు వినయమ్ము తోడఁ
జెంతఁ బ్రాంజలి నిల్చిన చిన్ని తంబు
లక్ష్మణునిఁ గాంచి నవ్వుచు రాముఁ డనియె 31.

ఉ. లక్ష్మణ నన్ను గూడి మఱి రమ్యతరమ్ముగ నీవు నేలు మీ
లక్ష్మపు ధాత్రి నెల్లను దలంపఁగ రెండవ యంతరాత్మ వీ
లక్ష్మియు నిల్చె నిం గదిసి రాజ్యము భోగము జీవితమ్మునున్
సూక్ష్మముగాఁ దలంచి మదిఁ జూచిన నీ కొఱ కంద నెంచుదున్ 32.

ఆ.వె. నీకు నిష్టము లగు నిత్య భోగములును
రాజ్య ఫలము లెల్ల భోజ్యము లగు
నీకు ననుభవించు నెమ్మి సౌమిత్రి ని
శ్శంక నన్ను గూడి సంతతమ్ము 33.

తే.గీ. పలికి యిట్లు సౌమిత్రుతో వందనములు
తల్లు లిద్దఱకు నొసంగి యల్లతాంగి
సీతకు ననుజ్ఞఁ గైకొని సీత తోడ
నేఁగె సంతసమున రాముఁ డింటి కంత 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 5.

దశరథుఁడు కోరఁగా వసిష్ఠ మహర్షి రాముని భవనమున కేఁగి మరునాఁటి యభిషే కార్థము సీతా రాములను మంత్ర పూర్వకముగా నుపవాస కార్యము నారంభింపఁ జేసి రాజ వీథులలో జనుల యుత్సాహమును గాంచి  రాజును సమీపించి సీతారాముల నుపవసింపఁ జేసి నట్లు విన్నవింప రాజు సంతోషముతో సభా సదులను వీడుకొలిపి యంతఃపురమున కేఁగుట.

కం. పనిచి నిజాత్మజుఁ దలఁచి మ
రునాఁటి యభిషేకమును బురోహితుని వసి
ష్ఠునిఁ బిలిపించి నరేంద్రుఁడు
మునినిం గని పలికె వచనములు సముచితముల్ 1.

కం. చనుఁడు తపోధన! రఘు రా
మునిఁ గోడలి తోడుత యశము సిరియు రాజ్య
మ్మున కుపవాసము తగ ని
ష్ఠునిచే జరిపింపుఁ డా యశోధను చేతన్ 2.

కం. అట్టులె యని వేదమ్ములఁ
బట్టు గల మునులకు నెల్ల వర తాపసుఁ డ
ప్పట్టునఁ బ్రీతి వసిష్ఠుఁడు
దట్టపు రామ గృహమునకుఁ దరలె స్వయముగన్ 3.

కం. సుదృఢ వ్రతుఁడు వసిష్ఠుఁడు
సదుచిత ధరణిసుర యుక్త సద్రథ మందుం
గదలె నుపవసింపింపఁగ 4.

సదయుడు మంత్రముల మంత్ర సర్వజ్ఞుండే

ఆ.వె. తెల్ల నైన మబ్బు దీటు వెల్గెడు రాము
నింటిఁ గదిసి మునివరేంద్రుఁడు తిగ
తొట్టికట్టు లెల్లఁ దోరంపు తేరున
సేఁగె నా వసిష్ఠుఁ డెలమి మీఱ 5.

చం. కని ముని వచ్చు వానిఁ దగ గౌరవ మొప్పఁగ సంభ్రమమ్ముగనన్
ఘనుని వసిష్ఠు మాన్యుని సకాశము వేశ్మము నుండి వచ్చి చే
రి నతశిరుండు రాఘవుఁడు లీలఁగ నూని కరమ్ము దింపె నా
మునివరుఁ దేరు నుండి తగ మూరిన భక్తి విశాల బాహుఁడే 6.

తే.గీ. ఆతఁడు పురోహితుఁడు జూచి యా రఘూత్త
ముని ప్రియార్హుని సద్వినయునిఁ బలుకుల
హర్ష మొసఁగ దీవించి మహర్షి యంతఁ
బల్కె నిట్టుల మాటలు పుల్కరింప 7.

కం. మదినిఁ బ్రసన్నతఁ బడసెఁ గ
డిఁది నీ జనకుండు కడు వడిన్ యువరాజౌ
పదమున కుపవాసము సే
యఁ దగు సభార్య రఘురామ! యడరుచు నేఁడే 8.

తే.గీ. సదయ నిన్నభిషేకించు నుదయ మందు
యౌవరాజ్యము నందు నరాధిపుండు
నహుష చక్రవర్తి నిజ తనయుని నయ్య
యాతినిం బ్రీతిఁ జేసిన రీతి రామ! 9.

తే.గీ. పలికి యిట్లు మంత్రములతోఁ బన్నుగ నుప
వాస మొనరింపఁ జేసెను వా రిరువురి
చే యతవ్రత రాముని సీతను దగి
నట్టి రీతి వేదజ్ఞ బ్రహ్మర్షి మురిసి 10.

తే.గీ. అంతఁ బూజింప రఘు రాముఁ డర్హ రీతి 11.

రాజగురువు గొని యనుజ్ఞ రాఘవేంద్రు
నుండి వెడలె రామ గృహము నుండి ప్రీతి
నా వసిష్ఠుఁడు దశరథు నరయ వేగ

కం. వెడలె నచటి మిత్రులచేఁ
గడు గౌరవ మంది యంతఁ గాకుత్స్థుఁడు దా
నెడఁద నలరి చన ననుమతి
నిడ వేశ్మము లోని కిన కులేంద్రుఁడు చక్కన్ 12.

కం. విరిసిన తామరల వెలుఁగు
సరసిఁ జెలఁగు మద శకునుల సరణిన్ ధరణిన్
నర నారుల రామ గృహము
కరము వెలిఁగె నప్పుడు ఘన కాంతుల తోడన్ 13.

చం. చని సదనమ్ము నుండి నృప సద్మ నిభమ్మగు దాని నుండి వే
ముని వరుఁ డింపుగా నరసె ముచ్చట లాడు జనాళి రాజ వీ
ధిని గమి చేతఁ గ్రిక్కిఱియఁ దేరున కింతయుఁ గష్టమై చనన్
జనుల కుతూహలమ్ము నటఁ జక్కఁగఁ గాంచెను సంతసమ్మునన్ 14.

తే.గీ. జనుల హర్ష నిస్వనములఁ జక్క నైన
రాజ మార్గము లెల్ల విరాజిలె నట
భంగ సంఘర్షణములఁ జెలంగు సాగ
రమ్ము పగిది వీక్షించు వారలకు నెల్ల 15.

తే.గీ. ఆ దిన మయోధ్య యందు మహాపథమ్ము
లెల్ల నంబు సిక్తము లయ్యె నుల్లము లల
రంగ నూడ్చిన పిమ్మట రమ్య వేశ్మ
రాజిపై ధ్వజము లెగిరెఁ దేజ మలర 16.

ఆ.వె. తివిరి చూచి రెదురు స్త్రీ బాల వృద్ధు ల
యోధ్య లోన భాస్కరోదయం బ
రయఁ దలంచి వేగ రామాభిషేకము
కన్నుల కఱ వెల్ల సన్నగిల్ల 17.

కం. జనుల కలంకారము ముద
మును బెంచెడి యుత్సవమ్ము పురిలోఁ గాంచం
గను జన కుతూహలము పె
ర్గ నయోధ్యా నగర మందు కేళీ లీలన్ 18.

ఆ.వె. జనులతో నిఱు కగు ఘన రాజ మార్గపు
జన సమూహము నడిమినిఁ జని చని
మెల్లగ ముని వరుఁడు మేదినీ నాథుని
సౌధ రాజమునకుఁ జాగెఁ బ్రీతి 19.

ఆ.వె. తెల్ల మబ్బు నంటు దిట్టంపు శిఖరమ్ము
భంగి నున్న రాజ భవన మెక్కి
కదిసె శక్రు గురువు కలిసి నట్లు వసిష్ఠుఁ
డవని పతిని నద్ధరామరుండు 20.

ఆ.వె. వచ్చిన మునిఁ గాంచి పార్థివుఁ డాసన
మ్ము వదలి యడుగఁ గృతము తగఁ గార్య
మని వచించె నెమ్మి మునివరేణ్యుఁడు రాజు
నరసి సంతసమ్ము నంద విభుఁడు 21.

కం. ముని రాఁగ సభాసదు లా
సనములఁ బతి గూడి యున్న జను లంతన్ మ
న్నన లేచిరి పూజించుచు
ఘనమ్ముగఁ బురోహితు నటఁ గాంచి ముదమునన్ 22.

కం. ముని యనుమతి గైకొని తా
జనులను వీడ్కొలిపి యంతఁ జక్కఁ బ్రవేశిం
చెను రా జంతిపురమును గు
హను సింహము చేరి నట్టి యందము తోఁపన్ 23.

తే.గీ. వెలయఁ జక్కని దుస్తుల లలన లచట
ఇంద్ర భవనము సదృశంపు టింటి రాజు 24.

చక్కఁగ వెలిగించుచుఁ బ్రవేశమ్ము సేసె
నింగి రిక్క గము లలర నెల విధమ్ము

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేనవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 6.

సీతారాములు పట్టాభిషేకమునకు వలసిన నియమముల నెల్లఁ బాటించుట, పౌరులు రామాభిషేకమునకు సంతోషించి దశరథు నభినందించుట, వివిధ గ్రామముల నుండి వేడుకను జూచుటకుఁ బ్రజ లయోధ్యకుఁ జేరుకొనుట.

కం. వెడలఁగఁ బురోహితుఁడు రా
ముఁడు స్నాతుం డయి నిజ మనము నియంత్రణ మం
దడర విశాలాక్షి ముదిత
పుడమి తనయ సీతఁ గూడి పూజించె హరిన్ 1.

కం. శిరమున నిడి హవి పాత్రను
హరికై యాజ్యమ్ము వేల్చె ననలమ్మునఁ దా
ధరణిజను గూడి రాముఁడు
పరఁగిన రీతి శ్రుతు లందుఁ బన్నుగ భక్తిన్ 2.

మ. తన శ్రేయస్సుఁ దలంచి యా హవిని నద్ధాత్రీశ పుత్రుండు దాఁ
దినె శేషమ్మును నిల్చి ధ్యానమున భక్తిం దల్చి నారాయణున్
ఘన దైవమ్మును బండె దర్భల పయిం గాంతా యుతుండై గుడిన్
మన ముండంగ నియంత్రితమ్ము నిలిచెన్ మౌనవ్రతం బందునున్ 3.

ఆ.వె. ఒక్క జాము మిగుల చక్కటి రాత్రికి
నిద్ర నుండి లేచి నిజగృహమ్ము 4.

రఘువరుం డలంకరణము సేయించెఁ గృ
త్స్నమ్ము వెల్గు లీనఁ జక్కఁగాను

తే.గీ. సూత మాగధ వందుల సుఖ వచనము
లను విని తగ రాముండు పూర్వ సమయంపు
సంధ్య వార్చి మనస్సును సంయమనము
సేసి తగు విధమ్ము జపమ్ము సేసె భక్తి 5.

ఆ.వె. మూరె దిశల వారి పుణ్యాహ వచనము
లతి గభీర సుమధు రాలపనము
లు ఘన వాధ్య రవములు పుర మయోధ్యలోఁ
జెలఁగి సుప్రతిధ్వనుల భృశమ్ము 6.

కం. విని సీతారాముల చ
క్కనిదై నట్టి యుపవాస కార్య మయోధ్యా
జను లెల్లరు సంతోష
మ్మున మున్గిరి మిక్కుటముగఁ బురవర మందున్ 7.

కం. రామాభిషేచనము విని
యామిని చని రాఁ బ్రభాత మంతఁ బురమ్మున్
గోమున నలంకరింపఁగ
భూమి జనులు సాగిరి తమి మోదం బలరన్ 8.

సీ. వెల్ల మొగులు కప్పు పెల్లు కొండ కొనల బోలు గుడుల యందు ముఖ్య మైన
చదుకమ్ము లందు రాజ పథమ్ము లందుఁ దరువు లందు నింక బురుజుల యందు
నెట్టి వస్తువు లుండు కొట్టులందు మఱి గృహస్థుల ధనిక గృహమ్ము లందు
సభ లందు దృశ్యంపు క్ష్మాజమ్ము లందును జిత్ర వర్ణమ్ములఁ జెలఁగు చున్న
ఆ.వె. ధ్వజములు వివిధములు పడగలు రెపరెప
లాడ కాంతు లీని యధికముగను
బౌరు లెల్లఁ బూని పన్నుగ నెగుర వే
సి రెలమిం గనులకుఁ జేయ విందు 9.

ఆ.వె. నటుల నటన లలరె నర్తక నర్తన 10.

ములు సెలంగె గాయకుల సుమధుర
గానములు వినఁబడెఁ గర్ణములకు నింపు
నచ్చ టచ్చ టీయ నచ్చముగను

తే.గీ. కదలి చక్క రామాభిషేకమ్ముఁ జూడ
వచ్చిన జనులు తమిఁ బరస్పరము పల్క
కథలు మించి రామాభిషేకము గుఱించి
తొడఁగిరి చదుకముల నిండ్ల నడరి ప్రీతి 11.

కం. ఆడుచు బాలలు గుంపుల
పేడుక వాకిళులఁ గథలు విన నొక రొకరిం
బాడుచుఁ బల్కిరి యభిషే
కాడంబరములు కడు ముదమారఁగ నపుడున్ 12.

ఉ. చక్కని రాజ మార్గములఁ జందన ధూపము లుంచి రింపుగన్
మక్కువ పుష్ప హారములు మంచివి యెంచి యలంకరించి రా
దిక్కులు వెల్గఁ బౌరు లిఁక దీపము లుంచిరి చెట్లపైఁ దగం
వెక్కసమై చెలంగఁ బుర వీథుల రాతిరి రాక శంకతో 13.

చం. పురమును జేసి యివ్విధిని భూషిత యుక్తము పౌరు లెల్లరుం
బరి పరి రీతులం జెలఁగి పట్టము కట్టు విధంపుఁ జర్చలం
బరఁగి పరస్పరమ్మును సభాస్థలులం జదుకమ్ము లందు నో
వరులను బ్రస్తుతించిరి నృపాలుని నా యభిషేక మెంచుచున్ 14.

తే.గీ. ఆహా యిక్ష్వాకు కులమున కహా రహమ్ము
సంతస మిడు మహాత్ముఁడు నంతరంగ
మందు వృద్ధుఁ డని యెఱింగి యవని ధవుఁడు
రాము నభిషిక్తుఁ జేయఁగఁ బ్రేమఁ దలఁచె 15.

కం. దయఁ బతి చేఁ జూడఁ బడితి
మి యందఱము రాముఁ జేయ మేలుగ రాజున్
స్వయము జగంబు తగ నెఱిఁగి
న యట్టి త్రాతను రయమ్మునఁ జిరము నుండన్ 16.

తే.గీ. పండితుఁడు నిగర్వియు ధర్మబద్ధుఁడును ఘ
నుండు తమ్ములపైఁ బ్రేమ మెండు మమ్ము
గాంచు నిజ సోదరుల సెల్లఁ గాంచు నట్లు
రాఘవుండు స్నేహమున నిరంతరమ్ము 17.

కం. చిరకాలము జీవించుమ
నరేంద్ర! కాకుత్స్థ! యో యనఘ! దశరథ! నీ
కరుణ నభిషిక్తునిగ మే
ము రామునిం గాంచెద మిఁకఁ బుణ్యస్వాంతున్ 18.

ఆ.వె. చూడ వచ్చి నట్టి వేడుక వార్తను
విన్న జానపదులు వివిధ దిశల
నుండి వినిరి పౌరు లుత్తము లిట్లు వ
చించు మాట లెల్ల నంచితముగ 19.

తే.గీ. రాము నభిషేక మారయ గోముగ నరు
దెంచి దిక్కుల నుండి సమంచితముగ
జానపదులు నింపిరి రాము నా నగరము
నెల్ల నయ్యయోధ్యాపురి పెల్లివిరిసి 20.

కం. తిరుగాడ జను లచటఁ జెలఁ
గె రవమ్ములు భీషణముగ గెంతుచు నంతన్
శరధినిఁ బర్వములఁ జెలం
గు రవమ్ముల భంగి రయము ఘోరము గాఁగన్ 21.

తే.గీ. ఇంద్ర నిలయ సన్నిభము నరేంద్ర పురము
సూడఁ గోరివచ్చిన వారి తోడ నిఙికి
యెల్లెడల ధ్వనులు సెలఁగఁ దెల్లముగ జ
ల చరముల తోటి కడలి జలమ్ముఁ బోలె 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 7.

కైకేయి దాది మంథర రామాభిషేక మెఱఁగి యసూయా కోపములతోఁ గైకకుఁ జెప్పిన విని సంతోష ముప్పొంగ నామె కొక్క యాభరణ మొసఁగి యింకయు నేమి కావలయునో కోరుమని యడుగుట.

తే.గీ.  దాది మంథర పుట్టిన దాది కైక
తో వసించుచుండు పరమ దుష్ట బుద్ధి
చంద్ర సన్నిభ మయిన ప్రాసాద మెక్కెఁ
దలవనితలంపుగాఁ గుబ్జ త్వరితముగను 1.

చం.  తడిసిన రాజ మార్గములఁ దద్దయుఁ జల్లిన పుష్పరాసులం
బడతి యయోధ్యఁ దాఁ గనె నపార పతాకములున్ ధ్వజమ్ము లా
డెడు కడు సుందరాధ్వముల నెల్లఁ దలంటి జలమ్ములాడి తి
ర్గెడు జన సంవృతమ్మును బురీంద్రము మోదక మాల్య హస్తులన్ 2.

మ.  ద్విజ ఘోషా సుసమన్వితమ్ము సిత సందీప్తాలయ ద్వారమున్
సుజ నాకీర్ణము వాద్యనిస్వన మహా శోభా ప్రకీర్ణమ్ము న
బ్జజ ఘోషా ప్రతినాదితమ్ము ముది తేభ స్థారి గోధుర్యమున్
స్వజనాలంకృత సుధ్వజాళిఁ గనె నాశ్చర్యమ్ముగా  నప్పురిన్ 3.

తే.గీ.  పట్టు తెల్ల బట్టల నున్న ప్రమద వికసి
తాక్షి దాది నొకరితఁ దా నరసి మంథ
ర దరి నున్న నామె నడిగె రయముగఁ దమ
కమునఁ బుర మిట్టు లుంటకు కారణమ్ము 4.

ఆ.వె.  హర్షమునఁ జెలఁగి ధనాశ గలట్టి రా
ముని జనని ధనమ్ము జనుల కేల 5.

పంచు చున్న దచట నంచితముగ వినఁ
గోరుదు నది యెల్లఁ గూర్మిఁ జెపుమ

కం. జను లేల యిట్లు హర్ష
మ్మున మున్గుచు నున్న వారు భూమీశుఁడు చే
సిన కార్య మెద్ది మోద
మ్మున సంశయము వొడచూపె ముదితా! చెపుమా 6.

కం. పరమానందమునఁ బలికె
ను రాముని విభవము నామెను గని నగవునన్
స్థిరముగఁ గుబ్జకు దాది వి
వరమ్ముగా హర్షచలిత వచనము లిట్లున్ 7.

ఆ.వె. అనఘుని జితరోషు యౌవరాజ్యమున రా
ముని నిలుపగ నెంచె మురిసి రేపు
పుష్యమి దశరథుఁడు పుడమి దవుండు సం
తసము నంద జనులు ధరణి నెల్ల 8.

ఆ.వె. ధాత్రి పలుకు లెల్ల దాది కుబ్జ విని యా
త్రమున హిమగిరి శిఖరమ్ముఁ బోలు
సౌధరాజము దిగి చక్కఁగ నేఁగెఁ గో
పమ్ము నూని యెడఁద బాధముగను 9.

కం. మండుచుఁ గోపమ్మునఁ దా
మెండుగ మంథర యఘాత్మ మేదిని యందుం
బండిన కైకం జేరి య
ఖండమ్ముగఁ బలికె నిట్లు కాంతామణితో 10.

ఆ.వె. మూఢ లెమ్ము నిన్ను గాఢముగను భయ
మావ హించె నిద్ర యీ విధమ్ము
నీకు నేల దుఃఖ నిచయమ్మున మునుఁగ
నేల నీవు  నిన్ను నెఱుఁగ వకట 11.

కం. దయితగఁ గనిపించెడు నీ
వయిష్టవు పతికిఁ బొగడుదు వక్కట సౌభా
గ్య యుత నని నిన్ను భాగ్య మ
రయఁ జల ముష్ణమున నేటి రయముం బోలెన్ 12.

ఆ.వె. అలుక నిష్ఠురముగఁ బలుక మంథర యిట్లు
కుబ్జ పాపచిత్త యబ్జ వదన
కైక కాల కింపఁ గలిగె డెందమ్మున
దుఃఖ మొక్క త్రుటినిఁ దోరముగను 13.

ఆ.వె. అంతఁ గుబ్జఁ గాంచి యనునయమ్మునఁ బల్కెఁ
గైక కుశలమె యిట నీకు మంథ
ర! కనిపించు చుంటివి కడు దుఃఖితగ వి
షన్న వదన వయి భృశమ్ము గాను 14.

కం. మధురమ్ముగఁ గైకేయి వ
సుధేశ్వరుని రాజ్ఞి పలుకఁ జోద్యం బలరన్
సుధఁ బోలు వచనములు విని
యధి కామర్ష వచనజ్ఞ యా కుబ్జ యనెన్ 15.

కం. చిత్తమున దుఃఖతరయై
యత్తన్వి హితమును గోరి యాసతి కిడగా
నుత్తలము భేద మా పురు
షోత్తముతోఁ గలుగ ననియె నుద్రేకముతో 16.

తే.గీ. దేవి జరుగుచు నున్నది నీ విభవపు
టక్షయ వినాశ మరయుమ యవని నేఁడు
యౌవరాజ్యాభిషేకము నడరి రాము
నకు జరుప నెంచె రేపు భూనాథుఁ డెలమి 17.

తే.గీ. మునిఁగితి నగాధ భయమునఁ గనలు చుంటి
నగ్నిచే మండు నట్టుల నత్యధికము 18.

బాధను విచారముఁ గలసి పడసితి మది
నీ హితము గోరి వచ్చితి నీరజాక్షి!

మ. కనఁ గైకేయి! తవార్తి మిక్కుట మగుం గాంచంగ నా దుఃఖమే
విను నీ వృద్ధియె నాకు వృద్ధి యగు నే వీక్షింప సందేహమున్
ఘన రాజన్య కులంబునం దుదితవై కాకుత్స్థు సద్భార్యవై
కన వేలం దగ రాజధర్మమున నుగ్రత్వమ్ము దేవీ మదిన్ 19.

తే.గీ. ధర్మములు పల్కుఁ గుటిలుండు ధవుఁడు నీదు
మెత్తగఁ బలుకుఁ గ్రూరమ్ము చిత్త మరయ
భావములు శుద్ధములు నీకు భామ భృశము
మోస పోవు టెఱుఁగవు నీ పురుషు చేత 20.

ఆ.వె. రిత్త మాటలు పతి హృద్యముగఁ బలికి
నీదు దరిని నుండు నెమ్మి విత్త
రాశి తోడ నేడు రాణి కౌసల్యకు
శుభము లెల్లఁ గూర్చుఁ జూడ వేల 21.

కం. పంపి భరతు నీ నందను
నింపుగఁ జుట్టాల యింటి కెలమి కపటి చం
దంపు మతి రాజ్యమున నుద
యంపుఁ దఱిన్ నిలుపు రాము నడ్డు దొలఁగఁగన్ 22.

కం. తల్లి వలె మేలు కోరుచు
నల్లని త్రాచు నొడి యందు నాథుని రూపుం
జల్లగ నుంచితి శత్రువు
నుల్లమున నెఱుఁగక బాల! యుచితమె నీకున్ 23.

ఆ.వె. ఫణి యయిన మఱి పగవాఁ డైనఁ జేసెడి
రీతి దశరథుండు నీ తనయుని
తోడ నిన్ను రాజు తోర ముపేక్షించె
నింక నైనఁ గనుమ శంక వీడి 24.

కం. మాయపు మాటలఁ బాపపు
టీ యవని పతి రఘురాము సెలమి నిలిపినన్
రాయనిగ నీ సుతుఁడు నీ
వీ యెడ హతులే కఱ వగు నీ సుఖము లిఁకన్ 25.

తే.గీ. సరియగు సమయం బియ్యది చక్కఁగ నిఁక
వేగ మొనరింపుమ హితమ్ము తీఁగఁబోఁడి!
కైక రక్షింపు మింపుగ నీ కుమారు
నిన్ను నన్ను నిప్పట్టున నీరజాక్షి! 26.

చం. విని సతి కుబ్జ పల్కులను వేగమ కైకయె శయ్య నుండి లే
చెను ద్వర హర్షముం బడసి చెన్నగు శారద చంద్రు భంగినిన్
ఘనముగ విస్మయం బడరఁ గాంచన భూషణ మొక్క టింపుగన్
వనిత యొసంగెఁ గుబ్జకు శుభమ్మును బ్రీతి మదిం జెలంగఁగన్ 27.

కం. ఇచ్చి నగ నట్లు మంథర
కచ్చెలువల మేటి కైక యారసి కుబ్జన్
మెచ్చి తిరిగి సంతోషం
బిచ్చఁ జెలంగ వచనమ్ము లిట్లు వచించెన్ 28.

కం. ఇచ్చన్ మెచ్చు పలుకు వా
క్రుచ్చితి మంథర తగఁ బలుకుమ యిట్లు ముదం
బిచ్చిన మరేమి చేయఁగ
వచ్చును నీ కింకయు నిటఁ బన్నుగ నాకున్ 29.

తే.గీ. భరతుఁ డైన రాముఁ డయినఁ దర తమముల
నెంచ నేను జిత్తమ్మున మించి రాము
ని నభిషేకింప నరపతి నెమ్మి దాల్తు
మిక్కుటమ్ముగ నిశ్శంక నిక్క మిదియ 30.

తే.గీ. దీని మించిన ప్రియ మొండు నేను గాంచఁ
జాల నర్థవు ప్రియ మంద మ్రోలఁ జెప్పి
తీవ పరమ ముదావహ మివ్విధమ్ము 31.

కోరు మిత్తు నుత్తమమును మూరి నీకు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 8.

మంథర తిరిగి కైకకు రాబోవు కష్టములను వివరించుచు నామెకు రామునిపై ద్వేషము కలుగఁ జేయ  యత్నించుట, వానిని గణింపక కైకేయి రాముని గుణ గణములను బొగడ నింకను నిష్ఠురంపు మాటలను గుబ్జ పలికి భరతునకు రాజ్య లాభము రాముని వివాసమును జింతింప మని బోధించుట .

కం. విని కైక భాషణములు స
ఘన దుఃఖామర్ష చిత్త కన కాభరణ
మ్మును విసరుచు నేలం బలి
కెను మంథర నిష్ఠురంపు గిరలను మఱలన్ 1.

ఆ.వె. హర్ష మేల నీకు నకట బాలా! కాని
చోట వగపు కడలిఁ జోద్యముగ ము
నుంగు టీవు నేర వంగన యే మందు
నిన్ను మించు వింత యెన్నఁ గలదె 2.

ఆ.వె. నవ్వుకుందుఁ గాంచి యవ్వ! దేవీ! నిన్ను
శోక మంది కూడ వ్యాకులమ్ము
నందు నీవు హర్ష మందు చుంటి వకట
బాల! యేమి యందుఁ జాల వింత 3.

ఆ.వె. సవతి కొడుకు పెంపు నవని వీక్షించి యే
ప్రాజ్ఞ సంతసించు రమణి! జాలి 4.

కలుగు చున్న దకట కాంచంగ నీ మంద
బుద్ధి మృత్యు భంగి ముందు నుండ

తే.గీ. రామునకు భీతి కలదు భరతుని వలన
రాజ్య భోగార్థ మెంచఁ దలంప దానిఁ
గలుగు చున్నది దుఃఖమ్ము కరము నాకు
భయము కలుగు భయస్థుని వలన నిజము 5.

మ. సతమున్ రాముని చెంత లక్ష్మణుఁడు సస్వాంతమ్ము నిల్పుం దమిన్
నుత ధానుష్కుఁడు నా విధిన్ భరతు సంతోషంపు శత్రుఘ్నుఁడున్
గతిఁ గాంచంగ భవమ్మునన్ భరతుఁడే కన్పట్టు రాజ్యమ్ము సే
లు తరం బెంచఁ గనిష్ఠు లిద్దఱకు శత్రుఘ్నుండు సౌమిత్రియున్ 6.

తే.గీ. క్షాత్ర ధర్మ విదుండు ప్రాజ్ఞ ప్రవరుఁడు
సమయ యుక్త కార్యుఁడు రాముని మది నెంచి
భీతి కలుగఁ దపింతును నీ తనయునిఁ
జింత సేయుచు నిప్పుడు చిత్త మందు 7.

కం. కౌసల్య భాగ్యవతి సూ
భూసురులే రేపు వెలయఁ బుష్యమి యువరా
జాసన మందుంచ సుతుని
భాసుర లీల రఘురాముఁ బడతీ! వింటే 8.

ఆ.వె. కొలుతు గాక హస్తములు మోడ్చి కౌసల్య
దాసి వోలె నకట తాను బొంద
సంతసమ్ము నేర కంతు జయించి శ
త్రువుల నెల్ల ధాత్రి దూర్ణముగను 9.

ఉ. ఇవ్విధి మమ్ముఁ గూడి తన కింకఁ దగం బరిచారికా గతిన్
నివ్వటిలంగ నీ సుతుఁడు నిత్యము రామున కౌను భృత్యుఁడే
యవ్వలు రాము నింట ఘన హర్ష సముద్రము నందు మున్గఁగా
నొవ్వుల నుండ్రు నీ స్నుషలు నొచ్చుచు నా భరత క్షయమ్మునన్ 10.

కం. కని యప్రీతను మంథర
ననుచుండఁగ నా విధమ్ము నంత ముదిత కై
క నయముగ రాముని గుణము
లను బొగడుచుఁ బల్కె నిట్లు లలితంపు గిరల్ 11.

తే.గీ. రాముఁడు కృతజ్ఞుఁడు వర ధర్మజ్ఞుఁ డింక
సత్య వాక్పరిపాలుఁడు నిత్య శుచి గు
రుజన దాంతుఁడు నర్హుండు నిజము పలుక
యౌవరాజ్యమునకు సుతు లందుఁ బెద్ద 12.

తే.గీ. తండ్రి పగిది పోషించు సోదరుల భృత్య
గణముఁ బ్రీతి దీర్ఘాయువుగ నలరు నతఁ
డు మహి నీవు రామాభిషేకమును వినఁగఁ
గుబ్జ! తాప మందఁగ నేల ఘోరముగను 13.

తే.గీ. కడవ నూరేండ్లు ధ్రువముగఁ బడసి భరతుఁ
డింపుగఁ బిత్ఫపైతామహ మీ రఘూత్త
ముని సమస్త రాజ్యమ్మును బురుష వృషభుఁ
డలరు నింత దానికి నేల కలవరింప 14.

ఆ.వె. వృద్ధి నరసితే సమృద్ధిగఁ గుబ్జ! నీ
విపుడు ముందు నింకఁ బ్రీతిఁ బడయఁ
గలవు మంథర శుభముల నెల్ల దుఃఖింప
దేని కింకఁ జెపుమ దీనముగను 15.

తే.గీ. భరతుని విధమ్ము రాముఁడు పాత్రుఁ డౌను
నాదు ప్రీతికి భృశముగ లేదు శంక
తాను గౌసల్యను గొలుచు దాని కన్న
నన్ను సేవించు నిత్యమ్ము మిన్నగాను 16.

కం. రాజ్యము రాముని దైనను
భోజ్యమ యది భరతునకును భువి రాముండే
త్యాజ్యము భ్రాతల భేదము 17.

భాజ్యమ్ములు సుఖము లంచు భావించు మదిన్

చం. అన విని కైక భాషణము లవ్విధి మంథర శోక తప్తయై
ఘనముగ నిశ్వసించి యట గ్రన్నన పెచ్చగఁ బల్కె నిట్టులన్
మునుఁగుట నీ వెఱుంగ వయొ మూర విపత్తులు దుఃఖ వార్ధిలోఁ
దనర ననర్థ రాశి కనఁ దల్తువు మౌర్ఖ్యము మీఱ నక్కటా 18.

ఉ. రాముఁడు రాజు కాఁగ నిఁక రా జగు పిమ్మట వాని పుత్రుఁడే
యీ మహి కైక నీ భరతు డింక బహిష్కృతుఁ డౌట నిక్కమే
క్షేమపు రాజవంశమున క్షిప్రము పార్థివ పుత్రు లెల్లరున్
భూమిని ఱేలు కాఁ దగరు మూరు నరాజక మట్టు లైనచో 19.

ఉ. భామిని యా కతమ్మ్ముననె పార్థివు లుంతురు జ్యేష్ఠ పుత్రునిన్
గోముగ సద్గుణుం డయిన  గూర్చెద రన్యుని సెన్ని కానిచో
రాముఁ డధీశుఁ డైన నిఁక రాజ కులమ్ము సుఖమ్ము లెల్లఁ బో
నీ మహి నుండు నీ భరతుఁ డింక ననాథుఁడు భగ్నచిత్తుఁడై 20.

చం. అది తెలుపంగ వచ్చితిని యక్కట నన్ను సెఱుంగ వీ విటం
బదిలపు వృద్ధి నీ సవతి భామ! తలంపవు పొందుచుండఁగా
నదియును గాక నా కిడుదు వబ్బుర మీ బహుమాన మిత్తఱిన్
సదమల చిత్త! యే మనఁగఁ జాలును జెప్పుమ పద్మలోచనా! 21.

చం. ధ్రువముగ రాముఁ డందుకొని తోరపు రాజ్య మకంటకమ్ముగా
భువి నిజ మెంచ నీ భరతు మూరుచు దేశము నుండి యంపుటో
యవనిపుఁ డన్య లోకమున కంపుటొ చేవ చెలంగఁగా సెఱుం
గ వశమె యేరికిన్ మదినిఁ గాంతరొ యింతయుఁ జింత సేయుమా 22.

ఉ. బాల్యము నుండి యీ భరతుఁ బన్నుగ నుంచితి మామ యింట సౌ
శీల్యుఁడు తమ్ముఁ డేఁగెఁ దమిఁ, జెంతను నిల్వఁగఁ బెర్గుఁ బ్రేమ సా
కల్యము స్థావరమ్ములను గాంచఁగ, నట్టుల లక్ష్మణుండు ప్రా
బల్యుఁడు నిల్చె సన్నిధిని భ్రాతను రాముని వీడ కెన్నఁడున్ 23.

ఆ.వె. ముల్లు లున్న ఱెల్లు మూరంగఁ జుట్టును 24.

జెట్టు నఱక కుండఁ జేను జీవు
లుండ్రు నాఁగ వినమె యుర్వి ఘోరంపు భ
యమ్ము నుండి రక్ష సెమ్మిఁ గొనదె

ఉ. రాముఁడు కాచు లక్ష్మణుని లక్ష్మణుఁ డింపుగఁ గాచు రామునిం
ప్రేముడి యన్నదమ్ములది విశ్వ మెఱుంగదె యశ్వి తుల్యమున్
రాముఁడు గాంచ నాపదల లక్ష్మణు నుంచఁడు రాఘవుం డహో
భామరొ పుత్రు నీ భరతు బాధల ముంచుట నిక్క మిద్దరన్ 25.

ఆ.వె. రాజగృహము నుండి తాఁజన భరతుండు
కాననమ్మునకును గలుగు శుభము
నాకుఁ దోఁచు నట్లు నీకును హితమగుఁ
జేయ న ట్లతండు పేయు సేల 26.

తే.గీ. తండ్రి రాజ్యమ్ము ధర్మయుతమ్ము వడసె
నేని భరతుండు మే లగు నెంచ నీకు
నీదు జ్ఞాతులకును సుంత లేదు శంక
యిందు వీక్షింప నెవ్విధి నింతి! వినుమ 27.

ఆ.వె. సుఖములు చవిగొన్న సూనుండు సహజంపు
టరియె రాఘవునకు నధనుఁ డైన
భరతుఁడు ధన మందు భాసిల్లు రాముని
వశము నందు నెట్లు వఱలఁ గలఁడు 28.

ఆ.వె. దవమున మృగరాజు తఱిమెడి గజరాజు
పగిది రఘువరేణ్యు బారిఁ బడ్డ
కాంత! పుత్రు భరతుఁ గాపాడఁ దగు దీవు
వేగ యుద్యమించి జాగు తగదు 29.

తే.గీ. సతి నిరాకరింపంగఁ గౌసల్యను మును
భాగ్య దర్పమ్ము నూని సపత్ని నకట
రామ మాత నీ పయి నేల భామ! వైర
మూనకుండు చెపుమ మదిలోన నిపుడు 30.

తే.గీ. జలధి గిరులు పురుల తోడ వెలుఁగు ధరను
బడసి రాముఁడు వెలుఁగంగ భరతుఁ గూడి
భామ! నీ వరయుచుఁ బరాభవము నశుభ
ములను దీనపై చరియింతు విలను నిజము 31.

తే.గీ. రాముఁడు పుడమిఁ బొంద భరతుఁడు భృశము
నష్ట భాగ్యుఁ డగును భామ! యిష్ట సుతున
కెలమి రాజ్యలాభమ్ము లభించు గతినిఁ
బరునకు వివాస మగు రీతి పనిఁ దలంపు 32.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 9.

మంథర మాటలు విని మండుచుఁ గైకేయి రాముని నడవులకుఁ బంపుటకు భరతునకు రాజ్యాభిషేకము చేయుటకుఁ దగిన యుపాయము చెప్పు మని మంథర నడుగ నామె దశరథుని దేవ దానవ యుద్ధములో నింద్రునకు సాహాయ్యముగ శంబ రాసురునితో యుద్ధము సేయుచు మూర్ఛిల్లఁ గైక రాజునిఁ గాపాడ రాజు కైక కిచ్చిన రెండు వరములను గుర్తు సేసి రాముని నడవులకుఁ బదునాలుగేండ్లు వాసము సేయఁ బంపుటను, భరతు నభిషిక్తునిఁ జేయుట నడుగు మని బోధించుట, యంగీకరించి కైక కోప గృహమున కేఁగి యాభరణములను వీడి కటికి నేలపైఁ బరుండుట.

కం. విని యా మాటలు క్రోధ
మ్మున నిట్టూర్చి సతి పేడి మూరఁ గనలుచుం
గని కైక మంథరను బలి
కెను వాక్యము లీ విధమ్ము కృతమతి తోడన్ 1.

ఉ. పంపెద నేఁడు రాము వనవాసము సేయఁగ నిశ్చయమ్ముగా
నింపుగఁ బుత్రు నా భరతు నెవ్విధి పే యభి షిక్తు నిత్తఱిన్
నొంపుగ యౌవరాజ్య పరిశుద్ధ పదమ్మునకై యొనర్తు నీ
వింపుగ నా కుపాయము వచింపుమ మంథర కార్య సిద్ధికై 2.

చం. విని వచియించె మంథర సవిస్తర వాక్యము లివ్విధమ్ముగా
ఘనతర పాపదర్శిని తగం గని కైక వచింతు నాహ వి
న్మిన కుల రామ బాధకము లీ భరతుండు గ్రహించి తాను ధా
త్రినిఁ దనయుండ కేవల మధీశుఁడు కాఁ గల మర్మ మంతయున్ 3.

ఉ. నీ కయి యేల జ్ఞాపకము నెమ్మది చేసికొనంగ నోపవే
కైక! స్మరించి కూడ వినఁగా మదిఁ గోరుదె నే వచింపఁగా
వీఁక వినంగ నెంచ నను బ్రీతి విలాసవతీ వచింతు నే
నో కమలాక్షి చక్క విని యోచన సేయుము యించు కేనియున్ 4.

కం విని లేచి యించుకయె బఱ
చిన తల్పము నుండి కైక శీఘ్రమ పలికెన్
తనయుం డందఁగ రాజ్యము
కొన కుండఁగ రాముఁడు పలుకు ముపాయమ్మున్ 5.

కం. ఆ పలుకులు విని మంథర
పాపాత్మ రఘూత్తముండు వడయఁగ నిడుముల్
పే పలికె నిట్లు వచనము
లేపారుచుఁ గైకఁ గాంచి యెలమి చెలంగన్ 6.

మ. విను దైవాసుర భండనమ్మునకు దేవీ నీవు తోడుండఁగా
ఘన రాజర్షులఁ గూడి నీ ధవుఁడు పాకద్విట్టు సాహ్యార్థమై
చనఁగా దక్షిణ దండకా వనినిఁ బ్రాశస్త్యంపు స్థానీయమే
ఘనుఁ డుండంగఁ దిమిధ్వజుం డచట వెల్గన్ వైజయం తాఖ్యతో 7.

కం. శత మాయలఁ దనరు నసుర
పతి శంబర నాముఁడు సురవరుల కజేయుం
డతి బల దర్పితుఁ డొనరిచె 8.

నతి ఘోర రణమ్ము వీఁక నలరుచు నచటన్

కం. ఆ రణమున క్షతగాత్రుల
వీరుల సుప్తులను నిశఁ బ్రవేశించి యహో
యా రాక్షసులు బలిమి నతి
ఘోరముగ వధించి రంతఁ గోపోద్రిక్తుల్ 9.

కం. అని సేయుచు దశరథుఁడే
ఘన దీర్ఘ భుజుండు దనుజ కాయము చేతన్
సునిశిత శస్త్రావలి చే
తను గాయపడెను భృశమ్ము తరుణీ వింటే 10.

కం. కొనిపోయి నష్ట చేతను
నని నుండి నిజపతి దేవి యావలకుఁ ద్వరం
దనువున గాయము లుండన్
దను జాస్త్ర కృతములు నీదు ధవుఁ గాచి తటన్ 11.

తే.గీ. సంతసించి నృపతి నీ కొసంగె రెండు
వరము లంత మెచ్చికొనుచు భామ నీ వ
నంగఁ గొందు వానిని నాథ!నాకు నను వ
యిన తఱి నని దానికి సమ్మతించె విభుఁడు 12.

చం. ఎఱుఁగను దేవి యీ కథ మృగేక్షణ వింటిని నీవ చెప్పఁగా
వఱలగఁ బ్రేమ మిక్కుటము పన్నుగ నుంచితి నే నెడందలోఁ
దఱ చయి చాగు రాఘవు పదార్థము లీ యభిషేక వస్తువుల్
మఱి తనరంగ నీయకుమ మానిని! బల్మిని నిశ్చయమ్ముగన్ 13.

ఆ.వె. అడుగు మిఁక వరముల నారెంటి నిప్పుడు
తూచి భరతుని యభిషేచనం బిఁ
కఁ బదునాలు గేండ్ల కానన వాసము
రామునకుఁ దడయక రాజుఁ గాంచి 14.

ఉ. ఏఁగఁ జతుర్దశాబ్దము లహీన పరాక్రముఁ డన్న కానకున్ 15.

వేగము పౌరు లెల్లరకుఁ బ్రీతుఁ డగున్ భరతుండు నిల్చుఁ దా
బాగుగ సుస్థిరుం డగుచుఁ బౌరుల మన్నన లంది సంతతం
బీ గతి కార్య మెంచి మది నిత్తఱి శీఘ్రము చేయ నొప్పగున్

తే.గీ. క్రుద్ధ పగిది యశ్వపతికిఁ గూతురు! చను
మా మలిన వస్త్ర యై రోష మలర భృశము
కోప గృహమున కిత్తఱి వేపమాన
యై పరుండుమ నేల హీనాంబరమ్ము 16.

తే.గీ. కాంత యేడ్చుచుఁ గన్నీళ్లు కాఱఁ గనుల
శోక తప్త యై దశరథుఁ జూడ కేఁగు
దెంచ జగతిఁ బరుండి నీ వించుకయును
బలుకకుమ పల్కరించిన భర్త నిన్ను 17.

చం. మగనికిఁ బ్రీతి మిక్కుటము మానిని నీ పయి లేదు శంకయే
తగులము మీఱ దూకు మనఁ దప్పక దూకును నిప్పులోన నీ
కెగసినఁ గోప మాతఁడు సహింపఁడు కిన్క వహింప నీయఁడే
మగువ నిజాసువుల్ విడుచు మానక నీ కొఱ కెన్నఁ డేనియున్ 18.

తే.గీ. ఎందు నీ మాట దాటంగ నీ మహీప
తికిఁ గలదె శక్తి పరికింపఁ దెల్లముగను
మందమతి యిఁక నైనను సుందరాంగి
యందపు బలము నెఱుఁగుమ యబ్జ నేత్ర 19.

తే.గీ. కనక మణి మౌక్తిక వర నికాయ మిత్తు
నంచు నాశఁ జూపును భూత లాధినాథుఁ
డబల నీకు నీదు పతియె యట్టి వాని
యందు నుంచ కెట్టి రతిని నంబుజాక్షి! 20.

తే.గీ. దేవ దానవ యుద్ధమం దే వరమ్ము
లిచ్చె వాని జ్ఞప్తికిఁ దేరు మింతి దశర
థునకు నో మహాభాగ! వేగ నరపతికి
మఱవఁ దగదు నీ యర్థమ్ము నఱిముఱి నట 21.

కం. ఎప్పుడు నిన్ను స్వయమ్ముగ
నప్పుడమి ధవుండు లేపి యాదరమునఁ దా
నొప్పుగ నొసంగును వరము
నప్పు డడుగు మూఁడిల్ల నాతఁడు వరముల్ 22.

తే.గీ. రాజవర! పంపు రాము నరణ్యమునకు
నిండు పదునాల్గు వర్షమ్ము లుండ నందుఁ
గట్టుమా భరతున కిఁకఁ బట్ట మేల
రాజ్య మెలమి సకల మని రమణి! పలుకు 23.

ఆ.వె. ఏడు నేడు నేండ్లు వీడి యయోధ్య న
డవికి నేఁగ రాముఁడు వనజాక్షి
నిల్చు నీ సుతుండు నిశ్చయముగ నూని
మూలములను శేష కాల మెల్ల 24.

తే.గీ. అడుగు రామ వివాసము పడతి! వరము
మఱవ కుండ భూమీశునిఁ దఱచి తఱచి
నీ తనయుని సర్వార్థము లో తనుతర
మధ్య! సిద్ధించు టిద్ధర సాధ్య మగును 25.

తే.గీ. ఈ విధముగ దేవి! తలంచి యింపుగ నెద
రాముని ననుప వనికి నరాముఁ డగును
శత్రు కోటి హతము కాఁగఁ జక్కఁగాను
భరతుఁడు నృపతి యయి చేయు పాలనమ్ము 26.

తే.గీ. వనము నుండి రాముఁడు తిర్గి వచ్చు కాల
మునకు మూలము లెల్ల నూనును సుతుండు
భరతుఁడు వడసి జనుల నపారముగ స
ఖులను నమ్మకమ్ముగఁ దాను గూర్చికొనఁగ 27.

ఆ.వె. రాముని నిపుడు యువరాజు సేయు తలఁపు
బలిమి నైన మాన్పవలయుఁ జుమ్మి 28.

భయము వీడి తగు సమయము రాజు నడుగ
వచ్చె నంచు నెంతు నిచ్చ నేను

కం. పలుకఁగ మంథర యివ్విధిఁ
దలఁచి యనర్థముల యుక్త తరములుగ శుభ
మ్ము లొసంగు నర్థ వంత
మ్ములుగఁ బలికెఁ గైక యిట్లు ముదము చెలంగన్ 29.

తే.గీ. ముందు చూపు మిన్నఁగఁ గల ముగుద కైక
విస్మయం బది చెలరేఁగ విన్న యంతఁ
గుబ్జ మాట లకట బాల కోపు దనరి
చెడ్డ దారి ననుగమంచె శీలవతియె 30.

ఉ. కుబ్జ! యెఱుంగ నైతి నిను గొప్పగఁ బల్కెడు వారి లోన నీ
వబ్జ నిభాస్య! మిన్న వని యారయ నిశ్చయ బుద్ధి యందు నీ
కుబ్జల లోన భూమి పయి గొప్ప వటంచును నిక్కువంబుగా
నబ్జజుఁ డిచ్చి గూనును మహత్త్వము పెంచెను నీకు మాటలన్ 31.

తే.గీ. నా ప్రయోజనములు నీ వనయము కోరి
కొందు వింపుగ నిచ్చటఁ గుబ్జ ప్రీతి
రాజు సేయ వాంఛించు కార్యమ్ము నేర
నైతి డెంద మందు నకట నాతి! కనుమ 32.

తే.గీ. కుబ్జలు కురూపినులు సుమ్మి ఘోర దర్శి
నులు కడింది వక్రాంగులును బరికింప
వీచు గాలికి వంగిన వికసి తార
వింద మీవు కుబ్జ! నిజము సుందరాస్య! 33.

తే.గీ. ఉర మతి విశాలము తనరి యుండు మూఁపు
ల వఱకును గుబ్జ నీకు సలలితముగను
దాని క్రింద నలరు సన్న మైన కడుపు
తలర బొడ్డు గంభీరమై చెలఁగ సిగ్గు 34.

కం. మొల గాంచ నుండ నిండుగ
నెలఁతా! కుబ్జా కుచములు నెగడఁగ గుండ్ర
మ్ములయి వెలుంగుదు తనరి వి
మలేందు నిభమై ముఖం బమరఁగ భృశమ్మున్ 35.

కం. మొలనూలు తోటి నీ కటి
చెలఁగె రవమ్ముల భృశముగఁ జెలువా! పిక్కల్
బలిసినవి మీఁదు మిక్కిలి
వెలసె విశాలముగ నీదు పెను పాదమ్ముల్ 36.

కం. తొడలు బెడిదమ్ములై కడు
నడరఁగ మెయిఁ బట్టుకోక యలరఁగ మిగులం
బడతీ! నా ముందు నడువ
వెలయుదు వా రాజహంసి విధముగ భృశమున్ 37.

కం. శంబరు మాయలు వేయికి
నంబ యధికమై నిలిచిన వచ్చెరువున నిం
కం బరములు పెక్కున్నవి
సంబరముగ నీదు పొట్ట శ్యామా! వింటే 38.

కం. తలఁపులు క్షాత్రపు విద్యలు
పలు మాయలు దొడ్డ గూను ధ్వజి ఘోణాభ
మ్మలరెడు దానిన్ దాఁపఁగఁ
గల వమితమ్ముగను దమ్మికంటీ! వింటే 39.

కం. వన మేఁగ రాముఁడు భరతుఁ
డు నడర నభిషిక్తుఁ డయి కడు రహినిఁ గుబ్జా
కనకపు మాలను దొడుగుదు
ఘన మగు నీ గూను పైనఁ గమనీయముగన్ 40.

కం. మేలైన పుటము వేసిన
చాల మెఱయు పసిఁడి పూత స్థగువునఁ గుబ్జా!
వే లభియింపఁగ వాంఛ య 41.

నాలస్యము పూయుదుఁ దనియంగను వినుమా

కం. నుదుట మఱి నీకుఁ దిలకము
ను దగం బుత్తడి మయమ్మును నునుతుఁ దొడవుల్
పదఁపడి యిచ్చెదఁ గుబ్జా!
మది యలరంగను శుభముల మంథర! వింటే 42.

కం. శుభ వస్త్రమ్ము ధరించి ప
రిభవించి శశిని ముఖమున రిపు కాయములో
నిభ నిభ గమనా! గర్వము
ప్రభవిల్లఁగ దేవతా నిభము తిరుగు దిఁకన్ 43.

కం. వర కుబ్జలలోఁ గుబ్జా
పురమున సర్వాభరణ విభూషితవై మం
థర మసలెదు వారు కొలువ
గురుతరముగ, నీవు నన్ను గొలిచెడు రీతిన్ 44.

చం. పొగడెడు తన్ను నివ్విధము భూరిగఁ గైకను శయ్యపైఁ బరుం
డఁగ నట వేది నగ్ని వలె డగ్గఱి పల్కెను బ్రీతిమై పెసన్
విగత జలమ్మునం దకట పృథ్విని వంతెనఁ గట్ట రెవ్వరున్
మగనికిఁ జూపఁ గార్యమును మానిని లెమ్మిక యుద్యమించుమా 45.

ఉ. ఆ విధిఁ బ్రోత్సహింపఁబడి యంతటఁ గైకయి గుబ్జతో నసూ
యా వశయై మృగాక్షి తన యందపు గర్వము చెల్గ మిక్కిలిం
దా విడనాడి భూషణ వితానము ముత్యపు మాల లర్హముల్
దేవి సరోషమే బయలు దేఱెను క్రోధ గృహమ్ము లోనికిన్ 46.

ఆ.వె. అంత హేమ సదృశ మగపడఁ గైక ప
రుండి నేల పైన దండ నున్న
మంథరఁ గని పలికె మంథర వాక్య వ
శ యయి యివ్విధముగఁ జలము మీఱ 47.

ఆ.వె. వనమున కరుగుటయుఁ దనయుఁ డా రాముఁడు 48.

రాజ్య మందుటయు భరతుఁడు జరుగ
వలయు లేని యెడలఁ బార్థున కీవు స
త్వరము తెలుపు నాదు మరణమె యని

కం. ధనము సువర్ణము రత్నము
లును భూషణములును నాకు రుచియింపవు కు
బ్జ! సెఱప ఱే డభిషేక మ
వని రామునకు నది తుది దివస మగు నాకున్ 49.

తే.గీ. భరత మాతకు మంథర తిరిగి పలికె
రాజ మహిషికి నిట్లు పరాక్రమంపు
మాటలను మేలు కూర్చెడు బాట నలరి
యహిత మా రఘురాముని కడరు నట్లు 50.

తే.గీ. పడయ రాజ్యము రాముఁడు పడఁతి! నీవు
నీ సుతండు తపింతురు నిక్కముగను
జేయు మవ్విధి కళ్యాణి శీఘ్రముగను
భరతుఁ డెవ్విధి రాజ్యమ్ము వడయఁ గలఁడొ 51.

కం. మాటల తూపులు మంథర
పాటవముగ మఱల మఱల పఱవఁగఁ దా నా
రాటమునఁ గరము లురమున
నాఁటి వెఱం గైక యతి ఘనమ్ముగఁ బొగిడెన్ 52.

తే.గీ. ఇచట నుండి యమాలయ మేఁగు టేని
నేను లేక రాముఁడు చనఁ గానకు చిర
కాలము భరతుఁడు సమృద్ధ కాముఁ డగుట
యేని తెలిపెదు మంథర ఱేని కింక 53.

తే.గీ. వలదు పఱుపులు దండలు వలదు చంద
నమ్ము కాటుక యన్నపానములు నాకు
దేనిఁ గోరను జీవమ్ము నైన నింక
రాముఁ డడవి కేఁగక యున్న భామ! నేను 54.

తే.గీ. ఇట్టు లెల్లఁ బలికి యంతఁ బట్టి పట్టు
విడిచి స్వీయ విభూషణ వితతి నెల్ల
నేల కిన్నరీ భామిని వోలెఁ బఱుపు
లుండ కుండ కైకేయి పరుండెఁ గనలి 55.

ఆ.వె. ఆగ్ర హాంధకార మావహింప విసర్జి
తాభరణ నికాయ యయ్యె విమన
యంధకార మందు నడఁగిన తారల
తోడ నభము భంగి తోఁచుచుండి 56.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొమ్మిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 10.

దశరథుఁ డేతెంచి కోపగృహమ్మున నున్న కైకను గాంచి పరిపరి విధముల నూఱార్చుట.

కం. భృశ పాపిని కుబ్జ భృశము
విశదపఱచిన విధి దేవి విష బాణము నా
ట శమించు కిన్నరి విధం
బశాంతి తోడుతఁ బరుండె నా కైక ధరన్ 1.

ఆ.వె. నిశ్చయించి యిట్లు నెలఁత కైక మదినిఁ
జేయఁ దగ్గ పనినిఁ జెలువముగ వి
చక్షణ వచియించె సర్వము మెల్లఁగ
మంథరకు పెసన్ సమంచితముగ 2.

తే.గీ. లలన లొంగి మంథర మాటలకును దీన 3.

కైక నిట్టూర్చి వేడిగ గాలిదిండి
పట్టి వోలె నొక్క క్షణము స్వాంత మందుఁ
జింత సేసె మేలొనరించు వింత గతిని

తే.గీ. చెలిమికత్తెయు నర్థార్థిని లలితంపుఁ
గైక నిశ్చయమ్ముకను విని కరము ప్రీతిఁ
గుబ్జ సిద్ధి కల్గెనని గ్రక్కునఁ దలంచి
హర్ష మందెఁ జిత్తమ్మున నధికముగను 4.

కం. కనుబొమ లలుకన్ ముడిచియు
నొనరిచి నిశ్చయ మతి ధృతి నుర్విని దన మే
నునిచి యబలామణి పరుం
డెను దేవి తపించుచున్ బెడిదముగ నెడఁదన్ 5.

ఆ.వె. అచట చిత్రము లగు నా మాల లాభర
ణములు దివ్యములు కనలిన కైక
విసర భృశముగఁ గనిపించె నెల్లెడ నేల
పైనఁ జెదరి వింతగా నిటు నటు 6.

తే.గీ. దండ లాభరణమ్ములు మెండుగ వెలిఁ
గె నటఁ దారల భంగి గగనము నందు
మాసి నట్టి బట్టల వెల్గె రోస మొక్క
జడను బద్ధ కిన్నరి వోలెఁ బడఁతి కైక 7.

కం. రామాభిషేచనమ్మును
భూమీశుఁడు పంచి యట్లు వొంతను గల యా
భూమి జనుల నెల్ల ననిపి
ధామము లోనికి నరిగెను దశరథుఁ డెలమిన్ 8.

తే.గీ. నేఁడు రామాభిషేకము నేరి రెల్ల
రంచు నెఱిఁగి వశియె హృదయమ్మున వచి
యింపఁ బ్రియము బ్రియార్హ మహిషికి నేఁగె
నంతిపురమునకు దశర థాధిపుండు 9.

కం. చేరెను గైక గృహ వరము
భూరి యశుండు ధవ లాభ్ర పూరిత గగనం
బా రాహువు గూడ వెలయఁ
దోరము చంద్రుం డరిగిన తోయమ్ము వెసన్ 10.

మ. చని తాఁ గాంచెను గీర కేకి చయ సంచారమ్ము వాద్య వ్రజ
ధ్వని సంతుష్టముఁ గ్రౌంచ హంసరుత భాస్వంతమ్ముఁ గుబ్జాసతీ
ఘన వామాబ్జ ముఖా యుతమ్మును లతా గంభీర చిత్రాలయాం
గన విన్యస్త మశోక చంపక ముఖ క్ష్మాజ ప్రమోదమ్మునున్ 11.

తే.గీ. దంత రజత సౌవర్ణ యుత వర వేది
కా విలసితమ్ము నిత్య పక్వ ఫల పుష్ప
భాసితమ్మును వాపీ విభవ సమాయ
తమ్ము సుందర వేశ్మరాజమ్ము మఱియు 12.

తే.గీ. దంత రజత సౌవర్ణ యుత పర మాస
న చయ విలసితమ్ము వివిధాన్న వర పాన
భక్ష్య నిచ యోపపన్నము భవ్య భూష
ణావృతస్త్రీ యుతముఁ బోల నమర పురము 13.

తే.గీ. వృద్ధి మంత మంతఃపుర మద్ధరణి ధ
వుఁడు ప్రవేశించి తన ప్రియంపు సతి కైక
నచ్చట శయ నోత్తమమున నరయఁ జాలఁ
డా దశరథుండు విస్మయ మంద నెడఁద 14.

కం. మను జాధిపుండు కాంక్షా
ఘన తప్తుఁడు భార్య దయితఁ గాంచక యచటన్
మునిఁగె విచారమ్మునఁ గడు
మన మందు నడిగెను మఱియు మానిని జాడన్ 15.

కం. మున్నెన్నఁడు తన రాకను
మన్నన సేయక యెఱుఁగదు మఱియు నహో తా 16.

సెన్నఁడు శూన్య గృహమ్మును
మిన్నక చేరఁగ నెఱుఁగఁడు మించి తలంపన్

తే.గీ. తనదు లాభము మాత్రమ మనము నందుఁ
గోరు మూర్ఖ కైకను దాను సేర కుండ
రాజసత్తముం డడిగెఁ బూర్వంపు రీతి
నిల్లు సేరి దశరథుండు తల్లడిల్లి 17.

ఆ.వె. క్రోధ మూని దేవి క్రోధాలయము సేరె
నంచు ద్వార పాల కాంగన వచి
యించె భీతి నంజలించి దేవా! యని
కాంచి వినయ మడర నంచితముగ 18.

కం. విని యా మాటలు భూపతి
మనం బెఱియ బెట్టిదముగ మఱలన్ వగ పం
దెను ఘనముగ నింద్రియములు
దనరం గంపితము లయి వ్యథ చెలఁగ భృశమున్ 19.

ఆ.వె. తగని యట్టి విధము ధరపైన పడి యుండఁ
బడఁతి కైక నరసెఁ బుడమి పతి వి
షాద మందు మండు సరణి కన్పించుచు
దశరథుండు రోష ధామ మందు 20.

ఆ.వె. తరుణి భార్య నతఁడు తనదు ప్రాణము కన్న
మిన్నను విమలుండు మేటి పాప
చింత వృద్ధుఁ డచట వంతఁ గాంచెను నేల
పైఁ బరుండ నామెఁ బార్థివుండు 21.

తే.గీ. తెగిన లత వోలె పతితంపు దివ్య భామ
వోలె పడ్డ కిన్నరి వోలె కూలి నట్టి
యప్సరస వోలె భ్రష్ట మాయవలె బద్ధ
హరిణి వోలె నవని నున్న యామెను గని 22.

తే.గీ. పేటకాని విషపు టమ్ము నాఁటి నట్టి
యాడ యేనుఁగు లాలించు నా గజేంద్రు
పగిది స్నేహమ్ము సెలగంగఁ బడతి కైక
నంత రాజు స్పృశించెఁ గరాబ్జములను 23.

ఆ.వె. తాకి ప్రేమ తోడ తప్త నరేంద్రుఁడు
కమల పత్ర నేత్రఁ గర కమలము
ల వచియించెఁ గామి లలితంపు మాటల
ననునయించుచుఁ గడు నతివ తోడ 24.

ఉ. దేవి యెఱుంగ నా పయి యతీతపుఁ గిన్కకు కారణమ్ముహో
యీ విటు లుండ నెవ్వరు శపించిరి యెవ్వ రగౌరవమ్ము నీ
కే విధిఁ జేసి రిప్పుడు శుభేక్షణ నేలఁ బరుండ నక్కటా
నీ విట మూరె దుఃఖ మెద నిక్కము నాకిట మిక్కుటమ్ముగన్ 25.

తే.గీ. నే శుభప్రద చిత్తుఁడనే పుడమిని
నేల శయనించితి వచింపు మింక భూత
మావహించిన రీతిగ నకట బాధ
నొసఁగ నామది కివ్విధి నుచిత మౌనె 26.

ఆ.వె. కుశల మీయఁ గలరు గొప్ప వైద్యులు చెంత
నన్నిట నరయంగ వ్యాధి యేమి
భామ చెపుమ నీకుఁ బన్నుగఁ గూర్తురు
కుశలము త్వరితము దిగు లది యేల 27.

తే.గీ. ఎవ్వరికిఁ బ్రియ మీ వలె నెవ్వ రప్రి
యమ్ము సేసిరి నీకు భృశమ్ము యెవ్వ
రంద వలెఁ బ్రియ మెవ్వ రే చంద మప్రి
యమ్ము వడయ వలయుఁ జెప్పు మిమ్ముగ నిఁక 28.

చం. వగవకు మెండ నీకు మెయి భామ! యవధ్యుఁ దలంతె చంపఁగాఁ
దగదని యందువా వధకుఁ దథ్యపు టర్హునిఁ జంపఁ జెప్పుమా
మగువ దరిద్రు విత్తమున మాన్యునిఁ జేయఁ దలంతె భాగ్యవం 29.

తుఁ గడు బికారిగాఁ దలఁతె తూర్ణము సేయఁగ నేరి నైననున్

కం. నే నిఁక నా వారందఱు
మానిని! నీకు వశులే కమలపత్రాక్షీ !
యే నీ యభిమత మెన్నఁడు
నే నది దాటంగ నేర నిక్కము సుమ్మీ 30.

తే.గీ. ఇష్ట మైనది యడుగుమ కష్ట మైన
నాదు జీవితమ్ము నయిన లే దనక నొ
సంగుదును బట్టు నాపై నెఱుంగు దీవు
శంక వల దొట్టు నీపై నొసఁగుదు ముదము 31.

శా. ఈ చక్రంబు చరించు మేర వనితా యీ భూమి నాదే సుమీ
ప్రాచీనమ్ములు సింధు దేశమును సౌరాష్ట్రమ్ము సౌవీర సా
వాచీ భూములు వంగ మత్స్య మగధ ప్రాంతాళి కాశీ పురం
బా చెల్వమ్ములు నంగ కోసలలు రాజ్యమ్ముల్ సుసంపన్న ముల్ 32.

ఆ.వె. ధనము ధాన్యములు వితత వస్తు రాశి మే
కలయు గొఱ్ఱెల గమి చెలఁగు నచట
నిచ్చ మెచ్చి నట్టి దేది యేని యడుగు
కైక సుంత శంక లేక మురిసి 33.

తే.గీ. బేల! లే లెమ్మ యాయాస మేల భామ!
భయము నీకేల కల్గెను బలుకు నిజము
తీర్తు దానిని వేగంబ దిగులు వలదు
మంచు నెల్లను సూర్యుండు మాపు నట్లు 34.

కం. అన విని నిట్టూర్చి పలుకఁ
గ నెంచి యప్రియ మొసంగ ఘన పీడనమున్
మనుజ పతికిఁ గైక దొడం
గెను జెప్ప నిజపతి కంతఁ గీ డొనరింపన్ 35.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 11.

కైక దశరథునకుఁ దన కిచ్చిన రెండు వరములను గుర్తు చేసి భరతునకు యౌవరాజ్యాభిషేకము సేయుట, రామునిఁ బదునాలు గేండ్లు వనమున నార చీర లూని జటాజూటముతో ముని వలె నివసింపఁ బంపుటను గోరుట.

కం. ఆతని మార శ రార్తుని
నాతత కామ వశ చిత్తు నవనీ ధవునిం
జేతో దారుణ వచనము
లా తన్వి కని యనెఁ గైక యాత్మేశ్వరుతో 1.

కం. నిందింప లేదు నన్నెవ
రుం దలఁపంగ నవమాన రోషిత నిట సే
చందమునఁ గా నభిమతము
డెందమ్మునఁ గలదు చేసెడిది నీవు విభూ! 2.

ఆ.వె. చేయ నిచ్చగింపఁ జెప్పు మొట్టును వేసి
రాజ! చేయుదునని యోజ నేను
బిమ్మట వచియింతు నెమ్మి నా కోరిక
కోరఁ దగిన దానిఁ గూర్మి మీఱ 3.

ఆ.వె. అంతఁ బలికెఁ దాను సుంత నవ్వుచుఁ గైక
తోడ సుస్మితఁ గని తేఁడు కురుల
పైన కరము లుంచి లోనఁ గామ మడరఁ
బరమ తేజుఁ డెలమి కరము నిమిరి 4.

తే.గీ. స్వాభిమాన! నీ కన్నను  నీ భువి పయిఁ 5.

బ్రియ తర మయిన వారు నరయ మనుజుల
యందు మనుజ శార్దూలము నిందు ముఖుఁడు
రాము మించి ప్రియులు లేరు రామ! వినవె

తే.గీ. రాఘవుల లోన ముఖ్యుండు రాముఁ డా మ
హాత్ముఁడు జయింపఁగ నశక్య మైన వాఁడు
జీవనార్థుండు వానిపై దేవి యొట్టు
పల్కు మిచ్చ మెచ్చిన దాని పడతి! యింక 6.

కం. అరయక యెవ్వని మనఁ జా
ల రమణి! యొక్క క్షణ మట్టి రాముని పై నా
న రయమున నీ వచనము లొ
నరింపఁ గలవాఁడఁ జుమ్ము నలినదళాక్షీ! 7.

కం. పర సుతులకు నాకన్న న
లరి మిన్నఁగ నెంతు నట్టి రాముని పై నా
న రయమున నీ వచనము లొ
నరింపఁ గలవాఁడఁ జుమ్ము నలినదళాక్షీ! 8.

కం. హృదయము స్పృశించి భద్రా!
యిది యెల్లను గావు మెంచి యింపుగ నన్నున్
సదయం బల్కు మిపుడు మం
చి దంచు నీవు మదినిఁ దలఁచిన యది యెల్లన్ 9.

తే.గీ. అతివ నాపైన నీ శక్తి యది యెఱుంగు
దీవు తెల్లముగ నొనర్తు నింపు నీకు
శంక వలదు నాపైన నే వంక నైన
నొట్టు నా సుకృతములపైఁ బెట్టు చుంటి 10.

చం. తనదు మనోరథమ్ము నెదఁ దల్చి నిజార్థ మెడంద నిల్పియుం
దనర ముదమ్ము పాక్షికము తద్దయు డెందము నందుఁ గైక ప
ల్కెను ముద మీయఁగా ధవుని కీర్తిత వాక్య నికాయ మెల్లనున్
వనిత సుఘోర వాక్యములు వచ్చె ననంగఁ దదంతకం బహో 11.

ఆ.వె.	ప్రతిన లిచ్చ టీవు క్రమముగఁ జేయుట
యీ వరము లొసఁగుట యెల్ల సురలు
నగ్ని ముందు నుండ నాలకింతురు గాక
మూడు పదులు ముగ్గు రీడ రాజ! 12.

చం.	రవియు శశాంకుఁ డాకసము రాత్రి దినమ్ములు నా గ్రహాలియున్
భువియు జగమ్ములున్ దిశలు భూతము లాగృహ దేవ తాలియున్
సువినుత దేవగాయకులు శూర నిశాచర దైత్యసంఘమున్
వివిధ జన వ్రజమ్ము తగ విందురు గా కిట నీదు మాటలన్ 13.

తే.గీ.	సత్యసంధుఁడు సుప్రభాశాలి ధర్మ
విదుఁడు సుసమాహితుఁడు రాజు వినుఁడు వరము
లొసఁగు చున్నవాఁ డిట నాకు నుత్తమముగ
దేవతా మూర్తు లార నా దెస దయ నిడి 14.

ఆ.వె.	ఇట్లు దేవి తా గ్రహించి కామవశు ధ
నుర్ధరుని వరదుని నుతు లొసంగి
మిక్కుటముగ నంత నక్కాంత పల్కెను
బలుకు లిట్లు తనదు భర్త తోడ 15.

కం.	స్మరియింపుమ నాథ సురా
సుర భండన మందు మున్ను చోద్యము కొన యీ
పిరి యుండ నిన్ను హింసిం
ప రిపులు మిక్కుటము భూప చంద్రా! దానిన్ 16.

కం.	అత్తఱి రక్షించితి నే
నుత్తమముగ దేవ! నిన్ను యుద్ధస్థలినిం
దత్తరమున వీడి మురియఁ
జిత్త మొసఁగితివి వరములు శీఘ్రము నాకున్ 17.

కం.	ఆ వరములనే కోరుదు
భూవర! దాచినవి నే నపుడు నీ కడనే 18.

యో వర సత్యవచన! నా
థా!వినుమా నాదు గిరల ననురాగమునన్

చం. ప్రతినను ధర్మబద్ధముగఁ బన్నుగఁ జేసి యొసంగ వేని చో
నతి రయ మింకఁ బ్రాణముల నార్య! త్యజింతును నే మహావమా
నిత నయి యున్న నాఁ బలికి నీరజలోచన కైవశమ్ముగోఁ
బతిని నిమిడ్చెఁ బాశమునఁ బడ్డ మృగమ్మన నాశనార్థమై 19.

తే.గీ. కామ మోహితు వరదునిఁ గాంచి పలికె
నంత నిట్లు రెండు వరము లప్పు డొసఁగి
నవి మహీపతి వచియింతు నా వరములు
వినుమ యిప్పుడు రెంటిని దనరి నాథ! 20.

తే.గీ. రామున కయి తెచ్చిన యట్టి రమ్యతరము
లయిన యభిషేక వస్తువు లన్ని యుంచి
చేయ వలయు రాజ్యమునకు శీఘ్రముగను
భరతు నభిషిక్తునిగ నాథ! వర తనయుని 21.

తే.గీ. రెండవ వరము సురదైత్య భండనమున
నిచ్చినది ప్రీతి తోడ మహీత లాధి
నాథ! యా కాల మిప్పుడు నాకుఁ దీర్ప
వేగ యాసన్న మయ్యెను వినుము దేవ! 22.

తే.గీ. దండ కాటవి వసియింపఁ దాపసి వలె
జడలు చీరాజినము లూని చక్కఁగఁ బదు
నాల్గు వత్సరమ్ము లవని నాథ రాముఁ
డరుగ వలయును జుమ్మి సత్వరము దేవ! 23.

చం. భరతుఁడు యౌవరాజ్యమున భద్రుఁ డకంటక ముండఁగా వలెం
బరమపుఁ గోర్కి నా దిదియ పన్నుగ నిచ్చిన దీ వరమ్ము దే
వర యిపు డేను వేఁడెదను వారక రాముని నేఁగఁ గానకుం
ద్వరితము నేడ చూడ మదిఁ దల్తును భూవర! నిశ్చయమ్ముగన్ 24.

తే.గీ. నెమ్మి సత్యసంగరుఁడవు కమ్ము రాజ
రాజ! కుల శీల జన్మములఁ దగ రక్ష
సేయుమ పరవాసం బది చిక్కుట కిలఁ
దపసు లందురు వలయు సత్యమ నరులకు 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్య కాండ యందుఁ బదునొకండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 12.

భార్య కైక మాటలను విని దశరథుఁడు నిశ్చేష్టుఁడై దుఃఖము తాపము చెలంగఁ దేఱికొని పరి పరి విధములఁ గైకను దారుణపుఁ గోరికలు తగవని నచ్చఁజెప్పినను గైక యంగీకరింప కుండుట.

కం. విని కైక దారుణ గిరలు
మనుజాధిపుఁడు వగ పంది మనమునఁ దాప
మ్ము నొక ముహూర్తము తాఁ బొం
దెను భృశముగ దశరథుండు దేవియె పలుకన్ 1.

కం. కలఁ గంటినో మనం బది
కలవర మందెనొ కరమ్ము కాదేని రుజల్
గలిగెనొ మనమున నాలోఁ
జెలరేఁగెనొ భూత మకట చేరి భృశముగా 2.

ఆ.వె. తలఁచి యివ్విధముగ ధరణీశుఁ డరయక
స్వాస్థ్య మింత యేని పడఁతి కైక
వాక్య పీడితుండు పడసెను జాల ప్రొ
ద్దునకు సంజ్ఞ నచటఁ దనర నడలు 3.

కం. కడు భీతి బాధయుఁ గలుగ
నెడఁదఁ బులినిఁ గన్న యట్టి యిఱ్ఱి పగిదిఁ దాఁ
బుడమి ననాచ్ఛాదము నా
యొడయుఁడు కూర్చుండె నంత నుర్వీశుండే 4.

తే.గీ. మంత్ర మహిమఁ గట్టుపడిన మండలమున
విషపు ఫణి వోలె నిట్టూర్చి వింత నక్క
టా యని దిగులు మీఱ మోహమ్ము వడసె
మఱల శోకసంతప్తుఁడు మనుజ వరుఁడు 5.

తే.గీ. చాల ప్రొద్దు గడవఁ బొంది సంజ్ఞ రాజు
దుఃఖితుండు క్రుద్ధుండునై తోరముగను
జక్షువుల తోడనె దహించు సరణిఁ జూచి
కైకను బలికె భర్త వాక్యమ్ము లిట్లు 6.

ఆ.వె. క్రూర! దుష్ట చరిత! కులనాశినీ! రాముఁ
డేమి పాపము నొన రించె నీకుఁ
బాప చిత్త! నేను బడతి నీ కెన్నఁడ
యిన వచింపు మకట యించు కైన 7.

కం. కొలుచును మాతృ సమానము
తలఁచి నిను రఘూత్తముఁడు సతత మా రాముం
డు లలితముగ నెందుకు నిడు
మల నీయఁగ నుత్సహింతు మఱి యాతనికిన్ 8.

తే.గీ. రా కుమారి ఘన విష సర్పంపు భంగి
నింట నుంచితి మది నేర కుంట వలన
నాదు జీవితమున కెంచ నాశ నార్థ
మనఁగ నిన్నక్క జమ్ముగ నడరి నేను 9.

ఆ.వె. జీవలోక జనులు చెలువముగఁ బొగడు
చుండ గుణము లెన్ని మెండుగ రఘు
రాము నిష్ట పుత్ర రత్నము నే యప 10.

రాధమునఁ ద్యజింతు రామ! చెపుమ

తే.గీ. సంపదను బ్రాణ మయిన గౌసల్య నయిన
నిఁక సుమిత్ర నయినఁ ద్యజియింప మన్న
విడువఁ గలవాఁడ పితృవత్సలుఁడు సుతుండు
రాముని విడువఁ జాలను భామ! నేను 11.

ఆ.వె. చూచి నంత జ్యేష్ఠ సుతుని నత్యంత హ
ర్షమ్ము కలుగు నెడఁద రఘువరేణ్యుఁ
జూడ రాక యున్నచో నష్ట మగును జే
తనయె నాకు భామ తత్క్షణమ్మ 12.

తే.గీ. లోకములు మనఁ గలవు సూర్యుండు లేక
సస్యములు పండు నింపుగ జలము లేక
నాదు జీవిత ముండదు నందనుండు
రాముఁ డిట లేకయున్నచో రమణి! నిజము 13.

ఆ.వె. పాప చింత యింక పాపచిత్తా! చాలు
వీడు నిశ్చయమ్ము పాడిగాను
శిరసు వంచి నతులు చేయుదు నీ కిట
నన్నిక గరుణింపు నళిననేత్ర! 14.

మ. పడతీ! యేమిది నీదు చింతన మహో పాపాత్ముఁరాలా! మదిం
గడు ఘోరం బథవా మదిన్ భరతుపైఁ గాంతా ప్రియం బప్రియం
బెడఁదన్ నాది యెఱుంగఁ గోరుదె బళా యీక్షించి నా కింపుగాఁ
బుడమిన్ ధర్మపరుండు నగ్రజుఁడు రాముం డంచు మున్నంటివే 15.

కం. నీ వా మాటను నీ కిల
సేవార్థము గాక యున్నఁ జెలువా నాకున్
నీ విఁకఁ బ్రీతిం గూర్పఁగ
నా వాక్యమ్మును బలికితె యాశ్చర్యముగన్ 16.

కం. పరు లను మాటలు విని శో 17.

క రయ సు సంతప్తవై వగం గూర్తు వహో
తరలి కినుక పేశ్మమునకుఁ
దరుణీ నాకుఁ దగునే యదయ నా యందున్

కం. నయ సంపన్నా! యో దే
వి! యడరె నిక్ష్వాకు వంశ వీరుల యింటన్
నయహీనం బక్కజముగ
బయల్పడఁ దవ వికృత మతి పన్నుగ నిటులన్ 18.

ఆ.వె. మున్ను సుంత యైన చిన్నతనపుఁ బల్కు
పలికి యెఱుఁగ వీవు లలన యప్రి
యంపు మాట నైన నందు వలన నమ్మ
కుంటి నిప్పలుకుల వింటె నీవు 19.

కం. పలుమారులు నా తోడను
బలికితివే రాఘవుండు భరతుని తోడన్
లలనా నీకు సమాన మ
ని లలితము గ బాల! వింటె నీరజ నయనా! 20.

ఉ. కానన వాస మెవ్విధినిఁ గాంతి నొసంగును ధర్మమూర్తికిన్
మానిని రాఘవేంద్రునకు మన్నన లొందిన యట్టి వానికిన్
మేనున సౌకుమార్యునకు నిర్దయగాఁ బదు నాలుగేం డ్లహో
మౌనిగ నిల్వ రామునకు మత్సర మేలనొ భామ! నీ కెదన్ 21.

చం. జగ దభిరామ రామునకుఁ జారువిలోచన నీదు సేవలోఁ
దగఁ దరియించు వానికి నితంబిని ఘోర వివాసనం బిటుల్
తగునె తలంపఁగా భరతుఁ దద్దయు మించును నీదు సేవలన్
మగువరొ కాన నే భరతు, మానస మందు, విశేష మెంచనే 22.

ఉ. సేవల గౌరవమ్మునను జెల్వగు నమ్మక మందు మించు వా
రీ వుడమిం గుమారుఁడు నరేంద్రుఁడు రాముని కన్న నుండిరే
వారిరి భక్తి తోడుతను బన్నుగఁ జేయఁడె నీకు సేవలే
యీ వని తోప జీవినుల నే యపనిందలు దూఱు లందెనే 23.

తే.గీ. శుద్ధ మనమున రాఘవుఁ డిద్ధరఁ గల
జీవ రాశి ననునయించి శ్రేష్ఠపుఁ బ్రియ
కార్యములఁ బౌరు లెల్లరఁ గర మలరఁగఁ
జేసి వారి మన్నన లందు భాసురముగ 24.

చం. జగములు నెగ్గు సత్యమునఁ జక్కఁగ దానము చేత దీనులన్
సుగురుల నెగ్గు సేవలను శూరుల శత్రుల వింటి తోడుతన్
జగతిని రాఘవుం డలరి సత్యము త్యాగము దాన సఖ్యతల్
తగు శుచి విద్య యార్జవము తద్ద వెలుంగును రాము నందుఁ జూ 25.

తే.గీ. అట్టి ఋజు గుణ సంపన్ను నమర తుల్యు
దేవి! పాప మాపాదింతు వీవు తేజ
మందు సంయమి సము నందు నకట రాము
నందు భావ్యమే నీకు నీ చంద ముండ 26.

తే.గీ. అప్రియంపు మాట యొకటి యనఁగ వినను
బ్రియము లెప్పుడు పల్కును బృథ్వి జనుల
తోడ నిష్టుఁడు రాముని తోడ నెట్టు
లప్రియము నీ కయి వచింతు నతివ చెపుమ 27.

తే.గీ. నాకు గతి యెద్ది యాతఁడు కాక యెవని
యందు వెలయు దమము క్షమ త్యాగ మింక
సత్య ధర్మములును గృతజ్ఞతయు భూత
ముల నహింసయు భృశముగ మూరి దేవి! 28.

కం. కైకా! వృద్ధునిఁ దప్తుని
నా కాలునిఁ గాంచు వాని నరయుచు దయతో
నాకుల చిత్తుని పైనన్
నీ కారుణ్యమ్ముఁ జూప నీ వర్హ వఁకన్ 29.

చం. పుడమిని సాగ రాంతమును బూర్ణము నిత్తును నీకు గోపమున్
విడువుము యంజలించెదను వేఁడెదుఁ బాదము లంటి యిత్తరిం 30.

గొడుకున కిమ్ము రక్షణము కూర్మిని రాముని కంగనామణీ
యొడయున కంట నీయకుమ యుర్వి నధర్మము నాకు నెవ్విధిన్

ఉ. ఈ పగిదిం దపించు మనుజేంద్రుని శోక విలోల మోహ సం
తాప సముద్ర పారమును దాట నశక్తుని దీన మానసుం
డై పలు మార్లు గావుమని యార్తిని వేడుచు నున్న వానినిం
బాపిని కైక రౌద్రతర వాక్యము లివ్విధిఁ బల్కెఁ గాంచుచున్ 31.

కం. వరము లొసంగి తపింతువు
ధరాధినాథ! మఱి యేల ధర్మవచనముల్
ధరఁ బల్కెదు పన్నుగ నర
వరాగ్ర గణ్యుండ! వీర! పాడియె నీకున్ 32.

చం. అడిగినఁ గూడి రాజ ఋషు లక్కట యేమని వారి కందువో
తడయక ధర్మవేత్త! మదిఁ దల్చితె యుత్తర మీయ నిట్టులం
బడతికిఁ గావ నెవ్వరితె ప్రాణము నిల్పితి నట్టి భార్యకుం
గడఁగి యసత్య వాచ్యములు గ్రక్కునఁ బల్కితి నప్పు డవ్విధిన్ 33.

కం. ఇప్పు డొసఁగి రాజ వరము
తప్పి వచన మీ వహో యితరము పలికినం
దప్పొనరించిన వాఁడవు
తప్పక యౌదు నరపతులఁ దలఁపఁగ నాథా! 34.

తే.గీ. శిబి యొసఁగెఁ దన మాంసమె శ్యేనమునకుఁ
బావురాయికి జరిగిన వాదమునఁ గ
పోతనమున కలర్కుఁడు మున్ను గన్ను
లిచ్చి యుత్తమ గతులకు నేఁగ వినమె 35.

ఆ.వె. ప్రతిన సేసి వనధి రాజ వేలను దాట
నేర దెన్నఁ డైన మూరి పూర్వ
వృత్తమును దలంచి చిత్తము నందు నీ
యానఁ జేయ కుండు మనృతముగను 36.

ఆ.వె. ధర్మమును దృజించి తనయు రాము నునిచి
రాజ్యమం దహో నిరంతరమ్ము
దుష్ట చిత్త! కోరు దువు పట్టమహిషి కౌ
సల్యతో రమించి సంతసింప 37.

తే.గీ. ధర్మ మైనను లేక యధర్మ మైన
సత్య మైనను లేక యసత్య మైన
నా కొసఁగి నవాక్యము లందు నాథ! లే ద
తిక్రమము సుంత యేని చింతింప వినుమ 38.

ఆ.వె. తనరి నీవు రాముని నభిషేకించిన
విషము మిక్కుటముగఁ బ్రీతిఁ ద్రాగి
నీ సముఖము నంద నేఁడ నే మరణింతుఁ
జూచు చుండ నీవు చోద్యముగను 39.

కం. ఒక్క దిన మైన నంజలిఁ
జక్క గ్రహించి నిలువంగ సతి కౌసల్యన్
పెక్కసమున నేఁ గాంచిన
మక్కుట మే లౌను నాకు మనుజాధీశా! 40.

కం. భరతునిపై నా పయినను
నరేంద్ర! యొట్టు నొనరింతు నందను రాముం
ద్వరిత మటవికి ననుపుట కి
తర మెద్దియు నొల్ల నేను దథ్యము సుమ్మీ 41.

కం. విపరీతపు వచనము లి
ట్లు పలికి విరమించె నంత లోలాక్షి యటన్
విపరీతమ్ముగ విలపిం
చు పతికి మారాడకుండుఁ జోద్యము గాఁగన్ 42.

చం. విని యశుభంపు మాటలను వేఁడఁగఁ గైక యరణ్య వాసమే
తనయులఁ బెద్ద రామునకుఁ దప్పక యీ భరతాఖ్య సూరికిం
దనరుచుఁ గట్టఁ బట్టమును దద్దయు దుఃఖము తోడ మిన్నకుం 43.

డె నట నొకింత సేపు పతి డెందము వ్రక్కలు గాఁగ బాధతో

చం ప్రియ మగు దేవి నప్రియ మభీతినిఁ బల్కు సతీ మతల్లినిన్
భయమునఁ గన్ను లార్పకయె పార్థుఁడు సూచుచు నుండె ఘోర శో
క యుతము లింక వజ్రనిభ గర్హిత వాక్యము లాలకించి ని
ర్దయఁ బలుకంగ డెందమునఁ దా సుఖ మింతయుఁ బొంద నేరఁడే 44.

తే.గీ. దేవి సేసిన నిర్ణీతి ధృతినిఁ జేసి
నట్టి శపథమ్ముఁ దన చిత్త మందు నెంచి
రామ యని నిశ్వసించి తా రాలె ఖండి
త తరు భంగి వేగమ్ముగ ధరణి పతియె 45.

తే.గీ. మతి యుడిగి నట్టి భంగి నున్మత్తు భంగిఁ
దేజ మణఁగిన సర్పంపు టోజ నాతు
రుని విధము విపరీతుఁడై ఘనముగఁ బడి
యుండె దశరథుం డవనిపై నండ లేక 46.

ఉ. దీనము గా నిలా ధవుఁడు తేటి యొకింత వచించెఁ గైకతోఁ
గాన కనర్థదాయకము కన్పడ నర్థ యుతమ్ము పల్క ఘో
రానయవాక్యముల్ తగునె యక్కట భూతము పట్టి నట్లుగా
మానిని! పల్క సిగ్గిలవె మన్యువు నొందఁగ నేల యివ్విధిన్ 47.

కం. బాలా మున్నెఱుఁగను నీ
శీలవ్యసనమ్ము నేఁడు చెన్నుగఁ దెలిసెం
జాల విపరీతములె యీ
లీలలు పరికింప నకట లేమా! వినుమా 48.

కం. ఎవ్వరి వలనఁ గలిగె నీ
కివ్విధపు భయం బెడంద నిట భరతునకే
యివ్వసుధా పట్ట మడుగు
దవ్వన వాసమ్ము నీయ నా రామునకున్ 49.

ఆ.వె. విడువు మిట్టి భావ మెడఁద నన్నృతమును 50.

భామ యెంచి తేని పతికి లోక
మునకుఁ దనయుఁడు భర తునకుఁ బ్రియమ్ము్మను
నిజముగ మది లోన నీరజాక్షి!

కం. పాపాత్ము్మరాల! క్రూరా!
యే పాపము దుఃఖ మయిన నీ వరసితి నా
లోపల రాముని యందుం
బాపపుఁ బను లాచరించు పరమక్షుద్రా! 51.

కం. రామునిఁ గాదని భరతుం
డీ మహి నేలంగ నొల్లఁ డెవ్విధి నైనన్
రాముని ధర్మము లోనం
దా మించు నని మది నెంతుఁ దరుణీ! వినుమా 52.

కం. రామా వన మేఁగు మనుచు
భామా నేఁ బలుక వాని వదనము వాడం
గా మునిఁగిన శశిఁ బోలుచు
రాముని నే నెవ్విధం బరయఁ గలవాఁడన్ 53.

ఉ. చక్కఁగఁ జేసి నట్టి సఖ సంయుత నిశ్చిత నిర్ణయమ్ము్మ నే
నక్కట యెట్లు సూడఁ గల నయ్యది యిత్తఱి రిత్త వోవఁగా
స్రుక్కిన సంగరధ్వజినిఁ జొప్పున నోడఁగ శత్రు కోటికిన్
దిక్కుల నుండి వచ్చిన సుధీ నరపాలుర కేమి చెప్పుదున్ 54.

కం. బేల! చిరకాలముగఁ దా
నేలం బాలించుచు నిట నిల్చెను గాదే
మే లగు నిక్ష్వాక్వన్వయ
పాలకుఁ డేమి ఫల మంచుఁ బలుకరె నృపులున్ 55.

కం. అడిగిన వృద్ధులు విబుధులు
కడు గుణవంతులు సుతుండు కాకుత్స్థుం డె
క్కడ యని నన్నక్కట నే
నుడుపెద నేమని వచింప నోటికి నగునే 56.

ఆ.వె. కైక కరము నన్నుఁగష్ట పెట్టఁగ రాము
నడవి కంపితి కట కొడుకు నంచు
నిజము చెప్ప నది యన్నృత మందు రందఱు
నమ్మఁ జాల రెవరు నయ విదూర! 57.

తే.గీ. రాఘువుం డేఁగ దారు ణారణ్యమునకు
నన్ను గౌసల్య యెవ్విధి నెన్ను మదిని
నప్రియం బివ్విధి యొనర్చి యబల కేమి
యందు బదులుగ నక్కట సుందరిఁ గని 58.

శా. ఆయా వేళల దాసి నా సఖిగ భార్యా భంగియుం జెల్లి నా
సాయం బుండును దల్లి నా సతము కౌసల్యా మహారాజ్ఞియే
నాయం దెప్పుడు ప్రీతి నుంచు నెదఁ దా నా కిచ్చె సత్సూను నే
నా యర్ధాంగిని నర్థురాలి నయొ నీ కై గౌరవింపం దగన్ 59.

ఆ.వె. నీ కొనర్చి నట్టి కైక! సత్కృతము ల
వియె తపించు చున్నవి కర మిపుడు
రోగి కన్నమందు రుచిక రాపథ్యపుఁ
గూర యొసఁగు నట్టి తీరు దనరి 60.

తే.గీ. రాముని యవమానమ్ము నరణ్య వాస
మెఱిఁగి భీత సుమిత్ర నన్నెట్లు నమ్ము
నాదు మృతి రాముని వివాసనమ్ము రెండు
నెఱిఁగి వైదేహి శోషించు వెఱచి కరము 61.

తే.గీ. కిన్నరుఁడు లేని హిమగిరిఁ గిన్నరి వలె
వేదనఁ దపించు వైదేహి నాదు ప్రాణ
ము హరియించుఁ దథ్యముగను మునుఁగ నామె
దుఃఖమున సమయుదుఁ గని తూర్ణముగను 62.

ఆ.వె. అటవిఁ దిరుగు రాము నరసి రోదించెడు
సీతఁ గాంచి నేను జీవితమ్ము 63.

నందు సుంత యైన నాశ నుంచ గలనె
యెవ్విధమ్ము నైన నెంచి చూడ

కం. తనయుని గూడి విధవ వయి
వనితా యేలుదు పుడమిని వనమున కేఁగన్
ఘనుఁ డా రాముఁడు దేవీ!
మన నుత్సాహమ్ముఁ జూప మదిలో వినుమా 64.

తే.గీ. విషము గూడిన మద్యము ప్రీతిఁ ద్రాగు
నరుని వలె భృశ మసతి పైన సతి వీవు
రూప మందు నత్యంతము రూపవతివి
సతివి యంచు నెంచితి మది నతివ! యకట 65.

కం. తీయని మాట లన్ృతముల
నో యతివా! యనునయింతు వొప్పుగ నన్నున్
బోయ కలస్వనమున నా
హా యడవి మృగమును బట్టి యడఁచెడు భంగిన్ 66.

తే.గీ. కల్లు త్రాగు బొమ్మని భంగి కాపురుషుని
గను దనయుని నమ్మె ననుచుఁ గాంతు రార్య
జనులు ధిక్కరింతురు నన్ను శంక లేక
రాజ మార్గము లందు నిలఁబడి యకట 67.

ఆ.వె. అకట యెంత శోక మక్కట యెంత యు
పద్రవమ్ము నీదు పల్కు లోర్పు
తోడ వింటి నిట్లు దుష్ట కార్యము మున్ను
జేయ దాని ఫలము చేరె నిపుడు 68.

కం. పాపిని! చిరకాలమ్ముగఁ
గాపాడితిఁ బాపి నైతిఁ గైక! తెలియకే
యే పాశము నింట నునుప
నా పాశమ్మె యురి యయ్యె నాహా తలఁపన్ 69.

ఆ.వె. పాపఁ డెఱుగ కుండఁ బామును జేత నొం
టరిగఁ బట్టి నట్లు తరుణి! నిన్ను
గూడి తనరు చుంటిఁ గూర్మి సేరకయె మృ
త్యు వని నీవు నాకుఁ దోయజాక్షి 70.

కం. నా చే దురాత్ము చేతను
పే చేయఁ బడె నపితృకుఁడు వింతగ రాముం
డే చీ యనంగ లోకులు
తోఁచును నా కర్థు లనఁగఁ దోరము నన్నున్ 71.

తే.గీ. మూర్ఖుఁ డీ దశరథుఁడు కాముకుఁడు నకట
యొక్క వనిత కొఱకు నంద నోత్తముని ర
ఘుప్రవరుఁ బంపుచున్నాఁడు ఘోర కాన
నమున కని లోకు లందురు నన్ను గాంచి 72.

తే.గీ. వ్రతములను బ్రహ్మచర్యము వలన నింక
గురువులకు సేవ లందును గరము నంద
నుఁడు కృశించె ననుభవించు నెడను దిరిగి
కలిగె రాఘవునకు ఘోర కష్ట మకట 73.

ఆ.వె. మారు మాట పలుక నేరఁడు నా తోడఁ
గాన కేఁగు మనినఁ గాంత! వినుమ
మంచి దంచు పలుకు మించఁగ వినయమ్ము
వినిన రాముఁ డిందు వింత లేదు 74.

ఆ.వె. చోదితుఁ డయి నాదు సుతుఁ డేఁగ నటవికిఁ
బల్కిన విపరీత వాక్యములను
బ్రియ మగు నవి నాకు వినినంత నక్కట
తనయుఁ డట్టు లనఁడు తథ్యముగను 75.

కం. తా నెఱుఁగఁడు నా భావం
బూనఁగ స్వచ్ఛపుఁ దలపుల నుత్తమ సుతుఁడే
గానన మేఁగు మనంగా 76.

నౌనను జింతింప కింత నానందముగన్

తే.గీ. లోకముల కసమ్మతముగ నా కుమారుఁ
డేఁగఁ గాంతారమున కిట్లు వేగమ మర
ణం బనుపు నన్ను యమ సదనమ్ముఁ గాంచ
క్షమకు నెన్నఁడు నర్హుఁడు కాని వాని 77.

కం. మనుజ శ్రేష్ఠుండు సనఁగ
వని కేను మృతుండు కాఁగఁ బాపంబిం కే
మి నెలఁత! మిగిలిన వారికి
జనులకుఁ జేయంగ నెంతు చల మేపారన్ 78.

ఆ.వె. నన్ను రాము నింక నందను లిద్దఱిఁ
గోలుపోవ సైపఁ జాలక ఘన
శోక భార మెడఁద సుదతి కౌసల్య న
న్ననుగమించు మృత్యు వందు నకట 79.

తే.గీ. నన్ను గౌసల్యను సుమిత్ర నందనులను
ముగ్గుర నరకమునఁ ద్రోసి పొందు రహి స
నాతన కుల మిక్ష్వాకు గుణ కుల మేలు
వీడ నేను రాముఁడు దాని విలువ తఱుఁగ 80.

కం. రాముని కానన వాసము
భామా! ముద మొసఁగె నేని భరతున కెడఁదన్
నా మరణమ్మున నాతం
డీ మహిఁ దర్పణము నాకు నీ రాదు చుమీ 81.

తే.గీ. అయ్యో నా పగదానివి యియ్యెడఁ గృత
కామ వేలుదు విధవగ భూమిఁ బురుష
పుంగ వుండేఁగ నడవికిఁ పుత్రు తోడ
మరణ మందఁగ నేను దనరుచు భృశము 82.

మ. నృప కన్యామణి రూప మంది కట నా నీకాయ్య మేతెంచితే 83.

యపకీర్తిం బరిభావముం గరము నా కందించితే ధాత్రినిన్
విపరీతమ్ముగఁ బాపకృత్యుని వలెన్ వీక్షింత్రు నన్నీ జనుల్
కృప లేకింతయుఁ జేసి తిట్లు నను గైకేయీ సుఘోరమ్ముగన్

తే.గీ. విభుఁడు రాముఁ డెవ్విధి నడవిఁ జరియించు
నకట నాదు కుమారుండు హయము లందు
గజము లందు రథము లందుఁ గదలు సున్ని
తుండు పాదచారి యగుచు నెండ లందు 84.

చం. ఎవనికి వంటవారు కడు నింపగు నన్నము కుండలమ్ము లూ
ని వఱలి వంట సేయుదురొ నెమ్మి సపానము లట్టి వాఁ డహో
తివిరి కషాయముల్ మఱియు తిక్తములుం గటు తీవ్ర భక్ష్య రా
శి వన సులభ్య మెట్లు నృపశేఖరుఁ డక్కట యాహరించునో 85.

ఆ.వె. అర్హము లగు బట్ట లలరి ధరించి సు
ఖమ్ముగ వసియించు ఘనుఁడు రాఘు
వుండు నేలపైఁ బరుండి కాషాయ వ
స్త్రముల నెట్టు లూను దలఁపఁ గలనె 86.

తే.గీ. ఎవ్వరన్న వాక్యము లివి యేఁగుట వన
మునకు రాముండు భరతుండు వొందుట యభి
షేచన మడరి తలఁపంగఁ జిత్రము లగు
దారుణంబు లచింత్యము లౌర చెపుమ 87.

కం. అతివలు స్వార్థపర లరయ
నతులమ్ముగ మోసగత్తియలె నిత్యమ్మున్
సతు లందఱి నే నను భ
రతుని జనని మాత్ర మందు రమణుల యందున్ 88.

తే.గీ. చెడు తలపుల దాన! ధనాశ కడు దనరెడు
దాన! క్రూర! నా కివ్విధిఁ దాప మొసఁగు
దాన! ధృఢమతి నా లో హితకరుఁ డైన
రామునం దప్రియము కంటి వేమి యిపుడు 89.

తే.గీ. రాముని గని మునుఁగ నుపద్రవము లందుఁ
దంద్రులు త్యజింత్రు తనయుల దారలఁ బ్రియ
లను విడుతురు భర్త లిఁక సర్వమ్ము నీ జ
గమ్ము మునుఁగును గ్రోధ సాగరము నందు 90.

తే.గీ. దేవ సన్నిభ రూపుని దివ్యముగ న
లంకృతు నను గదియు వాని రాముని సుతుఁ
గాంచ హర్షింతు వీక్షింప గాసె యువకు
ని వలె నౌదు నప్పట్టున నీరజాక్షి! 91.

చం. నడకలు ధాత్రిఁ జాగును ఘనమ్ముగ సూర్యుఁడు రాక యున్ననుం
బుడమిని వర్ష మీయక సమున్నత మున్న పురందరుండు రా
ముఁడు వన మేఁగఁ గాంచినసె మున్గి వ్యథార్ణవ మందు మించి యె
వ్వఁడును సజీవముండఁ డని భావన మియ్యది నాది భామరో! 92.

ఉ. నా లయ మెంచు దానిని ఘనద్విష నాఱడి నిచ్చు దానినిన్
మేలుగ నింట నుంచితిని మృత్యువుఁ బోలిన దాని నక్కటా
కాలపు సర్పి నంకమునఁ గానక నుంచిన భంగి మోహ మా
భీలము నిండ డెందమున వేగ వినాశము గోరి నట్టులన్ 93.

తే.గీ. వీడి రాముని లక్ష్మణు తోడ నన్ను
భరతు నుండఁ దోడుగ నీవు పట్టణమ్ము
రాష్ట్ర మేలనీ బంధువుల సమయించి
సంతసింపఁ గరమ్ము నా శత్రు గణము 94.

ఆ.వె. వెతల నున్న వాని వేధించుదాన క్రూ
ర! బలవంతముగ గిర లన నేఁడు
విఱిగి తత్‌క్షణమ్ము వేయి ముక్కలుగను
నేల నీదు పండ్లు రాల వేల 95.

తే.గీ. అప్రియం బించు కేనియు ననఁడు పరుష
వచనము లెఱుఁగఁడు ప్రియమ్ము పలుకు వాఁడు 96.

గుణ గణముల నారాధ్యుఁ డగుణము నెట్లు
చూతు వట్టి రాముని యందుఁ జోద్యముగను

తే.గీ. కేకయ నృప పాంసని నీవు శోక మందు
మునిఁగిన జ్వలించినఁ గృశియించిన విఱుగుచు
వేయి తున్కలుగఁ బడినఁ బృథ్వి దారు
ణ మ్మహితము సే నొనరింపఁ జుమ్ము బాల! 97.

చం. అసికి సమాన మీవు సత మప్రియముల్ వచియించు చుందువే
వెసఁ గడు దుష్టభావములు పెక్కులు కన్పడు నీదు చిత్త మం
దసతివి వంశ నాశినివి యాత్మను రంజిలఁ జేయ నేరవే
మసలఁగ నీవు సైప నిఁక మానిని కాల్తు సబంధనం బెదన్ 98.

తే.గీ. జీవితము లే దన సుతుని నే విడిచిన
సుఖము కల్గునె జీవింప సుఖము కలదె
నా కహితము సేయఁ దగదు నారి! కరుణఁ
జూడు పాదము లంటుచు వేఁడుకొందు 99.

తే.గీ. దారచేఁ బట్టు వడి యెడంద నమితముగ
భూమి పాలుఁ డనాథునిఁ బోలి యేడ్చు
చుఁ బడె రోగి పగిది దేవి సుదతి చాపఁ
జరణము లెడముగాఁ జేరఁ జాల కకట 100.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బన్నెండవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 13.

కైకేయి తిరిగి యా వరములనే యడుగ దశరథుఁడు తాపముతో భార్యను వలదని వేఁడుకొనఁగ నొప్ప కున్న విసంజ్ఞ నేలఁ బరుండిన రాత్రి యగుట. ఉదయమున మేలుకొలుప రాజును వారి నతఁడు వారించుట.

చం. అతివ యనర్థ రూపిణి నిజార్థ సుసిద్ధయె భీతి హీనయై
ధృతి భయ రూప దర్శిని పతిం గని కోరె వరమ్ము లంతఁ ది
ర్గి తరుణి కోరగం దగని కీ డన నొప్పని వాని నిద్ధరం
బతిత యయాతి భంగి నిలఁ బండిన భర్తను బుణ్య మాఱఁగా 1.

తే.గీ. సత్యవాది నని దృఢపు సద్వ్రతుండ
నంచుఁ బల్కెదు వుద్ధతి మించి రాజ!
వరము లిచ్చి నాకివ్విధిఁ దిరిగి కా ద
నంగ యత్నింతు వక్కట నలిన నేత్ర! 2.

తే.గీ. తడఁబడిన రీతి నొక ముహూర్తమ్ము నిలిచి
గైక యన నాలకించి భూకాంతుఁ డంతఁ
బల్కెఁ గ్రోధమ్ము చెలరేఁగ బదులు దశర
థుండు చిత్త మందు వగపు నిండ నిట్లు 3.

కం. మరణింప నేను రాముం
డరుగ వనమ్మునకు నో ని జామిత్రా యీ
ధర నీ వుండుమ సుఖముగఁ
దరుణీ! యీప్సితము దీరఁ దద్దయు నీకున్ 4.

కం. స్వర్గమున కేఁగ నన్నున్
స్వర్గావాసు లడుగం గుశలము సుతునకున్
దుర్గతి యా రాఘువునిది
తిర్గుచు నుండ వన మందుఁ దెలిపెద నెట్లున్ 5.

కం. కైకేయికిఁ జేయఁ బ్రియము
కాకుత్స్థు ననిపితి నేను గానకు ననఁగన్
వీఁక నిజము నే నుడువుచుఁ
గైకా! యది యనృత మౌ నకట యే మందున్ 6.

కం. చిర కాలమునకు శ్రమమున
వర పుత్త్రుఁడు కల్గె నాకు బాలార్తికి ని
ర్ధర రాముఁడు ఘన బాహువు
తరుణీ! త్యజియింతు నెట్లతనిఁ దర మగునే 7.

కం. శూరుఁడు విద్యల నన్నిటి
నేరిచిన జితాగ్రహుండు నీరజ నేత్రుం
డా రాము క్షమాపరు నే
నే రీతిని వీడ నేర్తు నెన్నం డైనన్ 8.

తే.గీ. ఎట్టు లిందీవరశ్యాము దిట్ట బలుని
దీర్ఘ బాహుని సుందర దేహుఁ దనయుఁ
బ్రియతముని రాము నంపుదు వీడి దయను
దండకా వనమునకుఁ బంత మది యేల 9.

ఆ.వె. అర్హుఁడు సుఖముల కనర్హుఁడు దుఃఖమ్ము
లంద నెన్నఁ డేని నందనుండు
రాముఁ డెంచ నట్టి రాముని నెట్లు ధీ
మంతుఁ జూతుఁ దాను వంత లంద 10.

తే.గీ. దుఃఖములకుఁ దగని వాని దుఃఖముల వ
శమ్ము సేయక మున్న యా చావు కల్గ
నాకు సంతసింతు మది ఘనమ్ముగ సుఖ
ముల ననుభవింతుఁ దప్పక నలిన నేత్ర! 11.

తే.గీ. క్రూరురాల! పాపావృత ఘోర చింత
నా! సతత సత్య విక్రమునకుఁ బ్రియ మగు
రామునకు నప్రియమ్ము పరాభవమ్ము
తోడ నపకీర్తి నాకు నిత్తు వది యేల 12.

కం. విలపించు చుండ నవ్విధిఁ
గలవరపు మనమ్ము తోడఁ గాంతుఁడు సూర్యుం 13.

డల పశ్చిమ గిరిఁ జేరెను
జెలఁగెను చీకఁటి దిశలను శీఘ్రమ యంతన్

ఆ.వె. ఆర్తిని విలపించు నా రాజునకు మూడు
జాముల నిసి వెల్గఁ జంద్రమండ
లమునఁ బ్రభలతోఁ గరమ్ము నయిన వెల్గు
నీ యఁ జాల దకట యింత యేని 14.

కం. వేఁడిగ నిట్టూర్చి పుడమి
ఱేఁడు దశరథుఁడు జరుం డటిముటి నలఁదురెం
జూడఁగ నభ మాసక్తిం
గూడిన చక్షువుల తోడ ఘోరపు టార్తిన్ 15.

ఆ.వె. ఉదయ మేను గోర నో రాత్రి! నక్షత్ర
భూషణ! దయఁ జూడుము నను భద్ర!
యంజలి ఘటియించి యార్తిని వేఁడెద
నిన్ను నేఁడు దీన నృపతిఁ గనుమ 16.

కం. లేకున్న నేఁగు రయముగఁ
గైకం గ్రూరాత్మ నిచటఁ గాంచఁగ నొల్లన్
నా కెవ్వని వలనఁ గలిగె
నీ కృచ్ఛ్రము లివ్విధముగ నెడఁద కలంగన్ 17.

ఆ.వె. పలికి యిట్లు తిరిగి పార్థివుం డంజలి
తోడ వేఁడఁ జాగెఁ దోయజాక్షి
నింకయు సతి కైక నీక్షించి పల్కెను
భాషణమ్ము లిట్లు భద్ర మెంచి 18.

తే.గీ. సాధు వైన నడత కల నీ ధవు నతి
దీను నీ వశమం దున్న వాని నాయు
వు సడలెడు వాని భద్ర! యీ పుడమి ఱేనిఁ
గరుణ తోడఁ గాంచుమ దేవి! కరము ప్రీతి 19.

కం. కరుణ గల దాని వీ వో
తరుణీ! సుశ్రోణి! నాకు దయ సాయమ్ముం
బరఁగింపుమ శూన్యమ్మున
గిర లేను బలుకుట లేదు కేకయ కన్యా! 20.

కం. దేవీ! యీ నా రాజ్యం
బీ వొసఁగుమ రామునకు నహీనము నిత్యం
బీ విశ్వమ్మునఁ గీర్తిని
నీ వొందెదవు కరుణించి నీరజ నేత్రా! 21.

కం. ప్రియ మిది చారుముఖీ! నా
కయినను రామ భరతులకు నయినను గురు సం
చయమున కైనను జగముల
కయినను జేయుమ కడింది యానందమునన్ 22.

తే.గీ. శుద్ధ భావము లున్నట్టి యద్ధరేశు
నశ్రు పూరితుఁ దామ్రాక్షు నతి విచిత్ర
ముగ నలమటించు రాజును ముదిత దుష్ట
భావ క్రూర వినియు నుంత పలుక దాయె 23.

తే.గీ. సుతు వివాసనము ప్రియపు సతి తనియక
నుంటను బ్రతికూలపు గిర లంట నరసి
మూర్ఛితుం డయ్యె శోకమ్ము మూర రాజు
గూలఁబడెను దెలివి లేక నేల పైన 24.

తే.గీ. ఇవ్విధి మనస్వి తప్తుఁడు నవ్వసుంధ
రా ధవుం డట నిట్టూర్పులం దలంచు
చుండ రాత్రి గడచెఁ బాడుచుండ మేలు
కొల్పు లవనీశుఁ డాపెను గుందు చుండి 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ
బదుమూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 14.

కైక తిరిగి యా వరములనే దృఢముగాఁ గోరుట, దశరథుఁడు కైకను భరతునిఁ ద్యజించితి నని పల్కి మూర్ఛితుఁడై పడియుండుట, వసిష్ఠుఁడు రాజగృహమునకు వచ్చి సుమంత్రుని తన రాకను రాజునకుఁ దెలుప మన సుమంత్రుఁడు రాజు వద్దకు నేఁగి మేలుకొలుప రాజు నతని నాపఁ గైక రాముని పిలుచికొని రమ్మని యతనికిఁ జెప్ప నతఁడు రాముని గాంచ నేఁగుట.

కం. సుత శోకార్దితు నేలఁ బ
డి తెలివిఁ గోల్పోయి తడబడి నటుల దొర్లం
బతిఁ గాంచి కైక పల్కెను
ధృతి నా పాపాత్ముఁరాలు తెల్లముగ నిటుల్ 1.

ఉ. పాపము నీ వొనర్చిన నిభమ్ము వరమ్ముల నాలకించి నీ
వీ పుడమిం బరుండ నది యెంచఁగఁ బాడియె శోక తప్తతన్
భూప! నిజార్థ పద్ధతి సమున్నత భంగిని నిల్వఁ బాడియౌ
యీ పరితాపమం దకట యీవు మునుంగుదు వక్కజమ్ముగన్ 2.

ఉ. సత్యము శ్రేష్ఠ ధర్మమని చక్కఁగ నందురు ధర్మవేత్తలే
సత్యము నాశ్రయించియె ప్రసన్న మనమ్మున నీకు ధర్మ మే
నత్యనురక్తిఁ జెప్పితినె యయ్యది దోషముగాఁ దలంతువే
యత్యయ మంద నిందుఁ దగ వౌనె ధరాపతి! యెంచి చూచినన్ 3.

చం. ఒసఁగెను స్వీయ దేహమునె యుర్వికి నాథుఁడు శైబ్యుఁ డా యగౌ
కసమున కిచ్చి మాటను సుఖమ్ముగ నుత్తమ లోక మేఁగెనే
వెసఁ దన నేత్ర యుగ్మమును బెర్కి యలర్కుఁ డొసంగెఁ బ్రీతి భూ
మి సురుఁడు వేడి నంతటనె మించి ప్రభం బతి వేదవేత్తకే 4.

తే.గీ. సత్య మనుసరించుచుఁ గూడి సత్యమును న
దీ పతి నిజ వేలను దాట నోపఁ డెన్నఁ 5.

డేని స్వల్ప మర్యాదను మానితముగ
నినకులేంద్ర! చింతింపఁగ నేల నీవు

తే.గీ. సత్య మగు బ్రహ్మ మొక్క వచనము నందుఁ
జక్క ధర్మమ్ము నిల్చును సత్య మందు
సత్య మక్షయం బగు వేద చయము దల్ప
సత్యమే పరమ్ము నొసఁగు సత్యముగను 6.

తే.గీ. ఆచరింపుమ సత్యము నంచితముగ
ధర్మ మెంచిన దృఢముగ దత్త వరము
లిపుడు సఫలము లగు గాక యింపుగాను
రాజ సత్తమ నాకు వరదుఁడ వీవు 7.

చం. నిలుపఁగ నింక ధర్మమును నే వచియించిన భంగి రామునిం
దలఁపక యన్య మెద్దియును దప్పక సూను బహిష్కరించుమా
పలుకుదు మూడు మారు లిట వారక వీడెద నీదు సన్నిధిన్
వలదని యన్న నిచ్చటనె పార్థివ సత్వర మేను బ్రాణముల్ 8.

తే.గీ. బల రిపు వలని పాశము బలి విడువఁగ
లేని పగిది నరేంద్రుండు లీలఁగా న
సక్తుఁ డయ్యెను బాశ విముక్తుఁడై చ
నంగఁ గైక యనఁగ వచనమ్ము లట్లు 9.

ఆ.వె. చక్రమునకుఁ గాడి సందునఁ జరియించు
నట్టి యెద్దు వోలె నవని ధవుఁడు
భ్రాంతిఁ జెంద మది వివర్ణ మయ్యెను గాంచ
వాని ముఖ కమలము వాడి మిగుల 10.

కం. తిరుగుచు నుండఁగఁ గన్నులు
నరపతి చూడంగ రాక నలఁగి యెడఁదఁ దాఁ
గరము తివిరి ధైర్యమ్మును
గురుతర మూని కని కైకఁ గోపమున ననెన్ 11.

కం. ఏ నిన్ను మంత్ర సహితము
సే నగ్ని యెదుటఁ గరమ్ము నెమ్మిఁ బడసితిన్
మానిని యా నిన్నింకయు
నీ నందను నా కుమారు నేఁ ద్యజియింతున్ 12.

ఆ.వె. కడచి రాత్రి దేవి కాఁగ సూర్యోదయం
బింక నీ గురు జను లంకము కది
సి యభిషేకమునకు నయి వేగిరపఱతు
రెల్లరు నను వినుమ కల్ల కాదు 13.

కం. రామాభిషేకమునకై
భామా సంభారము లవి పడసిన వెల్లన్
రాముం డొనరింపఁగ నీ
భూమిన్ సలిలక్రియలను మూరును నాకున్ 14.

కం. నీ వాపిన యభిషేకము
నీవును నీపుత్రుఁడు తరుణి! దురాచారా!
రావలదు నా కొసంగఁగ
నే విధిఁ దర్పణములు మది నెంచుమ దీనిన్ 15.

ఆ.వె. మున్నరసి జనులను మూర సుఖమ్మున
తిరిగి వారిఁ జాల నరయ హర్ష
హీనులుగను దుఃఖ మూని యవాఙ్ముఖు
లుగ భృ శాప్రసన్నులుగను నేను 16.

చం. పలుకుచు నుండ భూధవుఁడు పల్కుల నవ్విధిఁ గైక తోడుతన్
లలితపు రాత్రి పుణ్యవతి రమ్యపుఁ జంద్రునిఁ గూడి తారలన్
వెలయుచు నుండ నంతట గుభిల్లున నింపుగఁ దెల్లవాఱెఁ దా
నలసి మహాత్ముఁ డుండ హృదయమ్మున దుఃఖము పొంగి పొర్లఁగా 17.

తే.గీ. అంతఁ బాపపు నడత గలట్టి కైక
పార్థివునిఁ గాంచి తిరిగి కోపమ్ము తోడ
వచన నైపుణ్య మున్నట్టి పడఁతి పలికెఁ 18.

బరుష వాక్యమ్ము లివ్విధి భర్త తోడ

మ. ఇది యే మిట్టులు పల్కు దీ వకట భూమీశా! విషాభమ్ము నౌ
పద కాయమ్మును వేగ రాము నిటకున్ భావ్యమ్ము రప్పింపఁగ
న్మది నే కష్టము నేరఁ డాతఁడు గదా నా పుత్రు స్థాపించు మీ
వు దగన్ రాజ్యము నందుఁ బంపు వనికిం బుత్రోత్తమున్ రామునిన్ 19.

తే.గీ. శత్రువులు లేని విధముగఁ జక్కఁగ నను
జేసి కృతకృత్యుఁడ వగుమ చెన్నుగ ననఁ
గైక విని కశా తాడిత ఘన హయ నిభ
చోదితుఁ డయి దశరథుండు సుదతి కనియె 20.

తే.గీ. ధర్మ బంధనమున నివ్విధముగ నన్ను
గైక బంధించితే నీ వకట తెలివిని
నష్ట పోయితి నా జ్యేష్ఠ నందను గనఁ
గోరుదు నిపుడు రామునిఁ గూర్మి సుతుని 21.

మ. ఉదయింపంగ దినమ్ము నందు రవి యత్యుగ్రంపు టారాత్రి యేఁ
గఁ దగం బుణ్య ముహూర్తమే కదియ నక్షత్ర ప్రసిద్ధమ్ముగా
సదిలాదేవ వసిష్ఠుఁ డచ్చటకు శిష్యవ్రాత ముండంగ వెం
టఁ దదావాసముఁ జేరె వేగ తన తోడం గూడ సంభారముల్ 22.

సీ. తుడిచి తడుపఁబడ్డ తోరంపు వీథులు టెక్కెమ్ము లల్లాడ నిక్కు చుండఁ
జిత్రంపుఁ బువ్వులు చెల్వముగఁ జెదర విరిదండ లెల్లెడఁ బరగుచుండ
మురియుచు జనులుండ మూర నంగళ్లు మహోత్సవమ్ము చెలఁగు చుండ విరివి
రాఘువార్థమ్ము సేర జనులు చంద నాగరు ధూపము లలర గంధ యుతము
తే.గీ. శక్ర నగర నిభ పురము సంయమీంద్రుఁ
డా వసిష్ఠుఁడు దాఁటి ధరామర విల
సితము పౌరజానపద సంయుతము యజ్ఞ
విద సదస్య ద్విజ యుతము సదన మరసె 23.

తే.గీ. కదిసి యంతఃపురము దాఁటి పదిలముగ జ
నుల వసిష్ఠుఁడు సంతస మలర కరము 24.

పరమ ముని ప్రవేశించి యా ద్వార మందు
సారథి సుమంత్రు రాజేంద్రు సచివుఁ గాంచె

తే.గీ. కని విశారదు సూత పుత్రుని వసిష్ఠుఁ
డు సుమహాతేజుఁ డా విప్రుఁడు మునివరుఁడు
క్షిప్రము వచింపు నారాక క్షితి పతికి సు
మంత్ర యంచు బలికి ప్రీతి మఱియు ననియె 25.

తే.గీ. కాంచన ఘటము లియ్యవి గంగ నుండి
యంబుధుల నుండి తెచ్చిన యప్పు లుండ
నిండి మేడి కట్టియ పీఠ ముండె నిచ్చ
ట నభిషేకార్థమై తేఁబడంగ వెలసి 26.

ఆ.వె. విత్తనమ్ము లన్ని యుత్తమ రత్నము
లు దధి తేనె ఘృతములు కుసుమములు
పాలు లాజ లింక మేలు దర్భలు కన్య
లు సెనమంద్రు మద కరి సెగడంగ 27.

ఉ. నాలుగు వారువమ్ముల ఘనంపు రథం బసిరాజ ముండఁగా
మేలగు విల్లు మానవ సమేతము యానము జంద్ర సన్నిభం
బౌ లలితంపు ఛత్రము సితామల వీజన హేమ పాత్రలున్
మేలిమి స్వర్ణ దామముల మీఱి వెలింగెడు పాండు ధుర్యముల్ 28.

ఉ. సింగము నాల్గు దంతముల శ్రేష్ఠపు గుఱ్ఱము వీర్యవంతమున్
మంగళ వాద్య సంఘములు మానిను లింపుగ భూషితల్ స వే
శ్యాంగనలుం బురోహితులు నావులు విప్రులు జంతు పక్షి స
త్సంగము పౌర జానపద సంఘము వర్తక సంచయమ్మునున్ 29.

తే.గీ. వీరు నితరులు మిక్కిలి ప్రియముగ వచి
యించు వారు నాహ్వానితు లెల్ల రిటకు
రాఘు వాభిషేకమునకు రాజ వరులఁ
గూడి నిల్చిరి యిచ్చటఁ గూర్మి మీఱ 30.

తే.గీ. దినము సాగఁగ నింపుగ దివ్య పుష్య
మీ సునక్షత్ర యోగము మీఱ రాజ్య
ము నిఁక రాముఁ డంద వలయుఁ బుడమి ఱేని
నిఁ ద్వరపఱపుమ వేగమ నీవు వెడలి 31.

కం. విని యా మాటలు సూతుఁడు
ఘనాత్ముఁడు సుమంత్రుఁ డెంచి కాకుత్స్థ విభున్
ఘనముగ నేఁగెను లోనికి
మన మలరుచు నుండ గాంచ మనుజాధిపునిన్ 32.

కం. ఆ వృద్ధుని ముందుగ రా
భూవర సమ్మానితుండు భూపతి శుభమున్
వావిరి కోరెడు వా రీ
దౌవారికు లాప లేక తారుండి రటన్ 33.

తే.గీ. చేరి రాజు సమీపము నేరక నర
వరు నవస్థ నుంతయు నేని పరమ హర్ష
మున వర వచనమ్ముల నంతఁ బొగడఁ జాగె
సూతుఁడు సుమంత్రుఁ డడరుచు నాతతముగ 34.

తే.గీ. కాలమున కనుగుణముగఁ గదిసి యంతి
పురము పార్థివు నివ్విధిఁ బొగడఁ జాగె
సూతుఁడు సుమంత్రుఁ డింపుగ నాతతంపు
భక్తి నంజలి ఘటియించి శక్తి కొలఁది 35.

కం. ఇనుఁ డుదయింప మహాంబుధి
ఘనముగ నానంద మందు కరణిం బ్రకృతిన్
ఘనముగఁ బ్రీతుఁడు సూతుఁడు
మనమున బ్రీతినిఁ బడసె సుమంత్రుం డంతన్ 36.

కం. హరి నీ వేళన్ మాతలి
కరమ్ము కీర్తింప దనుజ కాయము నెగ్గెన్
నరవర యవ్విధి నిత్తఱిఁ 37.

గరం బలరి మేల్కొలిపెదఁ గాకుత్స్థశా

తే.గీ. వేద వేదాంగములు ఘన మోదమున స్వ
యంభువుని బ్రహ్మ దేవుని నంచితముగ
నిద్ర లేపిన విధి నవనీ పతీ! ము
దముగ నిద్ర లేపుదు మిమ్ము సముచితముగ 38.

తే.గీ. చంద్రుఁ గూడి యాదిత్యుఁడు సకల జీవు
లను ధరించి వెలింగెడు రత్నగర్భ
నిద్ర లేపిన విధి నవనీ పతీ! ము
దముగ నిద్ర లేపుదు మిమ్ము సముచితముగ 39.

తే.గీ. మేలుకొనుమ వేగమ్ముగ మేదినీశ
భూషితుఁడ వగుము తగ వపువు వెలుంగు
లీన మేరు పర్వతమున నెలమి దిన క
రుఁ డుదయించు నట్టి పగిది యడరి యింక 40.

చం. రవి శశి శూలి వైశ్రవణ రాడ్వరు ణాగ్ని పురందరుల్ ధరన్
రవికుల రత్న యిత్తురు ధరాపతి నీకు జయమ్ము నెమ్మినిన్
భువి గతియించె రాత్రి కృతమున్ మఱి కార్య మెఱుంగు చేయు మ
య్య విధి ననంతరంపుఁ బని నయ్యభిషేకము నిల్చె సిద్ధమై 41.

ఆ.వె. చేరి స్వయముగను వసిష్ఠుఁడు విప్రుల
తోడ నిలిచి యుండెఁ బాడిగ నిట
నంజలు లిడి యుండ నడరి పౌరులు జాన
పదులు వర్తకులును బార్థివేంద్ర! 42.

చం. ఒసఁగు మనుజ్ఞ రాజవర యుత్సవ మీ యభిషేక మింకఁ జా
గ సదన మందు నాయకునిఁ గానని సైన్యము పాల హీనమౌ
పసరము లింక గోవులును వాహ విహీన మచంద్ర రాత్రియుం
బస చెడు నట్లు రాజ్య మది పార్థ విహీనము కాంతి హీనమౌ 43.

కం. పలుక ననునయపు వచన 44.

మ్ము లర్థ వంతమ్ము లిట్లు భూకాంతునితోఁ
గలవర మందె భృశమ్ముగ
నిలాధి నాథుండు మఱల నెద విని నంతన్

తే.గీ. సూతుఁ జూచి పలికె రాజు శోకమున నె
ఱు పయిన కనుల సూత విఱుచుచు నుంటి
వి పలుకుల మర్మములను నావి యని  సుత ని
మిత్త మెలమినిఁ గోల్పోయి మిగుల మదిని 45.

ఉ. దీనుని దీన వాక్యములు తీరుగ సారథి యాలకించి వే
తాను గృతాంజలుం డగుచుఁ దగ్గెను వెన్కకు సుంత యంతటన్
మానిని కైక పల్కుటకు నాథు నశక్యతఁ గాంచి సూతునిన్
మానుగ మంత్ర వేత్తయె సుమంత్రుని నారసి పల్కె నివ్విధిన్ 46.

తే.గీ. రామ హర్షమున సుమంత్ర! రాజవరుఁడు
మేలుకొని యుండ రాతిరి చాల తలఁచి
నిద్రకు వశుఁ డయ్యె నిపుడు నీవు వేగ
రాముఁ గొనితెమ్ము మది విచారమ్ము వలదు 47.

ఆ.వె. ఆతఁడు తలఁచి మది నత్యంత శుభమును
బ్రీతిఁ జెంది తాల్చి విభుని యాజ్ఞ
తల సుమంత్రుఁ డంతఁ దరలె శీఘ్రమ్ముగ
రాముని నరయ గృహ రాజ మందు 48.

తే.గీ. తన్ను ద్వరపఱుపఁగ నట్లు తాను దలఁచె
నంత రామాభిషేకార్థ మలరి ధర్మ
వేది రాఘవుఁ డరుదెంచు వేగ యిచట
కంచు నేఁగె ముదమ్మునఁ గాంచ నతని 49.

తే.గీ. వీడి యంతఃపురమ్మును వేగ సాగ
రహ్రద నిభమ్ము నంత ద్వార తటిఁ గాంచె
జనుల గ్రిక్కిరిసి నిలువ సంబరమున
సూతుఁడు సుమంత్రుఁ డలరుచు నాతతముగ 50.

కం. కదలి రయమ్మున ముందుకుఁ
గదిసి సుమంత్రుఁ డటఁ జక్కఁగను ద్వారమ్ముం
బదిలమ్ముగఁ జేరిన మ
న్నె దొరల ధనవంతులఁ గనె నిజ పౌరాళిన్ 51.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదునాల్గవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 15.

సుమంత్రుఁడు దశరథు నాజ్ఞ రామునిఁ దీసికొని వచ్చుటకు రామ సౌధరాజమును చేరుట. రామ వేశ్మ వర్ణనము.

ఆ.వె. వేద పారగు లగు ద్విజులు స రాజ పు
రోహితులు నిలిచిరి రుచిరముగఁ గ
డపి నిసి నట ముద మడర గృహ ప్రాంగణ
మందుఁ గూడి యెల్ల రాత్రముగను 1.

తే.గీ. మంత్రులు చమూ పతులు నిగమ ప్రవరులు
రాముని యభిషేకమ్ము నారయ ముదమ్ము
మీఱ నేతెంచి కూడిరి మేదినీశు
సౌధ రాజావరణ మందు సంభ్రమమున 2.

తే.గీ. కాంతి నుదయింప సూర్యుఁడు కర్కటంపు
లగ్న మందుఁ బుష్యమి తనరంగ రామ
జన్మ సమయమ్ము నందునె జరపఁగ నభి
షేక మెంచిరి బ్రాహ్మణ శ్రేష్ఠు లెలమి 3.

ఉ. బంగరు నీటి కుండలును భద్రపు పీఠము భూషితమ్ము ను
త్తుంగ రథమ్ము కప్పఁ బులి తోరపుఁ జర్మము పెల్ల నింపుగా
గంగయు నింక నా యమున గ్రద్దనఁ గూడిన యట్టి తోయమున్
ముంగడ నుండెఁ గూప జల పుణ్య నదీ ప్రాద సత్త్ర తోయముల్ 4.

తే.గీ. ఇంకఁ దూర్పు నూర్ధ్వము పెన్క కేఁగు నదుల
జలములు కలిపి విమలంపుసాగ రాంబు
వులను సకల దిశల నుండి వొల్పుగను గొ
ని రయమునఁ దెచ్చి యుంచిరి నెమ్మి నచట 5.

తే.గీ. వెండి బంగరు గిన్నెలు నిండ నీరు
మఱియు లాజలు  కప్పగం బాల పత్ర
ములు కలువలు తామరలును వెలయ నుంచి
రచట రమ్యముగ నభిషే కార్థ మెలమి 6.

ఆ.వె. దధి ఘృతమ్ము తేనె దర్భలు సుమములు
పాలు లాజ లుండ పరమ భూషి
తాంగనా మణులు ను తానన్య వేశ్యలు
దనరు చుండి రచటఁ దత్పర లయి 7.

కం. చామరము చంద్ర కాంతుల
తో మెఱయుచు రత్న చయముతో భాసిలుచున్
రామున కయి కాంచన మయ
మై మరులు గొలుపుచు సిద్ధమై యున్న దటన్ 8.

కం. తెల్లని వెన్నెలఁ బోలుచు
నుల్లము లలరంగఁ జేయ నుజ్జ్వలముగ భా
సిల్లు గొడు గందముగ విల
సిల్లిన దభిషేక తటిని సేవార్థంబై 9.

తే.గీ. వేచి యున్నది తెల్లని వృషభ మడరి
యాగి యున్నది ధవళంపు టశ్వ మచట
మత్త కుంజరం బది రాజసత్తమునకు 10.

యోగ్య మెక్కుటకు నిలిచి యున్న దచట

తే.గీ. నిల్చి రెనమండ్రు కన్యలు నీరజాక్షు
లట నలంకృతలై మంగ ళాంగనలు చ
రింప వందిమాగధులును నొంపుగాను
వివిధ వాయిద్యము లచట వెలసి యుండె 11.

ఉ. వీఁక సమస్త వస్తువుల వే యభిషేక నిమిత్త ముంచ ని
క్ష్వాకుల కర్హమౌ విధము పార్థుని యానతి కూడి రాజులే
ప్రాకట ముండ సిద్ధముగఁ బట్టపుఁ గార్య నికాయ మెల్ల నా
హా కన నేర కా నృపతి నందఁకు తర్కము సేసి రివ్విధిన్ 12.

ఆ.వె. దినకరుఁ డుదయించెఁ దనరె రామాభిషే
కంపు బనులు నృపతి కింపుగ మన
రాక నెవరు తివిరి రమ్యముగ వచింపఁ
గలరు డెంద మందుఁ దలఁప వలయు 13.

తే.గీ. ఇట్లు లనుచుండ వారు మహీపతులును
సార్వభౌములు నచ్చటఁ జక్క నాల
కించి యా సుమంత్రుఁడు పల్కె నంచితముగ
నిట్లు రాజ సన్మానితుఁ డెలమి నంత 14.

ఆ.వె. రాజు నాజ్ఞ నేను రాముని ద్వఁజపఁకు
పఁ జనుచుంటి నిపుడు నిజము పలుక
మీర లెల్లరు పుడమిపతికిఁ గడు పూజ్యు
లరు విశేషముగను రామునకును 15.

కం. నే నడిగెద రాజేంద్రుని
నో నరవరు లార రఘుకులోత్తము వినతిం
దా నిప్పుడు మేలుకొనఁగ
నైన మిటకు రామికెల్ల భద్రము తోడన్ 16.

చం. పలికి యిటుల్ సుమంత్రుఁ డటఁ బన్నుగ నంతిపురంపు ద్వారముం 17.

దలుపులు మూసి యుండు సతతం బది కార్యవిదుండు సేరి తా
లలితముగా నుతించుచుఁ గులమ్మును బడ్క గదిన్ సరాతికిన్
నిలిచెను పెన్క వైపునసె సెమ్మి నొసంగుచు నుండి దీవనల్

చం. రవి శశి శూలి వైశ్రవణ రాడ్వరు ణాగ్ని పురందరుల్ ధరన్
రవికుల రత్న యిత్తురు ధరాపతి నీకు జయమ్ము సెమ్మినిన్
భువి గతియించె రాత్రి యహముం బఱతెంచె శుభమ్ము వేగ లె
మ్ము వర నరేంద్ర చేయు మిఁక ముఖ్య మనంతర కార్య మింపుగా 18.

ఉ. వచ్చిరి విప్ర పుంగవులు వర్తకు లింక బలాధినాథులే
యిచ్చ వహించి రారయ మహీపతి మేల్కొను మిప్పు డింపుగా
మెచ్చుచు నిట్లు పల్కగను మేటి యమాత్యునిఁ గాంచి నిల్వఁగా
నచ్చటఁ బల్కె మేలుకొని యద్ధరణీపతి యంత నివ్విధిన్ 19.

ఉ. నాతియె పల్కఁ దెమ్మనుచు నందను రాముని నిన్నుఁగాంచి యీ
రీతిని నిల్చి సూతవర లీలఁగ నేల యతిక్రమింతు వీ
భూతల నాథు నానతినిఁ బుత్రుని రామునిఁ దెమ్ము వేగమే
రాతిరి నిద్ర నే నెఱుఁగ రా జని యిట్టు లొసంగె నాజ్ఞనే 20.

చం. విని నరనాథు మాటలను వేగ మతండు నమస్కరించి యం
త నృపతి మందిరమ్ము విడి తాఁ జనె సూతుఁడు ప్రీతి నొందుచున్
మనమున రాజవీథిని సుమంత్రుఁడు కేతన భాసితమ్మునన్
వినుచు రఘూత్త మాభిషవ విస్తృత వాక్యము లాడఁగం బ్రజల్ 21.

మ. చని కాంచెన్ రఘురామ వేశ్మము మనోజ్ఞస్ఫూర్తిఁ గైలాస శృం
గ నిభభ్రాజిత శక్ర ధామ రుచి సంకాశమ్ము భాస్వత్కవా
ట నికాయద్యుతి శోభితమ్ము శతగాఢస్ఫీత వేదీ యుత
మ్మును హేమప్రతిమాగ్ర శోభితము సమ్మోదంపుఁ జిత్తమ్మునన్ 22.

సీ. మణి విద్రుమ సువర్ణ మయ తోరణ విలసితమ్ము శారద నీరద సమ దీప్త
మసమ మేరుగుహ వ రాభ నివాసము మణివర మాలోత్తమ సమలంకృ
తము మౌక్తిక మణి వితాన వికీర్ణమ్ముఁ జంద నాగరు ధూప సంయుతమ్ము
దార్దుర ఘన పర్వత శిఖరమ్ము పగిది వాసన లీనుచుఁ బరఁగు గృహము

తే.గీ. సారస మయూర విహగ రాస విలసితము
మనము నలరించు నీహాది వనమృగ ప్ర
తిమల ప్రభల తోడ వెలయు దివ్య గృహము
శశి దినకర సమ కుబేర సదన నిభము 23.

ఆ.వె. ఇంద్ర భవన తుల్య మింక నానా ద్విజ
గణ సమాకులమ్ము ఘన గిరీంద్ర
మేరు శృంగ నిభము మేదినీశ తనయ
గృహము సూతుఁ డరసె రహి చెలంగ 24.

చం. నిలువఁగఁ గూడి యంజళుల నిండుగఁ బౌరులు చక్కనైన కా
న్కలు గొని యూరి వారుఁ బ్రభు నందను నా యభిషేక మారయం
జెలఁగి యలంకృ తౌకమును జెన్నుగ మేఘ సమమ్ము రత్న రా
శి లలిత భూషి తాలయముఁ జేరెను గుబ్జ కిరాత సేవ్యమున్ 25.

తే.గీ. అశ్వ యుక్త రథమ్మున నడర కవచ
మంత సారథి రామ గృహమ్ము నర ని
కాయము వెలుంగ నచ్చటఁ గదిసె సకల
పుర జనులు సంతసింపంగఁ ద్వరితముగను 26.

కం. చేరి మృగ మయూర యు తా
పార ధనోపేత గృహము బలరిపు బృహ దా
గా రాభమ్మును సూతుం
డా రామ నివాస మరసె నానంద మెదన్ 27.

చం. సదనము వెండి కొండ వలెఁ జక్క నలంకృతమై చెలంగఁగాఁ
ద్రిదశ వరాలయాభమున దివ్యపు టంకణ మంతఁ జేరి తాఁ
బదిలముగాఁ దొలంగుచు నృపాల సుతాప్తుల నిల్వ నచ్చటం
గదిసెను లోగృహమ్మును బ్రకాశము నింపుగ సూతుఁ డత్తఱిన్ 28.

ఆ.వె. అచ్చట నతఁడు విని హర్ష యుక్తములు రా
మాభిషేకపు వచనావళి జను
లనుచు నుండఁ బ్రజల కందఱుకు ముద మొ 29.

సంగు నట్టి రామ మంగళములు

తే.గీ. రమ్యము మహేంద్ర మందిర రాజ నిభము
మృగ విహంగ సమాకులము గృహ వరము
మేరు శృంగ సంకాశము భూరి గృహము
ప్రభల వెల్గు రామ గృహ మరసె నతండు 30.

తే.గీ. కేలు మోడ్చి కానుక లుండఁ గేల జనులు
జానపదులు వేవేలుగ యానములను
వీడి ద్వార గతుల నెల్ల వెలయు చుండ
నిలిచి కాంచెను సూతుండు నెమ్మి నచట 31.

తే.గీ. మేఘ సంయుత శైలము మించు దేహ
మున్న యంకుశ మెంచని యూర మద జ
లమ్ము శత్రుంజయ మను నామమ్ము వెలయు
భద్రకరిఁ గాంచె రామార్హ వాహనమ్ము 32.

తే.గీ. హయ రథ గజముల పయిన నరుగుదెంచి
మంత్రి వరులు ప్రియులు నేల మగని కెంచఁ
గలసి యుండ నెల్లెడలను గాంచి వారిఁ
దొలఁగి యంతిపురముఁ జేరె నలరి యతఁడు 33.

తే.గీ. కొండపైఁ గదలని మబ్బు దండుఁ బోలు
ఘన విమాన సన్నిభ వేశ్మ గణము లున్న
రామ భవనము నతఁ డవారముగఁ జొచ్చె
నర్ణవమును మొసలి జొచ్చు నట్లు ప్రీతి 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదునైదవ సర్గము.

## అయోధ్యా కాండము

# సర్గము 16.

సుమంత్రుఁడు రామసౌధమును బ్రవేశించి సీతా సమేత రామునిఁ గాంచి యతనిని దశరథుఁడు చూడఁ గోరుచున్నవాఁ డని వచింప రాముఁడు లక్ష్మణ సమేతము తండ్రినిఁ గాంచ బయలుదేరుట. రాజ మార్గమున పౌరు లానందముగాఁ బల్కు మాటల నాలకించుచుఁ జనుట.

మ. అనుమోదమ్మున నుండ పౌరులు నివాసాంతఃపురద్వారముం
గని పే దాఁటి పురాణ పేదుఁడు మహాకక్ష్యం బ్రవేశించి యౌ
వనులం బ్రాస ధనుర్ధరప్రవరులన్ భద్రాప్రమత్తైక చి
త్త నరవ్రాతము రక్ష కాళి నృప భక్తశ్రేణి వీక్షించుచున్ 1.

తే.గీ. మఱియుఁ చూచె నక్కడ వృద్ధ మానవుల ధ
రింపఁ గాషాయ వస్త్రము లింపుగాను
పేత్ర కరు లలంకృతుల నువిదల కచట
రక్షకుల ద్వార మందు నలరఁగ నతఁడు 2.

ఆ.వె. రామ హితము పైన రతి యున్న వారలు
వచ్చు వానిఁ గాంచి పరమ సంభ్ర
మమున లేచి రాసనముల నుండి సుమంత్రుఁ
డేఁగుదెంచు చుండ నెలమి నంత 3.

చం. వినయుఁడు సూతనందనుఁడు వీరిని నెల్లరఁ గాంచి యంతటం
గన రఘురాము ద్వారమున గ్రక్కున నిల్చె సుమంత్రుఁ డంచు నా
తనికి వచింపుఁ డయ్య యనఁ దద్దయుఁ బ్రీతి సభార్యుఁ డైన రా
ముని కడ కేఁగి సత్వరము మూరి వచించిరి వార లింపుగన్ 4.

కం. విని యెఱిఁగి జనక హృత్ప్రియు
ఘను సూతుని రాక ముదము కర మీయఁగ నా
తని కచ్చటికే రప్పిం
చెను రాముఁడు రాఘవుండు శీఘ్రము యతనిన్ 5.

ఉ. భూవర పుత్రుఁ గాంచె నట భూక్షి దసృక్సమ శుద్ధ చంద నా 6.

ప్రావృత గంధు సూతుఁడు సువర్ణ వరాసను వైరి ఘాతిఁ జి
త్రా వనితా సమేత శశి తాదృశు వైశ్రవ ణాభు రామునిం
బావను వాల సువ్యజన భాసిత హస్త ధరాత్మజా యుతున్

తే.గీ. వంది వినయజ్ఞుఁ డొనరించి వందనములు
వినయముగ నిజ తను తేజమున వెలుంగు
నిన నిభునకు నడిగి సుఖమును ధరేశ
సత్కృతుండు సాంజలి  సుఖాసనున కనియె 7.

తే.గీ. రాఘవేంద్ర! కౌసల్యా వర తనయుండ!
రామ! నిన్ను జూడ నిపుడు రాజు జనకుఁ
డిచ్ఛగించె మహిషి కైక యెలమి నుండఁ
జెంతఁ జన నర్హుఁడ వటకు శీఘ్రముగను 8.

కం. విని యా మాటలు రాముం
డు నరర్షభుఁడు ఘనతేజుఁడు సుమంత్రుని సూ
తుని గౌరవించి సీతను
గని పల్కె ముదమ్ము నంది కర మిబ్బంగిన్ 9.

ఉ. దేవి! ధ్రువమ్ముగా నిపుడు దేవియు రాజును నా గుఱించి యే
వావిరి తల్చుచుందు రటఁ బాడిగ నీ యభిషేక కార్యముం
దా విని ప్రోత్సహించు సతి తద్దయు భర్తను  దిట్ట నైపుణిం
 బావని కృష్ణలోచనయు భర్తృ హితాత్మ మదర్థ మచ్చటన్ 10.

తే.గీ. జనని కేకయాధీశుని తనయ హర్ష
మంది రాజానువర్తిని డెంద మందు
నా హితమ్ము గోరు పుడమి నాథుఁడు సతి
తోఁ గలసి దూతవరు సుమంత్రు నిట కనిపె 11.

ఆ.వె. ఆ విధపు సభ యట నీ విధముగ దూత
రాక యిచటఁ గాంచ రమణి! ఱేఁడు
నేఁ డిక నభిషిక్తునిగఁ జేయు యౌవరా
జ్యమున కెలమి నన్ను నంబుజాక్షి! 12.

చం. వెడలెద నాహ కాంచెదను బృథ్వికి నాథుని సీత! వేగమే
యడరు రమించుమీ సఖుల నందఱఁ గూడి ముదమ్ము మీఱఁగా
నొడయుఁడు గౌరవించి యన నొప్పుగ ద్వారము దాఁక వచ్చె నా
పడతి తలంచి చిత్తమునఁ బద్మదళేక్షణ మంగళమ్ములన్ 13.

తే.గీ. రాజసూ యాభిషేచన మోజఁ జేయ
ద్విజ యుతం బర్హమగు నట్టిది వర రాజ్య
మొసఁగు సంప్రీతి నీకు రాజోత్తముండు
వాసవునకు నొసంగెడు బ్రహ్మ పగిది 14.

కం. దీక్షితుఁడ వయి తగ వ్రతం
బీ క్షితి నూని యజినము మెయి వెలయ శుచిపై
సక్షమ మృగ శృంగ మలర
నీక్షింతుఁ గరమున నిన్ను నెలమి భజింతున్ 15.

తే.గీ. తూర్పున బలారి రక్షించు నేర్పు మీఱ
దండధరుఁడు కాపాడును దక్షిణమునఁ
బశ్చిమమ్మున రక్షించు వరుణుఁడు నిను
ధనదుఁ డరయును నిత్య ముత్తరము నందు 16.

కం. అన సీతను వీడుకొలిపి
యనువుగఁ దా భూషితుఁ డయి యంతఁ దరలె సూ
తుని నా సుమంత్రుఁ గూడి ర
ఘు నందనుఁడు రాముఁడు జనకునిఁ గాంచఁ దమిన్ 17.

తే.గీ. కొండ గుహ నుండి వెడలెడు ఘోర సింహ
రాజము వలె బయలు దేరి రాముఁ డచట
గుమ్మ మందు నిలిచిన సద్గుణుఁడు లక్ష్మ
ణు ననుజునిఁ బ్రాంజలునిఁ గాంచె వినయ మతిని 18.

మ. చని పే మధ్యమ కక్ష్య నంతఁ దను గాంచంగం దమిన్నిల్చి న
ట్టి నరశ్రేష్ఠుల స్వీయ మిత్రజన కోటిం గాంచి తాఁ జేరి వా 19.

రినిఁ గాకుత్స్థుఁడు బల్కరించి తగ సంప్రీతిన్ నరవ్యాఘ్రుఁడే
యనలాభంపు రథమ్ము రాజతము వైయాఘ్రమ్ము నెక్కెన్ వడిన్

చం. ఘన నిభ నాద నాదితము కాంచన రత్న విభూషితమ్ము సూ
ర్య నిభ రుచిజ్వ లార్దిత జనాక్షి యుగమ్ముఁ గరేణు బాలకేం
ద్ర నిభ హయాళి యుక్తము బలద్విష కూబరి సన్నిభమ్మునున్
వినుత విశాల కూబరిని వేగమ వెల్గుచుఁ జాగె రాముఁడే 20.

కం. గగనమ్మున మేఘం బనఁ
గ గర్జ లడరఁగ ఘనమునఁ గదలు శశి యనన్
నెగడి వెడలె శ్రీమద్రథ
ము గృహమ్మును వీడి వేగముగ నవ్వేళన్ 21.

ఆ.వె. రాఘవానుజుండు లక్ష్మణుం డన్నను
గొడుగు చామరమ్ము కూర్మిఁ బట్టి
వెనుక నిల్చి యరదమునఁ దాను గాపాడు
చుండెఁ జక్కఁగాను మండితుండు 22.

ఆ.వె. వెడలు చుండ నరద మడరె జనుల నుండి
తుముల శబ్ద మంతఁ దోరముగ స
కల దిశలను జెలఁగెఁ గలకల మచ్చట
రాముఁ డేఁగు చుండ రథము నందు 23.

చం. వెడలిరి వెన్క రామునకు వీరులు వాజుల శైల సన్నిభం
బడరు గజమ్ము లందును సహస్ర శతాధిక సంఖ్యలం దగం
గడువడి ముందు భాగమున ఖడ్గ ధనుర్ధరు లూని త్రాణముల్
తొడవులు చంద నాగరుల తోడుత రాముని రాకఁ దెల్పుచున్ 24.

తే.గీ. అంతఁ జెలఁగెను వాద్యఘో షాతిశయము
వంది సంచయ స్తుతి శబ్ద వాచ్యములును
శూరగణ సింహ గర్జలు చోద్యముగను
రాజవీథుల వినిపించె రమ్యముగను 25.

కం. స్త్రీలు పెదచల్లఁ బువ్వులు
మేలుగ భూషితలు నిలిచి మేడల పయినన్
లీలఁగ మురియుచు రాఘవుఁ
డాలోకించుచును జాగె నరి దమనుండే 26.

కం. అనవద్యాంగాంగన లడ
రిన మోదమ్మునఁ జెలఁగి నిలిచి హర్మ్యములన్
ఘనముగఁ గీర్తించిరి రా
ముని నాతని కీయ సెడఁద ముదితలు ముదమున్ 27.

తే.గీ. సంతసించును గౌసల్య జనని రామ!
మాతృనందన! నినుగాంచి మహినిఁ బడయ
సిద్ధమై చన నీ యాత్ర శీఘ్రముగను
దండ్రి యీయంగ రాజ్యము ధర్మ మరసి 28.

తే.గీ. నీకు మిక్కిలి ప్రియమైన నీరజాక్షి
సీత సీమంతినుల కెల్లఁ బ్రీతి సెంత్రు
పరమ సీమంతినియె యని పడతు లెల్ల
రింపుగ మనమ్ములను రాఘవేంద్ర! నిజము 29.

ఆ.వె. గొప్ప నోములు మును పప్పడతియె నోఁచి
యుండ నోపు ధ్రువము మెండుగ శశి
నంది నట్టి పరమ సుందరి రోహిణి
వోలె రాము నందెఁ బుడమి పట్టి 30.

ఉ. మేడల పైన నీ విధము మెప్పు లొసంగుచుఁ బల్కుచుండఁ బూఁ
బోఁడుల నుత్త మోత్తములు పోవుచు రాముఁడు రాజ వీథినిం
దోడుగ నుండ లక్ష్మణుఁడు తోష మొసంగెడు పల్కు లన్నిటిన్
వేడుక నాలకించి కడు వేగమ యేఁగఁగఁ జాగె నవ్విధిన్ 31.

కం. విని రాఘవుండు జనుల వ
చనములు గూడి పలుకంగఁ జక్కఁగఁ దనవౌ
ఘన నుతి వాక్యమ్ముల నా 32.

యిన వంశోత్తమ్ముఁ డలరి యెదఁ జనుచుండెన్

ఆ.వె. రాజు కరుణ నేఁడు రాముఁ డందును సిరి
నింక భూమి నెల్ల నెలమి నగు ని
తండు మనకు రక్షకుండు తీర్పఁ గలఁడు
కోర్కులెల్లఁ దలఁచి కూర్మితోడ 33.

కం. చిరకాల మున్న రాజుగఁ
బుర జనులకు లాభ ముండు భూజను లెన్నం
డరయ రిఁక నప్రియములఁ గ
నరెట్టి దుఃఖములు రామ నరవరుఁ డుండన్ 34.

తే.గీ. మత్త గజ హయ రవముల మధ్య వంది
మాగధుల స్వస్తి వాక్కుల మధ్య మంగ
ళతర వాద్యము లలరంగ సుతుఁడు రాముఁ
డేఁగె వైశ్రవణుని భంగి వేగ మురిసి 35.

తే.గీ. ఆడ మగ యేనుగులు హరు లరదము లల
రంగ జనులు కూడళుల నిల్వంగ విరివి
రతనముల నమ్ము కొట్టు లలరఁగ బాటఁ
గాంచె రాముండు చనుచుండ నంచిత గతి 36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదునాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 17.

రాముఁడు నగర శోభలను వీక్షించుచుఁ బౌరుల మాటల నాలకించుచు జనకుని రాజసౌధమును జేరుట.

తే.గీ. ముదిత మిత్రులు రాఁగ రాముఁ డట ధ్వజ ప
తాక సంపన్న మగరు చందన సుధూపి
తమ్ము నానాజన సమాకులమ్ము శ్రీయు
తమ్ము నిల్చి తేరున నగరమ్ము గాంచె 1.

కం. సదనము లభ్ర నిభమ్ములు
ను దెల్లఁదనమున వెలుఁగుచును మెఱయు చుండన్
ముద మార రాజ వీథినిఁ
గదలెను రాముఁడు చెలఁగ నగరుధూపితమై 2.

ఉ. చందన ముత్త మాగరులు చక్కని గంధ విశేష వస్తువుల్
విందుగ క్షౌమ వస్త్రము లవిద్ధ సుముక్తలు స్ఫాటికమ్ములున్
సుందర రాజ మార్గమునఁ జొప్పడు చుండె విశాల వీథిలో
నందపుఁ బుష్ప సంచయము నంచిత భక్ష్య పదార్థ రాసులున్ 3.

తే.గీ. పెరుగు లాజ లక్షతలు హవియు నగరువు
చందనమ్ములు మాలల నందముగను
సేవ లందు చత్వర విలసితము రాజ
పథము రాముఁ డరసె దేవపథ నిభమును 4.

ఆ.వె. వినుచు మిత్రు లీయఁ బెక్కు లాశీర్వచ
నములు గౌరవించి నర వరేణ్యుఁ
డెల్లరఁ దగు రీతి నెలమి దాశరథి యేఁ
గఁ దొడఁగె రయముగ నరదము నందు 5.

తే.గీ. తాత ముత్తాత లరిగిన దారి ననుస
రించి రాఘవ! పాలింపు మంచితముగ
ధరణి నభిషిక్తుఁడ వయి నీ తండ్రి తాత
లిడిన సుఖమున కెక్కుడు పడయఁ గలము 6.

కం. చాలును భుక్తియు నిఁక మా
కీ లోకమునఁ బరమమ్ము లే యర్థమ్ముల్ 7.

మేలుగ నేఁగెడు రామా
యేలఁగ నీ రాజ్య మంద నింతియ చాలున్

కం. ఇంతకు మించి ప్రియతరము
సుంతయు లేదింక మాకు శూరుం డా రా
జాంతికమున నభిషేకము
స్వాంత మలర నంద నింకఁ జాలును మాకున్ 8.

కం. తన్ను బొగడుచు శుభమ్ములు
మిన్నఁగ ననుచుండ స్వీయ మిత్రులు పరులున్
విన్న రఘురాముఁ డత్తఱి
మిన్నక యుండి చనుచుండె మేటి పథమునన్ 9.

కం. చన దాఁటి రాముఁ డెవ్వం
డును నరవరు నుండి యిటు నటు మనము నింకం
గనులను మరల్పఁ జాలఁడు
జనులం జిత్రముగ నచటఁ జపలత మీఱన్ 10.

కం. ఎవ్వఁడు రాముని జూడఁడొ
యెవ్వని రాముఁడు గనండొ యెల్ల జగములం
దవ్వాఁడు నిందితుం డగు
నవ్వాని యెడఁదయు దూఱు నతనిని వింతన్ 11.

కం. పిన్నలను బెద్దలను దాఁ
బన్నుగ నాలుగు కులముల వారిని వీక్షిం
చున్నిత్యము కరుణం గా
నన్నిరతము భక్తిఁ గొల్తు నరవరు వారున్ 12.

తే.గీ. వెడలెను బ్రదక్షిణముగ నా వీథిఁ గూడ
ళులను దేవపథములను బలు గృహముల
మందిరములను దాఁటి యా సుందర వద
నుండు రాముండు రాజసుతుండు వేగ 13.

తే.గీ. కదిసి రాజగృహమ్ము మేఘ సదృశమ్ము
గగనమును దాఁకు సౌధ శిఖరము లలరఁ
బోలి కైలాసపుఁ గొనల మేలయిన వి
మానముల భంగిఁ దెల్లఁగఁ గాన రాఁగ 14.

తే.గీ. వర్ధమాన గృహమ్ముల వర మణి గణ
విలసితము లయి మించఁ బృథ్విఁ గల గృహవ
రముల నెల్ల నింద్ర సదనోపమముల నృప
నందనుండు ప్రవేశించె నంది ముదము 15.

తే.గీ. దాఁటి మూడు కక్ష్యలు రక్షితములు హయ వ
రస్థిత ధనుర్ధరుల చేత రాముఁడు రథ
వరమునఁ బిదప నా రెండు ద్వారములను
దాఁటె నడచుచు రయమున మేటి సుతుఁడు 16.

ఆ.వె. దాటి యంత నన్ని ద్వారములను దాశ
రథి జనవ్రజమ్ము రాముఁ డనిపి
యంత నంతిపురము నందుఁ బ్రవేశించె
నరవరోత్తముండు కరము ప్రీతి 17.

కం. చన నతఁడు జనకు సన్నిధి
జను లంత ముదమ్ము మీఱ సఖుని తిరిగి రా
క నపేక్షించి నిలిచి రట
వననిధి చంద్రోదయమ్ము వాంఛించు గతిన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదునేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 18.

దీనముగా విచారముగా నున్న తండ్రినిఁ గాంచి రాముఁడు తల్లి కైకను గారణ మడుగఁగ నామె దశరథుఁడు తన కొసంగిన వరములను దెలిపి తాను భరతునకుఁ బట్టాభిషేకము రామునిఁ బదునాలు గేండ్లు దండకారణ్యమున వసింపఁగఁ బంపుటను గోరి నట్లు వచింప రాముఁడు కొంచెమైన బాధఁ జెందక యుండుట.

కం. కనె రాముం డాసనమున
జనకుని దీను నటఁ గైక సరసన నుండన్
ఘనముగ వదనము వాడఁగ
మనమున దుఃఖము సెలంగ మాన్యుని వింతన్ 1.

కం. చరణము లంటి సవినయ
మ్ము రాఘవుఁడు తండ్రి కెఱఁగి ముందుగఁ బిదపం
గర కమలమ్ములఁ దాఁకుచుఁ
జరణములం గైక కట నొసఁగె వందనముల్ 2.

కం. రామా యని యా దీనుఁడు
భూమీశుఁడు పల్కి బాష్ప పూర్ణాక్షుండై
రామునిఁ జూడఁగఁ బిమ్మట
నే మేని వచింప శక్తి నిఁకఁ గోల్పోయెన్ 3.

కం. మున్నెఱుఁగ నట్టి రీతిగ
నన్నరపతిఁ దండ్రిఁ గాంచి యతి భయదంబై
యున్నట్టి రూప మాతఁడు
పన్నగమును దాఁకి నట్లు భయముం బడసెన్ 4.

చం. విగత ముదింద్రియ వ్రజునిఁ బీడిత పార్థుని శోకతప్తునిన్
వగచుచు నిశ్వసించుచును బాధను గ్రుంగెడు తప్త చిత్తు నిం
కఁ గదల రానిదై కదలు కంధిని బోలిన వాని రాహు వ
క్త్ర గళిత సూర్య సన్నిభునిఁ గల్లను బల్కిన మౌని తాదృశున్ 5.

తే.గీ. జనకుని యనూహ్య శోకము తనయుఁ డెదఁ ద
లంచిన కొలఁది ఘోర సంరబ్ధ చిత్తుఁ 6.

డయ్యె రాముఁ డమావాస్య యందు సాగ
రమ్మ భంగి మిక్కుటముగ రఘువరుండు

ఆ.వె. జనక హిత రతుండు మనమునఁ దల్పఁ దొ
డంగె నంత నన్ను నంగజు గని
పార్థుఁ డేల నేఁడు పచియింపఁ డాశీర్వ
చనము లలరి యంచు సడల ధృతియె 7.

కం. మున్ను కుపితుఁ డైన నృపతి
నన్నరసి ప్రసన్నుఁ డగును నరవరుఁ డేలం
గన్నను నేఁ డీ రీతిని
మిన్నఁగను వగచుచు నుండె మితి లేకుండన్ 8.

కం. దీనుని వలె శోకించుచు
నాననము విచార యుక్తమై ద్యుతి చెదరన్
మానిని కైకేయిని నను
మానమున నమస్కరించి మానుగ నడిగెన్ 9.

కం. తెలియక యపరాధము నా
వలనఁ గలదె యించు కైన వసుధేశుం డం
దుల కలిగెనె చెపుమ జనని
లలితమ్ముగ ననునయింపు రాజును నాకై 10.

ఆ.వె. అప్రసన్నుఁ డేల నయ్యె నాపయి నిరం
తరము సూపుఁ బ్రేమ తద్దయును వి
వర్ణ మయ్యె ముఖము వడసె దైన్యమ్మును
బలుకఁ డింత యేని పార్థివుండు 11.

ఉ. మేనున మానసమ్మునను మించి యొసంగునె బాధ నెద్దియుం
గానము సౌఖ్యమున్ సతము కల్గెనె రోగము దుఃఖ మైననున్
సూనులు క్షేమమే యచట సుందర సత్త్వులు మామ యింట యే
దేనియు నాదు మాతలకు నింతయు నైనను గీడు కల్గనే 12.

కం. ముద మీయ కున్న రాజున
కుఁ దండ్రికి ననుజ్ఞ దాటఁ గోపమ్ము వహిం
పఁ దలఁచి దాని మహారా
జెద బ్రతుకఁగ నిచ్చగింప నే నిఁక నిలలో 13.

కం. తన జన్మకుఁ గారణ మగు
జనకుం డుండంగఁ దలఁచి సజ్జనుఁ డెట్లుం
డు ననిమిష నిభము పాటిం
ప నేర కతని వచనములు పన్నుగ ధాత్రిన్ 14.

తే.గీ. కాక యభిమానమున నేని లేక కోప
మునను బలికితె పరుష వచనము లెవ్వి
యేని వానిచే నా తండ్రి యెడఁద యకట
కంపితం బయ్యె నేమొ వచింపు తల్లి 15.

ఆ.వె. ఎల్లఁ బల్కు మంబ యిట నే నడుగు చుండ
నిజము పూర్వ ముండని విధి మనుజ
పతి వికార మిట్లు పడయంగఁ గారణ
మెద్ది  కరుణ తోడ నింక నాకు 16.

చం. అన విని కైక రాఘవుని నారసి యాత్మ హితైక వాక్యముల్
జననియె వీడి సిగ్గు ననె సంకట మెద్దియు లేదు కిన్కయున్
మనమునఁ గల్గె బాధ యణుమాత్రము నీకయి భీతి కల్గఁగా
జనపతి మాటలాడఁగ నశక్తత నుండె నొకింత రాఘవా! 17.

చం. ప్రియుఁడవు నీకు నప్రియము విద్యల తల్లి వచింప నొప్ప దిం
తయు వసుధేంద్ర సత్తముని దప్పక చేసెడు కార్య మొక్క టుం
ది యిపుడు నీకు రామ విను తెల్పెద దానిని నాకు భూపుఁడే
దయ వర యుగ్మ మిచ్చె మును తాపము నందెను గోర నిచ్చటన్ 18.

ఆ.వె. ఇత్తు వరము లంచు నింపుగ వచియించి
విస్మరింప నెంచు వింత నేఁడు
ధరణి భర్త యెడఁదఁ దలఁచు నిపు డకట 19.

పతి గతజల సేతు బంధనమ్ము

తే.గీ. ధర్మమునకు మూలమ్ము సత్యమ్ము రామ
నీ కొఱకు నయి కోప మూని ధరణిపతి
నా పయిన మిక్కుటమ్ముగ నయవిద! విది
తంపు సత్యమ్ము వీడంగఁ దగునె యిట్లు 20.

తే.గీ. మంచి యైనఁ జెడ్డయు నైన నంచితముగఁ
జేయ నెంచినఁ దప్పక న్యాయ మెంచి
రామ! చెప్పుదు నంతయు రాజు నాజ్ఞ
మీఱ కున్న నీ తోఁ బుడమి పతి యనఁడు 21.

కం. విని యెల్ల జనని పలుకం
గ నిట్లు వ్యథ తోడఁ బలికెఁ గైక నరసి దే
విని రాముఁ డివ్విధమ్ముగ
జననాథుని సన్నిధిని విచార వదనుఁడై 22.

ఉ. అక్కట పల్కు నిప్పగిది నంబ! యనర్హవు ఱేఁడు చెప్పఁగా
గ్రక్కున నగ్ని దూకుదు సుఖమ్ముగఁ దిందు విషమ్ము తీక్ష్ణమున్
నిక్కువ మబ్ధి మున్గుదును నేను గురుండు హితుండు తండ్రియున్
మక్కువ మిక్కుటం బతని మాటను దాఁట నెఱుంగ నెన్నఁడున్ 23.

తే.గీ. చెప్పు మెల్లను దేవి యశేషముగను
రాజు కోరిన విషయమ్ము రమ్యముగ నొ
నర్తుఁ జేయు చుంటిఁ బ్రతిజ్ఞ వర్తిలండు
రెండు మాటల రాముఁ డెన్నండు మాత! 24.

తే.గీ. ఆ ఋజుతర వచనముల నాలకించి
సత్యవాది రాముఁ డన భృశపు టనార్య
కైక పల్కె దారుణములు కఠిన తరము
లైన భాషణముల నిట్టు లంత మాత 25.

చం. జనకుని దేవ దానవుల సంగర మందు సఘాతుఁ గావఁగా 26.

నను గడు మెచ్చి యీయ మును నాథుఁడు రెండు వరమ్ము లత్తఱిన్
వన గమనమ్ము నీకు నది భవ్యపు దండక యింక పేడితిం
దనయుని శూరు నా భరతు ధాత్రికి పే యభి షిక్తుఁ జేయఁగాన్

ఆ.వె. జేయ నెంచి తేని చెన్నుగఁ దండ్రిని
సత్యసంధునిగను జక్క నిన్ను
గూడ నరవరేణ్య కొమరుండ! యీ నాదు
మాట లాలకింపు పాటవమున 27.

ఆ.వె. జనకు నాజ్ఞను శిరసావహించి నృపతి
ప్రతిన ననుసరించి రామ యేఁగు
మడవికిఁ బదునాలు గబ్దమ్ములు వసింప
నేఁడు మారుమాట లాడ కుండ 28.

తే.గీ. నీ కొఱకు తెచ్చినవి యభిషేక వస్తు
వుల భరతు నభిషేకింప వలయు నిపుడు
వీడి యభిషేక మడవికి నేడు నేడు
నేండ్ల కొఱకు జడల నూని యేఁగు రామ! 29.

తే.గీ. ఇలను రామ! నానారత్న నిలయ మింక
హరుల రథముల గజముల నలరి వెల్గు
కోసల పుర మందు నిలిచి కూర్మి నేలు
భరతుఁ డభిషిక్తుఁ డయి తగ నర వరుండు 30.

కం. కాన నరేంద్రుఁడు భృశ శో
కాననుఁడు పలుకఁడు మునిఁగి యక్కట కరుణం
గాన నశక్యుం డిప్పుడు
తా నిన్నిట దుఃఖ మడర ధరణీపతియే 31.

కం. గురు వచనమ్ములు పాటిం
పు రఘువరా! నీవు సత్యము విరాజిల్లన్
గురుతరముగ నిప్పట్టున
నరేశ్వరుని నుద్ధరింపు నరవర! తండ్రిన్ 32.

కం. పరుష గిర లనఁగఁ గైకే
యి రాముఁ డొందండు శోక మింతయు నేనిన్
నరనాథుఁడు పుత్రార్తిం
గరమ్ము దుఃఖించె నంతఁ గాకుత్స్థుండే 33.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బదునెనిమిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 19.

కైక యప్రియంపుఁ బల్కులను విని రాముఁ డింత యేని బాధఁ జెందక యడవికి నేఁగ సమ్మతించి తండ్రికిఁ దల్లికి నమస్కరించి, తల్లి కౌసల్యను గాంచుట కేఁగుట.

కం. విని యప్రియంపు వచనము
లనఁ గైక మరణ నిభమ్ము లరి వీరఘ్నుం
డు నరోత్తముఁ డరయఁడు వ్యథఁ
గని కైకను రాముఁ డనియెఁ గాకుత్స్థుఁ డిటుల్ 1.

తే.గీ. అట్టు లగు జటాజినములు కట్టి వాస
ముండ నేఁగుదు నిచ్చట నుండి దేవి!
యడవి కడరి పాలించి రాజాజ్ఞ సమ్మ
దమ్ము న జనని! తప్పక నమ్ము నన్ను 2.

ఉ. ఇంత యెఱుంగఁ గోరుదు మహీపతి పూర్వ విధమ్ము నన్నిటన్
వింతగ శత్రు మర్దనుఁడు వీక్షణ సేసియు సంతసింపఁడే
సుంతయు పల్కఁ డింతయును జూడ నశక్యుఁడు హేతు పెద్ది యీ
వంతకుఁ జెప్పుమా జనని! పార్థివ సత్తముఁ డిట్టు లుంటకున్ 3.

తే.గీ. కోప మూనఁగఁ బనిలేదు నాపయినను
దేవి! యనుచుంటి నేఁగెద నే వనమున
కు జడ లింక చీరల నూని విజనమునకు
సంతసింపు చిత్తమ్మున వంత వీడి 4.

కం. ఆనతి నిడ హితుఁడు గురువు
భూనాథుఁడు పిత కృతజ్ఞ పూరుష వరుఁడున్
నే నేల తల్లి సంశయ
మూనుదుఁ జేయనె ప్రియమ్ము నొప్పుగ నిచటన్ 5.

కం. ఒక్కటి వేధించెడు నను
మిక్కిలి హృదయము దహించు మేదిని పతియే
చక్క భర తాభిషేచన
మక్కట వచియింపఁ డేల యంచు స్వయముగా 6.

తే.గీ. సేన యడుగక ప్రాణము లేని రాజ్య
మిష్ట ధనములు సీతను హృష్టముగ న
నుజుఁడు భరతున కిత్తు ననుంగు సుతున
కక్కట స్వయముగ ననంగ నక్కజంబె 7.

కం. మనుజేంద్రుఁడు జనకుండును
ఘనుఁ డీయఁగ నాజ్ఞ నీదు కామార్థంబై
యనుమాన మేల పాలిం
పనె తిరిగి వచింపఁగా నవసరమె మాతా! 8.

ఆ.వె. ఊఱడింపు నర వరోత్తమునిం దల్లి
భూమి పతిని నశ్రువు లిట రాల్చు
చుండెఁ బుడమిఁ జూచుచుండి వగచు చుండి
యేలనొ యిది యెల్ల యెఱుఁగ కుంటి 9.

ఉ. దూతల నేఁగ నిమ్ము త్వరఁ దోడ్కొని మాతులు నింటి నుండి రా
నీ తఱి వేగమా భరతు నిచ్చట కింపుగ రాజునాజ్ఞతో
వీత విచార మేఁగుదును వేగమ నిల్వఁగ దండకాటవిం 10.

బ్రీతినిఁ దండ్రి యానతిని లీలఁగఁ దాల్చిశిరమ్మునం దిఁకన్

ఆ.వె. అన విని రఘునందనుని మాట లెద నమ్మి
కైక త్వరపఱచెను బోక వనికి
సంతసించి పలికె నింతి దూతలు వడి
భరతునిఁ గొనితేర నరుగుదు రని 11.

తే.గీ. ఉత్సహించు వానికి రామ! యొప్ప దెట్టి
జా గని తలంతు మది సేను జాగ వలయుఁ
గాన శీఘ్రతరమ్ముగఁ గాననమున
కిప్పు డిట నుండి రఘువర! యొప్పుగాను 12.

కం. బిడియమ్ము మీఱ మిక్కిలి
పుడమిపతి స్వయము పలుకఁడు పుత్రా! నీ తో
నుడుపుము దుఃఖము నన్య మొ
కఁడు లే దిసుమంత యేని కలవర మేలా 13.

తే.గీ. పుర మిపుడు వీడి కాననమునకు నరుగు
దనుక నీవు స్నానమ్ము దా నొనరువండు
తినఁడు జనకుండు గావున తివిరి నిన్ను
ద్వరపఱచు చుంటి నిట్టులు వత్స! వినుమ 14.

కం. అయ్యో యెంతటి కష్టము
చయ్యనఁ గూలెను బలికి విశాల శయన మం
దయ్యవనీశుఁడు మూర్ఛిలి
యయ్యభ్ర విభూషితమున నార్తి చెలంగన్ 15.

చం. నృపతి వరేణ్యు లేపి తగ నీరజ లోచన కైక తోల పే
గపడె కశా విఘాత తురగమ్మును బోలుచుఁ గాన కేఁగగా
నృప తనయుండు పల్కె నిటు నెమ్మది కుందక సుంత యేని యం
బ పలుక నాలకించి కటు వాక్యము లెల్లను దారుణమ్ములన్ 16.

తే.గీ. ఆశ లేదు విత్తమ్మున నంబ! నాకు 17.

నేను జగతిఁ దల్ప వసింప దాని కొఱకు
ధర్మ మెన్ని కేవలము నే ధాత్రి నుందు
ఋషి నిభము నన్ను దేవి నీ వెంచఁ దగును

ఆ.వె. ఇంచు కేని తండ్రి కంచితముగఁ బ్రియ
ము నొనరింపఁ గలిగినను గృతంబ
ప్రాణములను గూడ వదలి యయిన నది
యెవ్విధి నయిన నని యెంచఁ దగును 18.

కం. పితృ శుశ్రూషణమునకుం
బితృ వాక్పాలనకు మించి పృథ్విని ధర్మం
బితరము కాంచ నశక్యము
వెతకిన శాస్త్రముల దేవి! విస్తారముగన్ 19.

ఆ.వె. తండ్రి చెప్పకున్నఁ దల్లి! నీ మాటల
నాలకించి శిరము నందుఁ దాల్చి
వనమునఁ బదునాల్గు వత్సరమ్ములు జన
హీన మందు నుందు నింక నేఁగి 20.

తే.గీ. ఎక్కు డధికార మున్నను నిక్కుమారు
ని పయి దేవి చెప్పితి వీవు నృవరున కభి
షేక కార్యమును గుణవిశేష మించు
కైన నా యందు నీ వరయ వని తెలిసె 21.

తే.గీ. మాత యనుమతిఁ గైకొని సీత ననున
యించి రమ్యముగను నేఁడ యిచట నుండి
వెడలుదును దండకాటవి కడరి దేవి!
విజనమౌ మహారణ్యము నిజము సుమ్ము 22.

తే.గీ. భరతు నీ రాజ్యము నెలమి పాలనమ్ము
సేయ నిమ్ము సేవించుచు స్వీయ జనకు
నదియ నీదు కర్తవ్యము నది సనాత
నంపు ధర్మము దానిఁ దనరఁగ నిమ్ము 23.

కం. విని యా రాముని మాటలు
జనకుఁడు దుఃఖహతుఁ డయ్యెఁ జాలక యుండెన్
ఘనుఁ డెద్దియుఁ బలుక మహా
స్వనమున రోదించె నంతఁ జంచల మతియై 24.

చం. జనకు విసంజ్ఞు మూర్ఛితుని సచ్చరణాంబుజ యుగ్మ మంటి వం
దనము లొసంగి కైకకును దల్లి యనార్యకుఁ బాద పద్మ వం
దనము లొసంగి యంతఁ ద్వరితమ్ముగ  వెల్లుచు నిష్క్రమించె నం
దనుఁడు రఘూత్తముండు పరితాపము సెందక సుంత యేనియున్ 25.

కం. జనకునకుఁ గైకకును బ్రీ
తి నొనర్చి ప్రదక్షిణములు ధృతి నంతిపుర
మ్మును వీడి రాముఁ డారసె
ననుఁగు సుహృజ్జనుల సెల్ల నచ్చట నిలువన్ 26.

కం. అవనీశ సుతుఁడు రాముని
కు వెనుక నశ్రువులు కాఱఁ గోపం బడరం
గ వెడలెను సుమిత్రానం
దవర్ధనుఁడు లక్ష్మణుండు తప్తాత్ముండై 27.

తే.గీ. చేసి యభిషేచనంపు రాశి కట సుప్ర
దక్షిణము నంత భక్తి యుతమ్ము రాముఁ
డేఁగఁ జాగె మెల్లగఁ జూచు చెల్ల సఖుల
నాదరముగ నచలుఁ డరిసూదనుండు 28.

తే.గీ. లోక కాంతుని రాముని లోక సుంద
రు తనుకాంతి రాజ్యచ్యుతి లుప్త మింత
యేని కాలేదు వింతగ నిందు కాంతి
నిశను గాని చందమ్మున నెగడు చుండె 29.

కం. వన మేఁగఁ గోరు వాని క
వనిం ద్యజించుచుఁ జరించు వానికిఁ జిత్త 30.

మ్మున లేదు వికారము రా
మునకు జగ దతీతునకు విమోహం బైనన్

చం. అనువుగ ఛత్ర చామరము లచ్చట వీడి స్వలంకృతమ్ములన్
జనులను బౌర వర్గమును స్యందన మత్తజీ వీడి దుఃఖమున్
వెనుకకుఁ ద్రోసి చిత్తమునఁ బ్రీతి నడంచి నిజేంద్రియమ్ములన్
జనని గృహమ్ము నప్రియము చాటఁగఁ జేరెఁ దదాత్మవంతుఁడే 31.

కం. జను లెవ్వరు నా శ్రీమం
తుని సత్య వచన రతుని నతులవిక్రము నా
ననమున మార్పు నొకింతయుఁ
గన నోపరు విస్మయముగఁ గాకుత్స్థునిలో 32.

ఆ.వె. చారు కిరణ కీర్ణ శార దేందు ప్రభా
నిభము దీర్ఘభుజుఁడు నిజ సదుచిత
హర్ష మింత యేని యక్కజముగ వీడఁ
డా రఘూత్తముండు నాననమున 33.

కం. తియ్యని మాటలు పలుకుచు
నయ్యెడఁ గర మాదరించి యాత్మీయులఁ దా
నొయ్యన మహాయశస్కుఁడు
చయ్యనఁ జేరె నిజ జనని సరసకు నంతన్ 34.

ఆ.వె. సముఁడు గుణము లందు సౌమిత్రి యన్నకు
విపుల విక్రముండు విరివిగ నెదఁ
బుట్టి నట్టి వగపు గుట్టుగ నుంచి య
గ్రజుని ననుగమించె లక్ష్మణుండు 35.

తే.గీ. చేరి యత్యంత ముదమునఁ జెలఁగు గృహము
వచ్చి నట్టి యాపదఁ గాంచి పార్థసుతుఁడు
సఖుల కాపద లగు నన్న శంక తోడ
వంత నొందఁడు రాముఁడు సుంత యేని 36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ బందొమ్మిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 20.

రాముఁడు మాత కౌసల్యతోఁ దాను దండకారణ్యమునకుఁ నేఁగి బదునాలు గేండ్లు వాసము చేయ రాజుచే నాజ్ఞాపింపఁ బడితి నని తెలుప నామె ఘోర దుఃఖమున మూర్ఛిల్లి లేచి దీనంపుఁ బలుకులు పల్కుట.

కం. అల పురుషోత్తముఁడు వెడలఁ
జెలంగె నార్తస్వనములు స్త్రీజన నిచయ
మ్ముల యంతఃపురమున నం
జళు లిడి రాముండు ఘనుఁడు జయ్యన నంతన్ 1.

తే.గీ. చెప్పకున్నను జనకుండు స్వీయ కృత్య
ముగ నది తనర కున్న రాముఁ డిట నంతి
పురమునం దెల్లరకు దిక్కు శరణు గాఁగ
నుండఁ దా నకట బహిష్కృతుండు నయ్యె 2.

కం. పుట్టిన యప్పటి నుండియు
నెట్టులఁ గౌసల్య జనని యెడల నడచుఁ దా
నట్టులనే మా యందును
నెట్టన వర్తిల్లు సతము నెమ్మి చెలంగన్ 3.

తే.గీ. కోప మొసఁగు పనుల నుడుగును సతమ్ము
కోపులను శాంతపఱచును గోప మూనఁ
డెపుడు తన్ను నిందించిన నెవ్వ రైన
నట్టి వాఁ డరుగుచు నుండె నకట వనికి 4.

చం. శర ణగు నెవ్వఁ డెల్లరకుఁ జక్కఁగ నట్టి రఘూత్తమున్ నృపుం
డరయగ బుద్ధి హీనుఁ డయి యక్కట పుత్రు బహిష్కరించెనే
విరివిగ జీవ లోకములు వేదనఁ జెందఁగ నంచు దార లె
ల్లరు గత వత్సధేనువుల రాణగ దూఱిరి భర్త నేడ్చుచున్ 5.

ఆ.వె. ఆర్త నాదము లటు లంతఃపురమ్మున
నడర నాలకించి యపుడు ఘోర
పుత్ర శోక తప్త భూనాథుఁ డాసన
మందుఁ గూలెఁ దిరిగి యార్తి తోడ 6.

కం. రాముఁడు భృశ ఘాతుఁడు మద
సామజ నిభ నిశ్వసనుఁడు సహ లక్ష్మణుఁడై
తా మనమును వశ మందిడి
యా మా తాంతఃపురమున కరిగె రయమునన్ 7.

కం. అచ్చట గాంచెను వృద్ధుని
నచ్చపుఁ బూజితుని ఘను సుఖాసీను బరుల్
విచ్చలవిడి నిలువఁగ దరి
నచ్చటి ద్వారమ్ము నందు నానందముగన్ 8.

తే.గీ. రామ! వర్ధిల్లు మయ్య యీ భూమి ననిరి
లేచి యెల్ల రరసి నంత శ్రేష్ఠుని జయ
శీలు రందు రాఘవుని విశేష విజయ
మంది సంతస ముప్పొంగ డెందములను 9.

ఉ. రెండవ కక్ష్యఁ గాంచెను దరించి తగం బ్రథమంపు ద్వారమున్
మెండుగ బ్రాహ్మణోత్తముల మేటి శ్రుతిజ్ఞుల రాజమాన్యులన్
దండము లిచ్చి వారికిని దద్దయు భక్తి తృతీయ కక్ష్య రా
ముం డట వృద్ధ నారులను బోఁటులఁ గాంచెను గావ ద్వారమున్ 10.

కం. వనితామణు లాశీస్సులు
ఘనముగ రాముని కొసంగి ఘన హర్షమునం
జని త్వరితమ్ముగఁ గౌస 11.

ల్యను వీక్షించి తెలిపిరి ప్రియ తనయు రాకన్

ఉ. ఆ సమయమ్ము నందు నిసి యందు సమాహితయై చరించి తాఁ
జేసి రమేశ పూజలను స్వీయ సుతార్థము దెల్లవాఱఁగన్
వాసము లూని తెల్లనివి పన్నుగ మంగళయై వ్రతాశయే
వాసిగ మంత్ర యుక్తముగ వహ్ని కొసంగుచు నుండె హవ్యమున్ 12.

కం. కదిసి నిజ జనని యుండెడి
పదిలపు టంతిపుర మతి శుభమ్మును బ్రేమం
పుఁ దనయుఁడు రాముఁడు కనియె
ను దల్లి నగ్ని కిడుచుండ నుతియించి హవిన్ 13.

తే.గీ. దేవ కార్య నిమిత్తము తెచ్చినట్టి
పెరుఁగు నేయి యక్షతలు హవిస్సు లింక
మోదకమ్ములు లాజలు పులగ మింకఁ
బాయసము సిత మాలలు వఱలు చుండ 14.

ఆ.వె. పూరి తోదకములు పూర్ణకుంభమ్ములు
సమిధ లెల్ల నమరి చక్కఁగ నట
యుండఁగ రఘునందనుండు వీక్షించెను
మాతఁ బార్శ్వమున సమంచితముగ 15.

తే.గీ. తెల్లనివి పట్టుబట్టలు సల్లలిత సు
రాభ వర్ణిని ధరియించి యర్ఘ్యము లొసఁ
గుచు సురాళికి నిల్చిన గురుతర వ్ర
తములఁ గృశియించిన తనదు తల్లిఁ గాంచె 16.

కం. బహుకాలమునకుఁ గాంచఁగ
సహాస లసితాననుని నిజ హ్లాద కరున్
బహుళ శిశువుఁ గదియు విధి వి
రహమ్మున సుతు దరి కేఁగె రాణి రయముగన్ 17.

కం. దరి సేరు మాత నారసి 18.

చరణములకు మ్రొక్క రామచంద్రుం డంతం
గరములఁ గౌగిలి యాతని
శిరమును మూర్కొనెను దల్లి శీఘ్రమ ప్రేమన్

చం. తనయునిఁ గాంచి ప్రీతి ననె తద్ద ప్రియం బిడు భాషణమ్ములన్
మునులును ధర్మశీలురును బుణ్యులు వృద్ధులు వొందు నట్టి కీ
ర్తినిఁ బరమంపు టాయువును ధీనిధి పొందుమ వంశధర్మమున్
ఘనముగ నున్నదానిని నకంపిత చిత్తత నీవు నిల్పుమా 19.

తే.గీ. రామ! గాంచుమ తండ్రిని రాజవరుని
నిత్య సత్యప్రతిజ్ఞుని నీకు నేఁడ
చేయు నభిషేక మిద్ధరఁ జెలఁగి యౌవ
రాజ్యమునకు సంప్రీతిని రమ్యముగను 20.

తే.గీ. ఆసన మొసంగి భోజన మారగింప
నామతింప మాతను గాంచి మోము నందు
సిగ్గు తోఁప చేతులు చాచి శిరము వంచి
యంజలించి పలికె నిట్టు లాత్మజుండు 21.

ఆ.వె. నైజమున వినయుఁడు నతుఁ డౌచు గౌరవ
కారణమున దండకా వన గమ
నమ్మునకు ననుజ్ఞ నిమ్మని యడుగఁ దొ
డంగె మాత నంత నంగజుండు 22.

కం. దేవి! మహాభయము కలిగె
నీ వియ్య దెఱుంగ వకట నీకును దుఃఖం
బా వైదేహికిని మదీ
యావరజుఁడు లక్ష్మణునకు నధికం బడరెన్ 23.

తే.గీ. ఆసనం బేల నాకింక నడవి కేఁగు
వాఁడ దండకారణ్యమ్ము పాడి యగును
నాకు నిప్పుడు దర్భాసనమ్ము సుమ్ము
వచ్చె కాలమ్ము కూర్చుండ వనము లోన 24.

ఆ.వె. వనము లోన నుందుఁ బదునాలు గేండ్లు వి
జనము నందు నేను దినుచు మధువు
పండ్లు మూలములను భద్రముగ విడిచి
మాంసము ముని వోలె మాత! వినుమ 25.

ఆ.వె. యౌవరాజ్య మొసఁగు నవనీశుఁడు భరతు
నకు బహిష్కరించె నన్ను దాప
సి వలె నుండ మనుచు శీఘ్రమ దండకా
రణ్యమునకు నేఁగి రమ్య వనికి 26.

కం. సేవించుచు ఫలమూలము
లా వన్యమ్ముల నిఁక విజ నాటవి లోనన్
జీవనమును జాగింతును
నే వర్షములు పదునాల్గు నిత్యము మాతా! 27.

కం. గొడ్డలి చేత వడి నఱకఁ
బడ్డ మహా సాలము వలె వన మందు భువిం
బడ్డ దివి నుండి వేగమ
దొడ్డ సురల భంగిఁ గూలెఁ దూలి జననియే 28.

తే.గీ. దుఃఖముల కనర్హను గాంచి తూలి నట్టి
తల్లిని నరఁటి పగిది పతనము కాఁగ
భువిని లేవ నెత్తెను మూర్ఛ వోవ నంత
రాముఁ డడరి వేగమ్ముగఁ బ్రేమ తోడ 29.

ఆ.వె. బరువు మోయు నట్టి బడబ దొరలి లేచి
నట్లు ధూళి నిండ నంగములను
జేతఁ దుడిచె నంతఁ జెన్నుగఁ దల్లికి
నందనుండు వగచి డెంద మందు 30.

తే.గీ. అసుఖ తప్త సుఖోచిత యంతఁ గాంచి
పురుష శార్దూలు రాముని దరినిఁ గూరు 31.

చుండ లక్ష్మణుం డట వినుచుండ నామె
పల్కె నిట్టులు కౌసల్య పరమ సతియె

ఉ. పుట్టక యున్న నీ వకట పుత్ర! రఘూత్తమ! గొడ్డురాలుగా
నెట్టన నుండు శోక మెద నిత్యము నా కది యొక్క టుండునే
పుట్టదు దుఃఖ మొండు భువి మూరి తపింపఁగ నాదు చిత్తమున్
దట్టము దాని కన్న నిది దారుణ మెంచఁగ దుస్సహమ్మునున్ 32.

మ. మును నే నేర శుభమ్ము లింక సుఖముం బొందంగ నా భర్త పా
లనమం దెన్నఁడు నీదుపాలనమునన్ రామా! మదిం దల్చితిన్
ఘన రీతిం బడయంగ నక్కట వినంగా వచ్చు వాక్యమ్ములన్
నను బాధించెడు వాని నింక సవతుల్ నన్నాడఁ బెన్రాణినిన్ 33.

చం. వనితల కింత కన్నను నపారపు దుఃఖము కల్గ నేర్చునే
ఘనము ననంత మైన నిజకష్టము మించి ధరాతలమ్మునం
దనయుఁడ వీవు నిల్వ నిటఁ దద్ద యుపేక్షను గాంచు చుండఁగా
వనమున కేఁగ నీ వకట ప్రాణము వోవుట నిశ్చయమ్మగున్ 34.

ఆ.వె. అణఁపఁ బడితి పుత్ర యత్యధికమ్ముగ
ధవుని చేత నస్వతంత్రగాను
బడతి కైకఁ గొలుచు వారికి సమముగ
లేక దక్కు వయిన రీతి నుంటి 35.

తే.గీ. నన్ను సేవించు వాఁ డైన నన్ను ననుస
రించు వాఁ డైనను భరతుఁ గాంచి నంత
చూడ నోపఁడు నన్నింకఁ జూతు నెట్లు
కైక ఖరవాదిని కుపిత కాంత ముఖము 36.

చం. ఇల జనియించి నీవు పదునేడు సమల్ గడచెం గుమారకా
యల నెద నేను దుఃఖమున కంతము గాంచఁగ వేచు చుండఁగా
నలయపు దుఃఖ మివ్విధము నక్కట యోర్వఁగఁ జాల నిత్యమున్
లలనలు నా సపత్నులు పరాభవ మీయఁగ సైప వృద్ధనై 37.

కం. దీనను దైన్యమ్ముగ నీఁక
సే నక్కట పూర్ణచంద్ర నిభ దీప్తంబౌ
యీ నీ ముఖమ్ము నిచ్చటఁ
గానక రామ! మను టెట్లు కాకుత్స్థ వరా! 38.

కం. పెంచితి రాఘవ నిన్నిట
సంచిత యోగోపవాస సంకటముల నే
నంచిత రీతిని వృద్ధము
లంచును నే నెంతు వాని నక్కట యాత్మన్ 39.

తే.గీ. నా హృదయ మెంత గట్టిది నాఁ దలంతు
వ్రక్కలుగ బగులదు స్థిర మక్కట యిట
వాన కాలమ్ము నందు మహా నదీ న
వీన తోయ తాడిత తీర మాని నట్లు 40.

చం. బలిమిని నేడ్చు జింకఁ గని పట్టి రయమ్మున నీడ్చు కేశి నా
నలరుచు పట్టి నన్నిచట నంతము సేయఁడె ధర్ముఁ డుద్ధతిం
గలుగదు చావు నా కకట కాలుని యింటను నోఁచ వాసమే
చలన మెఱుంగ దీ యెఁడద సన్నిభ ముక్కున కియ్య దెంచఁగా 41.

తే.గీ. ఈ వ్రతావళి దానము లింకఁ జేసి
నట్టి తపములు నిష్ఠలు వట్టి పైన
వకట పుత్రార్థముం జేయ నక్కజముగ
బీడు నేల వేసిన యట్టి బీజములుగ 42.

తే.గీ. స్వేచ్ఛగ నకాల మరణము సేరు నేని
ఘోర దుఃఖ తప్త నీఁక నేఁగుదును యమ స
దనమునకు నేఁడ నిను వీడఁ దథ్యముగను
దూడ లేని ధేనువు భంగిఁ దూర్ణముగను 43.

తే.గీ. నీవు లేని జీవితము సుతా! వృథా సు
మీ శశినిభాననప్రభా! మీఱి నీ వె
నుకనె యడవికి నే వత్తును దనయుండ! 44.

దుర్బలపు టావు చను నట్లు దూడ వెనుక

ఆ.వె. ఆలకించి సుతున కడరినట్టి విపత్తు
లను జనని యెడఁదఁ గలవర మంది
దుఃఖమునఁ గినుకను దోర మేడ్చెను గార
నున్న సుతునిఁ గన్న కిన్నరి వలె 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 21.

లక్ష్మణుఁడు దీనుఁడై కౌసల్యా దేవి మాటలు విని కాలోచితమగు పల్కుల బలవంతముగ రాజ్యమును గ్రహింప వలెనని యందుకుఁ దాను సంసిద్ధుఁ డని రోషమున పలుక రాముఁడు తండ్రి యాజ్ఞను దాను దాట లేనని యది ధర్మము కాదని లక్ష్మణుని వారించి తల్లితో నడవి కేఁగ నిశ్చయించితి నని పలికి యనుమతి నిమ్మని వేఁడుట.

కం. విలపించు చుండఁ గౌస
ల్య లక్ష్మణుఁడు గాంచి పల్కె రామ జననితో
లలితమ్ములు కాలోచిత
ము లగు వచనము లతి దీన ముగఁ గన్పడుచున్ 1.

శా. దేవీ నా కిది కాదు సమ్మతము దా స్త్రీమాటకున్ లొంగి గో
త్రావాసం బొనరింప రాజ్యము నహో రాముండు కోల్పోవఁగా
నా వృద్ధుండు వికారుఁ డంగజ వశుండై కామ మోహమ్మునన్
వేవేలుం బలుకండె భూపుఁ డకటా వేధింపఁ గైకేయియే 2.

చం. కన నపరాధ మింతయును గాంచను దోషము సుంత యేనియుం
దనయు బహిష్కరించుటకుఁ దల్లిరో రాజ్యము నుండి రాము నం 3.

దు నృపతి కాన కేఁగు మని తూర్ణము నానతి నీయఁ గాంచ నా
తని వరమిత్ర శత్రువులఁ దప్పును బట్టఁ బరోక్ష మందునున్

ఉ. దేవ నిభుండు దాంతుఁడును దిన్నని వర్తనుఁ డే విరోధినిన్
వావిరిఁ జూచు వత్సలతఁ బన్నుగ ధర్మము గాంచు నెవ్వ రే
నీ విధి లేక కారణ మహీన బలాఢ్యుఁ ద్యజింపఁ బుత్రునిం
బావను నేర్తురే తిరిగి బాలుఁడు కాఁ బిత పల్క వింతగన్ 4.

ఆ.వె. ఇట్టి భాషణములు పట్టితో నట్టులు
వల్క ధరణి ధవుఁడు పాడిఁ దొఱఁగి
యే సుతుండు నిల్పి యెదఁ జేయును దలంచి
రాజ ధర్మము నిల రాచ పట్టి 5.

కం. నరు లీ యర్థము నిట నె
ల్ల రెఱుంగక మున్న నీ వలరి చేయఁ దగుం
బురుషోత్తమ! రాజ్యము నిజ
కర పద్మాధీనముగను గలయఁగ నేనున్ 6.

మ. నిలిచుండంగను నీవు కాలు పగిదిన్ నీ వెంట నే నుండఁగా
విలుఁ గైఁ బూని కడింది రక్ష నిడుచున్ వేధింప వీరుల్ సమ
ర్థులు ధాత్రిం గలరే యెదిర్చి నిను సద్యో బాణ ఘాతమ్ములం
బరు లై డెక్కిన నీ యయోధ్య నిఁక నిర్మానుష్యముం జేసెదన్ 7.

తే.గీ. భరతు దరి నిల్చిన హితము నరయు జనుల
నైన నెల్లరను వధింతు నేను మృదు చ
రితుఁ డకట నిచట నవమానితుఁడు కాఁగ
సైప నోప నగునె నాకు శాంత మూని 8.

తే.గీ. ప్రోత్సహింపఁ గైక జనకుఁ డుత్సహించి
దుష్ట మతి శత్రు పైన బంధుత్వ మెల్ల
విస్మరించి యిప్పట్టున వేగ మతనిఁ
దగును బంధింప వధియింపఁ బగను బూని 9.

కం.	గురు వైన గర్వమూనిన
నరయని యెడ మంచి చెడుల నధమపు గతినిం
జరియింపఁగ నాతని నర
వర శాసింపంగ నొప్పుఁ బార్థుం డైనన్ 10.

కం.	ఏ బలమును గతన నిచటఁ
దాఁ బుడమిపుఁ డాశ్రయించి దానం బీయం
గా బింకమ్మున నెంచెనొ
యీ బోటికిఁ గైక కిట్టు లీ నీ భూమిన్ 11.

కం.	నీ తోడను నా తో నీ
భాతిని వైరమ్ము నూని భరతునకు సిరిన్
దాత ధరణీశుఁ డిచ్చుట
కే తీరునఁ బడసె శక్తి నిల రిపు దమనా! 12.

తే.గీ.	రక్తి యధికమ్ము నాకు నగ్రజుని పైన
మాత యొట్టు వేసి వచింతు నీ తఱిఁ దగ
నాదు వింటిపై సత్య దానక్రతు ఫల
ముల పయి హృదయమ్మున నిజముగ సతమ్ము 13.

తే.గీ.	మండుచున్న యగ్ని నయిన మాత దట్ట
మగు నరణ్యమ్ము నైన నా యగ్రజుండు
చేరుటకు మున్న నన్నటఁ జేరఁ గాంతు
వీవు నిక్కమ్ముగ నెఱుంగు మీ వచనము 14.

కం.	హరియింతు నీదు దుఃఖము
గురుతర వీర్యమున దేవి! ఘోరపు దిమిర
మ్ము రవి తొలఁగించు భంగిని
నరయఁ గలరు నాబలమ్ము నన్నయు నీవున్ 15.

కం.	అన లక్ష్మణుఁడు మహాత్ముఁడు
విని యేడ్చుచు శోక తప్త విరివిగఁ రాముం
గని కౌసల్య సదుఃఖం 16.

బనె వచనము లిట్లు దీనయై తనయునితో

ఉ. వింటివి గాదె తమ్ముని సువిస్తృత వాక్యము లెల్లఁ బుత్ర! నే
మంటకు నింకఁ జేయుమ సమంచిత కార్యము లెన్ని వేగ దా
నంట నధర్మ వాచ్యముల నట్లు సపత్నియె కైక కాంచి న
న్నింటను వీడి యేఁగఁ దగునే విలపించుచు నుండ నీ కిటన్ 17.

తే.గీ. ధర్మవేది! పుణ్యచరిత! ధర్మ మాచ
రింప నెంతు వేని నిలిచి యిచ్చట గృహ
మందు సేవింపు పాటించి యంచితంపు
ధర్మమును రాఘవా! నన్ను దల్లి నింక 18.

తే.గీ. కశ్యపుం డేఁగె ద్రుహిణసాదృశ్యుఁడు మును
జనని కొనరించి శుశ్రూష స్వగృహ మందు
నిజ తపం బలరఁగఁ గడు నిష్ఠ దివికి
రఘు కులాంబుధి హిమకర! రామ! వినవె 19.

తే.గీ. వెడల రా దిట నుండి నీ వడవికి నను
మతి నొసంగఁ జాలను ధరాపతి గురుత్వ
మునను నీకు నే రీతినిఁ బూజ్యుఁ డగునొ
నేను నట్ల యగుదు రామ! నీకు నెంచ 20.

చం. తలఁప సుఖమ్ము జీవితము ధారుణి నుండఁగ నీవు లేక యే
ఫలము నొసంగు నా కకట పన్నుగ నింకఁ దృణమ్ము నైన నే
నిలఁ దిని యుందు భద్రముగ నీవు చరింపఁగఁ జెంత లేనిచో
విలపితనై నిజాసువులు వీడెద నిక్క మభోజనమ్ముగన్ 21.

ఆ.వె. నదులకు పతి కడలి విదిత మిది చెడు న
డత గ్రహించి నట్లు వితత భూసు
ర వధ పాప మీవు రామ !యేగుదు వీఁక
నిరయమునకుఁ బుత్ర! నీరజాక్ష! 22.

కం. జననిని విలపింప నిటులఁ 23.

గని కౌసల్య నతి దీనఁ గాకుత్స్థుఁ డనెన్
మినుకులు ధర్మయుతమ్ముల
నునయమున మహాత్ముఁ డంత నొచ్చుచు నిట్లున్

తే.గీ. పితృ వచనములు దాట నే విధము లేదు
శక్తి నా కెన్నఁడును దల్లి భక్తి శిరసు
వంచి వేఁడెద వాంఛింతు వనికి నేఁగ
ననుమతి నొసంగుమ కరుణ నంబ! నాకు 24.

ఉ. చంపెను గోవుఁ గండుఁడను సంయమి ధర్మవిదుండు తండ్రి దౌ
పంపున సువ్రతుండు ఘన పండితుఁడే మును పూర్వ మందు స్వీ
యంపుఁ గులంపు వారు సగ రాజ్ఞను సాగరు లెల్ల భూతలం
బింపుగఁ ద్రవ్వి మృత్యువును సెల్లరు వొందరె ఘోర రీతినిన్ 25.

తే.గీ. తండ్రి యాజ్ఞను బాటించి తల్లి రేణు
కా సతిని జామదగ్న్యుఁడు గండ్ర గొడ్డ
ట వధియింపఁడె రాముఁ డటవిని మున్ను
డెందమున నుంచ కిసుమంత సందియమ్ము 26.

కం. ఈ విధి నన్యులు పెక్కురు
దే వాభులు మూరి నిజ పితృ వచనములనే
పేవేగం బాలించిరి
దేవీ! నేఁ జేసెదను బితృ హితం బెల్లన్ 27.

ఆ.వె. జనకు నాజ్ఞ దేవి! చక్కఁ బడుట నా యొ
కని వలననె కాదు జనులు మున్ను
నేను జెప్పినట్టి మానవోత్తముల వ
లనను జరిగె నిలను రమ్యముగను 28.

కం. క్రొత్తది ధర్మము కానిది
యిత్తఱి నే నెద్దియుఁ జరియించుట లేదే
యుత్తమ మార్గము పూర్వులు
నిత్తెము పాటించినదియె నేఁ బాటింతున్ 29.

ఆ.వె. అట్టుల నొనరింప నగును గర్తవ్యము
నాకుఁ దదితరము మనస్కరింప
నెపుడు తండ్రి యాజ్ఞ నెలమి నూనెడి వారు
నాశనమ్ము కారు నమ్ము మంబ! 30.

కం. పలుకు లని తా జననితోఁ
బలుకుల మిన్న విలుకాండ్రఁ బ్రథముం డంతం
బలికెను వీక్షించి యనుజు
ని లక్ష్మణుని రాముఁ డిట్లు స్నేహం బడరన్ 31.

కం. నే నిన్నెఱుఁగుదు లక్ష్మణ!
నీ నా పయి నున్న ప్రేమ నీ తేజమ్మున్
మేని బలము విక్రమమును
పేనిని రా దిల నెదిర్ప వీర వరులకున్ 32.

కం. వర శుభ లక్షణ లక్ష్మణ!
కరమ్ము నాదు జనని యిటుఁ గని నన్నిటులం
బరితాప మందె నేరక
గురు భావములు శమ సత్య గుణ బావమ్ముల్ 33.

ఆ.వె. లోక మందు ధర్మమే కరం బుత్తమం
బగును నిజము ధర్మ మందు నిల్చు
ధర్మ సంశ్రితములు తండ్రి పలుకు లెల్ల
నుత్తమమ్ము లెంచ నుర్వి లోన 34.

కం. తల్లికిఁ దండ్రికి ద్విజునకు
సల్లలిత మొసంగి మాటఁ జన దెవ్వరికిం
గల్లగఁ జేయంగను విల
సిల్ల వలయు ధర్మ మందు స్థితుఁడై వీరా! 35.

కం. దాట నశక్యుఁడ నిచ్చిన
మాటను దండ్రికి జనకుని మాటనె యనె న 36.

చ్చోటున నాతోఁ గైకయి
దీటుగ లక్ష్మణ జననియె ధీర వరేణ్యా!

చం. విడువుమ రాజ ధర్మ పరివేష్టిత బుద్ధి ననుత్తమమ్మునున్
విడువక ధర్మ మార్గమును వీడుమ తీక్ష్ణము మన్మతిం దగన్
నడువుమ యంచుఁ బల్కి రఘు నందనుఁ డారసి తల్లిఁ బల్కెఁ దా
నిడి తల వంచి వందనము లింపుగ నంజలి నిల్పి యింకనున్ 37.

తే.గీ. వెడల నిశ్చయించితిని దేవి! యనుమతి నొ
సంగు మింక నా మీ దాన స్వస్తి వాక్య
ములు బలుకు మమ్మ ప్రతినను బూర్తి చేసి
తిరిగి వత్తుఁ బురికి యయాతి దివికి వలె 38.

తే.గీ. తండ్రి మాటను బూరించి తల్లి! తిరిగి
వనము నందుండి యిచటకు వత్తు శోక
మెల్ల నాపుమ యెదలోనఁ దల్లడిల్ల
కుమ జనని సుంతయైనను సముచితముగ 39.

తే.గీ. నీవును సుమిత్ర వైదేహి నేను లక్ష్మ
ణుండు కూడ జనకు నాజ్ఞను శిర మందు
నూని పాటింప వలయుఁ జుమ్మూర్వి నిదియ
యగు సనాతన ధర్మమ్ము వగవ నేల 40.

తే.గీ. దుఃఖము నెద నిరోధించి తొలఁగఁ జేసి
యింక సంభారముల వేగ యెలమి నా య
రణ్య వాసపు బుద్ధి దలంచి ధర్మ
మనుసరింపుమ చక్కఁగ నంబ! యిపుడు 41.

చం. అన విని ధర్మ సంయుతము లాత్రము వేదన లేని పల్కులం
దనయుఁడు చచ్చి లేచిన యతండు గ్రహించిన భంగి సంజ్ఞనున్
జనని గ్రహించి రాముఁ గని చాగె వచింపఁగ నిట్లు పుత్రకా
జనకుని యట్ల నీ కగుదుఁ జక్కఁగ ధర్మము నందు బ్రేమనున్ 42.

చం. అనుమతి నీయఁ జాలను మహాటవికిం జన వీడి నన్నిటం
జన దీఁక నీకు దుఃఖిత భృశమ్ముగ నివ్విధి వీడి యేఁగఁగం
దనయుఁడు లేని జీవితము తల్లిని నా కిఁక నేల నీదు చెం
త నొక ముహూర్త మున్న సుఖదంబగు లోకము కన్న మిన్నఁగా 43.

తే.గీ. తర్పణము లమృతము లేల ధాత్రి నాకు
నంచు విలపించు తల్లినిఁ గాంచి నరుల
కాగడా లున్న గతి నేఁగు గజము భంగిఁ
దిరిగి రాముఁడు జ్వలియించె దీనముగను 44.

తే.గీ. మూర్ఛిలి నటు లున్న జననిఁ బొడగని పరి
తాప మందిన సౌమిత్రిఁ దమ్మునిఁ గని
ధర్మ సుస్థితుఁడు పలికె ధర్మ్య గిరలు
తగు నతనికె యట్లు వలుక ధర్మ యుతము 45.

తే.గీ. నీ పరాక్రమమును భక్తి నే నెఱుఁగుదు
లక్ష్మణ! మదభిప్రాయ మరయక తగిన
భంగి దల్లి తోడుత నీవు బాధపెట్టు
చుంటివి భృశమ్ము నన్నిట్టు లుచిత మౌనె 46.

తే.గీ. వినుమ ధర్మార్థ కామములను గణింత్రు
ధర్మ ఫలము నందుటకును ధరణి యందుఁ
గల వవి యిట నెల్లఁ దగ లక్ష్మణ వినయము
భార్య లోఁ బ్రేమ సుతు నందుఁ బరగు భంగి 47.

ఆ.వె. ఎందు మూటిఁ గనమొ యందు ధర్మం బున్న
దానిఁ జేయ నొప్పు ధనము పైన
నాశ యున్న ద్వేష్యుఁ డగు నెల్లరకు వాఁడు
కామ పరుఁడు ధరఁ బొగడఁ బడండు 48.

కం. గురువు జనకుండు వృద్ధుఁడు
ధరణిపతియు హర్ష రోష తర్షణములకుం
బరమై యొక్కటఁ బంచిన 49.

నరుఁ డక్రూరుం డయిన నొనర్పక యున్నే

ఆ.వె. అట్టి నేను జనకు నాజ్ఞ మీఱఁగ లేను
గురు వతఁడు మనకుఁ దగును ముదల నొ
సంగ ధర్మము గతి స్వామి కౌసల్యకు
జనని కతఁడు వినుమ సమ్మదమున 50.

తే.గీ. ధర్మమునకు రాజు బ్రతికి ధాత్రి నుండ
స్వీయ పథమునం దలరి విశేషముగను
దేవి నా వెంటను బయలుదేరు నెట్లు
భర్త మరణించిన విధవ పగిది చెపుమ 51.

తే.గీ. అట్టి దేవి! యనుమతింపు మడవి కేఁగఁ
బలుకు స్వస్తివచనములు పన్నుగ నీకఁ
దిరిగి వచ్చెదఁ బూరించి పురమునకు ని
జము తిరిగి వచ్చిన యయాతి చందమునను 52.

కం. యశము విడనాడ నోపను
నృశంసు చందమున నేను నేల కొఱకునై
విశదము జీవిత మల్పపు
దశయే రాజ్య మవినీతిఁ దలఁప గ్రహింపన్ 53.

తే.గీ. అంతఁ బురుషర్షభుఁడు మాత ననునయించి
యనుజునిఁ దగ నిర్దేశించి ఘనుఁడు విక్ర
మమున నడివికిఁ జను నిచ్చ మాతకు హృదిఁ
జేసెను బ్రదక్షిణము భక్తి శీఘ్రముగను 54.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది యొకటవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 22.

రాముఁడు లక్ష్మణునిఁ జేరి యిది విధి కృత మని తప్పరాని దని పలికి యోదార్చి యౌవ
రాజ్యాభిషేక కార్యము లన్నిటిని నాప మని యాదేశించుట.

ఉ. రాముఁడు చిత్త నిగ్రహుఁడు లక్ష్మణుఁ దమ్ముని రోష తప్తునిం
బాము విధమ్ముగా బుసలు వారక కొట్టెడు వానిఁ జేరి తా
గోముగఁ బల్కె ధైర్యమును గొప్పగ నూని ప్రియమ్ము మీఱఁగా
సామము లివ్విధమ్ముగను సత్త్వము చెల్గఁగ మిక్కుటమ్ముగన్ 1.

చం. వగపును రోష మెల్ల నిఁక భ్రాత త్యజింపుమ ధైర్య మూనుమా
తగ నవమానమున్ మదినిఁ దల్పక యుత్తమ హర్ష మందుమా
తగు నిఁక భద్ర కార్యమును దాల్పఁగ నీ యభిషేక కార్యముల్
వగవక యాపు మన్నిటినిఁ బన్నఁగఁ గూర్చిన వాని నెల్లనున్ 2.

తే.గీ. సంభ్రమ మభిషే కార్థము సల్పిన విధిఁ
గూర్ప సంబారముల నెల్లఁ గూర్మి మీఱ
నాప నభిషేక మియ్యెడ నట్టి సంభ్ర
మమ్ము సౌమిత్రి చూపుమ నెమ్మి తోడ 3.

కం. ఎవ్వని మనం బధికముగ
నొవ్వులఁ గనె నట్టి మాతను గని పలుకుమా
యెవ్విధి యభిషేకార్థము
రివ్వున సందియము వీడు లీలగ నట్లున్ 4.

కం. కుములఁగ సందేహమున నొ
క ముహూర్తం బైన జనని కాంచి యుపేక్షిం
ప మనమున నుత్సహింప వి
నుమ లక్ష్మణ సుంత యయినను నిజం బెంచన్ 5.

ఆ.వె. ఎఱిఁగి యైన నింక నెఱుఁగక యయిన నేఁ
దల్లుల కయిన మఱి తండ్రి కైన 6.

నించు కైనఁ జేయ నెఱుఁగను లక్ష్మణ!
యప్రియమ్ము నెన్నఁ డైన వింటె

ఆ.వె. సత్యవాది సత్యసంధుఁడు సత్య ప
రాక్రముండు సతము రాజు భీతి
జెందెను బరలోక చింతతో నాతండు
నిర్భయునిగ నింక నెగడ వలయు 7.

తే.గీ. ఆఁగ కున్న నీ కార్యము వేఁగు నాత
ని మది మిక్కుటముగను సత్యమును నిలుపు
టందు నోడె నంచుఁ దనదు డెందపు వగ
నన్ను బాధించు భృశముగ నెన్నఁ డింక 8.

ఆ.వె. అందు వలన నాపు మభిషేకపు విధాన
మెల్ల లక్ష్మణ కని యెలమి దానిఁ
బిమ్మట నిట నుండి సమ్మదమునఁ కాన
కేఁగ నిచ్చగింతు వేగముగను 9.

కం. చన నడవి కేను గైకే
యి నృపాత్మజ యడ్డు లేక యిద్దర నిజ నం
దనుని భరతు నభిషేకిం
చును గృతకృత్య యగు నేఁడు సురుచిర లీలన్ 10.

కం. ధరియించి నార బట్టలు
విరివి జడలు నే నరిగిన విపినమ్మునకుం
బరఁగు సుఖమ్ము భృశమ్ముగ
నరసినఁ గైకకు జననికి ననుజా! వినుమా 11.

కం. చక్కఁగ బుద్ధి నరసి మదిఁ
జక్కం బెట్టి కొనినట్టి జనకుని యాజ్ఞం
దక్కక చనుదు వ్యథ నొసఁగ
నక్కట తగ దింకఁ జేయ నాలస్యమ్మున్ 12.

చం. ఇది విధి కార్య మంచు మది నెంచుమ లక్ష్మణ! రాజ్య మిచ్చి దా
నిఁ దిరిగి నాపు టింక నను నిర్జన గోత్ర నివాసుఁ జేయు టి
ట్లు దలఁపఁ గైక కిప్డు మదిలో జనియించుట బుద్ధి యివ్విధిన్
సుదతికిఁ బీడ నాకు నిడఁ జోద్యము గాఁగఁ గృతాంతకృత్యమే 13.

చం. తెలియదె నాకు భేద మది ధీవర తల్లుల యందు లేదు నా
నిల సుతు నందు నాయెడను హీనము బేదము తల్లి కైకకుం
బలుకుట యుగ్ర వాక్యములు పంతముతోనభిషేక కార్యముం
దలఁగి యరణ్య మంపుటయుఁ దథ్యము గాంచఁగ దైవకృత్యముల్ 14.

తే.గీ. కానిచో గుణ సంపన్న కైక ప్రకృతి
నంచిత మతియు సాధార ణాట లాభ
మేల నన్ను పేదించు నిజేశ్వరు సము
ఖమ్ము ననె బలుకులను లక్ష్మణ చెలంగి 15.

తే.గీ. విధి యచింత్యము ప్రాణుల వెసఁ జెలంగు
నప్రతిహతముగను విపర్యయము నామె
యందు నాయందు నిత్తఱి వ్యక్త మియ్యె
దిపుడు చూపట్టె నాపంగ నెట్టు లగును 16.

కం. విధి నెవ్వండు దొడఁగు నె
వ్విధి నైన నెదిర్పఁ బట్ట వింతగ నరుఁ దా
నధికముగ దాని కర్మము
ల ధీరత నతిక్రమింప లావుం గలదే 17.

తే.గీ. కాంచ సుఖదుఃఖములు భయాగ్రహములు భవ
మభవమును లాభ నష్టము లన్య కర్మ
తతులు దైవ సంభవములు ధరణి యందు
నితర మొక్కటి కాన రా దెందు వెతక 18.

కం. మును లుగ్ర తాపసులు దే
వునిచేఁ బీడింపఁ బడుచుఁ బుడమిని నిజ తీ
వ్ర నియమములను వదలి నా 19.

శన మొదురు కామ రోష సంజననమునన్

తే.గీ. అడరి యారంభ మైనది యంత నాగు
టయు ననూహ్య మకస్మాత్తు నయి చెలఁగుట
యెల్ల దైవ కృత్యము సుమ్ము తెల్లముగ నె
ఱింగి వగవ నీ యభిషేక భంగమునకు 20.

ఆ.వె. కాన నీవు గూడ గ్రక్కున ననుసరిం
చి నను వగపు వీడి క్షిప్రము నభి
షేక కార్యములను వీఁక నివర్తింపు
లక్ష్మణ! గుణ నిచయ లక్షితాంగ! 21.

కం. ఇట నున్న యభిషవ సలిల
ఘటములు తపమాచరింపఁగ వ్రతమ్మును జే
యుటకు మునుక కుపయోగ మ
గుట హర్ష మొసంగు నాకు గొప్పగ ననుజా! 22.

కం. అయినను రాజ ద్రవ్య మ
ది యేల నాకు వ్రతమునకు ధీరవరేణ్యా!
స్వయముగఁ దోడి జలమ్మును
నయముగ వ్రతము నొనరింతు నైపుణ్యమునన్ 23.

ఆ.వె. లక్ష్మణ! వగవకుమ రాజ్య నష్టమునకుఁ
జింత వలదు మదిని సుంత యైన
రాజ్యము వనములఁ గరము మిన్న వనవాస
మెంచ నుందు నచట నంచితముగ 24.

తే.గీ. కర్మ విఘ్నమున కిట లక్ష్మణ తలఁపకు
పిన్న తల్లి కతం బని వేగ నీవు
విధి వశతఁ బరుషము లనె నధికముగను
దఱచు దైవ ప్రభావము నెఱుఁగు మట్లు 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 23.

రాముని మాటలను విని లక్ష్మణుఁడు హర్షశోకముల నడుమ మఱిమఱి నలిగి విధి బలహీన మైనది విక్రమమున రాజ్యమును బొంద వలె నని నొక్కి వక్కాణించిన నంత రాముఁడు తమ్ముని నూఱడించి తండ్రి యాజ్ఞను బాటింతు నని యదియే సత్పథమని వచించుట.

కం. విని యా రాముని మాట ల
వనత శిరుఁడు లక్ష్మణుండు పరితోషం బిం
కను దుఃఖమ్మునకు నడుమ
ను నలిగెను బలుమఱు మదిని నుత వీరుండే 1.

చం. కనుబొమ లంత మోడ్చి వడి కన్నము లోని భుజంగమం బనన్
ఘనముగ నిశ్వసించెఁ జెలఁగంగ మహాగ్రహ మంత లక్ష్మణుం
డు నరవరుండు కన్పడెఁ గడుంగడు రోష సమృద్ధ వీక్షణ
మ్మున మృగరాజ సన్నిభము భూరి భయంకర రూపుఁ డై యటన్ 2.

చం. కరి నిజ హస్త వేగ యుత కంపన సన్నిభమై చెలంగఁ ముం
గరములు పే గదల్చుచును గ్రక్కున  స్వీయ శరీర మందునుం
దిరుగఁగఁ పైకి నడ్డముగ దిట్టపుఁ గంఠమె యోర కంటితో
నరసి వచించె వాచ్యముల నాతఁడు రాముని తోడ నివ్విధిన్ 3.

ఉ. ఉద్ధత రాజ కుంజర మహోన్నత సంభ్రమ మివ్విధమ్ముగా
నిద్ధరఁ బుట్టె నీకు నయహీనము తోఁపఁగ శంక లేనిదౌ
పద్ధతి లోక ముండ విధి బల్మినిఁ బెద్దగఁ జేసి దుర్బలిన్
శ్రద్ధగఁ బల్క నివ్విధము సమ్మతమే నిను బోలు వారికిన్ 4.

ఆ.వె. ఏల దైవమును సలీలఁ బొగడుదువు
బేల నిప్పగిదిని నేల వారి
లోన సందియమ్ము నూన వింతయు నేనిఁ
బాప మతుల యందు భ్రాంతి తోడ 5.

తే.గీ. ధర్మచిత్త! వారు కపట ధర్మ తత్ప
రులయి స్వార్థపు మోసపుఁ దలఁపు లూని
సుచరితు నిను మెత్తగఁ బల్కుచు నిట నుండి
పంపు చుంటి రెఱుఁగ వేల భ్రాత! దీని 6.

ఆ.వె. మున్న వా రిరువురు పన్నియుందు రిటులఁ
గాక యున్నఁ బుడమి కాంతుఁ డిచ్చి
యుండు నీ వరముల నువిదకు పూర్వమ్మ
పూర్ణముగను నిక్కము సుమి రామ! 7.

తే.గీ. మొద లిడిన యభిషేకము పురుషు నన్యు
నకు నొనర్ప రుచింపదు నరుల కెపుడు
దీని నే సైఁప నోపను ధీరచరిత!
యిందు నేను క్షమార్హుఁడ నింక నన్న! 8.

ఆ.వె. దేని వలన నిట్టు లూనితి మతి నను
మాన మీవు మఱియు దేని వలన
మోహ మంది తిటులఁ బుణ్యాత్మ! యా ధర్మ
మగును ద్వేష్య మన్న! యరయ నాకు 9.

కం. యుక్తము కాని వచనములు
రక్తి వశుఁ డయి నిజసతికి రాజు పలుకఁగన్
శక్తి కలిగి చేతల నా
సక్తి నధర్మముల నొనరువఁ దగునె నీకున్ 10.

కం. వంచనతో నిది పన్నినఁ
గొంచె మెఱుఁగ వీ వెడందఁ గ్రూరత్వమ్మున్
మించును దుఃఖము ధర్మపుఁ 11.

బంచనఁ జేరంగ నిట్లు భ్రాతా! నాకున్

తే.గీ. తల్లిదండ్రుల నెపమునఁ దనరు శత్రు
లిద్ద అకట కామాతురు లెంచఁ తలఁప
రెన్నఁడు హితము నీకిల నేల వారి
కోరిక లొనరింపఁగ మనసారఁ దలఁచి 12.

చం. అరసిన నీవు దైవకృత మంచు మనమ్మున వారి చర్యలన్
గురుతర గర్హణీయములు క్రూర తరమ్ములు మెచ్చ వానినిన్
స్థిరముగ విశ్వసింతురు విధిం గడు భీరులు శక్తి హీనులుం
బురుషులు కీర్తిమంతులు నపూర్వ పరాక్రము లెన్న రీ విధిన్ 13.

కం. పురుష ప్రయత్న శక్తి నె
దిరింప దైవమ్ము నోపు ధీరవరున కి
ద్ధర దైవముచే నెట్టి వి
పరీతముల నందు శంక బాధింపదుసూ 14.

ఆ.వె. చూతు రిప్పుడు పురుషునకు దైవమునకుఁ
బౌరుషమ్ము నందుఁ బరఁగు భేద
మెల్ల దైవ నరులఁ బల్లవించు బలిమి
కానఁబడును జక్కఁగా నిపు డిట 15.

తే.గీ. జనులు గాంతు రిప్పుడు దైవ సంక్షయమ్ము
వేగ నా చేత నెగడంగ విశ్మయముగ
నాగి నట్టిది యైన రాజ్యాభిషేచ
నమ్ము విధివశమున నిల్పుఁ జుమ్ము నేఁడు 16.

తే.గీ. అంకుశమునకు లొంగక యడ్డు లేక
మద బలమ్మునఁ బాఱెడు మత్త కుంజ
రమ్ము భంగి దైవమ్మును బమ్మి పాఱఁ
జేయుదును బౌరుషమ్మునఁ జేవ మీఱ 17.

ఆ.వె. రామ! నేఁడు కనుమ రామాభిషేక మా 18.

పంగ లేరు లోకపాలు రింక
ముజ్జగములు నైనఁ బుడమిని ననఁ దండ్రి
మాట చెప్ప నేల మానవేంద్ర!

అ.వె. కూడి యెవ్వరు నిను గోత్రమునకుఁ బంప
నెంచిరి కపటమ్ము నెడఁద నూని
వార యచటకిఁ జను వారింకఁ బదునాల్గు
వత్సరమ్ము లుండ వనము నందు 19.

కం. నీ యభిషేకమ్మును వా
రీ యెడ నాపి జనకుండు నీ కైకయు ని
ట్లీ యఖిల రాజ్యము సుతున
కీయఁ దలఁచి నట్టి యాశ లీఁక ఖండింతున్ 20.

తే.గీ. నా బలము పౌరుషములు ఘనమ్ముల నెది
రింప జనియించు నా దుఃఖ మెంచ దైవ
బలము నెదిరింపఁ గల్గెడు బాధ మించు
మిక్కుటమ్ముగ నిద్దర నిక్క మిదియ 21.

ఉ. చక్కఁగ రామ! యేలి భువి క్షాత్రము మీఱ సహస్రవత్సముల్
మిక్కిలి దక్షతన్ వనికి మీఱి చనంగ కుమారు లంతటం
దక్కొని రాజ్య మేలుదురు తాతలు పూర్వము నిల్పి పుత్రులన్
మక్కువ తోడ రాజ్యమున మంచిగఁ జేసి రరణ్య వాసమున్ 22.

మ. ధరణీ నాథు ననిశ్చయాత్మ వలనన్ ధర్మాత్మ! శంకించుచున్
ధరణిం గ్లేశము రాజ్య మేలఁగను జిత్తంబందుఁ జింతింపవే
వర వీర్యమ్మున నీదు రాజ్యమును గాపాడంగ నే నుంటి శం
బర రాశిం దగ వేల నాఁ బ్రతిన నీ పై నాదు స్వర్గమ్ముపై 23.

తే.గీ. మంగళ ద్రవ్యములను జక్కంగ నీ వి
ట నభి షిక్తుండ వగుమ యడరి మహీ ప
తులను నే నొక్కఁ డను నిల్పుదును బలమ్ము
సూపి శంకింపఁ బనిలేదు చోద్య మంచు 24.

తే.గీ. కాదు శోభకు బాహులు కాదు విల్లు
తొడవు కత్తి కట్టుటకుఁ గాదు శర చయము
దాచుటకుఁ గాదె యీ నాల్గు తథ్యముగను
శత్రు దమ నార్థ మున్నవి సతము నాకు 25.

తే.గీ. మెఱపు కాంతి తో వెల్గెడు మేటి కత్తి
పదును టంచుతో రిపులను వజ్రి నైన
నఱక వెనుకాడ నా తోడఁ దఱచు పగను
గొన్న సైప నిక్కమ్ముగ నెన్నఁ డేని 26.

ఆ.వె. ఖడ్గ ఘాతము లగు గజ తురగ నరుల
కరములు తొడ లింక శిరముల భువి
యెల్ల నిండఁగఁ జరియింపఁ జొచ్చు నలవి
కాక కానఁబడును గంజ నేత్ర! 27.

కం. నా కరవాలము ద్రుంపఁగ
నీ కరి గణ మెల్లఁ గూలు నిల వెల్గులతో
నాకువులను సతటిణ్మే
ఘూకరమును బోలు చుండి యాశ్చర్యముగన్ 28.

ఆ.వె. కట్టి కవచములను గైకి ప్రేళ్లకు నిల్వ
నేను వింటి తోడ నే నరుండు
మగతనమ్ము మీఱ మగఁ డను కొనువాఁడు
నిల్వఁ గలఁ డెదిర్ప నీరజాక్ష! 29.

తే.గీ. ఒక్కని ననేక శరముల నొక్క సాయ
కమ్మున ననేకుల నడతుఁ బమ్మి నేను
నర గజాశ్వ మర్మమ్ములఁ బరగఁ జేయు
దు నడరి మదీయ దృష్టి చాతుర్యమునను 30.

ఆ.వె. రాజు ననధికారు రామ నిన్నధికారు
నిగను జేయ నావి యగు మహాస్త్ర 31.

తతుల శక్తి యిచటఁ దనరంగఁ గాంతు వీ
వుల్ల మందు ముదము వెల్లివిరియ

ఉ. చందన మద్ద యోగ్యములు చక్కని బాహు విభూషణార్హముల్
వొందికఁ బంచు సంపదలు పుణ్య సఖావలి పాలనార్హ మౌ
చందము నుండు నా వర భుజమ్ములు నీ యభిషేక మాపెడిన్
మందుల నెల్ల నాపును సమగ్ర బలమ్మున సత్వరమ్ముగన్ 32.

తే.గీ. శత్రు వెవని మాన ప్రాణ సఖుల నుండి
దూర మొనరింప వలయును దోరముగ వ
శ మగు విధ మీ పుడమి నీకుఁ జక్కఁగ వచి
యింపు నీ దాసుఁడ నొనర్తు నింపుగ నిఁక 33.

తే.గీ. కనుల నశ్రువులు తుడుచుకొనుచుఁ బల్మ
రు రఘుకుల వర్ధనుండు పలుకుల నూఱ
డించి యనుజు ననె జనకు నీరితముల
నేను బాటింతు సత్పథ మౌ నిది ధర 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది మూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 24.

కౌసల్య రామునితోఁ దాను గూడ నడవికి వచ్చెదనని పలుక భర్తతో నుండి సేవించుటయే సతికి ధర్మ మని వారింప నామె యంగీకరించి రామునికై స్వస్తికార్యములు సలుప నుద్యుక్త యగుట.

కం. కని కౌసల్య సుతుని జన
కుని యానతినిఁ దలఁ దాల్పఁ గూరిమితో ని
ల్చిన వాని ధర్మయుతముగ 1.

గనులం దశ్రువులు నిండఁ గాంత వచించెన్

ఆ.వె. దుఃఖము లెఱుఁగని సుతుండు నా కింపుగ
కలిగి దశరథ నృపు వలన నడరి
యుంఛ వృత్తి నడవి నుండు నెట్లు మధుర
భాషణుండు పుడమి ప్రజల కెల్ల 2.

తే.గీ. రుచికరము లన్నములు భృత్యులు నిజ దాసు
లిచటఁ దినుచుండ నక్కట యెలమి నుండి
నాథుఁడు ఫల మూలములు కాననము నందుఁ
దిరుగుచు భుజించు నెవ్విధి దీనముగను 3.

కం. గుణనిధి ప్రియుండు నిన కుల
మణి రాముని భూధవుఁడు కుమారు నిటు లకా
రణ మడవి కంపె నన విని
గణించి నమ్మెదురె మదినిఁ గలుగదె భయమున్ 4.

కం. లోకమున విధి బలీయము
లోకుల శాసించు టందు లోకానందుం
గాకుత్స్థు నంప ఘోరం
బౌ కాంతారమున కడరి యాశ్చర్యముగన్ 5.

సీ. నిన్ను గాంచమిఁ గల్గ నిట్టూర్పు నా గాలి వంత వ్యథయుఁ గాఁగ వంటచెఱకు
కన్నీ రది హవిస్సు కాఁగ నెడంద నీదు మఱలి రాకకై కుములఁ గల్గు
భాష్ప రాశి పొగయై పరఁగ శోక మడరి యగ్ని పగిది కాల్చు నత్యధికము
నన్ను వేసవి యం దనలము గడ్డినిఁ గాల్చు భంగి నీ యెడఁబాటు ప్రబల నాకు
ఆ.వె. పుత్ర! వినుము మఱియు నాత్రముతోడూడ
యనుసరింపదె తగ నావు చనిన
నట్ల నేను తప్ప కనుసరింతును నిన్ను
యెచ్చటికి వెడలిన నచ్చటికిని 6.

కం. అన దుఃఖమ్మున నవ్విధి
జనని విని నరర్షభుండు సంచలితాత్మం 7.

గని యనెఁ గడుదుఃఖితతో
ఘనుండు రాముఁడు గిరలను గమనీయముగన్

తే.గీ. వంచితుం డయ్యెఁ గైకచేఁ బార్థివుండు
కాననమున వసింప నేఁగ నిఁక నేను
నీవును బరిత్యజించిన నీ విధముగ
నిక్కముగ మనఁ జాలఁడు నేలఁబోడు 8.

కం. పడతికి నిలఁ దన భర్తను
విడుచుట క్రూరత్వ మగును వినుమా జననీ!
యెడఁద నయినను దలఁపకుమ
కడు దూష్యం బది సతమ్ము కరుణం గనుమా 9.

కం. జనకుఁడు జీవించు దనుక
జననీ సేవల నతనికిఁ జలుపంగఁ దగున్
ఘనముగ నది యౌను సనా
తన ధర్మము సత్యముగను దల్లీ! వినుమా 10.

కం. అన రాముఁ డట్లు చేతల
ఘనుండు శుభదర్శన విని కౌసల్య ముద
మ్మున నట్లే యని తాఁ బ
ల్కెను నందను నరసి కరము ప్రీతిని నంతన్ 11.

కం. ఇంకను బల్కెను రాముఁడు
క్రుంక జనని దుఃఖ మందుఁ గూర్మి చెలఁగఁగా
నంకము సేరి గుణాఢ్యుఁడు
బొం కెఱుఁగని వాఁడు ధర్మమూర్తియు నిటులన్ 12.

ఉ. నేనును నీవు మాత యను నిత్యము నింపుగఁ దండ్రి వాక్యముల్
మానక చేయఁగా వలయు మానుగ నాతఁడు నీకు భర్తయుం
దా నరనాథుఁడున్ గురువు తల్పఁగ నీశ్వరుఁ డెల్ల వారికిన్
నేను వనమ్మునం దిరిగి నెమ్మిని వచ్చిన విందు నీ గిరల్ 13.

ఉ. నా విని తల్లి దుఃఖమున నందన వత్సల భాష్ప నేత్రయై
తా వచియించె నీ సవతి తల్లుల మధ్య వసింప లేను రా
మా! వన మేఁగ నెంచ జనకాజ్ఞఁ గుమార వహించి జింక నా
నా వని కీవు నన్నుఁగొని యంచిత రీతిని నేఁగు రాఘవా! 14.

చం. వనరుచు నున్న తల్లిఁ గని వందుచు రాముఁడు పల్కె నివ్విధిన్
వనితల కెల్ల భర్త యగుఁ బన్నుగ దైవము జీవితమ్మునం
దనరు విభుండునై పుడమిఁ దా నగు నాథుడు నీకు నాకునున్
మన మిల కా మనాథులము నాథుఁ డతం డగు నెల్ల వారికిన్ 15.

చం. భరతుఁడు కూడ ధర్మమును బన్నుగ నెంచు నిరంతరమ్మునుం
బరమ మృదూక్తులం దనుపుఁ బ్రాణుల నెల్లఁ బ్రియమ్ము మీఱఁగం
గర మనురక్తి నిన్నరసి క్రన్ననఁ జేయును నీ హితమ్ములం
బరమపు ధర్మచిత్తుఁడును బార్థివ సూనుఁడు తల్లి! నమ్ముమా 16.

ఆ.వె. ఏగ వనికి నేను దా గరిమపుఁ బుత్ర
శోకమున శ్రమము వసుంధరా ధ
వుండు సుంత పొందకుండు విధమ్మున
నప్రమత్తతఁ బతి నరయు మమ్మ 17.

తే.గీ. దారుణ మగు శోకమ్మున ధరణి ధవుఁడు
వృద్ధుఁడును ననారోగ్య నిబద్ధుఁ డై కు
ములని భంగి నిత్యము హితము నొనరింపు
మమ్మ సుసమాహిత వగుచు నంచితముగ 18.

చం. సతులు వ్రతోపవాసములు చక్కగఁ జల్పుచు నున్న భర్త వా
క్తతుల గణింప కున్న వనితామణు లెల్లరు గాంత్రు దుర్గతిన్
సతతము దేవపూజలను జల్పక యున్నను భర్తృ సేవలన్
మతి నిడి చల్పు వార లగు మానిను లందుదు రింక స్వర్గమున్ 19.

తే.గీ. పతికి హితముగఁ జరియించి భర్త కెలమి
సేవ లొనరింపుమ జనని శ్రేష్ఠముగ న
దియ సనాతన ధర్మము దృష్ట మయ్యె 20.

జగతి శ్రుతుల వినంబడె సత్యముగను

ఆ.వె. నాదు క్షేమ మెంచి నాకౌకసుల కీవు
పూజ సేయు మమ్మ పూల తోడఁ
బూజ్యులు వ్రత రతులు భూసురులకు సంత
తమ్ము నగ్ని కార్య తతుల నెలమి 21.

కం. పతి సేవా రతవై యీ
గతి నా ప్రత్యాగమనపుఁ గాలమ్మునకై
మిత భోజనమ్ము నింక ని
యతిని నిరీక్షింపు తల్లి! యానందముగన్ 22.

ఆ.వె. ధర్మపరుల శ్రేష్ఠ తముఁడు జీవించి యు
న్న మఱలంగ నే వనమ్ము నుండి
జనని పొందు దీవు సదమల వాంచిత
ముల ననేకములను గలఁత యేల 23.

చం. అన విని భాష్పపూరిత యుగాక్షి నిజాత్మజ శోక తప్త ప
ల్కెను గని రాము నా జనని లీలఁగ నిశ్చయ మైన నీదు పో
కను సుత నాప నేరక వికారము నందుట యెల్లఁ దల్పఁగా
ఘన మనివార్యమై చెలఁగుఁ గాలము సంతత మంచు దల్చెదన్ 24.

ఆ.వె. పోయి రమ్ము పుత్ర! పూని యేకాగ్రత
భద్ర మొసఁగుఁ గాక ప్రభువు నీకు
తిరిగి రాఁగ నీవు తెల్లముగ విగత
బాధ నొదు నేను భవ్యముగను 25.

తే.గీ. తిరిగి రాఁగ మహాభాగ! పరమ పుత్ర!
వ్రతము పూరించి కృతకృత్య! రామ! జనకు
ని నొనరించి ఋణ విముక్తునిగను నిన్ను
గాంచి పొందుదు పరమ సుఖమ్ము నెల్ల 26.

ఆ.వె. విధి గతి నెఱుఁగఁగ భువిని సతత మశక్య 27.

మౌను సుమ్ము పుత్ర! యదియె నిన్ను
బ్రోత్సహించె నిట్టు లుత్సహించి జనని
మాట నీవు వినని మార్గ మూన

కం. వెడలి మహాబాహు సుఖం
బడరఁ దిరిగి రమ్ము నీవు పమ్మి తిరిగి రా
నడవిఁ జరియించి సంతస
మిడు నయ్యది మృదు వచనము లెలమిం జెలఁగన్ 28.

కం. జడ లింక నారచీరలు
కడు విందొనరింప నీవు కాననమును వీ
డెడు సమయం బది నేఁ డయి
యడరిన బాగుండు దనయ యరయఁగ నిన్నున్ 29.

తే.గీ. వన గమన నిశ్చిత మతినిఁ దనయుని శుభ
లక్షణునిఁ గాంచి రాముని లలన పలికెఁ
బరమ చేతమునను స్వస్తి వచన దాయి
ని యయి కౌసల్య యింపుగ నిలిచి గిరలు 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 25.

కౌసల్య రాముని క్షేమమునకై మంగళ కార్యయములను నిర్వర్తించి యాశీస్సుల నొసఁగిన
రాముఁడు తల్లికి నమస్కరించి సీత వద్దకు నేఁగుట.

కం. శ్రమ నెల్ల నెద విసర్జిం
చి మాత కౌసల్య భృశ విశేషాత్మయు దై 1.

వములఁ దలంచి తమిఁ జలిపె
ను మంగళమ్ముల నొసఁగు  వినుత కార్యములన్

కం. నిను వారింప నశక్యను
జనుమా రఘుకుల వరేణ్య! చక్కఁగ నింకన్
వనికిన్ మఱలుమ శీఘ్రం
బ నడువుమ విబుధ వరేణ్య మార్గము లందున్ 2.

తే.గీ. ధృతి నియమములు పాటించి ధీరచిత్త!
నీవు గాతు వే ధర్మము నెమ్మి యట్టి
ధర్మ మడరి రక్షించును దథ్యముగను
నిన్ను నిశ్శంక నింక వనినిఁ జరింప 3.

చం. గుడులను బుణ్య తీర్థములఁ గోరి భజించితి వెవ్వరిం దగం
గడు రతి వార లెల్ల ముని కాయముతో నిను గాతు రింపుగా
నడవి వసింపఁ బుత్రక! మహాస్త్ర చయమ్ములు నెమ్మి కౌశికుం
డిడినవి మంత్ర యుక్తముగ నింపుగఁ గావఁగ నిల్చు నిత్యమున్ 4.

తే.గీ. తండ్రి కొనరించి నట్టియుఁ దల్లికి నొన
రించి నట్టి సేవల చేత నింక సత్య
మునకుఁ జేసిన సేవలఁ బుత్ర! రక్షి
తుండవై నీవు చిర కాల ముండు మయ్య! 5.

చం. నరవర రక్షణం బిడు ఘనమ్ముగ నీ సమిధల్ పవిత్ర ద
ర్భ రుచిర చైత్య హోమ వర వాటిక లన్యము లింక శైలముల్
తరువులు గుల్మషండములు తమ్ముల యిల్లులు పన్నగమ్ములున్
వర మృగరాజ పక్షులును బన్నుగ నీ కిఁకఁ గాననమ్మునన్ 6.

తే.గీ. సాధ్య విశ్వ మరుత్తులు సంయ మీంద్రు
లింక ధాత విధాతలు నీ దిశా ప
తులు భగుండును బూషార్యములును వాస
వ ప్రముఖు లిత్తు రట నీకు స్వస్తి సతము 7.

ఆ.వె. ఋతువులు నెల లింక నీ పక్షములు వత్స
రములు పవలు నిశలు నిమిషములును
స్వస్తి నొసఁగు నీకుఁ బన్నుగ నిత్యము
రాఘవేంద్ర! నీ కరణ్య మందు 8.

ఆ.వె. స్మృతియు ధృతియు ధర్మము తనయ! రక్షించు
నెల్ల వేళ లందు నింక నిన్ను
స్కంద చంద్ర గురులు సప్తర్షులును నార
దుండు నరయు చుండ్రు మెండుగాను 9.

ఆ.వె. దిశలు సిద్ధు లింక దిక్పతు లెవ్వరి
నే నుతింతు వారు నిన్ను ఘోర
వనము నందు నుండఁ బన్నుగఁ గాతురు
గాక సంతతమ్ము నీకఁ బుత్ర! 10.

ఉ. శైలము లర్ణవమ్ములును సాగర నాథుఁడు నంతరిక్షమున్
మేలగు స్వర్గ ధామమును మేదినియుం దటినీ నికాయముల్
కాల నిశల్ పవళ్లు గ్రహ కాయము తారలు దైవ యుక్తముల్
లీలఁగ సంధ్య లిం బొసఁగు రీతినిఁ గాచును నిన్ను గానలో 11.

ఆ.వె. ఆఱు ఋతువులును మహాభుజ! మాసమ్ము
లుర్వటములు కలలు సర్వ కాష్ఠ
లడరి యటవి లోన నన్ని వేళల నిచ్చు
నీకు సుఖము లెల్ల నెమ్మి తోడ 12.

కం. చరియింపఁగ ముని వేష మ
లర వనమున ధీవరా! సురగణము దైత్యో
త్కర మెల్ల నీ కొసగు గురు
తర సౌఖ్యము లెల్ల సంతతమ్ము కుమారా! 13.

తే.గీ. రక్కసులు పిశాచమ్ములు రౌద్రు లింక
క్రూరులు పలాశ నాదులు వీర! యెల్ల
రెవ్విధిని నీకు భీతిని నెన్నఁ డేని 14.

నీయ కుందురు గావుత నా యటవిని

ఆ.వె. కోఁతు లీగలు పురుగులు తేళ్లు దోమలు
ప్రాఁకు నట్టి పెల్ల రామ! యేరు
దూఱ నలవి కాని తోరంపుఁ గానల
యందుఁ గలుగ కుండు సెందు నీకు 15.

తే.గీ. పులులు పెన్నేనుఁగులు సింగములు నెలుఁగులు
పందులును గొమ్ము మెకములు సెందు నిన్ను
దున్న లైన బెడిదములు నెన్నఁ డేని
కలఁత పెట్టకుండును బిడ్డ! కాన లోన 16.

కం. నరమాంస భోజనులు గురు
తర రౌద్రులు నన్య జంతు తతు లెవ్వియు నేఁ
బరఁగింపఁ బూజ లిచ్చట
నరవర! హింసింపవు నిను నందన! యెపుడున్ 17.

ఆ.వె. దారు లగు శుభములు మూరు పరాక్రమ
ముగ్రముగను సంప దుత్తమమ్ము
లబ్ధ మగును స్వస్తి లభియించుఁ బుత్రక!
క్రమ్మ క్షేమ మేఁగు రామచంద్ర! 18.

చం. కలుగును స్వస్తి యభ్రచర కాయము చేత ధరాధిపాలి చేఁ
బలువురు దేవతా వరుల పన్నుగ నింకను శత్రు కోటి చే
సలలిత భంగి దేవగురు సౌరి కుబేర శశాంక సూర్యులే
మెలఁగఁగఁ గాతు రర్చితులు మిత్ర నిభమ్ముగ దండకాటవిన్ 19.

ఆ.వె. స్నాన మాచరించు సమయమ్ములో నిన్ను
వాయు ధూమరాజి వహ్ను లింక
తాపస వదనచ్యుతమ్ములు మంత్రమ్ము
లడరి కాచుఁ గాక యడవి నిన్ను 20.

తే.గీ. సర్వలోక ప్రభువు బ్రహ్మ సర్వలోక 21.

భర్త మఱి తాపసేంద్రులు భద్రముగను
దేవతా వరు లన్యులు నీవు తిరుగు
చుండ నడవి రక్షింతురు మెండుగాను

కం. ఈ విధి నాయత లోచన
భూవినుత యశస్విని తగఁ బూజించె నహో
దేవగణములను మాలల
తో విమల సుగంధములను స్తుత్యాదులనున్ 22.

కం. రామ క్షేమార్థమ్ముగ
భామ యనలము వెలిఁగింప బ్రాహ్మణ వరులే
నీమముగ హవ్య మొసఁగఁగ
సేమఱకయుఁ జేసెఁ బూజ సెలమి చెలంగన్ 23.

తే.గీ. తెల్లని వగు దండలు నేయి సెల్ల సమిధ
లింకఁ దెల్లని యావాల నింతి పుణ్య
శీల కౌసల్య తెప్పించె శీఘ్ర గతిని
నగ్ని కార్యము సేయంగ నంచితముగ 24.

తే.గీ. పేలిచి పురోహితులు వహ్ని మేలుగ విధి
యుతము శాంతికై దోష రహితము హవ్య
శేష భాగమ్ము తోనటఁ జేసిరి బయ
టి బలి బ్రాహ్మణోత్తములు పటిష్ఠముగను 25.

ఆ.వె. రామునకు వనిఁ దనర శుభమ్ములు సతము
స్వస్తి వచనములు ద్విజప్రవరుల
చేఁ దగఁ బలికించెఁ దాఁ దేనె పెరుఁగు బి
య్యమ్ము నేతు లొసఁగి యధికముగను 26.

కం. రాముని జనని యశస్విని
కామితములు దక్షిణ లిడి కౌసల్య మహా
భూమిసురేంద్రునకు నరసి
రాముని నంతఁ బలికెను బరమ వాచ్యములన్ 27.

తే.గీ. సర్వ సురులకుఁ బూజ్యుఁడు శక్రునకు స
హస్ర నేత్రునకు మును వృత్రాసుర వరు
సంగరమునఁ గలిగె నెట్టి మంగళము ల
భంగముగ నగు నీ కట్టి మంగళములు 28.

తే.గీ. పక్షి వరునకుఁ బూర్వము వైనతేయు
న కమృతార్థమ్ముఁ పెడల వినత జనని వ
రాంగన యొసఁగెఁ దమి నెట్టి మంగళము ల
భంగముగ నగు నీ కట్టి మంగళములు 29.

తే.గీ. అమృతము సృజించిన సమయ మందు దైత్య
హత్యకై వజ్ర ధరునకు నదితి కశ్య
పాంగన యొసఁగెఁ దమి నెట్టి మంగళము ల
భంగముగ నగు నీ కట్టి మంగళములు 30.

తే.గీ. దిట్టమగు తను కాంతి నతిక్రమింప
మూడు లోకము లింపుగఁ బొలసుదిండ్ల
గొంగ హరికిఁ గలిగె నెట్టి మంగళము ల
భంగముగ నగు నీ కట్టి మంగళములు 31.

ఆ.వె. మంగళము లగు పరమర్తువులు దిశలు
వేదములు జలధులు ద్వీపములు జ
గములు దీర్ఘబాహు! కాకుత్స్థ! రామ! నీ
కిచ్చు మంగళములు హెచ్చు గాను 32.

చం. శిరమున నుంచి యక్షతలు చెల్వపుఁ బుత్రున కింక గంధముం
బరఁగఁగఁ జేసి యింపుగను భామిని గోసల రాజ్ఞి యౌషధిన్
నిరతిని నా విశల్యకరణిం దగఁ జేతికిఁ గట్టె సిద్ధికై
గురుతర రక్షగాఁ దనరఁ గూర్మిని మంత్రము లుచ్చరించుచున్ 33.

ఆ.వె. దుఃఖము సెలఁగినను దోరముగ ముదము
నంది నట్లు పలికె నరయ భ్రాంతి 34.

వాక్య మాత్రముగను భావ మడర కున్నఁ
దనదు పుత్రుఁ గాంచి తత్తఱమున

ఆ.వె. పుత్రు తలను వంచి ముద్దిడి కౌఁగిలిం
చి యనురక్తిని సురుచిర యశస్వి
ని వచియించె నిట్లు సెగడంగ సౌఖ్యము
సిద్ధిఁ బడయఁ జనుమ క్షేమముగను 35.

ఆ.వె. అరుజ మడర సిద్ధి నంది వడిఁ బురం బ
యోధ్యకు మఱలంగ నో కుమార!
రాజపథము నందు రమ్యముగ నిలువ
నీవు చూతు నెలమి నిన్ను నేను 36.

కం. వీడ విచారపుఁ దలపులు
నాఁడు రహిని వెల్గు నాననమ్మును గాంతున్
వేడుక నుదయించెడు శశి
నా డంబర మతిశయింప నందన! రాఁగన్ 37.

కం. నిను భద్రాసనమున నుం
డ నరయుదును దిరిగి రా నడవి నుండి వడిన్
జనకాజ్ఞను బూరించి త
గ నయోధ్యకు సంతసమునఁ గాకుత్స్థ వరా! 38.

కం. వన వాసము సేసి పిదప
ఘనముగ శుభముల నొసంగఁగ వలయు రామా!
యనవరతము కోరికల న
వనిజకు నాకుం బెనుపుమ వని కేఁగు మిఁకన్ 39.

తే.గీ. దేవ గణములు నా మహాదేవుఁడు పర
మర్షులును భూతకాయముం బన్నగములు
దిశలు మత్పూజితులు నీ కనిశ మొనర్తు
రు హితము వివాసితునకు సురుచిరముగను 40.

కం. కనుగవ నశ్రులు నిండఁ ద
గిన విధి స్వస్త్యయనములు ముగించి మఱియు చు
ట్టును దిమ్మరి పిడించెను
ఘనముగ సుతుఁ గౌఁగిలించి కౌసల్య తమిన్ 41.

కం. తల్లి యొనరింప నవ్విధిఁ
దల్లడిలి ప్రదక్షిణములు తనయుఁడు రాముం
డుల్ల మలర జనని చరణ
పల్లవముల నంటి సీత వసతికి నేఁగెన్ 42.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది యైదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 26.

దుఃఖితుఁడుగాఁ గన్పించు రాముని గాంచి సీతాదేవి కారణ మడుగ రాముఁడు తాను రాజుచే
నడవికి నేఁగ బహిష్కృతుఁడై నటులు తెలిపి సీత నయోధ్యలో నుండు మని పల్కుట.

మ. చన నాశీర్వచనమ్ము లీయఁ దగఁ గౌసల్యా సతీ రత్నమే
వన వాసమ్మున కాత్మ నెంచి ధృతినిం బార్థుండు రాముండు పే
జననీ పాదము లంటి మ్రొక్కి నిలువన్ సద్ధర్మ మార్గమ్మునన్
ఘనమౌ రాజపథమ్ము సేరి నడవంగాఁ జాగె సర్వుల్ గనన్ 1.

కం. వెలిఁగించుచుఁ బౌరావలి
విలసిత రాజాధ్వ మంత వీరుఁడు రాముం
డల నిజ గుణాలి జనులఁ గ
దలించుచుఁ జనఁ దొడఁగెను నుత చరిత్రుండే 2.

ఉ. నేరదు సీత యీ కథను స్నిగ్ధ తపస్విని యించుకేనియున్ 3.

మూరఁగఁ చిత్త మందుఁ దలపుల్ నిజ భర్తభిషేచ నార్థముల్
గారవ మొప్పఁ జేసి సుర కాయ సుపూజలు సత్కృతజ్ఞతన్
సేరును రాజధర్మమును నెమ్మిని  పేచుచు నుండె భర్తకై

ఉ. చేరె మహా విభూషితము స్వీయ గృహమ్మును హర్ష యుక్తులౌ
పౌరులు నిండి యుండఁగ నవాబ్జముఖుఁడై చిఱు సిగ్గు తోఁపఁగా
నా రఘురాము నార్త ముఖు నవ్విధిశోక నిమగ్న చిత్తుఁ దా
నారసి వేపమాన యయి యయ్యవనీ సుత లేచి యంతటన్ 4.

కం. సీతను వీక్షించిన ఘన
మౌ తాపము చిత్తమందు నాపఁ దరము గా
కే తా వివృతం బొనరిచె
నా తాపము ధర్మ నిరతుఁ డా రాముఁ డటన్ 5.

కం. వదనమ్ము వర్ణ హీనము
గఁ దనరఁ దనువారి సెలఁగఁగ వదన మందున్
ముదము చెదరం బతిం గని
సుదతి విభూ! యే మిది యనెఁ జోద్యము మీఱన్ 6.

ఆ.వె. ప్రాజ్ఞులు ద్విజవరులు పల్కిరి రాఘువ!
గురువు విభుఁడు కాఁగఁ బరఁగు పుష్య
మి కడు శుభద మంచు వికలపుఁ జిత్తము
న మఱి యుండ నేల నాథ! నేఁడు 7.

ఆ.వె. వంద కమ్ము లలర నందంపు నురుగు ప
గిది వెలుంగు గొడుగు వదన పద్మ
ము పయి నేఁడు నీకు మోద మీయఁగ విరా
జిల్ల దేమి వింత యుల్ల మెరిసె 8.

ఆ.వె. విధు మరాళ రుచుల వెల్గెడు వింజామ
రములు సుందరములు రామ! తామ
రస విలోచను రుచిర ముఖమ్ము నేల వీ
వ నరయ మిట వింత తనరుఁ జుమ్ము 9.

కం. నరవృషభ వంది మాగధ
నర వాక్యజ్ఞులు వొగడఁ గనము స్తోత్రములన్
వర సూత సమేతముగను
గర మాశ్చర్యంబు గాఁగఁ గాకుత్స్థ వరా! 10.

కం. తలపైఁ బెట్టరు వేద
జ్ఞులు విప్రులు తేనె దధులు సురుచిరముగ నీ
తల స్నాతున కేల నిగమ
ములు నుడివిన భంగి నీకుఁ బురుష వరేణ్యా! 11.

కం. కుల ముఖ్యులు మంత్రులు భూ
ష లలర జానపద పౌర సంఘము లకటా
చెలువమ్ముగ నాథా! ని
న్నలరి యనుగమింప రేల యరవిందాక్షా! 12.

తే.గీ. కాంచన విభూషితమ్ములు నంచిత జవ
సత్వ సంపన్నములు భవ్య సైంధవములు
నాల్గు లాగు వరస్యందనమ్ము నాథ!
యేల నీ ముం దడరి చరియింప దిపుడు 13.

కం. పయనింప నీవు పురుష వ
ర! యద్రి కాలాభ్ర నిభము లక్షణ గుణ సం
చయ పూజి తేభ రాజ మ
ది యేల కన్పడదు ముందు ధీరవరేణ్యా! 14.

ఆ.వె. చూడ ముచ్చ టైన సొన్నంపు భద్రాస
నమ్ము నుంచి ముందు సమ్మదముగ
మండితమును నడవ మంజులముగ ముందు
వీర! కాంచ నేను వింత గాను 15.

కం. అభిషేకము సంసిద్ధము
శుభముగ ముఖ వర్ణము గత శోభగ నయ్యెం 16.

బ్రభవింపదు హర్షము శశి
నిభానన! యపూర్వముగను సేరను గతమున్

చం. అని విలపించు చున్న వసుధాత్మజ రాముఁడు గాంచి యిట్లు ప
ల్కె నపుడు సీత నన్నటవికిం జన నానతి నిచ్చె తండ్రి యె
ల్లను వచియింతు సత్కులజ! లాలితధర్మ! సుధర్మ వేదినీ!
వినుమ క్రమమ్ముగాఁ గనిన వింత వివాసము బద్మలోచనా! 17.

మ. నర నాథుండు ప్రతిజ్ఞ నిల్ప రతుఁడున్ నా తల్లి కైకేయికిన్
వర యుగ్మమ్ము నొసంగె మున్ను పిత సంభావ్యుండు నేఁ డింపుగా
ధరణీశుం డభిషేక కార్యముల నుత్సాహమ్ముతో నుండఁగా
వరధర్మంపు నెపమ్ముతో బ్రతినకున్ బద్ధుండునై యోడెనే 18.

ఆ.వె. దండకా వనమున నుండ వలెను బదు
నాలు గేండ్లు నే జనకుని యాజ్ఞ
యౌవరాజ్య మందు ననుజు భరతు నుంచె
మూరి యట్లు గైక గోర రాజు 19.

చం. విజన మరణ్య మేఁగ నిను బేర్మిని వచ్చితిఁ గాంచ నెంచి భూ
మిజ! భరతుండు నిల్వఁగ సమీపములో నను గూర్చి సుద్దు లె
ల్లఁ జనదు పల్కఁ బూరుషులు రమ్యపు టన్య జనస్తవమ్ములన్
నిజముగ సైఁప రెన్నఁడును నీవు స్తుతింపకు నా గుణమ్ములన్ 20.

తే.గీ. మూరి యాసింపఁగ విశేష గౌరవమ్ము
తగదు భరతుని నుండి యతని సమీప
మందు సత మనుకూలపుఁ జందముననను
వర్తిలంగ భవ్య మగును వారిజాక్షి! 21.

ఆ.వె. ఆతనికి నొసంగె యౌవరాజ్యము సనా
తనము రాజు సీత! తగు నతండు
గౌరవింపఁ బడగఁ గాంత! నీ చే మీదు
మిక్కిలి నృపతియును నిక్కముగను 22.

చం. జనకు ప్రతిజ్ఞఁ బాలనము సక్కఁగఁ జేయఁగ నేఁడ యేఁగు వాఁ
డను ధృతిఁ గాన కిప్పుడు దృఢమ్ముగ నుండుమ యో మనస్వినీ
చన ముని సేవితం బగు ఋషమ్మున కేను వ్రతోపవాసముల్
దనరఁగఁ జేయుచుం గడపు తామరసాక్షి! త్వదీయ కాలమున్ 23.

ఉ. వేకువ లేచి యింపుగను వేల్పులఁ గొల్చి యథావిధమ్ముగా
వీఁకను నాదు తండ్రి కిడి ప్రీతిని వందనముల్ ప్రశాస్తకుం
బ్రాకట ధర్మ మెంచి మది రాజ్ఞిఁ గృశాంగిని నాదు మాతనున్
నీ కిల నర్చ నార్హ ననునిత్యము వృద్ధను దన్పు సేవలన్ 24.

తే.గీ. నాదు మాత లితర లెల్ల నలిన నేత్ర!
నీకుఁ బూజ నీయలు సుమ్ము నిత్య మబల!
చెలిమి ననురాగ మింక సేవల జననులు
గాంచ వా రెల్లరు సమలె యంచయాన! 25.

ఆ.వె. భ్రాతృ పుత్ర నిభము భరత శత్రుఘ్నులఁ
జూడఁ దగును నీవు శోభనాంగి
వార లిద్ద ఱెంచఁ బ్రాణమునకు మిన్న
నాకు నిక్కముగను నలిన నయన! 26.

కం. తగ దప్రియమ్ము సేయఁగ
మగండు పుడమికి విభుండు మన కులమునకుం
దగ దేశమున కతని కె
ట్టి గతి భరతున కవనిజ! కడింది బలునకున్ 27.

ఉ. శీలము చేత యత్నయుత సేవల చేతఁ బ్రసన్నులౌదు రీ
నేలను రాజు లెల్లరును నేరఁగ నన్యము కోపగింత్రు చూ
క్రాలఁగఁ గీ డొనర్చు పనులం దనయాలిఁ ద్యజింత్రు నిర్దయన్
మేలి సమర్థులం గనిన మెచ్చి గ్రహింత్రు జనాన్యులం దగన్ 28.

ఆ.వె. రాజున కనుగుణము రమణి వర్తిల్లి యీ
భరతున కిట నుండు భద్ర గతిని
నిలిచి ధర్మ మందు నేర్పునఁ గళ్యాణి! 29.

సత్యమున వ్రతముల నిత్య మలరి

తే.గీ. వెడలెద మహా వనమునకుఁ బ్రియ! వసింపు
మీవు భామ! యిచట నేరి కెట్టి బాధ
కలుగ కుండు నట్టి విధము లలితముగను
నాదు వాక్కులు పాటింప న్యాయ మగును 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది యాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

# సర్గము 27.

రాముని మాటలు విని ప్రేమతోఁ గూడిన కోపముతోఁ దనను గూడ నరణ్యమునకుఁ దీసికొని పొమ్మని కోరుట.

కం. అన విని వైదేహి ప్రియ వ
చన ప్రీతికిఁ బాత్రురాలు సంక్రుద్ధయునై
ఘన మగు ప్రణయమ్మున భ
ర్తను గాంచి పలికె వచనములను శీఘ్రముగన్ 1.

ఆ.వె. ఏమి భాషణమ్ము లివి రాజనందన!
పల్కు దీవు తలఁచి పరమపురుష!
తెలికగను నేను తిరిగి యిట్లపహాస్య
ము లన నే విధముగఁ బలుకు దీవు 2.

తే.గీ. తల్లి తండ్రి భ్రాత సుతుఁడు తనయుని సతి
వారి వారి పుణ్యములను వసుధఁ గొంద్రు
భర్తృ భాగ్యము భార్యయు పడయు నార్య
పుత్ర! వనవాస మట్టులఁ బొందఁ గలను 3.

కం. జనకుఁడు జనని కుమారుఁడు
కనఁ దాను సఖీజనులును గారు గతి యిహ
మ్మునఁ బరము నందు నారీ
జనులకుఁ బతియే యగు గతి సతతము సుమ్మీ 4.

కం. చన నీవు రామ! దుర్గమ
వనికకుఁ గుశ కంటకములఁ బన్నుగ నేఁ ద్రుం
ప నరుగుదు మున్న నిక్కము
గ నేఁడ సంతోషముగ వికసితాబ్జాక్షా! 5.

తే.గీ. త్రాఁగ మిగిలిన నీరమ్ము నాఁగ వీర!
వీడి రోషేర్ష్యముల నటవికి నను గొని
పొమ్ము నిశ్శంక నెమ్మిఁ బాపమ్ము సుంత
యైన నా యందు నెన్నండు నైన లేదు 6.

ఆ.వె. మేడ పైన నైన మింటి పైన నయినఁ
గోట లందు నైనఁ గోమళులకు
సర్వ వేళ లందు సంచరింపఁ దగును
బతి పదముల నీడఁ బత్నుల కిల 7.

ఆ.వె. శిక్షఁ గొంటి నింట నక్షయముగఁ దల్లి
దండ్రులు నుడువంగ ధర్మ వర్త
నమ్ము లందుఁ జెప్ప నా కిచటఁ బని లే
దింత యేని రామ! వింత గాను 8.

చం. అరుగుదు నిర్జనమ్మునకు నా యతి దుర్గమ మైన కానకుం
బరఁగఁగఁ బెక్కు జంతువులు పన్నుగ వ్యాఘ్ర వృకాదు లన్యముల్
గురుగృహ మందుభంగి కడు గూర్మిని నుందు సుఖమ్ము మీఱఁగం
గరము తలంప ముజ్జగముఁ గాంతుని నిన్ను గణించి నిత్యమున్ 9.

తే.గీ. రామ! పాటించి బ్రహ్మ చర్యమ్ము నియతి
నుందుఁ జేయుచు సేవలు సుందరముగ 10.

నీకు మధుగంధ వన మందు నెమ్మి సతము
వీరః నిను గూడి చేయుదు విహరణమ్ము

కం. అడవినిఁ గావంగ సమ
ర్థుఁడ వీవన్య వన జన తతులఁ గావంగం
గడు నిపుణుండవు మఱి నీ
పడతిని నన్నేల నుడువ వలయును నాథా! 11.

కం. క్రన్నన నేఁగుదు నడవికి
నిన్నుం గూడి యిపు డలరి నీరజనయనా!
నన్నాప నశక్యంబౌ
సన్నుత చరితా! యెడంద సంశయ మేలా 12.

కం. ఫల మూలము లనునిత్యము
నల భక్షించుచు వసింతు నట నిశ్శంకం
గలవర మీయను నీ తో
మెలఁగుచు నెన్నండు నీ కమిత్రధ్వంసీ! 13.

తే.గీ. వీత భీతనై నీతోడఁ బ్రీతి నిచ్చ
గింతు గాంచఁగ ధీమంత! సంతసమున
నదులు గిరులు కొలనులు వనమ్ము లెల్ల
నాథ! యెల్లెడలఁ జని యనవరతమ్ము 14.

ఆ.వె. బాతు లంచ లుండఁ బాఱుచు నింపుగఁ
బూసి నట్టి పూలు మూర వెల్గు
సరసు లరయ వీర! సతము నీ తోడుత
నిచ్చగింతు రామ! యెలమి నేను 15.

కం. పాటించి వ్రతములు సతము
వాటముగను స్నాన మేను బరమ ముదమునం
బాటవముగ నొనరింతు మ
హాటవి నీ తోడఁ దనరి యలరుదు వీరా! 16.

కం. సమయం బెఱుంగఁ గడవఁగ
సమలు సహస్రా ధికములు చరియింపఁగ రా
మ! మహిని నీ తోడుత స్వ
ర్గము నైనను గోర నే నరణ్యము నెంతున్ 17.

ఆ.వ స్వర్గ వాస మేను బడసిన రాఘువ!
నీవు లేక యున్న నేను గోర
నెన్నఁ డైనఁ గాని మన్నింప నేరను
దాని నరవరేణ్య! తథ్యముగను 18.

ఉ. ఏఁగుదు నీ యరణ్యమున కెవ్విధి దుర్గమమై చెలంగినన్
నే గజ వాన రాది మృగ నిత్య నివాస విలాసి కింపుగా
వేఁగక నిల్తు నింకఁ బితృవేశ్మము నందు వసించు నట్టులన్
నీ గరిమంపుఁ బాదముల నెమ్మి స్పృశించుచు సంతసమ్మునన్ 19.

తే.గీ. అన్య మెఱుఁగని దాని నీ కంకితాత్మ
దాని నినువీడ మరణమ్ము నేని నెంచు
దాని నీకు బరువు కాని దాని నన్ను
రామ! గొనిపొమ్ము నీ తోడ రాగ మలర 20.

తే.గీ. అవ్విధిఁ బలికినను సీత యనవరతము
ధర్మ మెంచు నరవరుండు ధరణిజఁ గొని
పోవ సమ్మతింపక పల్కె నా వన గమ
నమ్ము నాప నందుఁ గల కష్టమ్ము లెల్ల 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

# సర్గము 28.

రాముఁడు సీత పల్కుల నాలకించి యామె రాకను నిరోధింప నెంచి వన వాస మందు నుండు దుఃఖముల నెల్ల సీతకు విశదపఱచుట.

తే.గీ. ధర్మవత్సల ధర్మజ్ఞ ధర్మ చిత్తుఁ
డంత సీత వాక్యమ్ముల నాలకించి
యడవి నందుండు నిడుమల నాత్మఁ దలఁచి
సీతఁ దోడ్కొని చన నెంచఁ డాతఁడు మది 1.

చం. పలుకుచు సాంత్వనమ్ములను భాష్ప జలావృత నేత్ర సీతతో
లలనకు మాన్పనింపుగ నరణ్యనివాసముఁ బల్కె నిట్టులం
గులవర మందుఁ బుట్టితివి కోమలి ధర్మము నందు నిల్తు వీ
విల నిజ ధర్మ మూని తగ నిత్తఱి నా సుఖ మెంచి నిల్వుమా 2.

ఆ.వె. నా నుడివిన రీతి నారీమణి! చరింప
నబల! తగును సీత! యడవిఁ గలవు
పెక్కు దుఃఖము లవి చక్కఁగఁ జెప్పెద
వినుము శ్రద్ధ తోడ మనము నుంచి 3.

తే.గీ. సీత వీడు మరణ్యముఁ జేరు తలఁపు
డెంద మందు రయమ్మున సుందరాంగి!
పెక్కు దోషమ్ము లగపడు నిక్కముగను
వనము నందు నంచు వచింత్రు జనులు వినుమ 4.

ఆ.వె. సీత! హితముఁ గోరి చెప్పుచుంటి వినుమ
సుఖము కాన రాదు సుంత యైన
సంతతమ్ము నుండు చారులోచన! కాంచ
దుఃఖ మడవి లోనఁ దోరముగను 5.

ఆ.వె. కొండ వాగు లందు నుండు శబ్దమ్ములు
కొండ గుహల నుండు ఘోర సింహ 6.

గర్జనలు వినంగఁ గష్ట మగును గాన
దుర్గమమ్ము  వనము దుఃఖ మయము

ఆ.వె. నిర్జన వన మందు నిర్భీతిఁ దిరుగాడు
క్రూర మత్త వన్య ఘోర మృగ చ
యమ్ము కాంచి నంతఁ బమ్మి మూర్ఛను గాన
దుర్గమమ్ము  వనము దుఃఖ మయము 7.

ఆ.వె. మత్త కరుల కైన నుత్తరింపఁగ రాని
నదులు పంక మయము నక్రయుతము
లై చెలంగు చుండు నందువలన సీత!
దుర్గమమ్ము  వనము దుఃఖ మయము 8.

ఆ.వె. లతలు ముళ్లతో జల విహీనమై చన
నలవి కాని గతులు నఱచు వన్య
కుక్కుటములు మూరు ఘోరముగను గాన
దుర్గమమ్ము  వనము దుఃఖ మయము 9.

ఆ.వె. నేల రాలి నట్టి మేలి యాకుల శయ్య
పైన భూతలమున బాగుగ నల
సి సొలసి నిదురింప సేదతీరును గాన
దుర్గమమ్ము  వనము దుఃఖతరము 10.

ఆ.వె. రే పవళులు సీత! హృదయముఁ దగ నియం
త్రించి తిన వలె ఫల సంచయమ్ము
తరు పతితము సంతతమ్ము తనిసి  గాన
దుర్గమమ్ము  వనము దుఃఖతరము 11.

చం. బలము నెఱింగి చేయఁ దగు భద్రముగా నుపవాస కోటి మై
థిలి! జడ లూన భార మగు దిట్టముగా నిఁక వల్కలాంబర
మ్ములను ధరింపఁగా వలెను బూర్వ సురార్చన లెల్లఁ జేయఁగా
వలె నతిథివ్రజమ్మునకుఁ బ్రాంతర వాసము  దుఃఖ దాయియే 12.

ఆ.వె. నియమమునఁ జరించి నిత్యము కాల కా
లమ్ము లందు నభిషవమ్ము లచట
మూరి చేయ వలయు మువ్మూరు కావున
దుర్గమమ్ము వనము దుఃఖతరము 13.

ఆ.వె. బాల! యేటి స్వయముగా లలితమ్ముగ
నార్ష సమ్మతముగ నతివ! యచట
యార్తవముల వేది కర్పింప వలెఁ గాన
దుర్గమమ్ము వనము దుఃఖ మయము 14.

ఆ.వె. దొరికి నట్టి వానితో నటవీ చరు
లెల్ల తిని మితముగ నుల్ల మందు
సంతసిల్ల వలయు సతము మైథిలి! కాన
దుర్గమమ్ము వనము దుఃఖ మయము 15.

ఆ.వె. మిక్కుటమ్ము గాలి, మీఱుఁ జీకటి, నిత్య
మాకలి భయము లట నత్యధికము
చెలఁగుచుండు సుమ్ము సీత! యందువలన
దుర్గమమ్ము వనము దుఃఖతరము 16.

ఆ.వె. పెక్కు రూపు లైన పెక్కు పుర్వులు పృథ్వి
దర్ప మడర భామ! సర్పరాజ
ములు నిరంతరమ్ము పొంచియుండును గాన
దుర్గమమ్ము వనము దుఃఖతరము 17.

ఆ.వె. వంకరగఁ దిరుగుచు వఱలుచుఁ బాఱెడు
నదులలో వసించు నాగము లట
దారు లందు నిల్చు దారుణముగఁ గాన
దుర్గమమ్ము వనము దుఃఖతరము 18.

ఆ.వె. బాధ లొసఁగు సతము వనమందుఁ దేళ్లు నీ
గలు మిడుతలు కీటకములు దోమ
లన్యము లమితముగ నందువలన సీత! 19.

దుర్గమమ్ము వనము దుఃఖ మయము

ఆ.వె. ఱెల్లు దబ్బ లింక ముళ్ల చెట్టులు కొమ్మ
లు పెనవేసి కొంచు నపరిమితము
చెలఁగుచుండు నచట సీత! యందువలన
దుర్గమమ్ము వనము దుఃఖ మయము 20.

ఆ.వె. కాయమునకుఁ గల్గు కష్టము లవి పెక్కు
భయము లుండు పెక్కవని సుత! నివ
సింప నడవి లోన సీత! యందువలన
దుర్గమమ్ము వనము దుఃఖ మయము 21.

ఆ.వె. కినుక పిసిడితనము మన మందుఁ ద్యజియించి
తపపు బుద్ధి నుంచి తనర వలయు
భయము గొల్పు వేళ భయము తగదు కాన
దుర్గమమ్ము వనము దుఃఖ మయము 22.

ఆ.వె. చాలు నింక వనికిఁ జనుట తగదు నీకుఁ
జింత సేయ సీత! యంతరంగ
మందుఁ గాంతు నడవి యందు దోషమ్ములు
మిక్కుటముగ నేను నిక్కముగను 23.

కం. వనమునకుం గొనిపోవ స
తిని నిష్టపడక పలుకఁగ ధీరుని నా రా
ము నరసి యా వచనమ్ములు
విన నొల్లక దుఃఖిత యయి పెన్మిటి కనియెన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

# సర్గము 29.

రాముని మాటలను విని సీత తిరిగి తన్ను నడవికిఁ గొని పొమ్మని పరిపరి విధముల వేఁడికొనఁగ
రాముఁ డియ్యకొనక సీత నూఱడించుట.

చం. అన విని భర్తృ భాషణము లార్తిత జానకి భాష్పపూర్ణ నే
త్ర నరనికాయ పుంగవుఁడు రాముని తోడ వచించె నిట్టులన్
వనమునఁ గల్గు దోషములు పన్నుగ నీవు వచించి నట్టి వె
ల్ల నగును నీదు స్నేహమున రమ్య గుణమ్ములె యెంచి చూడఁగన్ 1.

చం. మృగములు వ్యాఘ్ర సింహములు మేటి గజమ్ము లగౌకసమ్ములున్
ఖగ చమరమ్ము లన్యములు కానన చారులుపాఱు భీతి తో
డఁ గనని కారణమ్మున ధృఢంపు శరీరుని నిన్ను మున్ను గాం
చఁగ వన మందు నిన్నిపుడు  సర్వులు భీతిలరే దృఢమ్ముగన్ 2.

కం. వన గమనము నీ తోడుత
ననివార్యము నాకు గురుజ నానుజ్ఞను గాం
చిన నీ వియోగ మది క
ల్గినఁ ద్యక్తవ్యము లసువులు రిక్తమ్ము లగున్ 3.

కం. నీ దరి నుండఁగ రామా!
యా దేవేంద్రుండు శక్రుఁ డైనన్ బలిమిన్
వేదన లీయఁగ నాకుం
దాఁ దగునే తలఁచి చూడ ధర్మచరిత్రా! 4.

కం. పతిహీనం బే నారియు
నతులవ్యథను మనఁ జాల దవనిని నా నీ
గతి నీ చే మున్ను నిద
ర్శిత మయ్యెను రాఘవ! నరశేఖర! నాకున్ 5.

ఆ.వె. అదియుఁ గాక పూర్వ మార్యపుత్ర! పితృ గృ
హమున వింటి విప్రు లనఁగ నేను 6.

వననివాస ముండు నని నిక్కముగ నాకుఁ
బ్రాజ్ఞ! సంశయమ్ము వడయఁ దగదు

కం. విని సాముద్రిక విప్ర వ
చనమ్ములను మున్ను రామ సంతస మడరన్
వనవాసార్థోత్సాహం
బున ననవరతమ్ము నుంటిఁ బూర్ణేందుముఖా! 7.

తే.గీ. పొంద వలయు నాదేశము పోవ వనికి
నిన్ననుగమించెద నటకు సేర నన్య
మెద్ది తలఁ దాల్తు నానతి నింపుగ నిజ
మగును ద్విజవాక్కు లిప్పుడు తగిన భంగి 8.

చం. కల వధికమ్ముగా పెతలు కానన మందని నే నెఱుంగుదుం
గలుగును దుర్బలాత్మ నర కాయము నందు నిజమ్ము నెంచఁగం
బలికిరి తాపసీమణులు మాతృ గృహమ్మున నాదు బాల్యమం
దల కల దంచు కాననపు టంచిత వాసము నాకు నత్తఱిన్ 9.

కం. నేఁ గోరఁగ నిను వీఁకను
గాకుత్స్థ పలుమఱు నాకుఁ గరుణ నొసఁగితే
వాకు లలరి నీ తోడుత
నా కానన వాసమునకు నానందముగా 10.

కం. దినములు లెక్కించుచు నే
మనమున నిల్చితిని వన గమన దినమునకై
నిను శూరు ననుగమించుట
వన మందు రుచించు నాకు భద్రమ నీకున్ 11.

తే.గీ. రామ! శుద్ధాత్మ! ప్రేమ నరణ్య మందు
భర్తతోఁ జరియించుచు వర్తిలఁగ వి
కల్మష నగుదు నా కెంచఁ గాంతుఁ డగును
దైవము ధరణి లోన సంతతము కొలువ 12.

మ. మర ణానంతర మైన నాకుఁ దగు రామా నీదు సాంగత్యమే
వర భూదేవులు పుణ్యవంతు లను నీ వాక్యమ్ములన్ వింటిమే
యరయన్ ధాత్రినిఁ దండ్రి ప్రీతి నిజ కన్యా దానముం జేయఁగా
శర ధారా సహితమ్ము తత్సతి యగున్ స్వర్గమ్మునన్ భర్తకే 13.

ఆ.వె. నన్ను నీదు సతినిఁ బన్నుగ నిట నుండి
కొని చనంగ నకట కూర్మి మీఱ
నిచ్చగింప వేల సచ్చరితను బతి
వ్రతను గతన యెద్ది రాఘవేంద్ర! 14.

కం. కొని చన నర్హుఁడవు సతిని
నను సుఖ దుఃఖ సమ దీన నారిని నీ భ
క్తను గొనుదానను నీ వగ
పును సుఖమును సమముగ సతము రఘువరేణ్యా! 15.

ఉ. ఇవ్విధి దుఃఖ తప్తను నరేంద్ర వనమ్మున కీవు నన్ను నా
దవ్వుల కే కతమ్మునను ధర్మ సతిం గొని పోవ కున్నచోఁ
ద్రెవ్వఁగ నగ్నినీర విష మృత్యు ముఖమ్ముల నొక్కటన్ వడిన్
నొ వ్వన కుండఁ జొత్తును నినుం దమిఁ దల్చుచు రాఘవోత్తమా! 16.

కం. విజనం బైన నడవి కవ
నిజను గొని చనంగ నా పునీతుండు మహా
భుజుఁడు తలవండు పల్కుఱు
నిజసతి యాచించు చున్న నిర్ద్వంద్వముగన్ 17.

కం. నయనములఁ గాఱె యశ్రువు
లె యుష్ణ సంపూరితమ్ము లిలయం దెల్లం
బయనింపఁ దొడఁగ వగ పెం
తయుఁ బొందె నవనిజ యెడఁద దారుణ భంగిన్ 18.

ఆ.వె. సీత నంత నట్లు చింతించు తామ్రోష్ఠి
నరసి యాత్మవంతుఁ డా రఘూత్త
ముండు మాన్ప నెంచి మెండుగ నూఱడిం 19.

చె బహువిధముల నర శేఖరుండు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నిరువది తొమ్మిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 30.

సీత రామునితోఁ దిరిగి యడవికిఁ దనను  దీసికొని పొమ్మని పరిపరి విధముల వేఁడ రాముఁడు చివరకు నంగీకరించి సీతను  దన యొక్క వస్తు సంచయమును బ్రాహ్మణులకు దాన మిమ్మని పల్కుట.

ఆ.వె. అనునయింపఁ బడ నిజాత్మనాథుని చేత
జనక తనయ పలికె వన నివాస
మాత్మ నెంచి నిశ్చి తాత్మయై భర్తను
గాంచి భాషణములు పంచఁ జేరి 1.

కం. కరము చలియించి చిత్తము
న రాముని విశాలవక్షు నలినాక్షుని నా
త్మ రుచిర గౌరవ మెల్లఁ ద
నరఁ బ్రణయము మీఱ సీత నాథునిఁ దూఱెన్ 2.

తే.గీ. నాదు తండ్రి వైదేహుఁడు నాథ! నిన్ను
నల్లునిగఁ బొంది యా మిథిలాధిపుండు
రామ! పురుష విగ్రహ మున్న రమణి నకట
యాత్మ యేమని యెంచెనో  యక్కజముగ 3.

తే.గీ. మందు సూర్యునిఁ బోలు నఖండ తేజ
మరయ మీ రఘూత్తము నందు నంచు లోకు
లనఁగ నజ్ఞానమున నది యనృత మగును 4.

రామ! సత్యమ్ము నెంచ నరర్షభ మది

తే.గీ. నన్ను నన్యపరాయణ నారి నేల
విడిచి యేఁగ నెంతువు భయపడఁగఁ గార
ణ మది యెద్ది నీ యీ విషణ్ణమున కేది
హేతువో యెఱుంగ కుంటిని నినకులేశ! 5.

ఆ.వె. మానిత చరితుని ద్యుమత్సేన తనయుని
ఘనుని సత్యవంతు ననుగమించి
సతతము చరియించుసావిత్రిఁ బోలు దా
నిగ నెఱుఁగుమ వశను నీకు వీర! 6.

చం. అనఘ మనస్సునం దయిన నన్యులఁ గాంచను నిన్ను దక్కఁగా
ఘన కులపాంసినీ నిచయ కాంతలఁ బోలను వత్తుఁ గానన
మ్మునకుఁ జిరమ్ము నుంటిఁ గద పుణ్య కుమారిని దార నిట్టు ల
న్య నరుల కీఁ దలంచితివె నట్టువు భంగి స్వయమ్ము రాఘవా! 7.

తే.గీ. అనఘ! యెవ్వని శ్రేయము తనరి పల్కు
చుంటి వెవ్వని కొఱ కీవు వెంట నన్ను
గొని చనంగఁ దల్పవు మదిఁ గూర్మి వాని
వశమున విధేయుఁడ వగు మనిశము రామ! 8.

కం. నను వీడి రామ వనికిం
జన నర్హుఁడ వీవు కావు స్వర్గమ్మున కై
నను దపమున కైనను గా
ననమున కైనను జరింతు నాథా! నీతో 9.

కం. నీ వెంట నేఁగుచుండఁగ
నే విధపు టలసట నేర నింతయు నైనన్
వావిరి విహార శకటము
లో విహరించు గతి నుండు రుచి రాసక్తిన్ 10.

ఆ.వె. మార్గమందుఁ దగులు ప్రూనులు దర్భలు 11.

గడ్డి బొల్లు లింకఁ గంటకములు
దూది పగిది నుండు తోడు నీ వుండఁగ
నాకు కాన కేను  వీఁక సేఁగ

కం. చెలరేఁగి గాలి దుమ్మును
జిలికిన నా పైన రామ! చెన్నుగ దానిం
దలఁతును సుగంధ గంధము
వలె నింపుగ మేని పైన వఱలచు నుండన్ 12.

చం. వని నిదురింప శాద్వలపుఁ బానుపు పైన సుఖమ్ము నాకు మిం
చును మృదు తల్ప మందు నల నోలిన దానికి నెంచి చూడఁగాఁ
గొని స్వయ మీ వొసంగఁ గడు కూర్మిని నల్పము లైన నెక్కు పై
నను ఫల మూల పత్రములు నాకమృ తాభములే గణింపఁగన్ 13.

కం. ఆయా ఋతువుల దొరకెడు
నాయా ఫలపుష్పముల మహానందముతో
నే యనుభవించుచుఁ దలఁప
నా యింటి నిఁక జననీ జనకుల నరేంద్రా! 14.

తే.గీ. అప్రియమ్ము కలుగదు నీ కార్తి యించు
కేని నావలన కలుగ దెట్టి బరువు
కాను స్వర్గము నీ వున్న లేని యెడ న
రకమె కాన నా తోఁ జను రామ! ప్రీతి 15.

కం. నన్ను నవిచారను వనికిఁ
గ్రన్నన నీ తోడుతఁ గొనక వెడలి తేనిన్
మన్నింపక భక్షింతు వి
షాన్నము శత్రువులకు వశమై యుండ నిలన్ 16.

ఆ.వె. విడువఁ బడిన నాథ! యడరఁగ దుఃఖము
జీవిత మది యేల చెపుమ దాని
కన్న నాకు మేలు కాకుత్స్థ! మరణమ్ము
నిక్క మెంచ నింక నీరజాక్ష! 17.

కం. ఒక్క ముహూర్త మయిన నే
నిక్కడ యీ దుఃఖ మెడఁద నెవ్విధి సైపన్
నిక్క మనఁగ నివ్వచనం
బెక్కడి పదు నాలు గేం డ్ల పేలా పలుకన్ 18.

చం. వనరుచు నివ్విధమ్ముగను బాధిత చిత్త కరమ్ము సేరి భ
ర్తను వడిఁ గౌఁగిలించి కొని తద్దయుఁ బెద్ద స్వరమ్ము తోడ నే
డ్చె నపుడు బాణ ఘాత కచ చెన్నునఁ దాఁ జిర మాపి నట్టి పై
న నయన వారి రాల్చెను ఘనం బగు కాష్ఠము వహ్ని భంగినిన్ 19.

తే.గీ. స్పటిక సంకాశ విమల భాష్పములు నేత్ర
యుగము నుండి వైదేహికి నుద్ధృతముగ
రాలె నంత దుఃఖమ్మున రమ్య పంక
జముల నుండి నీ ళ్లన్నియు జాఱి నట్లు 20.

ఆ.వె. నీటను బెకలింప నీరజమ్మును బోలి
యాయతాక్షి కంత నార్తి తోడఁ
జంద్ర నిభ ముఖమ్ము జాఱ భాష్పమ్ములు
వాడె మిక్కుటముగ వన్నె తఱఁగె 21.

కం. తెలివియె లేని విధమ్ముగఁ
గలవర మందు నవనిజను గౌఁగిలి యంతం
బలికెను రాముఁడు నమ్మక
మలవడ ననునయముగ వచ నావలి నిట్లున్ 22.

కం. అలమట మందఁగ నీ వి
ట్టులు స్వర్గమ్ము నయినను విడుతు నిశ్శంకన్
నలువ పగిది నెల్లెడ భయ
మిల లేదు మది నిసుమంత యేనియు దేవీ! 23.

ఉ. చారుముఖీ! త వాశయము చారు తరమ్ము నెఱుంగ కేను గాం
తార నివాస మొల్ల నని ధాత్రిజ! పల్కితిఁ గావ శక్తియే 24.

మూరిన నాకు నీవు ధరఁ బుట్ట మదర్థము కాన కేఁగఁగా
వారణ మెట్లు సేయ నగు భామ! యశమ్ము యశస్వి వీడుసే

తే.గీ. సూర్యుని సువర్చలా సతి సుదతి యనుస
రించు విధ మేను సతము కరినిభ సక్థి!
సతత ధర్మరత విబుధ చరిత పథము
నందుఁ జరియింతు నిశ్శంక నిందు వదన! 25.

చం. వనమున కేఁగ నంచు నని పల్కను నే జనకాత్మజా యిటన్
నను నడిపించు చున్నది ఘనంబును సత్యయుతమ్ము నైన నా
జనకుని వాక్కు ధర్మము వశమ్మున నుండ నతిక్రమించి నే
మినుకులు తల్లిదండ్రు లన మేదిని నుండఁగ నుత్సహింపనే 26.

ఉ. అందని దైవ మెవ్విధిని నర్చన సేయఁగ నొప్పు ధాత్రిలో
నందెడు తల్లిదండ్రులు మహాగురు వుండఁగ నందుపాటులో
నిందుముఖీ! త్రయంబిది గణింపఁ ద్రిలోకసమానమే సుమీ
యెందుఁ బవిత్ర మన్య మది యిద్ధర లే దిది పూజనార్హమే 27.

తే.గీ. జనక సేవ లెప్పగిది నొసఁగు బలమ్ము
నప్పగిది సత్య దాన మానాదు లింక
యజ్ఞ గురుదక్షిణలు నేర వకట యీయ
నెన్నఁ డేనియు జానకి! సన్నుతాంగి! 28.

కం. ధన ధాన్యమ్ములు విద్యా
ఘన సౌఖ్యమ్ములును బుత్రకవ్రాతము లిం
క నభశ్చర లోక మయిన
జనకు ననుసరింపఁ గావు సతి! దుర్లభముల్ 29.

తే.గీ. సేవ మాతాపితలకు రుచిరతరమ్ము
సేసెడు మహాత్ములకు నెల్లఁ జెందు గో జ
గములు దేవ గంధర్వ లోకములు బ్రహ్మ
లోకము లితరమ్ములును సురుచిరముగను 30.

కం. నిజమును నీతి గతుల నిలు
చు జనకుఁ డానతి నొసఁగిన చొప్పున వర్తిం
తు జనక నందన! యయ్యది
నిజమైన సనాతనంపు నీతియె చుమ్మీ 31.

తే.గీ. దండకా వనమున కేఁగు దలఁపు దృఢమె
యంచు నీ తోడ నివసింతు నంచు నీవు
పలుక నినుగొని పోవంగ భామ! సిద్ధ
మైతి నిప్పుడు మైథిలి! ప్రీతి తోడ 32.

కం. వనమున కేఁగంగ జనిం
చిన మదిరేక్షణ! శుభాంగి! చెలువము మీఱం
గ ననుసరింపుమ నన్నిం
క నడరి సహధర్మచరివి కమ్మిల సీతా! 33.

కం. కులమునకు నాకు నీకును
లలనా తగి నట్టి రీతి లావణ్యముగాఁ
జలిపితివి నిర్ణయం బి
ట్టుల నాశ్చర్యమ్ముగాఁ బటుతరంపు ధృతిన్ 34.

కం. మొద లిడుమ శుభశ్రోణీ
తదనుగుణపుఁ బనుల నింకఁ దరలఁగ వనికిన్
సుదతీ నీ వుండని య
ట్టి దివి రుచింపదు నరకపు రేవయె నాకున్ 35.

ఉ. పంచుమ రత్నరాసులను బాఱుల కర్థికి భిక్షు కోటికి
న్మించి యొసంగు మన్నమును నెమ్మి విలంబము వీడు మింక నీ
వంచిత భూషనావలిని నంబర యానము లాట వస్తువుల్
పంచు శయాలి భృత్యులకు బ్రాహ్మణ కోటి కనంతరమ్మునన్ 36.

ఆ.వె. భర్త తోడ తనదు వన గమనమ్మున
కు ననుకూలుఁ డగు టవనిజ యెఱిఁగి
మోద మలర దాన మునకు వేగ ముపక్ర 37.

మించె దేవి యంత నంచితముగ

కం. విని భర్త భాషణమ్ములు
మనస్విని తమిఁ బరిపూర్ణ మానసయు యశ
స్విని ధర్మతత్పరులకున్
ధన రత్నాదుల నొసంగ ధరణిజ తొడఁగెన్ 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 31.

సీతా రాముల సంభాషణము లంతకు మున్ను వచ్చి యున్న లక్ష్మణుఁడు విని తాను గూడ వారితో నరణ్యమునకు వచ్చెదనని వేఁడికొనఁగఁ జివరకు రాముఁ డంగీకరించి వారి యాయుధములను గొని తెమ్మని పలికి సఖులను వీడుకొలిపి తమ సంపదను పంచ సుయజ్ఞునితోఁ గూడి బ్రాహ్మణోత్తములను పిలువమని యానితి నొసఁగుట.

చం. మునుకఁగ నిట్లు వార లట మున్నరుదెంచిన లక్ష్మణుండు భా
ష్ప నయన సంయుతాస్యుఁ డయి శక్యము గాక సహింప శోకమున్
వనరుచుఁ బట్టి పాదములు భ్రాతవి పల్కెను సువ్రతుండు రా
ముని మఱి సీత నారసి సమున్నత వాక్యము లంత నివ్విధిన్ 1.

తే.గీ. వనమునకు గజ మృగఖగ వ్రాత సంచ
రితమునకు నేఁగ నింక నిశ్చితము కాఁగ
ముందు నే నుండ వచ్చెద నంది విల్లు
సంచరింతువు నను గూడి సాను వందు 2.

ఉ. దేవజగంపు టాక్రమము దేవ! రుచింపదు నీవు లేనిచో
నే వర సంపదాదులును నీ యమరత్వము లోక రాసులన్ 3.

నే వరియింప నాఁ బలుక నిశ్చిత బుద్ధి నిజానుజుండు తా
రా వల దంచుఁ బల్కఁ గడు రాముఁడు తమ్ముఁడు పల్కె వెండియున్

కం. అనుమతి నొసఁగితి పూర్వము
నసె వారింపంగ నేల నన్నిప్పుడు వ
త్తు ననంగ నాప కారణ
మును గోరుదు నెఱుఁగ శంక పొడమిన దనఘా! 4.

కం. నిలిచి యెదుట వన గమనము
దలంచి యాచించు వాని తమ్మునినిఁ గృతాం
జలు మును చను వీరుని గని
పలికె మహాతేజుఁడు రఘువరుఁ డిబ్బంగిన్ 5.

మ. చెలిమిన్ మీఱెడు ప్రాణ తుల్యుఁడవు నా శ్రేష్టంపుఁ దమ్ముండవున్
బలవంతుండవు ధర్మ తత్పరుఁడవే వశ్యుండపై నిల్తువే
నిలువన్ నేర్తువు సత్పథమ్మున సఖా నిత్యమ్ము నీవివ్విధిం
జలుపన్ యాత్రను గాతు రెవ్వ రిఁకఁ గౌసల్యా సుమిత్రాదులన్ 6.

తే.గీ. కోరికలు కురియించును మూరి తేజ
మందు భూపతి పర్జన్యు చంద మడరి
కాని లక్ష్మణ! యాతండు కామ పాశ
బద్ధుఁ డయ్యె నకట నేఁడు పార్థివుండు 7.

ఆ.వె. అశ్వపతి నరేంద్రు నాత్మజ కైకేయి
యఖిల రాజ్య మంది యడరు చుండి
సవతులకు నిరత విచార సంతప్తల
కెట్టి మంగళమ్ము లీయ దనుజ! 8.

కం. పడసి భరతుండు రాజ్యము
నడచుచుఁ గైక కనుగుణమున నిరంతరముం
గడు దుఃఖిత కౌసల్యను
బడతి సుమిత్రను మదిఁ దలఁపఁ డని తలంతున్ 9.

ఆ.వె. ఇచట నిలిచి నీవు సుచరిత కౌసల్య
నరసి యుండు మింక నవనిపతి య
నుగ్రహమున నయిన నుతచరిత్ర! స్వయము
గ నయిన భరియింపఁ గార్య మగును 10.

తే.గీ. ధర్మవిద నీకు నాపయి తనరు భక్తి
కిదియ యగు నిదర్శన మెంచ  నివ్విధముగఁ
జేయ గురుజన పూజ లమేయముగను
ధర్మ మతులం బగు ననుజ! తథ్యముగను 11.

కం. ఇవ్విధిఁ జేయుమ లక్ష్మణ
నొవ్వక నా కయి జనని కనుగుణపుఁ బగిదిన్
దవ్వుల కేఁగ మనము వని
కెవ్విధి సుఖ ముండు మాత కింతయు సేనిన్ 12.

కం. అన వాక్యవిదుఁడు రాముఁడు
విని వాక్యజ్ఞుం డనుజుఁడు పేరిమితోఁ బ
ల్కెను లక్ష్మణుండు మెల్లగ
సునిశిత భాషణము లంత సురుచిర రీతిన్ 13.

ఆ.వె. నీదు తేజ మరసి నీరజాక్ష! భరతుం
డనవరతము మించి వినయ మడర
పూజ సేయు నిరతిఁ బుణ్య కౌసల్యా సు
మిత్రల నరమరము మెఱయ దిందు 14.

కం. నను బోలు వేయి మందిని
ఘనముగ భరియింపఁ గలదు కౌసల్య సహ
స్ర నుత జనపదములఁ బడసెఁ
దన బ్రతుకున కట్టి యార్య తథ్యము భ్రాతా! 15.

ఆ.వె. తన్ను నింక నాదు తల్లిని నా బోఁటి
వారి నెల్లఁ దాను బన్నుగ భరి
యింప నోపు నిక్క మెంచ యశస్విని 16.

సందియమ్ము సుంత యిందు లేదు

కం. నన్ననుచరునిగఁ గొమ్మిఁక
నన్న! యిది తలఁప నధర్మ మన రాదు సుమీ
జెన్నుగఁ గృతార్థుఁడ నగుదుఁ
బన్నుగ నీ కార్య మగును వనమున వినుమా 17.

తే.గీ. విల్లు నమ్ములు ధరియించి వెంట నుండి
పాఱ తట్టను గైకొని పథము ముందు
నడచి చూపుదు నింపుగ నడరి నేను
దారిఁ జేయుచుఁ జక్కఁగ గారవమున 18.

ఆ.వె. అలరి నిత్య మేను ఫలములు మూలము
లన్య వన్యములు మహోర్జములు ము
నుల కరణ్య మందు నొవ్వనక గ్రహించి
చక్కఁగ సమకూర్తు నిక్కముగను 19.

తే.గీ. కొండ డెప్పలను సతము కూర్మి తోడ
జానకీ సతి గూడి సంచారముల న
లరుఁడు సర్వ మే నొనరింతు రయము మీఱ
మెలుకువల నిద్ర లందును మీరు తనర 20.

కం. పరమంపు బ్రీతి నొందె వి
ని రాముఁ డా మాటలను గని  నిజానుజు స
త్వరము సఖుల యాజ్ఞను బడ
సి రమ్ము సౌమిత్రి! వనము సేరుట కనియెన్ 21.

చం. జనకుని యజ్ఞ వాటిక నొసంగెఁ దగన్ వరుణుండు తన్మహా
త్మున కల రౌద్ర దర్శనపుఁ దోరపు విల్లు లభేద్య వర్మముల్
ఘనములు నక్షయేషువులు ఖడ్గ యుగమ్ము సువర్ణ దీప్త సూ
ర్య నిభము తూణ రాజములు నర్చితముల్ సతతమ్ము లక్ష్మణా! 22.

కం. అవి యెల్లఁ గలవు సద్గురు 23.

వు వసిష్ఠుని యింట ననుజ పుణ్యాయుధముల్
సవినయ మీ వవి గొని ర
మ్ము వనంబున కేఁగ క్షిప్రముగ సౌమిత్రీ!

తే.గీ. అంత సఖులను వీడ్కొని యటవి కేఁగ
నిశ్చితుండు లక్ష్మణుఁడు మునిగణ ముఖ్యుఁ
డు ఘనుఁ డిక్ష్వాకుల గురు వసఘుని యింటి
కేఁగి యాయుధముల సెల్ల వేగ తెచ్చి 24.

తే.గీ. రాజ వంశ శార్దూలుఁడు లక్ష్మణుండు
మాల్యభూషిత సత్కృత మండి తాయు
ధ నిచయమ్మును జూపించె నినకు లాగ్ర
గణ్యునకు రామునకుఁ జెలఁగంగఁ బ్రీతి 25.

ఆ.వె. ఆత్మవంతుఁ డా మహాత్ముఁడు రాముఁడు
రాఁగ లక్ష్మణుని నరసి వచించెఁ
బ్రీతి సమయమునకు నేతెంచితి వనుజ!
నేను కోరి నట్లు మాననీయ! 26.

ఉ. ఈయఁగ నే దలంచితి మదీయ ధనమ్ము సమస్త మిత్తఱిం
బాయక తాప సావలికి బ్రాహ్మణ కోటికి నీవు నీయఁగా
నీ యెడ భక్తితో గురుల నింపుగఁ గొల్చెడి విప్ర కోటికిన్
నా యెడ నుండు కింకర గణమ్మునకుం దగు రీతి లక్ష్మణా! 27.

తే.గీ. రయముగ కొని రమ్ము సుయజ్ఞు లక్ష్మణా! వ
సిష్ఠ పుత్రు నార్యు ద్విజుల శ్రేష్ఠు నిటకుఁ
జనుదుఁ బూజించి విప్రులఁ జక్కగా ని
తరుల శిష్టులఁ గానకుఁ ద్వరితముగను 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది యొకటవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 32.

రాముని మాట నాలకించి లక్ష్మణుఁడు సుయజ్ఞుని తీసికొని రాఁగ వానికి రాముఁడు దానముల నొసఁగుట. విప్రులకు నితరులకు దానముల నిమ్మని తమ్ముని నాదేశించుట, త్రిజటుఁ డను పేద బ్రాహ్మణునకు నతఁడు దండము విసర నది యేగినంత దనుక నున్న గోవుల నొసఁగుట. విప్ర పుంగవులు రాముని నాశీర్వదించుట.

కం. విని యన్న శాసనమ్మును
ఘన ప్రియమును శుభతరమ్ముఁ గ్రన్నన నేగెం
గన నెంచి సుయజ్ఞు గృహ
మ్మునకు  సుమిత్రా సుతుండు మోదము తోడన్ 1.

చం. కని ద్విజు హోమశాలఁ బరగంగ సుయజ్ఞుని లక్ష్మణుండు ప
ల్కె నొసఁగి వందనమ్ములు సలీల సుదుష్కర కార్య కర్తనుం
గన రఘు రాము రమ్మనుచుఁ గ్రన్నన సంధ్యను వార్చి యాతఁ డం
త ననుసరించె లక్ష్మణునిఁ దజ్జ్వలి తోన్నత రామ శాలకున్ 2.

కం. వచ్చిన వేదవిదు నరసి
చెచ్చెరఁ దా నంజలించి సీతా సతితో
నచ్చపు టగ్నినిఁ గొలిచెడి
పెచ్చున వే తిరిగెఁ జుట్టుఁ బ్రీతి నతనికిన్ 3.

చం. కనక మయంపు టర్ఘ్యములు గైకొను మంగద బాహుభూషలన్
ఘన శుభ కుండలమ్ములను గాంచన సూత్ర మణివ్రజమ్ములన్
వినుత సుయజ్ఞ! రత్నములు పెక్కులు నంచును బూజ సల్పి ప
ల్కెను నిజ దార వాక్కులు సఖిం గని రాఘవుఁ డివ్విధమ్ముగన్ 4.

తే.గీ. సౌమ్య! మిత్రమ! నేఁడు కాంచనపు సూత్ర
మింక హారము నొడ్డాణ మీయఁ దలఁచె
సీత నీదు భార్య కొఱకుఁ బ్రీతి తోడ 5.

నీవు వీని నెల్లఁ గొనుము నెమ్మి తోడ

ఆ.వె. వనమున కరుగుచు నవనిజ కేయూరము
లను బవిత్రములను రమ్యచిత్ర
తరము లంగదములఁ దలఁచె నీయఁగ నీదు
భార్య కెలమి నేఁడు బ్రాహ్మణార్య! 6.

కం. వర రత్న ఖచితపుఁ బఱపు
పరఁగెడు మంచమును గూడ వైదేహి యొసం
గె రయమ్మున మీ యింట న
మరంగఁ జేయఁగను బ్రీతి మాన్యవరేణ్యా! 7.

కం. ఇంకయు మాతులుఁ డిచ్చిన
జంకని శత్రుంజయ మను సామజ వరముం
గొంకక సహస్ర నాగము
లంకమ్మున నుండ నిత్తు నార్యా! గొనుమా 8.

కం. కడు ప్రీతి సుయజ్ఞుండు ఘ
నుఁడు సీతారామలక్ష్మణుల కొసఁగెను దా
నడరి తగు దీవనలు రా
ముఁ డనఁగ నివ్విధి గ్రహించి ముదముగ నంతన్ 9.

కం. దేవాధీశుని తోడుత
నా వాగీశుఁడు వలికన యట్టి విధము స్వీ
యా వరజు లక్ష్మణుఁ బ్రియునిఁ
దా వీక్షించి యవిచారుఁ దగ రాముఁ డనెన్ 10.

తే.గీ. కౌశి కాగస్త్యు లుభయుల గౌరవముగఁ
బిలిచి విప్రవరేణ్యులఁ బ్రీతి రత్న
రాసు లర్పించి పూజింపు రమ్య సస్య
ములను దోయమ్ముల పగిది నలరి యనుజ! 11.

ఆ.వె. వెండి పసిడి మణుల దండిగ ధనముల 12.

గోసహస్రములను గూర్మి వారి
కిరువుర కెదఁ దనియ నిమ్ము మానద! మహా
బాహు! వేగ మిపుడు బహుళముగను

మ. పర మాచార్యుఁడు తైత్తిరీయులకు సద్భక్తుండు కౌసల్యకుం
గురు వాశీస్సుల నిచ్చు వేద విదుఁ డుద్ఘోషుండు నవ్వానికిన్
వర యానమ్ముల నింక దాసుల బృహద్వస్త్రాలి కౌశేయముల్
కర మా విప్రునిఁ దన్పు మిచ్చి బహు సత్కారమ్ములన్ లక్ష్మణా! 13.

తే.గీ. సచివుఁడు మన జనకునకుఁ జాల కాల
ముండె మనవద్ద ఘనుఁడు సూతుండు చిత్ర
రథుఁ దనుపు గో సహస్రముల మఱి లేగ
ల నొసఁగి మణి వస్త్ర ధనముల నధికముగ 14.

ఉ. తాపసు లైన యీ వటులు తద్దయు భక్తి కఠుండు నింక కా
లాపుఁడు చెప్పి నట్టి శ్రుతులం బఠియించుచు నన్య మెద్దియుం
దోఁపమి చేత సోమరులు తుష్టులు తింటను విజ్ఞ సమ్మతుల్
కాపుగ తేరు లెన్బది సకాంచన రత్నము లిచ్చి వెండియున్ 15.

ఆ.వె. వేయి వడ్ల బండ్లు వృషభమ్ములు శతద్వ
యమ్ము నొసఁగి యింక నెమ్మి వ్యంజ
నార్థముగను వేయి యావుల నిమ్ము సౌ
మిత్రి! వారి కెల్ల మేలు నెంచి 16.

ఆ.వె. సేవ లొసఁగు చుండిరే వట కోటి కౌ
సల్య చెంత నుండి సంతతమ్ము
వారి కీ వొసంగు ప్రత్యేకముగ వేయి
వేయి గోవు లిపుడు ప్రీతిఁ జెంద 17.

తే.గీ. అంబ కౌసల్య హర్షించు నట్టి విధము
నాదు దానమ్ము లరసి ఘనమ్ముగాను
లక్ష్మణ ద్విజుల నెల్లర రమ్య రీతి
నర్చ సేయు మెల్ల విధుల నాదరమున 18.

తే.గీ. అంత లక్ష్మణుండు పురుష వ్యాఘ్రుఁడు స్వయ
ముగ యథోక్త రీతిని హర్షమున ధరా సు
రాగ్ర గణ్యులకు ధన చయమ్ము నెల్లఁ
బంచెఁ బోలి కుబేరుని నంచితముగ 19.

తే.గీ. భాష్ప గద్గద కంఠులు భటులు భృత్యు
లచట నిలువ వీక్షించి నిజాశ్రితులను
రాముఁ డొక్కొక్కరికి ధనరాశిఁ బంచి
పల్కె నివ్విధి నింపుగ వారి తోడ 20.

ఆ.వె. మఱలి వచ్చు వఱకు మాదు వేశ్మమ్మును
లక్ష్మణుని గృహము సురక్షితముగ
నుంచ మీదు కార్య మెంచఁ బరమ వీరు
లార యంచితముగ భార మూని 21.

చం. పలికి నిజోపజీవులను భార మనస్కులఁ గాంచి యివ్విధిం
బిలిచి ధనాధినాథ వరు విత్తము తెమ్మని పంచె సర్వముం
బలువురు తేర విత్తమును బన్నుగఁ గన్పడె విత్త రాశియే
మిలమిల వెల్గు లీను చట మేదిని నుంచఁగ నద్భుతమ్ముగన్ 22.

చం. ద్విజులకు బాల వృద్ధులకుఁ బేదల కెల్ల సలక్ష్మణుండునై
సుజన వరుండు రాఘవుఁడు చోద్యము మీఱఁగఁ బంచె విత్తముం
ద్రిజటుఁడు నా ధరామరుఁడు దివ్యపు గార్గ్య కులుం డొకం డటన్
భుజమునఁ బాఱ నాఁగళుల మోసి గడించును నేలఁ ద్రవ్వుచున్ 23.

తే.గీ. వృద్ధుఁ ద్రిజటు నరసి భార్య పేదరికపు
బాధ ననుభవించుచు నంతఁ బతినిఁ జేరి
తరుణి సుతులను జూపి యతనికిఁ బలికె
నిట్టు లప్పుడు వచనమ్ము లింపుగాను 24.

ఆ.వె. వీడి గొడ్డలి నిఁకఁ బాడు పాఱను నాథ!
కాంచు రాము నించుక యతఁ డొసఁగు 25.

నాదు మాటను విని మేదినీశ సుతుని
నిత్య ధర్మ రతుని నెమ్మి తోడ

కం. విని భార్య మాటలు ద్విజుఁడు
చనె నలిఁగిన వస్త్ర మూని సంభ్రమమునఁ జ
క్కని మార్గ మెంచి రామ స
దనమునకు రయముగ నంత దారానుజ్ఞన్ 26.

కం. త్రిజటుని భృగు వంగిరసుల
నిజ తేజమున నలరు ఘనుని ద్విజోత్తముఁ డొ
ట జనులు పంచమ కక్ష్యకు
ను జనిన వారింప లే దనువుగ గమించెన్ 27.

తే.గీ. రాజపుత్రునిఁ గదిసి ధరామరుండు
పలికెఁ ద్రిజటుఁడు పేదను బార్థివాత్మ
జా! యశస్వి! సుతులు పెక్కు రయ్య యుంఛ
వృత్తి నుందు నన్ను గనుమ విప్రు దయను 28.

మ. పరిహాసమ్ము స్ఫురింప రాముఁ డనె విప్రశ్రేష్ఠు వీక్షించుచున్
ధరణీదేవ సహస్ర గోవులును నే దానంబు నీ కుంటినే
కర వీర్యమ్మున దండమున్ విసరు తత్కాష్ఠంపు దూరమ్ములోఁ
బరివేష్టించిన గోవు లెల్లఁ దగ నీ పాలే ప్రయత్నింపుమా 29.

కం. నా విని విప్ర శ్రేష్ఠుఁడు
పే వస్త్రము కట్టి కటికి విసరెన్ శక్తిన్
వేవేగ దండ మంతన్
భావోద్రేకమ్ము మీఱఁ బంతము తోడన్ 30.

తే.గీ. అంత దండము వీక్షింప హస్త లాఘ
వమున నా సరయూనదీ పారము వడి
దాటి వేవేల యాల మంద నడుమఁ బడెఁ
జక్కఁగ వృషభ రాజము సరస వింత 31.

తే.గీ. రాముఁ డంత ధర్మాత్ముఁడు ప్రేమఁ గౌఁగి
లించికొని విప్రవరుని రప్పించి గోప
కులను సరయూ తటిని నున్న గోగణమ్ము
నెల్లఁ బంపించెఁ ద్రిజటుని యింటి కడకు 32.

తే.గీ. ఊఱడించి గార్గ్యునిఁ గోప మూన వలదు
ధరణిసుర! హాస్యమున కంటి నరయ నెంచి
నీదు తేజము మీఱ రాని దని తెలిసె
నడుగు మన్య మెంచిన నిత్తు నాదరమున 33.

చం. పలుకుచు నుంటి సత్యముగ బ్రాహ్మణ సత్తము హద్దు లేదు నీ
కిల వరియింపఁగా నితర మెద్దియు నా ధన మెల్ల నెంచ వి
ప్రుల కయి యొప్పు నింపుగను మూరి యొసంగిన నార్జితమ్మునున్
వెలయు యశస్కరమ్ముగను బ్రీతిదమై తనరారి నిత్యమున్ 34.

తే.గీ. గోవుల ననేకము వడసి యా వర ముని
త్రిజటుఁడు సభార్య ముద మంది ప్రీతి కీర్తి
బలము సౌఖ్యము నభివృద్ధి కలుగు రీతి
రాము నాశీర్వదించెను రమ్యముగను 35.

ఆ.వె. తనిసి నట్టి చిత్తమున రాముఁడు నిజ మ
హా ధనమ్ము నెల్ల నార్జితమ్ము
ధర్మబలముననను నుత యుతార్థ గిర చోది
తమ్ము పంచె మిత్ర తతి కచిరము 36.

తే.గీ. అర్ఘ సమ్మాన భవ్య దానాదులం ద
నియని వారు సుహృద్విప్ర నిచయ భృత్య
వర్గ భిక్షుగణ దరిద్ర పర్వ మందు
నొక్కరును లేరు లెక్కింప నిక్కముగను 37.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 33.

సకల సంపద నర్థులకు దానము చేసి రామ లక్ష్మణులు సీతతోఁ గూడి దశరథునిఁ గాంచుటకు
నేఁగు వేళ దారిలో బౌరుల సంభాషణముల నాలకించుట. జనకు గృహము చేరి రాముఁడు
సుమంత్రుని రాజునకుఁ దన రాకను తెలుప మనుట.

తే.గీ. రాముఁ డవ్విధి వైదేహి రమణి తోడ
నిజ ధనమ్ము నొసఁగ ధరణి సురుల కిఁకఁ
జనిరి సీతతో రామలక్ష్మణులు గాంచఁ
దండ్రి నానతిఁ గైకొనఁ దలఁచి యంత 1.

ఉ. హారము లింక దామముల నా యవనీసుత కట్ట నింపుగాఁ
దోరము పెల్ల నాయుధపు దోయి ధరింపఁగ రామలక్ష్మణుల్
మూరి చరించు చుండఁగ సమున్నత బాహులు రాజ వీథినిన్
వారట వెల్గి రింపుగ నపారము దుస్సహ కాంతు లీనఁగా 2.

తే.గీ. ఇండ్లు మిద్దెలు మేడల నెక్కి పైకి
జనులు శ్రీమంతు లప్పుడు మనము లందు
నావహింప విచారము త్రోవఁ గనిరి
రామలక్ష్మణ ధరణిజలఁ జనుచుండ 3.

కం. దీనులు వీథులు జనముల
తో నిండ నడవఁగ రాక తోరముగ నహో
యా నృప సుతు రాఘువుని మ
హా నిల యాగ్రమ్ము లెక్కి యరసిరి వగలన్ 4.

ఆ.వె. ఛత్ర రాజమును విసర్జించి యక్కట
నడక నేఁగు చున్న నరవరేణ్యు
రాము నరసి జనులు భీమ శోకార్తులు
బహు విధ వచనములు పల్కి రెల్ల 5.

తే.గీ. ఏఁగఁగఁ జతురంగ బలము లెవ్వని వెను
క నడరి చను నవ్వాని నకట యొకండ
నేఁడు సౌమిత్రి సీతను నెలఁతఁ గూడి
కనుఁడు వెంట నరుగు చుండెఁ గలఁత తోడ 6.

తే.గీ. అనుభవించుచు సంపద లర్థి జనుల
కిచ్చుఁ గోరికలను రాముఁ డెలమి సతము
ధర్మ మందు గౌరవమునఁ దండ్రి నన్నృత
వాక్కుఁ జేయంగ నొల్లఁడు చిక్కు లున్న 7.

ఆ.వె. మున్ను నింగి నేఁగు భూతముల కయినఁ
గాన రాని యట్టి జానకీ స
తినిఁ బురుషులు నేడు ఘన రాజ వీథిని
నేఁగు వారు చూతు రిచట యకట 8.

కం. తగు మైపూతల కెబ్జని
దగు చందన మలదు సీత తథ్యముగ నగున్
విగత నిజ గాత్ర వర్ణిని
గఁ గదలి చలి వాన నెండఁ గమలి భృశముగన్ 9.

ఉ. తోరపు సత్త్వమే దశరథుం గవియం ద్రుటి నిట్టి మాటలన్
వారక పల్కుచుండెఁ గద పార్థుఁడు పుత్రు బహిష్కరింపఁగా
ధీరుని నర్హుఁడే యకట దిట్ట గుణమ్ములు లేక యున్ననున్
మూరిన వృత్తి నెగ్గ జగముం దనయుండు వచింప నేలనో 10.

ఆ.వె. క్రూర మెఱుఁగమి దయ కూర్మి వినుటయు శీ
లమ్ము దమము శమము పమ్మి యుండు
రాము నందు నాఱు రమ్యంపు గుణములు
నరవరేణ్యు నందు నాణ్యముగను 11.

కం. అందువలన శిక్షింపఁగ
నెందేని రఘుకులవార్ధి కిందుని గ్రీష్మం 12.

బందు జల ముడుగఁ దాపము
నొందు జలచరముల భంగి నుడుకరె జనులున్

కం. జగతీపతి పీడ వలన
జగ మంతయుఁ బీడిత మగుఁ జక్కని పేరే
తెగ ఫలపుష్ప సమావృత
నగ రాజపు సన్నిభము ఘనమ్ముగ నింకన్ 13.

ఉ. మానవ జాతి మూల మగు మానిత కాంతిని ధర్మసారుఁడే
యీ నృపవరుండు రాముఁ డిల నెంచఁగ నన్యులు శాఖ లింక నా
సూన ఫలాదు లౌదురు విశుద్ధుఁడు లక్ష్మణు భంగి దార స
త్సూను సబాంధ వాదులను దోడ్కొని పోదము రాఘవేంద్రుతో 14.

కం. పొలము లుపవనమ్ములు గృహ
ములెల్లఁ ద్యజియించి దుఃఖముల సుఖముల సే
వల నయిన సమముగ మనము
చలిపెద మా రాము తోడ సహగమనంబే 15.

సీ. సంగ్రహించిన నిధి సంపదల లయంపు వాకిళ్లఁ గైకొన్న వడ్ల దుడ్ల
నపహృత సకల సారాదుల నవకీర్ణ భస్మ సంచయముల వర్జి తామ
రావలి వెడలి బి లాదులు తిరుగాడు మూషిక వ్రాత సమున్నతముల
వీత ధూమోదక విలసితముల హీన మార్జనముల నహోమ జప తతులఁ

తే.గీ. గలవు వేళలఁ బోలె భగ్నమయి నట్టి
పాత్ర లెల్లఁ జెదరి యుండ వదల మనము
నిలిచి యున్న గృహమ్ముల నెలఁత కైక
నడరి పొంద నిం డిఁక ముద మడర నెడఁద 16.

ఆ.వె. రాముఁ డేఁగ వనము రంజిలు నగరమ్ము
భంగి రమ్యముగను బరఁగి సతము
మనము వీడినట్టి ఘన నగరం బింక
నగును గాననమ్ము పగిది యిపుడు 17.

తే.గీ. బొఱియలను దంష్ట్రులు విహగములు మృగములు 18.

సానువులను సింహ కరులు కాననమును
వీడి మన భీతిని మనము వీడి నట్టి
మన గృహముల నవి కదిసి మనును గాక

ఉ. క్రూర మృగ ద్విజ వ్రజము కూర్మి ఫలార్జున మాంస భోక్తలే
మూరు పురమ్ము నింపుగను బొందు సపుత్ర సబాంధవమ్ముగా
ధారుణిఁ గైక గోత్రమునఁ దప్పక రామునితో వసింతు మే
దారుణ మొంద కుండగను తథ్యముగా మన మింక నెమ్మినిన్ 19.

కం. వచనము లివ్విధి నానా
సుచలిత జన భాషణము లచోదిత గిరలే
యచట వినఁ బడఁగ రాముం
డచిలిత నిజ చిత్తుఁ డాయె నాశ్చర్యముగన్ 20.

ఆ.వె. అంత నతఁడు కదిసె నరయ దూరము నుండి
వెండి కొండ కొమ్ము విధ మగపడు
తండ్రి గృహ వరమ్ము ధర్మాత్ముఁడు మద గ
జ నిభ విక్రముండు చారు యశుఁడు 21.

కం. కనెఁ జేరి రాముఁడు సుమం
త్రుని నతి దీనముగ నున్న తోరంపు విచా
రుని శిక్షిత వీర పురుష
ఘన రక్షిత రాజవర నికాయము చెంతన్ 22.

తే.గీ. ఆర్త జనుల నచ్చోటఁ దా నరసియు రఘు
రాముఁ డవ్యగ్ర రూపుఁడై రంజిలి దర
హాస మగపడఁ బిత్రాజ్ఞ నాచరింప
జనకుఁ గాంచఁ బ్రవేసించెఁ జక్కఁగాను 23.

తే.గీ. ముందు వని కేఁగ నిక్ష్వాకు పుణ్య వంశ
సంభవుం డార్త వదను సచ్చరితు నా సు
మంత్రు నరసి తనదు రాక మాటఁ దెలుప
రాజునకుఁ దండ్రికి నిలిచె రాముఁ డెదుట 24.

తే.గీ. జనకు నానతి వన మేఁగ మనము నందు
నిశ్చయించి ధర్మరతుఁడు నృపున కిపుడు
తనదు రాకఁ దెలుపు మంచుఁ గని సుమంత్రుఁ
బల్కె రాఘవుఁ డవికార భావమునను 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది మూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 34.

సీతా రామలక్ష్మణులు దశరథునిఁ గాంచి యడవి కేఁగ ననుమతినిఁ గోర రాజపత్నుల సమక్షమున దశరథుడు మూర్ఛిల్లి పిదప నాఁటి రాత్రికిఁ దల్లితోఁ దనతో నుండి మరునాఁ డేఁగ మనిన నది ధర్మము కాదని పలికి తత్క్షణ మేఁగుటకు సీతకు లక్ష్మణునకుఁ దనతో నడవి కేఁగుటకు ననుమతినిఁ గోర ననునుమతి నొసఁగి విలపింప రాముఁ డనునయ వాక్కులు పలికిన దశరథుఁడు శోకమున రామునిఁ గౌఁగిలించుకొని తిరిగి మూర్ఛిల్లిన రాణులు నందఱు గొల్లుమని రోదించుట. సుమంత్రుఁడు కూడ యేడ్చి మూర్ఛిల్లుట.

కం. అంతఁ గమల పత్రాక్షుఁడు
చెంతఁ గల సుమంత్రుఁ గాంచి శీఘ్రము నా రా
జాంతికపు రాక చని జా
గింతయు లేక వచియింపు మిఁక నాఁ బలికెన్ 1.

చం. కొని రఘురాము నానతినిఁ గుందు మనమ్మున నా సుమంత్రుఁ డేఁ
గి నృపుని నిశ్వసించు పతి ఖేద నిమగ్నునిఁ గాంచె సూతుఁ డం
త నివురు గప్ప నిల్చిన యుదర్చినిఁ బోలుచుఁ దోయ హీన ప
ద్మనిఁ దలపించి గ్రస్త రవి తీరునఁ గన్పడు రాఘవేంద్రునిన్ 2.

తే.గీ. ప్రాజ్ఞుఁ డా సూతుఁ డట రఘురామునే త
లంచు వ్యాకులి తేంద్రు నరసి సభక్తి
రాజు నంజలించి మొదటఁ దా జయమ్ము
వల్కి మెల్లగ ననె భీతి వాక్కు లిట్లు 3.

తే.గీ. ధన మొసంగి బ్రాహ్మణులకుఁ దదితర పరి
చారకులకు నిలిచెఁ బురుషర్షభుండు
నీదు తనయుండు రాముఁడు నీరజాక్షుఁ
డిచట ద్వారమం దరయ రాజేంద్ర! నిన్ను 4.

తే.గీ. వీడుకొలిపి సఖుల నెల్ల వీరవరుఁడు
రాముఁడు నిను గాంచఁ దలఁచె రాజ! కరుణ
రాజసుతునకు సత్యపరాక్రమునకు
నిమ్మనుజ్ఞను గలుగు  భద్రమ్ము నీకు 5.

కం. పురుషర్షభుండు రాజ గు
ణ రత్న నిచయాంకుఁడు కిరణ చయ వృత దివా
కర సన్నిభుండు తాఁ జను
నరణ్యమున కరసి నిన్ను నవనీనాథా! 6.

కం. గగనము వలె నిష్పంకుఁడు
తగ గాంభీర్యమ్మునం దుదధి సన్నిభుఁడున్
జగదీశుఁడు సత్య వచనుఁ
డు గని సచివు ధర్మచిత్తుఁడు వలికె నిట్లున్ 7.

ఆ.వె. ఎవ్వ రిచట నున్న నిటకు నా దారల
నెల్లర గొని రమ్మ యీ సతీ ప
రివృత మేను నరవరిష్ఠు ధార్మికు సుతు
నిఁ గన నెంతు రాముని సుమంత్ర! 8.

కం. చని యంతఃపురమున కం
త నతఁడు రాణులను గాంచి ధరణీపతి పి
ల్చెను దేవులార మిమ్ములఁ
జనుండు గన నాథు వలదు జా గని పలికెన్ 9.

కం. అన నా సుమంత్రుఁ డివ్విధి
జననాథుని యాజ్ఞ నపుడు చాగిరి చేరన్
ఘన సౌధము పతి యానతి
వనితామణు లెల్ల నెఱిఁగి వారక యంతన్ 10.

తే.గీ. అందు మున్నూరు నేఁబది మంది సతులు
వెంట నుండి కౌసల్యకు వెడలఁ దొడఁగి
రంత మెల్లగఁ తామ్రనయనలు ధృతపు
వ్రతలు ప్రమదలు తలఁదాల్చిరాజు నాజ్ఞ 11.

ఉ. దారలఁ గాంచి రాఁగ నట దత్క్షణ మాత్మజు సూత యేఁగి పే
తేరుమ నాదు సన్నిధికి ధీరుని నాఁ బనుపన్ సుమంత్రునిన్
వారిని రామలక్ష్మణులఁ బన్నుగఁ దెచ్చెను సీత తోడుతం
జేరెను దాను గూడ నృపు చెంతకు సూతుఁడు సత్వరమ్ముగన్ 12.

తే.గీ. తన్ను జేరు కృతాంజలుఁ దనయుఁ గాంచి
దూరమున లేచి దిగ్గున దొడ్డ యాస
నమ్ము నుండి నారుల మధ్య పమ్మి పాఱి
పడెను రాజు సేరక మున్న పుడమి మూర్ఛ 13.

ఆ.వె. రాముఁ డంత మఱియు లక్ష్మణుండు మహార
థుండు తూర్ణముగ నృపుండు వగపు
చేతఁ దెలివి చనిన చెన్నునఁ బడఁ గాంచి
బర్వులిడిరి జనకు వద్ద కపుడు 14.

కం. చెలఁగె వనితామణుల యే
డ్పులు హా రామా యటంచుఁ బుడమిపు నింటం
గలిసి విభూషణముల రవ
ములతోఁ బెల్లుగను మాఱు మ్రోగుచు నంతన్ 15.

తే.గీ. రామలక్ష్మణు లిద్దఱు రాజు నంత
బాహువుల కౌఁగిలించి యవనిజ తోడ్ప
డంగఁ దల్పము నందుఁ జక్కంగ నుంచి
రతఁడు విలపించు చుండంగ నార్తి భృశము 16.

కం. వగపు కడలిని మునింగిన
జగ మగఁడు ముహూర్త మందు సంజ్ఞఁ బడయఁ గాం
చి గురుని రాముఁడు ప్రాంజలిఁ
దగు విధముగఁ బల్కె నిట్లు ధర్మాత్మునితో 17.

చం. అరుగఁగ దండ కాటవికి నానతి నిమ్మని వేఁడ వచ్చితిన్
నరపతి! మాకు నెల్లరకు నాథుఁడ వీవు శుభంపు దృష్టితో
నరయుము మమ్ము సీతయు మహాత్ముఁడు లక్ష్మణుఁ డేఁగుదెంచఁగా
వరము నొసంగు కూడ దని పల్కిన నొల్లక యుండి రెవ్విధిన్ 18.

తే.గీ. వీడు శోకము నెల్లను విశ్వమాన్య!
నన్నుసీతను లక్ష్మణుఁ జెన్నుగను వ
నమున కేఁగ ననుమతింపు నలువ తనదు
ప్రజల శాసించు రీతినిఁ బార్థివేంద్ర! 19.

కం. వనమున కేఁగుట కానతి
వనరక నృపు నుండి పేచు వానినిఁ బుత్రుం
గని పృథివీపతి తాఁ బ
ల్కెను దశరథుఁ డివ్విధము చలించి భృశముగన్ 20.

ఉ. రామ రఘూధ్వహ ప్రవర రామకుఁ గైకకు నే నొసంగఁగాఁ
గామితముల్ వరమ్ములను గందితి మోహ వశుండనై యిటన్
భూమిని నేలు మీవు నను బుత్రక! బంధితుఁ జేసి నేఁడు నీ
భీమ పరాక్ర మోద్ధతిని బ్రీతి నయోధ్యను నిల్చి యింపుగన్ 21.

కం. ఎన్నఁగ ధర్మోద్ధరణుల
మిన్నయు రాముండు తండ్రి మినుకల విని తాఁ
గ్రన్ననఁ గేల్మోడ్చి పలికె
నన్నర పతిఁ గాంచి యంత నతి నైపుణినిన్ 22.

ఆ.వె. రాజ వేయి వత్సరముల కీవ పుడమి
పతివి నే వసింతు వనము నందు
నిశ్చయముగ నింక నీవు నా వలనఁ గా
రా దసత్యవాది రాజ సింహ! 23.

తే.గీ. వనినిఁ బదునాలు గేండ్లు నివాస ముండి
తిరిగి వచ్చెద నంతఁ బ్రతిజ్ఞ పూర్తి
సేసి రాజశార్దూల యచిరము నీదు
పాద పద్మముల స్పృశింప మోదముగను 24.

తే.గీ. సత్యమునకు బద్ధుండునై సత్యవాది
కైక చేత చోదితుఁడునై గాసిలి కర
ము విలపించుచుఁ బల్కెను బుత్రుఁ గాంచి
ప్రియతముని నంత మిక్కిలి ప్రేమ తోడ 25.

తే.గీ. వెడలు మింపుగ నందన వెతలు లేక
తిరిగి రాక కెలమి శుభాతిశయము లడ
రంగఁ గలుగ శ్రేయమ్ము లభంగముగను
వృద్ధి చెలఁగంగ దారుల భీతి లేక 26.

కం. నిను వారింప నశక్యము
మన ముందును ధర్మమందు మసలుచు నీకున్
ఘనుఁడవు సత్యాత్ముఁడవు ర
ఘునందన! తలంప నీవు కూరిమి పుత్రా! 27.

ఆ.వె. నేటి రాత్రి కిచట నిలువుమ యెవ్విధి
నైనఁ బోవ వలదు కాన కీవు
సంతస మడరంగఁ జరియింతు నొక్క ది
నంపు దర్శనమ్మున నయిన సుత! 28.

ఆ.వె. తల్లి నింక నన్ను దనయ! వీక్షించుచు
నేఁటి నిశను జక్క నిల్చి తనిసి
సకల వాంఛితములఁ జన నర్హుఁడవు రామ!
యింకఁ గాననమున కెల్లి నీవు 29.

తే.గీ. సతము దుష్కరతర కర్మ సంచయమ్ము
సేయ విశ్రుతుండవు రామ! చేర నెంతు
విజన వనమున కొనరింపఁ బ్రియము నాకు
వీడి యిట నెల్లరను నీదు పేర్మి జనుల 30.

ఉ. అప్రియ మొట్టు నీపయిన నాత్మజ! యియ్యది యెల్ల నాకు నే
క్షిప్రము మోసపోయితి నిసీ యొక ఛన్నశిఖి ప్రభా నికా
శప్రమదా నిమిత్తమున శార్య విపత్తు లబింపఁ గైకయీ
సుప్రచుర ప్రచోదితము చోద్యముగా నిటు తీర్ప నెంతుపే 31.

కం. ఇది కర మాశ్చర్యము కద
మది నెంచుట జ్యేష్ఠ సుతుఁడు మానక తండ్రిం
బదిలమ్ముగ విగ తాన్నృతు
నిఁ దనరి చేయంగ నిట్లు నీరజనేత్రా! 32.

కం. పర మార్తుని జనకుని యా
గిరలను విని రాముఁడు పరికించి యనుజతో
నరపతిని దీనముగ ననె 33.

నరపుంగవుఁ డిట్లు వచన నైపుణ్యుండే

కం. ఎవ్వ రొసంగెద రిప్పటి
యివ్వర గుణ కోటి నెల్లి యిక్కతమున నే
నవ్వన మేఁగఁ దలంచెద
నెవ్విధమున నైన వీడి యీప్సిత రాశిన్ 34.

చం. నరవర యిమ్ము భూమి  సజన ద్రవి ణాయత ధాన్య రాష్ట్రముల్
భరతున కేఁ దృజించినది పన్నుగ నా వన వాస బుద్ధి నా
దరమున వీడఁ జాలను ముదమ్మునఁ గైకకు నిచ్చి నట్టి వౌ
వరముల నిప్డు ప్రీతి నిడి భామకు వెల్గుమ సత్యవాదివై 35.

తే.గీ. నేను మీ యాజ్ఞఁ బాటించి కాననమ్ము
నందుఁ బదునాల్గు వర్షమ్ము లుందు వన చ
రాళి గూడి యథోక్తమ యడుగ రాజ్య
ము వగ పుడిగి భరతునకుఁ బుడమి నిండు 36.

ఆ.వె. కోర నెట్టి సుఖము లే రీతి చిత్తమ్ము
నందు నేను నిశ్చయముగ నీవు
పంచి నట్టి రీతి మించి చేయఁ బ్రియము
కల్గు నాకు వాని కన్న మిన్న 37.

చం. తొలఁగును గాక నీకు వగ తూర్ణము పెట్టకు కంట నీటినిన్
జలధి నదీ విభుం డెద విచారము నందఁడు తా దురాసదుం
డిల వల దీ సుఖమ్ములు మహీవలయంబును రాజ్య వైభవ
మ్ములు మఱి వాంఛితమ్ములును భూరి దివమ్మును నాకు జీవమున్ 38.

ఆ.వె. కాంచ నెంతు నిన్ను నంచిత సత్యవం
తునిగఁ గా దనృతునిగను నరేంద్ర!
నీ సమక్ష మందు నే నొట్టిడి వచింతు
సత్యము సుకృతముల జనక! నిజము 39.

ఆ.వె. క్షణ మయిన నిలువ తగ దిట నాకు జనక! 40.

సైపు శోక మెల్ల నో పుడమి ధ
వుండ! నిశ్చయమున నుండ దెట్టి విపరీ
తమ్ము నాకు సందియమ్ము లేదు

తే.గీ. కానకు పెడలు రాఘువ! కదలి యంచు
గైక మాత నన్నిట వేఁడఁగఁ బయనింతు
నంచుఁ బల్కితిఁ గాన నే నెంచి ప్రతిన
నేఁగెదను నిశ్చయమ్ముగ నింకఁ దండ్రి 41.

తే.గీ. బొంద నుత్కంఠఁ బనిలేదు భూప! నీకు
సుప్రశాంత వనమ్మున సుప్రియమ్ము
న విహరింతుము విహగ నినాదితమ్ము
న హరిణాళి విలసిత వనమున మేము 42.

చం. సురలకు నైనఁ దండ్రి యగుఁ జూడఁగ దైవమ యుక్త మవ్విధిన్
గురు వచనమ్ములన్ వినెద గూర్మిని దైవముగాఁ దలంచుచుం
బరఁగి చతుర్ద శాబ్దములు వాసము సేసి వనమ్ము నందు రా
నరవర నన్ను జూచెదవు నందను దాపము వీడు మింపుగా 43.

తే.గీ. అశ్రు పూరిత గళుల నరాధి నాథ!
యీ జనుల నెల్ల నీ వూఱడింప నర్హుఁ
డ వయి యిట్లక్కట కటకటం బడంగ
నేల నిచ్చట పురుష శార్దూల కరము 44.

కం. పురమును బుడమిని రాష్ట్రము
భరతున కింపుగ నొసంగు పార్థివ వర్యా!
చిరకాల ముండ నేఁగెదఁ
బరిపాలించి జనకాజ్ఞ వని కే నింకన్ 45.

తే.గీ. భూమి నెల్ల నే విడువంగఁ బురముల గిరి
తతుల కాననమ్ముల తోడ నతి ముదమున
శుభపు సీమఁ బాలింప నిండు భరతు నీఁక
మీరు చెప్పిన రీతిని గారవముగ 46.

తే.గీ. అనఘ! నా మది నీ యాజ్ఞ యందు నిలిచి
నట్టి భంగి నిలువ నేర దెట్టి కోర్కె
లందు భోగ సంచయ మందు నార్య సమ్మ
తముగ నా కై వగపును వీడుమ నరేంద్ర! 47.

తే.గీ. అనృత దోష మంటిన నీకు ననఘ! యవ్య
యంపు రాజ్యము వలదు సర్వానుకాంక్ష
లు సుఖము లవనిజయు నాకు నసువు లైన
వలదు నిజము కావలయు నీ వ్రతము సుమ్ము 48.

కం. ఫల మూలమ్ములు దించును
గొలనుల నదులింక గిరులఁ గూర్మిని గనుచుం
బలు చిత్ర పాద పావళి
విలసిత వనిని విహరింతు వేదన విడుమా 49.

కం. మునిఁగి యగచాటుల నృపతి
తనయు నరసి కౌఁగిలించి తద్దయు శోక
మ్మున దుఃఖమ్మున మోహ
మ్మున నేలం గూలెఁ దెలివి పోఁ బడి యుండెన్ 50.

కం. కైకేయి తక్క మిగిలిన
యా కాంతలు గాంచి యేడ్చి రంతఁ జెలఁగె హా
హాకారము లెల్లెడలం
బ్రాకి సుమంత్రుండు నేడ్చి వడి మూర్ఛిల్లెన్ 51.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 35.

సుమంత్రుఁ డంత దశరథుని మనసు నెఱిఁగి కోప సంతాపము లడరఁ గైకేయినిఁ గాంచి దూషించుచు వేఁడికొనుచు నామెను నిర్ణయమును మార్చుకొన మని పలికినఁ గైక యంగీకరింప కుండుట.

సీ. సూతుండు తల విదుల్చుచు నంత నొక త్రుటి నిట్టూర్చి మఱిమఱి దట్టముగను
కేలు నంతటఁ బిండి కేలినిఁ బటపట పండ్లు కొఱుకుచు నంబకము లందుఁ
దోఁప నెఱ్ఱఁదనము దొలఁగ మున్నటి శాంత మెల్ల రోషమ్ముచేఁ దల్లడిల్లి
సంతాప మశుభమ్ము సంతరింప నృపతి మానసం బెఱిఁగి సుమంత్రుఁ డడరి
తే.గీ. సంచలింపఁ గైక యెఁడద శరనిభ వచ
నముల వాగ్వజ్రముల నంగన కట సర్వ
మర్మములు వడి భేదిల్ల మంత్రి పలికె
భాషణమ్ముల నివ్విధి బదు లొసంగ 1.

తే.గీ. విడిచి తక్కట స్వయము దేవి! నిజపతిని
దశరథు ధరఁ జరాచర తతి భరించు
భర్త నివ్విధముగ గౌరవమ్ము లేక
దీని మించు నకార్యముఁ గానఁ గలమె 2.

చం. తలఁచెద నేను దేవి! నిను దారుణ నాథ నిహంత్రిగా నికం
గులమును గూల్చు నారిగను ఘోర తరమ్ము తపింపఁ జేసితే
బలరిపు భంగి దుర్జయునిఁ బర్వత సన్నిభ నిశ్చలుం బతిన్
జలధి నిభంపు సుస్థిరుని శాంతి హరించుచు నీదు చేతలన్ 3.

ఆ.వె. కించపఱుపకుమ స్వకీయ పతిని రాజు
నీ వరదుని దేవి! నెలఁతల కిల
భర్తృ వాంఛ లెంచఁ బరమమ్ము లగుఁ బుత్ర
కోటి కాంక్షలకును బోటి! వినుమ 4.

కం. నృపు పిమ్మట రాజ్యమ్ముల
నెపుడు వయస్సును గణించి యిత్తురు దేవీ!
విపరీతము సేయఁ దలఁతు 5.

విపు డిక్ష్వాకు కుల నాథు సెంచక యకటా

కం. ఏలఁగ నిమ్ము సుతు భరతు
మేలుగ నో దేవి! యింక మేదిని సెల్లం
జా లేఁగెద మెల్లరము స
లీల ఘనుఁడు రాముఁడు పెడలిన చోటులకున్ 6.

ఆ.వె. దాఁట సెంచి తీవు మేటి మర్యాద రే
ఖ నిట నడరి నేఁడు  కాంత నీదు
పనుల ధరణిసురులు వసియింప నీ దేశ
మందు సెవ్వ రేని యరయఁ దగరు 7.

ఉ. తప్పక పోదు మెల్లరము దారిని రాఘవుఁ డేఁగు దారినిం
జెప్పుమ వీడి బంధువుల శ్రేష్ఠపు విప్రుల నింక సాధులం
జొప్పడు రాజ్యలాభమునఁ జోద్యపుఁ బ్రీతిని హీన కార్యముం
జప్పున నిచ్చగించితివి చల్పఁగ నమ్మరొ యేమి సెప్పుదున్ 8.

ఆ.వె. ఆచరింప నిట్టి యనుచిత కార్యమ్ము
నీవు దేవి! యింక నేల యేల
వ్రక్కలై కనఁ బడ దిక్కడ యంచును
జూచుచుంటి నకట చోద్యముగను 9.

ఆ.వె. రాము నడవి కంప భామ! నిలువ నిన్ను
గొప్ప బ్రహ్మ ఋషుల ఘోర వాక్కు
లనెడు దండ మేల యక్కట హింసింప
మండుచుండి రాదు మానకుండ 10.

కం. మావి నఱకి గొడ్డట మఱి
యీ పేఁపను బాతి పాల నింపుగ మనుపం
గా వాని కిడునె మధురం
బే విధి నయినను దలంప నింతీ! వినుమా 11.

ఆ.వె. తల్లి పోలిక నడతయు వచ్చె నీ కంచు 12.

నేఁ దలంతు దేవి! నింబ వృక్ష
మెట్లు తేనె నొసఁగు నిట్లు వినమె మున్ను
మనము సత్య మయ్యె మినుకు నేఁడు

ఉ. వింటిమి పూర్వ మొక్క కథ బింకపు బుద్ధిని నీదు మాతయే
కంటక మాడి తండ్రిఁ గడు కాఱియ పెట్టిన యట్టి వృత్తముం
దొంటి మునీంద్రుఁ డొక్కఁ డిడెఁ దొడ్డ వరమ్మును మెచ్చియిచ్చ వా
ల్గంటిరో! నీదు తండ్రికి నృకాంతుఁడు సేర మృగోక్తు లింపుగన్ 13.

తే.గీ. వంకరగఁ దిర్గు ప్రాణుల భాషణమ్ము
లెల్ల నా వర బలమున నెఱుఁగు రాజు
తల్పమున నొక్క చీమ రొద నొకనాఁడు
నరవరుఁడు విని పక్కున నవ్వె వింత 14.

కం. విని యా నవ్వును రోష
మ్మున జనకుని మృత్యుపాశము వరించుచు నీ
జనని యడిగెఁ గారణ మే
మని వినఁ గోరుదును సౌమ్య! యనె నాత్రముతో 15.

తే.గీ. చెప్పిన మఱు క్షణంబ నశింతు దేవి!
యని భవజ్జనకుఁడు సందియమ్ము సుంత
లే దని పలుకఁ జచ్చిన లేక యున్నఁ
జెప్పు మనె నన్నపహసింతె యిప్పు డనుచు 16.

ఉ. కేకయ నాథుఁ డగ్గిరల ఖిన్న మనమ్మున నాలకించి తా
నా కత నెల్లఁ బూర్ణముగ నా వరదాయికి నంతఁ దెల్పఁగా
నా కుటపుండు భూమిపతి నారసి చచ్చిన ధ్వంసమైన నీ
యీ కలకంఠి యెన్నఁడు వచింపకు నా బదు లిచ్చెఁ బ్రీతినిన్ 17.

కం. నృపుఁ డా మాటలు విని తా
నపుడు విడిచి సత్వరము తవాంబను దేవీ!
విపులంపు హర్షమున య
క్ష పతి కుబేరు పగిదిని సుఖముగఁ జరించెన్ 18.

ఆ.వె. నీవు గూడ నట్లు నిత్యము పాపము
సెంచు దాన! చెడ్డ నివ్విధమ్ము
మోహ మడరఁ గరము భూపతి కొనరింప
నిశ్చయించి తెడఁద నిర్దయ నిట 19.

కం. నరులకు తండ్రివి తనయల
కరయం దల్లివి గుణమ్ము లలవడు నంచుం
బరఁగును లోకోక్తి యది త
నరె సత్యముగ నని తోఁచు నా కిత్తఱినిన్ 20.

ఆ.వె. కాకు మట్లు దేవి! వీఁక వినుమ ధరా
పతి పలుకుల నింక భర్త కోర్కె
కనుగుణముగ మసలి యంబ! కమ్ము జనుల
కెల్ల గతివి కరుణ పల్లవింప 21.

తే.గీ. వినకు పాపుల మాటల ననుచితముల
దేవరాజ సమప్రభు దేవి! నీదు
భర్త మఱి లోకభర్త నిప్పట్టు నందుఁ
జేయకు మధర్మ బద్ధునిఁ జిత్రముగను 22.

తే.గీ. నీ కొసంగిన వరముల నృపతి దశర
థుండు వ్యర్థమ్ము కానీడు తోయజాక్షుఁ
డబల నిశ్శంక నిది నిక్క మరయ దేవి!
కాన నింక మన్నింపుము ఱేని మాట 23.

ఆ.వె. జ్యేష్ఠ సుతుఁడు దానశీలుండు నిపుణుండు
రాముఁడు నిజ ధర్మ రక్షకుండు
త్రాత లోకులకు బలమున మేటి యభిషే
కింపు మతని దేవి! యింపుగాను 24.

కం. వన మేఁగినచో రాముఁడు
జనకుని వీడి నరనాథు జగములఁ గలుగున్ 25.

వినుమా నీ కపవాదము
ఘనముగ దేవీ! నిజమ్ము కావుమ ప్రజలన్

కం. కొననీ రాముని రాజ్యము
మనమునఁ దాపమ్ము వీడు మానిని యింకం
గన మన్నుని రాముని క
న్నను మిన్నఁగ నేలువాని నరు సెందైనన్ 26.

ఆ.వె. యౌవరాజ్య మందు నలరంగ రాముఁడు
గాంచి దశరథుండు కాన కేఁగు
నీ మహోగ్ర ధన్వి యింకఁ బూర్వుల మార్గ
మనుసరించి దేవి! యవని ధవుఁడు 27.

కం. అని యివ్విధిఁ గైకేయికి
ననునయ తీక్ష్ణ వచనముల నవనీశుని చెం
తను క్షోభ నొసంగి భృశము
గను నిలిచెఁ గృతాంజలుఁ డయి కాకుత్స్థు దరిన్ 28.

కం. అయినను జలింప దామె మ
ఱియు నిసుమంతయు వగవ దఱిముఱి మనము నం
దయినం గన్పట్టదు కై
క యాస్యము వివర్ణ మగుట కన రా దకటా 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది యేనవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 36.

దశరథుఁడు ప్రతిజ్ఞా తప్తుఁడై కన్నీరు నిండ పలుమార్లు నిట్టూర్చుచు సుమంత్రునితో రాముని తోడఁ జతురంగ బలములను ధనాదులను సహాయకులను బంపు మనఁగ నట్లు పంపుటకుఁ గైక యంగీకరింప కుండుట, సిద్ధార్థ ముని సగరుఁడు తన సుతుఁ డసమంజసుఁడు దుష్టుఁ డగుటచే బహిష్కరించె నని రామునిలో దుర్గుణములు లే వని పలుకఁగ దశరథుఁడు తాను గూడ రామునితో నడవి కేఁగెద నని కైకతోఁ బలుకుట.

కం. ప్రతిన నొగల్ప నెదను భూ
పతి యిక్ష్వాకుండు భాష్ప పరివృత నయనుం
డతులవ్యథ నిట్టూర్చి ప
లు తడవలు సుమంత్రుఁ గాంచి లోలతఁ బలికెన్ 1.

తే.గీ. సూత! రత్నరాసుల నిచ్చి యాతతముగ
నింకఁ జతురంగ బలములు నంకమునఁ జ
నంగఁ జూడుమ రామ వన గమనమున
శీఘ్రమ యనుపు మట్టులఁ జెల్వముగను 2.

తే.గీ. మధుర వాదినుల నిజ రూప ధనలను మ
హా ధన వణిక్కులఁ బరివృతార్థ యుతము
రాజపుత్ర వాహిని వెంట రమ్యముగను
జాగ నిమ్ము సుమంత్ర! ప్రశాంతముగను 3.

ఉ. ఇంకను వెంట నుండి రమియించెడి భృత్యుల కిచ్చి మిక్కిలిం
డంకము లంపు మింపుగఁ గడంకను నాగరికాళి తోడుగా
నింక మహాయుధమ్ములు నహీన రథమ్ము లరణ్య గోచరుల్
పొంకముగా నిషాదులును మూరి చరింపఁగ నంపు సూనుతో 4.

తే.గీ. కుంజర మృగాదులను జేసి భంజితమ్ము
లడవి లభియించు క్షౌద్రమ్ము నారగించి
యాప గాదుల వీక్షించి యలరి భృశము
రాముఁడు స్మరింప నేరఁడు రాజ్య మచట 5.

తే.గీ. నాదు ధన ధాన్య కోశ వరాదు లతని 6.

ననుగమింపఁ బనుపు నిమ్ము వనము నిర్జ
నమున నుండ రాముఁడు వేగ నరవరుండు
ధర్మ బద్ధుఁడు దుష్కర కర్మ రతుఁడు

ఆ.వె. మూరి యజ్ఞములను బుణ్య దేశమ్ముల
దక్షిణల నొసంగి తా నొనర్చి
కలసి ముని గణమును గాకుత్స్థుఁడు వసించు
సుఖముగ వన మందు శూర వరుఁడు 7.

కం. భరతుండు మహా బాహువు
పురమ్ము పాలింప ఘనుఁడు పూర్ణేప్సితముల్
నర పుంగవుండు రాముఁడు
తిరుగ వనినిఁ బొంద వలయు స్థిరముగ నెల్లన్ 8.

చం. పలుకఁగ రాఘవుం డిటుల భామకుఁ గైకకుఁ గల్గె భీతియే
కలవర మందె నెండె నటఁ గాంతకు నోరు గళమ్ము నిండె న
శ్రులను భృశమ్ము మీఱె నెద శోకము బాధ సెలంగ మిక్కిలిం
గలుషిత బుద్ధి వేగ నిజ కాంతునిఁ జేరి వచించె నివ్విధిన్ 9.

తే.గీ. రాజ! భరతుఁ డెట్లు వరించు రాజ్య మిట్లు
హీన జనము శూన్యమ్మును హీన సార
మద్య నిభము రుచి విహీన మహిని సమ్మ
తమ్ము కా దిది నాకు నిక్కమ్ము గాను 10.

ఆ.వె. సిగ్గొకింత లేక యెగ్గులు పల్కిన
నాయతాక్షి నరసి యవని ధవుఁడు
దారుణంపు గిరలఁ దశరథుం డాలకిం
చి వచియించె నిట్లు సెలఁగఁ గినుక 11.

ఆ.వె. మోయు చుండ బరువు పొలఁతి! కాడి తగిలిం
ప భుజ మందు నేల బాధ నిడుదు
తిరిగి మున్న యకట దివిరి పలుకు చుండ
నాప వేల నీ వనార్య నన్ను 12.

కం. కినుక వహించి పలికిన ని
జ నాథు పల్కులను విని యసహనము తోడం
గినుక ద్విగుణీ కృతము కాఁ
గ నతివ కైక వచియించెఁ గాంతుని తోడన్ 13.

తే.గీ. వినమె నీదు వంశమ్మున మును నృపుండు
సగరుఁ డసమంజ సాఖ్యు జ్యేష్ఠ తనయుని బ
హిష్క రించె నవ్విధముగ నిపుడు రాముఁ
డేఁగ వలయు వనమునకు వేగ రాజ! 14.

కం. అయ్యింతి యివ్విధిఁ బలుక
నయ్యో యన దశరథుండు హాహా యంచుం
జయ్యన సిగ్గిలిరి జనులు
కొయ్య పగిది నిల్చెఁ గైక క్రూరత్వమునన్ 15.

తే.గీ. అంత సిద్ధార్థుఁ డను పేర నలరు నిష్ట
మంత్రి పుణ్యుండు వృద్ధుండు మాన్యవరుఁడు
రాజునకుఁ గైక వీక్షించి రమ్యతరపుఁ
బల్కులను గారవమ్మునఁ బల్కె నిట్లు 16.

తే.గీ. దుర్మతి యసమంజసుఁడు వీథులఁ జెలంగి
యాడు బాలకుల గ్రహించి యకట వారి
నెల్ల సరయూ నదిని ముంచి యుల్లసమ్ము
నందు చుండు సంతతము నెడందఁ గరము 17.

చం. కని యది పౌరు లెల్లరు నృకాంతునిఁ జేరి కడింది క్రుద్ధులై
యని రసమంజసుం డయిన నక్కట మే మయినన్ వసింప నిం
క నిచట రాష్ట్ర వర్ధనుఁడ! గ్రక్కున కోరుకొనుం డనంగ నా
జనపతి భీతి కారణము సజ్జను లార వచింపుడం చనన్ 18.

చం. అన నని రిట్లు వారు నృప యాడఁగ మాదు కుమారు లెల్లరం
గని మతి హీను భంగిని సుఖం బరయున్ నది లోన వారిఁ ద్రో 19.

సి నగుచుఁ దాను మూర్ఖుఁ డయి శీఘ్రమ యప్రియుఁ బుత్రు వీడె నా
జనపతి యాలకించి జన సంఘు హితమ్మును గోరి యంతటన్

తే.గీ. సగరుఁ డాతని నిజ భార్య సంయుత సప
రిచ్ఛదము యానమున నుంచి సచ్చరితుఁడు
జీవి తాంతము దృజియింప శీఘ్రము నిజ
సేవకులకు నాజ్ఞ నొసంగె భూవరుండు 20.

ఆ.వె. పలుగు గంప లంతఁ బట్టుకొని యసమం
జసుఁడు దుర్గమములు శైలములఁ ది
శలఁ దిరుగుచుఁ బాప చరుని భంగినిఁ ద్రవ్వు
చుండి బ్రతుకుఁ గడపు చుండె నతఁడు 21.

కం. విడిచె సుతుని ధార్మిక సగ
రుఁ డట్లు రాజవృషభుం డలోలుండై రా
ముఁడు సేసిన పాప మిచట
నుడువం గలమే త్యజింప నుతగుణ సుతునిన్ 22.

ఆ.వె. కన మవగుణ మించుకయు రాము నందు శ
శాంకు నందుఁ గల్మషమ్ము పగిది
గాంచ దుర్లభమ్ము కొంచె మైనను దోష
మున్నఁ జూపు దేవి! బొమ్మనెదము 23.

తే.గీ. చెడ్డవాఁడు కాని నరుని చేఁత లందు
మంచి దారినిఁ బయనించు మాన వోత్త
మునిఁ ద్యజింప విడిచి ధర్మమును దహించు
శక్రు ద్యుతినైన నిక్క మెంచంగ దేవి! 24.

ఆ.వె. చాలు నింక రాము సంపదను హరింప
దేవి! శుభ తరాస్య! తీరని యప
వాద మేల నీకుఁ బన్నుగ రక్షింప
వలయు నిన్నె నీవు వడయ కుండ 25.

కం. అన సిద్ధార్థుం డవ్విధి
విని యలసిన స్వరము నందుఁ బృథివీశుం డం
త నరసి కైకను శోక
మ్మునఁ దప్తుండై పలికెను ముఖముల నిట్లున్ 26.

తే.గీ. ఆదరింప వీ వచనము లబల నీవు
పాపవృత్త! దుర్మార్గము వలచు దీవు
నీదు చేష్టలఁ గాంచము నీతి నింత
నీ వెఱుఁగవు హితమ్ములు నీకు నాకు 27.

తే.గీ. రాజ్యమును సుఖముల వీడి రాము వెంట
నేఁగుదును నేఁడు ధనముల నెల్ల విడిచి
యనుభవింపు యథేచ్ఛము తనరి రాజు
భరతుఁ గూడి సుఖమ్ముగఁ చిరము నీవు 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది యాఱవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 37.

కైకేయి యిచ్చిన నార బట్టలను రామలక్ష్మణులు ధరింప సీత ధరించు విధము తెలియక రాముని నడుగ రాముఁడు సీతకుఁ బట్టు చీర పైనఁ గట్టఁగ వశిష్ఠుఁడు వారించి కైకను నిందించి యడిగిన వరములలో సీత లేదు గనుక నామె సర్వాభరణ భూషితయై భర్త తో నేఁగ వచ్చునని పల్కుట.

కం. విని రాముఁ డమాత్యవరు వ
చనములు వినయజ్ఞుఁ డంత సద్వినయమునన్
జననాథు దశరథుని నిజ 1.

జనకుని వీక్షించి పలికె సద్వాక్యములన్

తే.గీ. భోగ సంచయ త్యాగికి ముక్త సంగు
నకు నరణ్య వాసికిని వన్య చయ జీవి
కేల రాజశార్దూల! నా కీ యనుచర
వర్గ మిప్పట్టున విడువఁ బాడి యగును 2.

ఆ.వె. ఇచ్చి యుత్తమంపు టిభమును విప్రోత్త
మునకు ద్రాటిఁ గోరు జనులు గలరె
కుంజర ప్రవరము మంజులముగ నిచ్చి
యాస రజ్జు పైన వీస మేల 3.

చం. బలగపుఁ గార్య మేమి బుధ వర్గ వరేణ్య! జగత్ప్రభూత్తమా!
వలసిన నార చీరలను బన్నుగ నిమ్ము త్యజింతు సర్వమున్
వలయును గడ్డపాఱ మఱి వట్టిది గంపయు నిమ్ము సద్దయం
జెలఁగి వసింపఁగా నటవిఁ జెన్నుగ నేఁ బదునాలు గేం డ్లటన్ 4.

ఉ. ఇచ్చెను గైక తెచ్చి స్వయ మీ రఘు రాముని కట్టి చీరలన్
గ్రుచ్చి వచింపఁ గట్టమని కొంచెపు లజ్జయు లేక యచ్చటన్
మెచ్చి గ్రహించి తా విడిచి మేలి పటమ్ములు కట్టె వాని నా
యచ్చపు మౌని వస్త్రముల నందఱు నచ్చటఁ జూచుచుండగన్ 5.

ఆ.వె. లక్ష్మణుండు కూడ సూక్ష్మ వస్త్రమ్ములు
వీడి జనకు నెదుట వీరవరుఁడు
తాపస వసనముల ధరియించె శీఘ్రమ
భ్రాత పగిది నచటఁ బ్రీతి తోడ 6.

ఉ. జానకి పట్టు బట్టల భృశమ్ము వెలుంగు వరాంగి యంతఁ దా
నూనఁగ నున్న వల్కలము లుచ్చును గాంచు కపోత భంగినిం
గానఁగ భీతి నొంది కడుఁ గైక కరమ్మున నుండి సిగ్గునుం
బూని గ్రహించి లక్షణ విభూషిత భాష్ప కళంక నేత్రయై 7.

తే.గీ. మనసు చలియింప ధర్మము గనెడు ధర్మ 8.

వేదిని లతాంగి గంధర్వ విభు నిభుండు
తనదు భర్తను వీక్షించి తగు విధమ్ము
గఁ బలికెను భాషణమ్ములు కాంత సీత

ఆ.వె. ముని వరులు వనమునఁ దనరెడు వారు ధ
రింత్రు నార చీర లెట్లు  నాథ!
యంచు నడిగె నేర్పు కొంచ మైనను లేక
కట్టు టందుఁ బుడమి పట్టి కలఁగి 9.

తే.గీ. బట్ట యొక కొంగు కంఠమ్ము పైనఁ బెట్టి
చేత మఱి యొక్క కొంగును నాతి పట్టి
లేక నిపుణత్వ మింత ధరింప నార
చీర లక్కట సిగ్గిలి సీత నిలిచె 10.

కం. ధర్మావనుల వరేణ్యుఁడు
కర్మ కుశలుఁడు వడి వచ్చి కట్టెను రాముం
డర్మిలి క్షౌమమున స్వయము
కూర్మిసతికి సీత కంత గుణ ధాముండే 11.

కం. కని రాముని చీరను గ
ట్ట నవనిజకు నవ్విధం బడరి యవ్వేళన్
వనరుచు నంతఃపుర వా
సిను లశ్రువులు విడిచి రరసి లలన లెల్లన్ 12.

ఆ.వె. అనిరి వారు రాము నారసి జ్వలిత తే
జస్వి నివ్విధిముగఁ జన నడవికి
వత్స! సీత కేరు పనుపు నొసంగ లే
దు కద యీ మనస్వినికి రఘువర! 13.

ఆ.వె. జనకు నాజ్ఞ నీవు చనుమ విజన వన
మునకు ననుజుఁ గూడి మూరి రామ!
తగ దరణ్య మేఁగఁ దరుణికి మా కామె
దర్శనమ్ము నంత దనుక నిమ్ము 14.

ఆ.వె. మా యడిగిన దిడు కుమార! జానకి నుండ
నిమ్ము భామ నిచట నెలమి నిమ్ము
మాకు ధర్మ మందు నీ కుండ మెండుగఁ
బ్రీతి నిలువ విచటఁ బెక్కు లనిన 15.

కం. వినుచును వారి వచనములు
ఘనుండు దాశరథి బట్ట కట్టెను సతికిన్
వనజాక్షి సీతకు గుణ
మ్మునఁ దన కీ డయిన యట్టి పొలఁతికి నంతన్ 16.

కం. అరసి నవనిజను జీరను
బరిగ్రహింపన్ వసిష్ఠ పరమర్షి కుభృ
ద్గురువు వచించె నివారిం
చి రమణి జానకినిఁ గాంచి శీఘ్రము కైకన్ 17.

కం. మితి మీఱి తీవు దుర్మతి!
నుతకులముఁ జెఱచితి కైక! నొప్పించి కడుం
బతి వంచించి నృపతి ని
ల్చితివి ప్రమాణ విగత గతిఁ జీ యన జనులే 18.

మ. పని లే దేఁగఁగ సీత కివ్విధి దలంపం గైక! శీలక్షయా!
ఘన సింహాసన మందు నిల్చును దగం గాకుత్స్థ పీఠమ్మునం
దన దారం దగఁ జూచు నాథులకు స్వాంతం బౌనుగా దారయే
వని కేగం బతి రాము నాత్మ సతి తాఁ బాలించు నీ భూమినిన్ 19.

ఆ.వె. లేక తా వెడలిన వీఁక రామునిఁ గూడి
కాననమున కలరి కాంత సీత
యనుగమింతు మతని ఘనుని మే మెల్లర
ము తరలి వెడలు నిఁకఁ బురము గూడ 20.

తే.గీ. ఎక్కడ కరుఁగ రాఘవుఁ డక్కడ కరు
దెంతు రంతఃపురపుఁ ద్రాత లంత దేవి! 21.

భృత్య వర్గముతోఁ గూడి పేర్మి పురము
రాష్ట్రము వెడలును బరివారమ్ముఁ గూడి

మ. చని సంచార మొనర్తు రీ భరతుఁడున్ శత్రుఘ్నుఁడుం గానలన్
ఘనుఁ డా రాముని నన్న క్షౌమ ధరు లా కాకుత్స్థు వీక్షించుచున్
జన శూన్యంపుఁ బురమ్మునుం దరు లతా సందోహ సంపూరిత
మ్మును బాలింపు జనాహితస్థిత! ధరం బో దుష్ట వృత్తా యిఁకన్ 22.

తే.గీ. రాముఁ డుండ డెచ్చోటు నా భూమి యెవ్వి
ధమ్మున నయినఁ గాదు రాష్ట్రమ్ము సుమ్ము
రాముఁ డెవ్వని నుండిన రమ్యముగను
రాష్ట్ర మగును దప్పక నా యరణ్య మెంచ 23.

ఆ.వె. తండ్రి యాయని భువిఁ దనయుఁ డై జనియింప
నరపతికి భరతుఁడు బాలనమ్ము
సేయఁ దగఁడు సుమ్ము చింతింప నీకును
సుతుని పగిది కాడు సుమ్ము దేవి 24.

కం. గగనము పైకి నుఱికినను
మగువా నీవు భువినుండి మానును క్షుద్రం
బగు కార్యము సేయంగ నె
ఱఁగి నిజవంశ చరితము మఱి భరతుఁడు ధృతిన్ 25.

ఆ.వె. సుతుని పైనఁ బ్రేమ చోద్యమ్ముగా మీఱ
హాని సేయ నీవు పూని తతని
కిప్పుఁ డనుసరింప నెవ్వరు దలఁపరు
రాముని నుతగుణుని రాఘవేంద్రు 26.

ఆ.వె. చూతు వీవు నేడ వే తరలఁగఁ గైక!
యిఁక ద్విజమృగ పణుల నెల్లఁ బశు చ
యమ్ముతోడ నామహాత్ముఁడు రాముని
వెంట నతనిని గను వృక్షములను 27.

తే.గీ. చీర యవిహితమ్ము స్నుషకు నీ రమణికి
దేవి యుత్త మాభరణములే విశేష
ముగ నొసఁగు మని వారించె మూరి యా వ
సిష్ఠుఁ డా నార చీరను సీత కీయ 28.

తే.గీ. రామునకు నొక్కనికె నీ వరణ్య వాస
ము నడిగితివి కేకయరాజ పుత్రి! సీత
సత మలంకరించుకొని వాసమ్ము సేయు
వనిని భూషణములు దన భర్త తోడ 29.

తే.గీ. బండ్లు పరిచారికల తోడ పరివృత యయి
వస్త్ర వరము లితరములు వలసి నట్టి
వస్తువుల తోడ వెడలు నీ వరము లందు
సీత జనక రాజ తనయ చిక్క లేదు 30.

కం. అన నిట్లు నృప గురువు ద్విజ
ఘనుం డతుల శక్తి యుతుఁడు కాంతామణి సీ
త నిజ మతము విడువదు భ
ర్తను సేవింపంగ నెంచి తద్దయుఁ బ్రీతిన్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 38.

నార చీరలను గట్టిన సీతను జూచి దశరథుఁడు దుఃఖముతోఁ గైకేయిని నిందించి సీత చక్కని వస్త్రములతో నాభరణములతో నడవికి యేఁగ వలె నని తా నిచ్చిన వరము రామునిఁ బంపుటకు

మాత్రమే సీతకు కాదని మోహమున మూర్ఛిల్లి లేవఁగా రాముఁడు తండ్రికి నమస్కరించి తన తల్లినిఁ
దయతోఁ బ్రేమతోఁ గాపాడు మని కోరుట.

కం. కని సీతను నాథవతిని
అనాథ వలె నారచీర నవ్విధిఁ గట్టన్
జను లెల్లఁ జీ యనిరి యా
తని దశరథుఁ గాంచి శోక తప్త హృదయులై 1.

కం. విని యా రావములను బుడ
మి నాథుఁ డెద దుఃఖితుఁడయి మిక్కిలి ధర్మ
మ్మున జీవితమునఁ దా వీ
డెను శ్రద్ధను దశరథుండు డెందము నందున్ 2.

కం. నిట్టూర్చి కరము వేడిగ
బిట్టారసి కైక సతినిఁ బృథివీశుండే
కట్టి కుశ వస్త్రముల ని
ప్పట్టునఁ జన రాదు సీత వని కని పలికెన్ 3.

తే.గీ. పరమ కోమలి వైదేహి బాలయు సుఖ
ములకు మాత్రమ తగు వనమునకు నేఁగఁ
దగదు నా సత్యమును బల్కెఁ దాప నోత్త
ముండు నా గురు వింపుగ ముగుద! వినవె 4.

తే.గీ. రాజవర సుత  జానకి శ్రమణి వోలె
జనుల నడుమ నిల్చె విసంజ్ఞ జనప చీర
కట్టి యీ తపస్విని సీత యెట్టి తప్పె
వరికిఁ జేసెఁ గొంచె మయినఁ దరుణి యకట 5.

తే.గీ. విడువ వలయును నారలు పడతి సీత
జనక పుత్రి మున్నిడ లేదు చాను! వరము
నీ కిది యథేచ్ఛ సుఖముగ నృపవర సుత
సర్వ భూషణముల నూని చనును వనికి 6.

తే.గీ. ఇచ్చితిని క్రూర వరముల నచ్చపు నియ
మమునఁ జావ నర్హుండను మగువ నీదు
పని నను దహించు నిఁక వెదురును దన కుసు
మములె నశియింపఁ జేసెడు మాద్రి కైక! 7.

తే.గీ. చేసె ననుకొన్న బాపిని! వీస మైన
రాముఁ డశుభమ్ము నక్కట భామ! నీకు
నెట్టి యపకారము పుడమి పట్టి సీత
సేయఁ గన్పట్టె నిట దుష్ట శీల! నీకు 8.

కం. మృదుశీల తపస్విని యీ
సుదతి మృగీ నిభ విశాల సునయన నీ కీ
సదమల జానకి యొసఁగఁ గ
ల దెట్టి దోషము వచింపు లవమైన కటా 9.

కం. చాలదె రామ వివాసన
మేల కడంగెదవు నింక నీ పాపములన్
బాలా! చేయంగఁ గరుణ
నే లేశము సూప కుండ హీన చరిత్రా! 10.

కం. వింటి నీ భాషణములు నే వివరముగను
రాముఁ డిటకు వచ్చి నపుడు భామ నీవు
పలుక రామా భిషేకపు వరము మాత్ర
మిచ్చితిని నీకు నంతియ యెఱుఁగు మీవు 11.

కం. కన నెంతు నార చీరల
జనకాత్మజను నకట మఱి చనఁ గోరుదు వీ
వు నరకమున కీ సమయ
మ్ము నివ్విధ మతిక్రమించి పొలఁతీ! యింకన్ 12.

తే.గీ. కాంచఁ డంతము రాజు శోకమునకు విల
పించుచు మహాత్ముఁ డచ్చటఁ గొంచె మైన 13.

నాతురత వొంగ భృశముగ నాత్మజ గత
దుఃఖ మగ్నుఁడై పుడమి పైఁ దూలె నంత

కం. పలుకుచు నుండ జనకుఁ డీ
పలుకుల నిట్లు వనమునకు బయనింపంగాఁ
దలఁచిన రఘు రాముఁ డధ
స్తల శిరుని నృపతినిఁ గాంచి తనయుఁడు పలికెన్ 14.

ఆ.వె. ధర్మనిరత! నాదు తల్లి కౌసల్య వృ
ద్ధయు యశస్విని గుణ తతుల మిన్న
నిన్ను దాను దేవ యెన్నండు నిందించి
యెఱుఁగ దింత యేని నింతిఁ గనుమ 15.

ఆ.వె. వరద! తగును నీకు భామను మన్నించి
చూడ నన్ను వీడి శోక సాగ
రమ్ము నందు మునిఁగె రాజ! యాపదలు ము
న్నెఱుఁగ నట్టి యామె నిపుడు భృశము 16.

తే.గీ. నన్ను దల్చుచు నిత్యము నంద నార్ధ
శోకము వడయని విధమ్ము చూచి గౌర
వించిన జనని జీవించుఁ బ్రీతిఁ బూజ్య!
నన్ను మఱచి తపస్విని నిన్ను జూచి 17.

ఆ.వె. కొడుకు పైన బెంగఁ బడసిన నా తల్లి
ని సురనాథ నిభ! వని నివసింప
నేను గావఁ దగుదు నీవు శో కార్దిత
యముని యాలయమున కరుగ కుండ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది యెనిమిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 39.

దశరథు నాజ్ఞ సుమంత్రుఁడు రథము నాయాత్త పఱచి తెచ్చుట, కోశాధికారి సీతకై
యాభరణములను మేలి వస్త్రములను తెచ్చుట; రాముఁడు కౌసల్య మఱియు నితర తల్లుల
యాశీర్వాదములను గైకొనుట, కౌసల్య సీతకుఁ దగు నీతులను బోధించుట.

చం. ముని వలెఁ గానిపించు నిజ పుత్రుని రాముని భాషణమ్ములన్
విని పడె స్వీయ చేతనము వీడి సదార గణమ్ము నంతటన్
వనరి కరమ్ము దుఃఖమునఁ బార్థుఁడు చూడ నశక్యుఁ డయ్యె రా
మునిఁ బలుకంగ రాక వగ మూరగ నిల్చె ముఖమ్ము గాంచకే 1.

తే.గీ. ఒక ముహూర్తమ్మునకు సంజ్ఞ యుడుగ రాజు
దశరథుండు ఘన భుజుండు తలఁచుచు సుతు
రాము విలపించె నీ వ్యథ ప్రాణి తతుల
మున్ను హింసింపఁ దల్చెను బొందితి నని 2.

కం. కాదేని నిక్కముగ నే
నేదేని విధమ్ము పూర్వ మెవ్వరి కైనన్
వేదన నొసఁగితినో కుమా
రాదుల దూర మొనరించి యని కడు వగచెన్ 3.

మ. కన నీ కాలము కూల్ప మన్కిని ననుం గైకేయి బాధింపఁగాఁ
దనయుం గాంచఁగ నగ్ని సన్నిభు నిటం దా నెమ్మి నూనంగ మే
నున నారల్ విడి సూక్ష్మ వస్త్రములు విన్నూత్నమ్ము లెల్లం గటా
నను నా మృత్యువు మ్రింగ రాదు వడి సంత్రస్తాత్మ్ము నాశ్చర్యమే 4.

కం. వంచన నూని యొకర్తయె
యెంచి తనదు లాభ మెల్ల నివ్విధిఁ జేయన్
ముంచెను దుఃఖాంభోధిఁ బ్ర
పంచ జనుల నెల్లఁ గైక పాపపుఁ గృతియే 5.

చం. అని గిర లిట్లు భాష్పజల మడ్డు పడంగ నృపుండు రామ నా
నని యొక మాట రాక యిఁక నాతని కెద్ది వచింప నిల్చి తాఁ
గని తగ సంజ్ఞ నశ్రువులు కన్నుల నిండఁగఁ గాంచి యా సుమం
త్రుని నిజ మంత్రి నచ్చటను దుఃఖము తోడనె పల్కె నివ్విధిన్ 6.

ఆ.వె. ఉత్త మాశ్వ నివహ యుక్త రథమ్మును
యాన వరము తెమ్ము సూను నీ మ
హానుభావు నంప ననువుగ జనపద
మున కవతలకు సుఖముగను సూత! 7.

తే.గీ. వీరవరు సాధుచారిత్రు మూరి పుత్రు
ని వెలిపేసి రక్కట జననీజనకులు
ఫల మిది గుణవంతుని గుణములకు నంచు
నేఁ దలంతు నెద సుమంత్ర! నిశ్చయముగ 8.

ఆ.వె. ఆలకించి మానవాధీశు మాటలు
వేగ వర్తనుండు వేగ కట్టి
తురగములను మేటి యరదమునకు నా సు
మంత్రుఁ డరుగు దెంచెఁ దంత్ర విదుఁడు 9.

కం. కనక విభూషిత మా రథ
మును దెచ్చి నృపాత్మజునకు మొగుడిచి కరముల్
ఘన వర హయ యుక్తమ్మును
వినయమ్మునఁ దెలిపె నంతఁ బేరిమి తోడన్ 10.

చం. శుచిని ధనాధికారిని వసుంధరకుం బతి సత్వరమ్ముగా
నచటకుఁ బర్వి రమ్మనఁగ నానతి నీ నరుదెంచ వానితో
వచనము లిట్లు పల్కె వర వస్త్రము లంచిత భూషణమ్ములన్
రుచిరము లేండ్లకుం దగ సులోచన కిండు గణించి సీతకున్ 11.

తే.గీ. మూరి యంతఁ గోశాగారమునకు నేఁగి 12.

రాజు నాజ్ఞ సర్వము దెచ్చి రయముగ ధన
నిధిపతి యొసంగె సీతకు నిఖిల మంత
సదమలాంగి ధరించె భూషణము లలరి

ఆ.వె. వెల్గె భూషణముల౯ బృథ్వీ తనయ యింట
నందముగ నుదయము నందు౯ జక్క
గ నుదయించెడు దినకరు౯ బ్రభారాశిని
నభము నందు౯ బోలి నారి సీత 13.

ఆ.వె. అంత సీత౯ గాంచి యత్త కౌసల్య కౌ౯
గిలి భుజద్వయమున౯ బలికె నిట్లు
ముద్దిడి తల పైన మూర నదీనయై
జనక తనయ యచట సంభ్రమమున 14.

తే.గీ. లోకమున నసదంగనలు నిరతమ్ము
పతులచే మన్ననల నంది వారి నెంచ
రింత కష్టము కల్గిన నింతు లకట
వింటె వైదేహి యా తెలిగంటు లుంట 15.

ఆ.వె. ఇట్టి వారు పూర్వ మెల్లరు ననుభవిం
చి భృశముగ సుఖములు సెల౯గి కలుగ
నల్ప మయిన వారి కాపద సైపరు
వీడ నెంత్రు కూడ విస్మయముగ 16.

కం. చెడు నడతల వారు మఱు౯గు
టెడంద కలవారు యువతు లెల్లరు దోసం
బడరు తలంపులు నిండిన
పడతులు త్రుటి వీడ౯ గలరు వలపు తలంపన్ 17.

కం. కులమున నొనర్చి నట్టి ప
నులను బహుమతులను విద్యను నయిన సంప
త్తులను లతాంగుల డెంద
మ్ములు తృప్తిల వవి యనిత్యములు సంతతమున్ 18.

ఆ.వె. శీలమున శమమున మేలి సత్యమ్మున
శ్రుతుల నిల్చి నట్టి సతులకు వర
సాధ్వులకు ధవుండ చారుశీల! విశిష్టుఁ
డును పవిత్రుఁడు నగు ననవరతము 19.

కం. నా సుతుని నీ వివాసితు
నో సుదతీ దైవ సదృశ మూహింపు మెదన్
వీసము సిరి లేకున్నను
దా సిరుల మునిఁగిన నైనఁ దలఁప కవజ్ఞన్ 20.

కం. విని ధర్మ సహిత వచనము
ల నత్త పలుకంగ సీత రమణీమణి తా
ననె నిట్టు లంజలి ఘటిం
చి నిలిచి యెదురుగ వరాంగి చెన్నుగ నంతన్ 21.

తే.గీ. చేసెద పతి శాసించిన చెన్ను నన్ను
సత్వరమ్ము దేవి యలరి సతి తన పతి
తోడ నెట్లు మెలఁగ నొప్పుఁ దోరముగ నె
ఱుంగుదును నేను వింటి నా సంగతి మును 22.

తే.గీ. దుష్ట జనులతో నను దగదు నరయంగ
సమముగ నెపుడు దేవి! నిజము చలింప
నేర నేను ధర్మము నుండి నీర జారి
నెపుడు వీడని ప్రభ వోలె నెలమి నుందు 23.

తే.గీ. లేక తంత్రులు మోగదు వీఁక వీణ
లేక చక్రము లరుగదు గాక రథము
లేక పతి తథ్యము సతికి పోక సుఖము
నూఱుమంది తనయులున్న మీఱు వగపు 24.

ఆ.వె. మితముగనె యొసంగు పిత తనయుల కెంచ
మాత గూడ మితపు దాత్రి సుమ్ము 25.

మిత మెఱుంగఁ డీయ పతి సతి కెన్నఁడు
పతినిఁ గొలువ నట్టి పడతి గలదె

తే.గీ. ఆర్య! నేనేల శ్రేష్ఠ వరాంగన నయి
పతినిఁ గించపఱప నెంతు పత్ని ధర్మ
ములు వినిన సతి నెన్నఁడు  పుణ్య సతుల
కగును భర్త సతము దైవ మవని యందు 26.

కం. విని సీత పలుకులు మన
మ్మున కింపు నొసఁగిన వానిఁ బుణ్యాత్మ వడిం
గనుల విడిచె నశ్రువులను
జనితమ్ములు దుఃఖ హర్ష సంయోగమునన్ 27.

ఉ. వారని ధర్మ తత్పరుఁడు ప్రాంజలిఁ దల్లుల మధ్య రాముఁడే
గౌరవ నీయ యైన వర కాంతను మాతను జేరి పల్కెఁ దా
మూరుచు నంబ శోకమును బూర్తిగ వీడుమ తండ్రిఁ జూడుమా
తీరు నరణ్య వాస మిది దిట్టతనమ్మున సత్వరమ్ముగన్ 28.

తే.గీ. ఏడు నే డేండ్లు నిద్రింప నీవు గడచు
మాత! చింతింపఁగా నేల మమ్ము గూర్చి
నన్ను జూతువు  వని నుండి క్రన్ననఁ దిరి
గి యరుదెంచ సఖులు గూడఁ బ్రియ తనయుని 29.

కం. చక్కఁగ నిట్లు పలికి పే
యక్కడ నిజ మాత తోడ నాతం డంతన్
మక్కువ మున్నూ ఱేబది
తక్కిన తల్లుల నరసి సుత ప్రవరుఁ డనెన్ 30.

తే.గీ. అవ్విధముగ విచారించు నా జననులఁ
గాంచి దాశరథి మొగిడ్చి కర యుగమ్ము
ధర్మ యుక్త మనియె నిట్లు తల్లు లార
సైచి తప్పు లనుజ్ఞ నొసంగ వలయు 31.

కం. వినిరి సుసంహితములు రా
ముని నయ యుక్త వచనములు భూనాథ సతుల్
మనమున శోకమ్ము చెలఁగ
వనితా రత్నమ్ము లపు డపారం బెదలన్ 32.

ఆ.వె. ధరణి నాథ సతులు తద్దయు విలపింప
నాలకించి రాముఁ డనఁగ నట్లు
రావములు చెలంగెఁ గ్రౌంచీ రవమ్ముల
పగిది మిక్కుటముగ భవన మందు 33.

తే.గీ. డప్పు మద్దెల ధ్వనుల నడరఁగ మున్ను
దశరథుని సౌధ రాజము దద్దరిల్లె
రోదనమ్ముల నిప్పుడు మోది కొనుచు
రాణు లేడ్వ భృశమ్ముగ రాజు నెదుట 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు ముప్పది తొమ్మిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 40.

రాముఁడు సీత లక్ష్మణుఁడు దశరథునకు నంజలి ఘటించి ప్రదక్షిణములు సేసి యడవికి రథమున బయలుదేరుట, దారిలో నంతఃపుర స్త్రీలు, పౌరులు దశరథుఁడు విలపించుచు ననుగమించుట. దశరథుఁడు రాముని఼ జూచుచు నిలఁబడిపోవుట.

ఆ.వె. రాజు పదము లాని రాముఁడు సీతయు
లక్ష్మణుండు నిజ కరద్వయమ్ము
మోడ్చి దీనుల గతి మూరి ప్రదక్షిణ
ము లొనరించి రంత లలితముగను 1.

తే.గీ. తండ్రి యనుమతి గైకొని ధర్మవిదుఁడు
సీతతో రాముఁడు మునిఁగి చింతఁ దల్లి
పాద పద్మములకు భక్తి వందనమ్ము
లాచరించెను గౌసల్య కంత నపుడు 2.

ఆ.వె. లక్ష్మణుండు వేగ భ్రాత పిదప రామ
మాత పదములకు నమస్కృతు లిడి
మఱి సుమిత్ర తనదు మాత కొసంగెను
నతుల వెండియుఁ జరణమ్ము లంటి 3.

చం. నతుల నొసంగు లక్ష్మణుని నందను నారసి దీర్ఘ బాహునిన్
హితద సుమిత్ర మూర్ధమును నింపుగ మూర్కొని పల్కె నేడ్చుచున్
సుత! జనియించి తీ వరుగ శూరుఁడ! కానకు మిత్ర రక్షుఁడా!
రతిఁ జరియించుచున్ వనిని రామునిఁ గూడదు విస్మరింపఁగా 4.

తే.గీ. కష్టముల నైన నింక సుఖమ్ము లందు
ననఘ! యితఁడు నీ కగు దిక్కు తనరి యగ్ర
జు వశ మందు మెలంగుట యవని యందు
సజ్జనుల కగు ధర్మము సత్య మెంచ 5.

తే.గీ. ఇదియ యుచితమ్ము కులమున కిది సనాత
నంపు ధర్మము దీక్ష జన్నమ్ము లందు
దానములు దగు నింక యుద్ధమ్ము లందు
దగును జేయంగ నిజ తను త్యాగ మడరి 6.

కం. అని లక్ష్మణుతో నివ్విధిఁ
జనని సుమిత్ర రఘురాముఁ జనఁ దొడఁగిన నం
దనునిం గని మఱల మఱల
యనెఁ జను చను రామ! యంచు నబలా మణియే 7.

తే.గీ. తలఁపు రాముని లక్ష్మణ! దశరథునిగ 8.

సీత నెంచుమ మాతగఁ బ్రీతి తోడఁ
దలఁపు మయ్య యడవి నయోధ్యగను బుత్ర!
యరుగు మింక సుఖమ్ముగ నన్నతోడ

కం. అంత సుమంత్రుండు వినయ
వంతుఁడు వినయజ్ఞుఁ డరసి ప్రాంజలి ననె భూ
కాంత సుతునితో నిర్జర
కాంతునితో మాతలి వలెఁ గన్పడ నపుడున్ 9.

కం. ఎక్కు మరదమ్ము భద్రము
మిక్కుట మగు నీకు రామ! మేలుగ నే మీ
రెక్కడ దింప మనిన మి
మ్మక్కడ కిఁకఁ జేర్చెదను మహాయశ! వడినిన్ 10.

కం. పదునాలు గేండ్లు వన మం
దు దేవి యన నుండ వలయుఁ దూర్ణము రామా!
యది పూరింపఁగ నింపుగఁ
గదల వలె రఘూద్వహా! యిఁకఁ గాకుత్స్థ వరా! 11.

చం. అరదము నెక్కె సీత వడి నంచిత భూషల నూని యింపుగం
ధరణిజ సంతసమ్మున నితంబిని భామకు వెన్క నా మహా
పురుషులు రామలక్ష్మణులు భూరి దివాకర సన్నిభమ్ము భ
వ్య రథము నెక్కి రగ్నినిభ  బాసితముం గలధౌత యుక్తమున్ 12.

ఆ.వె. ఏండ్ల లెక్కకుఁ దగ నిచ్చె బట్టల నింక
నగలను దశరథుఁడు నాథు ననుస
రించి యేఁగు సీత కింపుగ మామయె
కాంచి యంత వేగ కరుణ తోడ 13.

ఉ. ఆ విధి నాయు ధావళి మహా కవచమ్ములు దార్ఢ్య చర్మముల్
ధీవరు లైన భ్రాతలకు దివ్య రథమ్మున నుంచ సీత యా
పావని కాఁగ మూడవది వాహన మందు సుమంత్రుఁ డంతటన్
వావిరిఁ దోలె నశ్వముల వాయు జ వాభ విరాజితమ్ములన్ 14.

కం. కనఁ జిరకాలమునకు వన
మున కేఁగుచు నుండ నగరము త్రుటిని మూర్ఛి
ల్లెను బలమెల్ల నశించెను
జనులకు రాఘవుని నట్లు సంతాపమునన్ 15.

ఆ.వె. నగర మంత నిండె నాదమ్ముల మద కు
పిత గజస్వనముల భీమ తురగ
శింజిత నినదములఁ జెలఁగి భీకరముగ
నొక్క త్రుటినిఁ గాంచు చుండ నపుడు 16.

తే.గీ. బాల వృద్ధుల తోడ నా పట్టణమ్ము
పీడితమ్ము పర్వు లిడెను వీరవరుఁడు
రాముని వెనుక నార్తి నీరమ్ము న కయి
పర్వు లెత్తు ఘర్మార్తుల భంగి నపుడు 17.

చం. వెనుకను బ్రక్కలందును సవేదన పాఱుచుఁ గాంచి యాతనిం
గనులను నిండ నీరు జనకాయము పల్కె నెలుంగు మీఱఁగా
విను విను సూత లాగుమయ పేగుల కళ్ళెము లింక మెల్లగాఁ
జను కన నెంతు మాస్యమును జక్కఁగ రాముని చూడ కుంటిమే 18.

ఆ.వె. దేవ సూను సదృశుఁ డీ వర నందనుం
డరుగుచుండ వనికి నరసి రామ
మాత హృదయ మిట్లు మనఁగఁ బగులకుండ
నరయ నినుప గుండె యగును జుమ్ము 19.

కం. కృతకృత్య సీత ఛాయా
గతిఁ జక్కఁగ ననుసరింపఁ గాంతుని నెన్నం
డతివ విడువకయె ధర్మపు
రతితో మేరువు వదలని రవి కాంతి వలెన్ 20.

కం. ఆహా సిద్ధార్థుండవు
సాహాయ్యము లక్ష్మణా! భృశమ్ముగఁ జేయన్ 21.

వాహన మెక్కితివే ఘన
బాహు! సుర నిభాగ్రజ హిత వచనున కెలమిన్

తే.గీ. ఇయ్య దగు గొప్పసిద్ధియె యియ్య దగును
గొప్పవృద్ధి యిమ్మార్గము గూర్చు నీకు
స్వర్గమునకు నింపగు దారి చారుతరము
నీ వనుసరించు చుంటివి నీదు భ్రాత 22.

కం. అన్నరు లివ్విధిఁ బల్కుచుఁ
గన్నీటిని నాప లేక కన్నులలోనన్
పెన్నంటిరి యిక్ష్వాకునిఁ
గ్రన్ననఁ బ్రియ రాముని నటఁ గాంచుచు నార్తిన్ 23.

కం. అంత నృపుఁడు దీనుండై
యింతుల దీనలను గూడి యింటిని వీడెం
జింతిలుచు నా దశరథుం
డంతఃకరణమునఁ గాంతు నాత్మజు నంచున్ 24.

కం. ఆతఁడు వినె ముందు ధ్వనుల
నాతతముగ నేడ్చు చుండ నబలా మణులే
మాతంగ గణం బేడ్చెడు
రీతినిఁ బద్ధ ద్విరద వరేణ్యునిఁ గాంచన్ 25.

తే.గీ. సన్నగిల్లెను జనకుండు మిన్నగాను
భూధవుండు కాకుత్స్థుండు పూర్ణ చంద్రు
భంగి రాహు గ్రహమ్ముచే మ్రింగఁ బడఁగ
నయ్యవసరమ్మునఁ గుముల నార్తి తోడ 26.

తే.గీ. కీర్తిమంతుఁడు రాముఁ డనార్త చిత్త
దాశరథి త్వరపఱచె సూతవరు నంత
వేగముగ స్యందనమ్మును వీఁగి నడుప
మంచుఁ బల్కుచు నప్పుడు మించ ధృతియె 27.

తే.గీ. చనుము చను మంచు రాముఁడు సాగు మనఁగ
నిలుపు నిలుపు రథం బని పలువు రనఁగఁ
బౌరులు గతిని సూతుఁడు ధ్వనిని వినిన
శంక వలన రెండును జేయఁ జాలకుండె 28.

తే.గీ. రాముని మహాభుజుని ఘన రథ మరుగుచు
నుండఁ బైకి లేచిన దుమ్ము నిండ దిశలు
పౌర జనుల కన్నీ రది పాఱ నచట
మునిఁగి శాంతించె వింత గొల్పుచుఁ గడింది 29.

ఆ.వె. రోదనమ్ము వలన మేదిని కన్నీటి
తోడ నిండఁ బురినిఁ దూర్ణ మంత
రామ గమన మందు రవము లాహా కార
ములు సెలంగ వ్యథను బొందెఁ బురము 30.

తే.గీ. కలఁత రేఁగిన కన్నీరు కాంతల కను
గవల నుండి కాఱ నపుడు కానిపించెఁ
జేపలు కదల్పఁ దమ్ములు చిత్ర గతిని
రాల్చు నీటి బిందువుల పెరవునఁ దనరి 31.

కం. శ్రీమంతుఁ డా నరేంద్రుఁడు
రాముని యంద మన ముంచి రయమున రాగం
బే మీఱఁ గని పురి పెతను
భూమిని హత మూల తరువు వోలెం గూలెన్ 32.

కం. అంతఁ జెలఁగె నయ్యయ్యో
వింత ధ్వనులు వేగ రాము వెనుకను గనఁగాఁ
జింతం గూలిన దశరథు
నింతుల మధ్య నరులెల్ల సేడ్వ నొక త్రుటిన్ 33.

కం. హా రామా యను కొందఱి
హా రామాంబా యనియెడు నన్యుల యేడ్పుల్
నారీమణులను బిగ్గర 34.

గా రోదింపంగఁ జేసెఁ గన్నుల తోడన్

ఉ. వెనుకకుఁ జూడ రాఘవుఁడు వెంటను వచ్చెడి తల్లిదండ్రులం
గనెను విచార మానసులఁ గట్టఁ బడంగఁ గిశోరముం గనం
గ నెఱుఁగ రాని తల్లి వలెఁ గట్టఁ బడంగను ధర్మ రజ్జునం
గనుట కశక్యుఁ డయ్యె నృపకాంత సుతుం డటఁ బ్రస్ఫుటమ్ముగన్ 35.

తే.గీ. రథ వరమ్మున నేఁగ వలసిన వారు
కాలి నడక నరుగు చుండఁ గష్టములకుఁ
దగని సుఖముల కర్హులను గని పొమ్ము
పొమ్ము సూత వడిగ నంచుఁ బమ్మి పలికె 36.

కం. పురుష వ్యాఘ్రుఁడు రాముఁడు
బరిగోలఁ దపించు గజము భంగి నపుడు తా
నరయ జననీజనకులం
గరము వగచు చుండఁ జూలక వనరు చుండెన్ 37.

కం. లేగ కయి సాల కరిగెడి
యా గోవు పగిది వలపున నాత్రము తోడన్
వేగముగఁ బాఱు చున్నది
యేఁగు సుతుని రామమాత యీక్షించి తమిన్ 38.

మ. రుత యుక్తమ్ము రథమ్ము వెంటఁ జనుచున్ రోదించు కౌసల్యనున్
సుత రామా! యయొ సీత! లక్ష్మణుఁడ! నాఁ జోద్యమ్ముగాఁ బిల్చు నా
సతినిం గార్పఁగఁ గంట నీరు తమకై సాధ్వీమణిం గాంచె నా
ర్తత నాట్యం బొనరించు భంగి నలరం దల్లిన్ విచారమ్మునన్ 39.

తే.గీ. ఆపు మాపుము రథ మాపు మంచు రాజు
రథము పోనిమ్ము వడి నంచు రాముఁ డనఁగ
రెండు చక్రముల నడుమ నుండి నట్లు
తోఁచెను సుమంత్రున కపుడు దుష్కరముగ 40.

ఆ.వె. నింద లిడిన రాజు నే విన కుంటి రా 41.

జ! యని పలుక వచ్చుఁ బ్రియముగాను
జిరపు దుఃఖ మిడినఁ బరఁగుఁ బాపం బధి
కముగ రాముఁ డనియెఁ గని సుమంత్రు

కం. తలఁ దాల్చి రాము నానతి
వెలయ జనానుజ్ఞ యంత వెడలెడు గుజ్జి
మ్ములఁ దోలెను దా మిక్కిలి
బలముగ సారథి సుమంత్ర వర నాముండే 42.

ఆ.వె. చేసి రఘువరునకుఁ జెలిమిఁ బ్రదక్షిణ
మంత రాజ జనులు చింతతో మ
లఁగిరి చిత్తములు దిరుగ నేర వశ్రువు
లాగ నేర వకట వేగ మడర 43.

ఆ.వె. తిరిగి రాకఁ గోర నరుగ రా దనుగమిం
ప నతి దూర మతనిని నరనాథ!
యంచు మంత్రు లనిరి యా దశరథునితో
నవ్విధముగ వార లరసి పతిని 44.

తే.గీ. చెమటఁ దడిసిన మేనుతోనమరి యుండి
వగపు నిండిన రూపమ్ము వఱలు చుండ
వారి గుణ వాక్కులు విని సదార గణము
నిల్చెఁ జూచుచు సుతు జాలి నృపవరుండు 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 41.

రాముఁడు వనమునకు నేఁగఁగ నంతఃపురమున స్త్రీల యార్తనాదములు  చెలఁగుట, పౌరు లెల్లరు ప్రకృతియు విలపించుట.

కం. పురుషర్షభుండు రాముఁడు
కరములు మోడ్చి యరుగంగఁ గానకు నంతః
పురమున నార్త స్వనములు
తరుణులవి సెలంగె నంతఁ దారస్థాయిన్ 1.

తే.గీ. అక్కటా యెక్కడి కరుగు దిక్కు నింక
త్రాతయు ననాథులకు దుర్బల జనులకును
దాపసులకు నట్టి విభుండు భూప నంద
నుండు సద్గుణుం డినకు లేద్రుండు నిపుడు 2.

తే.గీ. అక్కటా యెక్కడి కరుగుఁ జక్కఁగను ద్య
జించి కిన్క నొసఁగునవి చేయు శాంతు
లుగను గ్రుద్ధులఁ దిట్ట నలుగఁడు పంచు
కొను విచారము లట్టి సద్గుణుఁడు ఘనుఁడు 3.

ఆ.వె. కరము భక్తిఁ దల్లి కౌసల్య నలరుచుఁ
గాంచు రీతి మమ్ముఁ గను మహాత్ముఁ
డితఁడు  సంతతమ్ము  నిత్తఱి నక్కట
యెక్కడి కరుగు నిటు లక్కజముగ 4.

ఆ.వె. కరము క్లేశము లిడ కైకేయి దశరథుఁ
డనుప వనికి భువికి జనుల కెంచ
రక్షకుండు ఘనుఁడు రఘు రాముఁ డక్కట
యెక్కడి కరుగు సుతుఁ డెట్టు లుండు 5.

కం. జీవుల కెల్లఁ బ్రియతముని
నీ వర సత్యవ్రతు ఘను నీ ధర్మ రతుం
దా వని కంపెను రామునిఁ
బోవఁ దెలివి యెల్ల నిట్లు భూవరుఁ డకటా 6.

ఆ.వె. దూడ లేని యావు దుఃఖించు రీతిని
నంతిపురము నందు నింతు లెల్ల
శోక తప్త చిత్త సుదతు లేడ్చిరి బిగ్గ
రగ దిశలఁ జెలంగ రవము లిట్లు 7.

ఆ.వె. సుతుని వలని ఘోర శోకమ్ము తపియింప
నంతిపురము నందు నడరి నట్టి
యార్తనాదములను నాలకింప మహీప
తి యతి దుఃఖితుండు నయి చలించె 8.

తే.గీ. అగ్నిహోత్రము లెల్లెడ భగ్న మయ్యె
వంట లుంట నిండ్ల నకట కంటఁ బడదు
జనులు కార్యమ్ము లొనరింపఁ గనఁగ రాదు
సూర్యుఁ డస్తమించె నపుడు చూచుచుండ 9.

తే.గీ. కూటి నెల్లఁ గక్కిన వంతఁ గుంజరములు
పాల నీయవు దూడల కాలు చింతఁ
బుట్ట మొట్ట మొదట మగపట్టి తనకుఁ
దల్లి సంతసింప దెడఁదఁ దల్లడిల్లి 10.

కం. కుజ బుధ గురు త్రిశంక
వ్రజమ్ము సోమునిఁ గదిసెఁ బర గ్రహ కాయ
మ్ము జగతి ఘోరమ్ముగఁ గనఁ
బ్రజ లయ్యవసరము నందు భయ మొదవంగన్ 11.

తే.గీ. కాంతిఁ గోల్పోయె నెల్ల నక్షత్రము లిలఁ
గందెఁ దేజమ్ము నశియింప గ్రహము లెల్ల
ధూమవంతమ్ముగ విశాఖ భీమ గతిని
వెల్గె నప్పుడు వింతగ విన్ను నందు 12.

ఆ.వె. వాయు వేగ చలిత వారిధరము భంగిఁ
గడలి పొంగె వడి నగరము దూఁగె 13.

రాముని వనమునకు రాజు బహిష్కరిం
పంగ దశరథుండు వర తనయుని

తే.గీ. చీఁకటులు క్రమ్మిన విధి నచిరము దిక్కు
లెల్ల కలఁతఁ జెందె గ్రహము లేని తార
లేని నభమందు నించుక యేని వెల్గ
కున్న వప్పుడు కాంతులు సన్న గిల్లె 14.

ఉ. ఒక్క త్రుటిం బురంపు జను లొందిరి దైన్యము నన్నమందు నే
నక్కట యే విహారముల యందు మనమ్ముఁ జరింప నీయరే
మిక్కిలి నిశ్వసించుచు నమేయ విచార నిమగ్నులై నృపుం
డక్కరి నాఁ దలంచుచు దృఢమ్ముగఁ గుందిరి యెల్ల రత్తఱిన్ 15.

ఆ.వె. కన్ను లందు నిండఁ గన్నీరు ఘన రాజ
వీథి నరుగు జనులు వేదనావ్ర
తాస్యు లందుఁ గనము హర్షమ్ము శోకప
రాయణు లయిరి సకల నరు లరయ 16.

తే.గీ. గాలి వీవదు చల్లగఁ గాంచ నచట
చంద్రుఁ డగపడఁ డచ్చట సౌమ్యముగను
దాప మివ్వఁడు సుంతయుఁ దపనుఁ డచట
లోకమెల్ల మునింగెను శోకమందు 17.

తే.గీ. తనయు లక్కట కోరరు తల్లుల నల
భర్త లడుగ రక్కజముగ భార్యల మఱి
భ్రాత లొకరి నొకరి విడువంగ నెల్ల
రన్ని స్మరియింత్రు రాముని నంద ఱెడఁద 18.

కం. రామ సఖు లెల్ల శోకం
బే మదిఁ జూఱఁ గొన మోహమే తనరంగన్
క్షేమంబుగఁ దల్పమ్ముల
నే మేనులు వాల్చి లేవ రెంతకు నకటా 19.

తే.గీ. విరహిత పురందర సశైల పృథ్వి వోలె
విగత రాఘు వాయోధ్యయె బెదరి భయము
శోక మడరంగ వణఁకె ననేకప వర
యోధ హరి గణము లఱచె నుద్భటముగ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది యొకటవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 42.

రాముఁ డేఁగు చుండ రథపు దుమ్ము కనఁబడు నంత వఱకుఁ జూచుచు దశరథుఁడు మూర్ఛిల్లి పడిన దరి సేరిన కైకను నిందించుట. కౌసల్య నాథుని లేపి యింటి కేఁగుట, రాజు విలపించుచు రాముని దలఁచుచుఁ గౌసల్యా దేవి గృహమున కేఁగుట.

కం. చనుచుండ సుతుఁడు రాముఁడు
కను నంత వఱకును దుమ్ము కాకుత్స్థుఁ డహో
కనులు మరల్పఁడు దశరథుఁ
డు నరవరేణ్యుఁడు కడుంగడు విషాదమునన్ 1.

తే.గీ. ప్రియతము నతి ధార్మికు నృవరేణ్యు నట్లు
రాజు చూచు నంత వఱకు రథము నుండి
లేచు చుండెను భువి దుమ్ము చూచు నాశ
రాము నంచును దోఁపఁగ గోముగాను 2.

ఆ.వె. అంత నరద మరుగ నా ధూళియు నదృశ్య
మయిన బాధఁ గుమిలి యవనిఁ గూలె
నవని ధవుఁడు దుమ్ము నయిన వీక్షింప నో
పంగ లేక యకట క్రుంగి భృశము 3.

తే.గీ. అంతఁ గౌసల్య పరుగున నాత్మనాథు
దక్షిణపుఁ జేతినిఁ గదియఁ దరుణి కైక
సేరె వామ పార్శ్వమునకు శీఘ్రముగను
భరతుని ప్రియతమంపు టంబయె చెలంగి 4.

ఉ. అంతట నీతి ధర్మ వినయజ్ఞుఁడు భూపతి గాంచి కైక నా
యింతినిఁ గర్హి తేంద్రియుఁడు హీన గుణాంగన నంతఁ బల్కెఁ దాఁ
జింత సెలంగఁ దాఁకకుము శీలవిహీనవు నాదు గాత్రముల్
చెంతఁ గనంగ నోర్వ నిను జీ సతి నా కిఁకఁ గావు బంధువున్ 5.

చం. నిను యజియించు వారి కిఁక నేనిటఁ జెందను వారు నాకునున్
ఘనముగ విత్త మంద రతి కాంత! చెలంగును నీకు వీడి నీ
తినిఁ జరియించి తీవు నిను దేజి త్యజించితిఁ బట్టి చేతిఁ జే
సిన యనల ప్రదక్షిణ మిసీ గణియింప నిటం బరమ్మునన్ 6.

తే.గీ. ప్రీతి నీ యవ్యయం బైన భూతలమ్ము
రాజ్యమును గైకొనినచో భరతుఁ డతం డొ
సంగఁ బితృ తర్పణము లవి యంగన విను
నన్ను జేరకుండును గాక యెన్నఁ డైన 7.

కం. వనరెడు కౌసల్యా సతి
తన పతి నరనాథు రేణు తనునిన్ దుఃఖా
ర్తుని లేపె నంత శీఘ్రమ
చనెను గృహ వరమ్మునకు విచారము తోడన్ 8.

తే.గీ. తనయు ధర్మాత్ముఁ దాపసుఁ దల్చు చుండి
రాముని ద్విజుఁ జంపిన రీతిఁ గామమున న
నలముఁ దాఁకిన భంగి యన్నర వరేణ్యుఁ
డధికముగఁ దపియించె శోకాబ్ధి మునిఁగి 9.

ఉ. నందను స్యంద నాధ్వము నృనాథుఁడు సూచుచుఁ దిర్గి తిర్గి తాఁ
గుందుచు డెంద మందు నతి ఘోరముగా గళి తార్క రూపపుం 10.

జందము వెల్గఁ డింతయును జక్కఁ బురాంతము సేర నోపు నీ
యిందు నిబాస్యుఁ డంచు సెద సెంచి తపించి వచించె నిర్వ్యథిన్

కం. గిట్టల గుర్తులు తమి నా
పట్టినిఁ గొనిపోవు నట్టి వాహములవి క
న్పట్టును ద్రోవలఁ జూడఁగఁ
గట్టా రాముఁడు ఘనుండు కనిపింపఁ డిటన్ 11.

తే.గీ. సుఖ మొసంగు చక్కటి దిండ్ల సోలు నాదు
మేటి పట్టి గంధ మలఁది మేనఁ జిగురు
టాకుబోడులు వీవ నేఁ డకట తరుల
మొదట ఊయి కఱ్ఱల నాని నిదుర వోవు 12.

తే.గీ. నేల పయి నుండి మెయి దుమ్ము వ్రాల లేచు
నిశ్వసించి పాపము ధరణిపతి సుతుఁడు
ప్రస్రవణ గిరి నుండి యిభ్యాగణ పతి
లేచిన పగిది నిద్రనుండి యక టకట 13.

కం. లేచి నడువ దీర్ఘ భుజు వ
నేచరులు తనయుఁ డనాథునిగ వన మందుం
జూచెదరు లోకనాథుని
నేఁచను రాజీవలోచను నరయ రామున్ 14.

కం. జనక సుత సుఖార్హయె కా
ననమున కంటకము లంఘ్రి నాటఁగ నకటా
వనితా రత్నము చరియిం
చును దప్పక నేఁడు గాంచఁ జోద్యము గాదే 15.

ఆ.వె. ఎఱుఁగదు వన మింత యేని భయం బది
చెలఁగ మిక్కుటముగ సీత రోమ
హర్షణములు ఘన భయావహములు ఘోర
మృగముల యఱపులు వినఁగఁ జలించు 16.

చం. అనయ! సకామపై విధవపై నివసింపుమ రాజ్య మందుఁ గై
క! నరవరేణ్యుఁ డీ సుతునిఁ గానక నే మన నుత్సహింప నా
నని విలపించి భూపతి జనావృతుఁ డంత నరిష్ట మైన పే
ళను గనిపించు స్నాత నరు లాగునఁ జేరెఁ బురోత్తమమ్మునున్ 17.

ఉ. బోసులు చత్వరమ్ములు నపూర్ణపు రాజ పథమ్ము లార్తులున్
మూసిన గుళ్లు నంగళులు పొక్కెడు దుర్బల మానవాళియున్
గాసిలి యున్న పట్టణము గాంచి తలంచుచు రాజు పుత్రు నా
వాసము సేరె సూర్యుఁ డల వారిద పంక్తినిఁ జేరు భంగినిన్ 18.

కం. గణి సీతా రామ స ల
క్ష్మణ విరహిత వర నరేంద్ర సద్మము తోఁచెన్
ఫణి గణ దర్పమ్ము గరుడుఁ
డణఁచుచుఁ గొనిపోవ నచల మైన హ్రద మనన్ 19.

ఆ.వె. గద్గదస్వరమునఁ గ్రందుచు మందము
గ మృదువుగను దీన గతి వచించె
మనుజ పుంగవుండు మాటల నివ్విధి
మాన వాధిపుండు మనము కనల 20.

ఆ.వె. కాంత రామమాత కౌసల్య యింటికి
నన్ను గొని చనుండు పన్నుగ నటఁ
గాక యన్య మందుఁ గనను నే శాంతిని
హృదయ మందుఁ బలుక నిట్లు రాజు 21.

కం. విని యా పల్కులు ద్వార
మ్మును గాచు భటవరు లంత మూరి వినయులై
జన నాథుఁ జేర్చిరి దశర
థునిఁ గౌసల్యా గృహమునఁ దూర్ణము భక్తిన్ 22.

చం. చని తన పెద్ద భార్య ఘన శాలకుఁ దల్పము పైకి నెక్కి య
య్యెను జలి తాంతరంగుఁడు నరేంద్రుఁడు పుత్రవరద్వయమ్ము తో
డను స్నుష కూడ లేని వికటంపు నివేశము గాంచె నప్డు చం 23.

ద్రుని నిసిఁ గోలుపోయిన సుదూర నభంపు నిభమ్ము వింతగన్

కం. భవనము గాంచి మహా రా
జు వీరుఁడు కరమ్ము లెత్తి చూచుచు పైకిన్
నృవరుఁడు హా రామ వెడలి
తివె నను వీడి యని యేడ్చెఁ దీవ్ర రవమునన్ 24.

ఆ.వె. అంత వఱకు నుండి యా రాముఁడు తిరిగి
రాఁగ వనము నుండి రతినిఁ గౌఁగి
లించు కొను జనులు సుఖించు వారలు సుమ్మి
కాంచి సుతుని రాము నంచితముగ 25.

ఆ.వె. రాముని పయిఁ జూపు రాదు తిరిగి నాకు
నింకను గనకుంటి నింతి మంచి
గ నిను జేత ముట్టు కౌసల్య యిప్పట్టు
నఁ గరుణను వహించి మగువ నన్ను 26.

కం. కని రామునినె తలంచుచు
ననిశము శయనమున నున్న యా నరపతినిన్
వనరుచు నిట్టూర్చుచుఁ బ్ర
క్కనఁ గూర్చొనె దుఃఖ తప్త కౌసల్య వడిన్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 43.

కౌసల్య భర్తను గాంచి పుత్రార్తియై విలపించుట.

కం. అలసి వగచుచుఁ బరుండిన
యిలాధవునిఁ బతినిఁ గాంచి యేడ్చుచుఁ బలికెం
గలఁతం గౌసల్య వచన
ము లిట్లు శోకార్త యంత పూర్ణాశ్రువులన్ 1.

తే.గీ. విషము సల్లి రాఘవుని పురుష వృషభుని
పైన నహి వోలె వంకరగా నడచెడి
కైక చరియించుఁ గుబుసమ్ము వీఁక విడిచి
నట్టి పన్నగి భంగిని నలరి యింక 2.

ఆ.వె. పంపి రాము నిట్లు వనమునకుఁ బడసెఁ
గోర్కె నింట నుండి కుమతి కైక
చెడ్డ పాము పగిదిఁ జెలఁగుచు బాధించు
నన్ను నిత్య మింక మిన్న గాను 3.

కం. ఒసఁగిన దాసునిగా నా
దు సుతుని నతఁ డుండు నింటఁ దూర్ణం బొనరిం
చి సవినయమ్ము పనులు తన
కొసంగినవి బిక్ష మెత్తి యొప్పుగ నగరిన్ 4.

తే.గీ. కైక కిష్టమయిన రీతి నా కుమారుఁ
ద్రోసి గతినుండి యొసఁగితె దుష్ట రక్క
సులకు భాగములను బర్వముల నొసంగు
నట్టి నహితాగ్నుల పగిది నక్కజముగ 5.

కం. వనము మహాబాహుండు గ
జనాథ గతిఁ జేరి యుండుఁ జాప ధరుండై
యనుజుండు లక్ష్మణుని బా
లను సీతను గూడి యింక రఘు వీరుండే 6.

కం. మున్నెట్టి దుఃఖ మెఱుఁగని
పిన్నలు కైక యనుమతిని విడువఁ బడంగం 7.

దన్నన్నది లేక వనిని
నన్నన్న యవస్థ వారి దట యెట్లుండున్

ఆ.వె. తరుణులు ఫల మూను తరుణమ్మున విడువఁ
బడిరి కఱవు కా విభవము లెల్లఁ
బాప మెట్టు లుండ్రు ఫలమూలము లశన
ములయి యుండ నచటఁ గలవరమున 8.

చం. తఱుఁగఁగ శోక మెల్లను సదార సలక్ష్మణ రాముఁ బుత్రు నే
నఱిముఱి లేక గాంచు సమయం బది వచ్చునె నాకు నింపుగాఁ
వఱలునె యీ యయోధ్య విని పార్థివ సూనుని రాక టెక్కెముల్
మెఱయఁగ సంతసిల్లి నిజ మిత్రులు పౌరులు చుట్టు ముట్టఁగా 9.

కం. తిరిగి నరవ్యాఘ్రు లుభయు
లరణ్యమును వీడి రాఁగ నత్యానందం
బరయునె యయోధ్య పర్వము
నరయ ముదం బంది చెలఁగు నంబుధి భంగిన్ 10.

ఆ.వె. రమణి సీత నుంచి రథమునఁ బ్రీతినిఁ
వీర దీర్ఘ భుజుఁడు చేరునే య
యోధ్యను బురవరము నుత్తమ వృషభమ్ము
గోవు ననుస రించు కోపు దనర 11.

కం. చల్లుదురె యక్షతలు నరు
లెల్లరు రాజపథ మందు నింపుగఁ దనయుల్
సల్లలితమ్ముగ రాఁగ మ
హోల్లసమున శత్రుమర్ద నోత్తముల పయిన్ 12.

కం. కాంచంగ నోతునె కదియ
నంచిత కుండల ధరులను నాయుధ వరముల్
మించి మెఱయఁగ నయోధ్యను
సంచిత శృంగాద్రుల వలెఁ జారు వదనులన్ 13.

కం. ఎప్పుడు గాంతును వారల
నిప్పురమునఁ దిర్గుచు మఱి యీయఁగ ఫలముల్
విప్పారిన కుసుమమ్ములు
నప్పడమి సురాత్మజలకు నానందముగన్ 14.

కం. ఎప్పుడు కదియును నన్నిఁక
గొప్ప వయో బుద్ధు లందు గుణ ధర్మజ్ఞుం
డెప్పటి యట్టుల నవ్వుచుఁ
జప్పున మూడేండ్ల బాలు సరణిం దోఁపన్ 15.

తే.గీ. వీర! మున్నేను బరమ లోభిని నయి కట
లీలఁ బాలను ద్రాగెడు లేఁగ లున్న
మాతృ గోవుల పొదుగుల నీతి వీడి
కోసి యుండుదుఁ దప్పక ఘోరముగను 16.

కం. సింగముచేఁ గోల్పోయిన
భంగి మొదవు తనదు దూడఁ బార్థివవర్యా!
యంగన కైకేయి వలన
నంగజుఁ గోల్పోయితి నిట నాహా వింటే 17.

కం. ఏకైక సుతు గుణావృతుఁ
బ్రాకట శాస్త్ర నిపుణుఁ గన రాకున్న ధరన్
నా కీ జీవితమం దిఁక
నే కొంచెపు టాశ యుండ దెవ్విధి నైనన్ 18.

కం. ఘన బలుఁడు మహా బాహుని
గనఁ జాలని నాకు ముదము కలపై యుండుం
దనయు నతిప్రియు నిజ జీ
వనమున సామర్థ్య మైనఁ బరఁగదు లవమున్ 19.

కం. లేచిన తనూజ శోకము
పేఁచుచు నున్న దనల మయి విస్తారముగన్ 20.

లేచి దినకరుఁడు వేసవిఁ
గాఁచు విధి భువినిఁ బ్రచండ కరముల చేతన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది మూడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 44.

విలపించు చున్న కౌసల్యా దేవిని సుమిత్రా దేవి యూఱడించుట.

కం. విలపించు చుండ నుత్తమ
లలనం గౌసల్యను గని లాలన తోడన్
నలినాక్షి సుమిత్ర నయపుఁ
బలుకులు ధర్మమున నిల్పి పలికె రయమునన్ 1.

ఉ. జాలిగ నేడ్వ నేల సుతు సద్గుణ యుక్తునిఁ బూరుషోత్తమున్
బేలగఁ దల్చి బాధఁ బడ వింతగ రాజ్యము వీడి యేఁగె భూ
పాలుని సత్యవాక్కునిగఁ బన్నుగఁ జేయఁగఁ దండ్రి బల్లిదుం
డీ లలి తేద్ద వర్తన మృగేంద్ర నిభుండు మహాత్ముఁ డిత్తఱిన్ 2.

తే.గీ. శిష్టవరు లాచరించు విశిష్ట ఫలము
లొసఁగు పరలోకమునను మహోన్నతముగ
నట్టి ధర్మ మార్గమ్మున నలరి సుతుఁడు
శ్రేష్ఠుఁడు నిలిచె రాముఁడు చింత దగదు 3.

తే.గీ. అనఘుఁ డీ లక్ష్మణుండు నిత్యమ్ము నుండు
మంచి వర్తనమున దయ నుంచు జీవు
లందు లాభము సేకూర్చు నందనునకు 4.

రామునకు మహాత్మునకు నరణ్య మందు

కం. ధర్మాత్ముని నీ పుత్రుని
నర్మిలిఁ దా ననుస రించె నవనీ సుతయే
నిర్మల చరిత్ర కానన
కర్మావస్థ లెఱిఁగియు సుఖముల కుచితయే 5.

కం. జగమునఁ బ్రసిద్ధ కేతన
మెగురం జేయును విభుండె యీ నీ సుతుఁడే
తగ సాధింపని దెయ్యది
యగు సత్యవ్రత స నయ మహాధనున కిలన్ 6.

ఆ.వె. ఎఱిఁగి రాముని శుచి నింక మాహాత్మమ్ము
నినుని కిరణ రాశి యిన కులప్ర
వరుని రాముని తనువరము దహింప న
ర్హమ్ము కా దని విశదమ్ము సుమ్ము 7.

కం. సేవించు నిత్య మనిలము
దా వీచుచు యుక్త శీత తదను గుణో ష్ణా
పావృత రీతిని రాముని
నా వన మందు శుభదముగ నన్ని ఋతువులన్ 8.

కం. రాతిరి పరుండ జనకుని
రీతి నితనిఁ గౌఁగిలించి లీలగ శశియే
ప్రీతిని శీతల కిరణము
లే తాఁకఁగ హర్షమిచ్చు నీ యనఘునకున్ 9.

ఉ. ఇచ్చెను బ్రహ్మ యస్త్రముల నీ వర వీరుని రాఘవేంద్రునిన్
మెచ్చి తిమిధ్వ జాత్మజుని మీఱి వధింపఁగ దైత్యు నాజిలో
నిచ్చటఁ గా ననమ్మున వసించిన నింట వసించు రీతినిన్
నిచ్చలు నుండు రాము డిఁక నెమ్మిని స్వీయపు దోర్బలమ్మునన్ 10.

ఆ.వె. ఎవని యమ్ముల గతి కెదురు నిల్వ నశించు 11.

శత్రు కోటి యెల్ల సమర మందు
వాని శాసనమ్ము నూన వసుంధర
యర్థ కాదె సందియ మది యేల

ఆ.వె. ఆ పరాక్రమమ్ము నా శుభ సత్త్వమ్ము
మీఱ రాఘవుండు మేది నీశు
నందనుండు వేగ పొందు రాజ్యమ్ముఁ బూ
రించి వన నివాస మంచితముగ 12.

చం. రవి కగు భాస్కరుండు నన లమ్మగు నగ్నికి దేవి! రాముఁ డం
చ విభుఁడు మానవేంద్రులకు సంపద శ్రీలకు కీర్తి కీర్తికిన్
దివిజుల కౌను దేవతయె తీ రగు నోర్పున కోర్పు చేతన
ప్రవరుఁడు భూతకోటి వన పట్టణ వాస విభేద ముండుసే 13.

ఆ.వె. మూటి కెలమి వేగ భూమికి సీతకు
శ్రీకి నందనుఁ డభిషిక్తుఁ డగును
బురుష పుంగవుండు భూరి యశస్వి రా
ముండు చింత నింక నుండ నేల 14.

తే.గీ. కార్చు చుంటి రశ్రువులు శోకమున, పెడలు
రాముని఼ గని, యయోధ్యా పుర వరు లెల్ల
నార చీరల దుర్జయునకుఁ దలంప
లక్ష్మి వలె సీత యుండ దుర్లభము కలదె 15.

తే.గీ. విల్లు నమ్ము లస్త్రమ్ములు భీకర కర
వాలము ధరియించి స్వయము పౌరుషమ్ము
మూర నగ్రజునకు వనమున ననుజుఁడు
లక్ష్మణుండు ముందుండ దుర్లభము కలదె 16.

కం. విడు శోకము మోహమ్మును
నెడందఁ గల్యాణి! తిరిగి యింపుగ వచ్చుం
గొడు కడవి నుండి సత్యము
నుడువుచు నుంటిఁ గనియెదు వినుమ నీ సూనున్ 17.

కం. శిరసును వంచి సుతుఁడు నీ
చర ణాబ్జమ్ములకు మ్రొక్కఁ జారు తరముగా
నరయఁ గలవు కల్యాణీ!
తిరిగి దివి నడరు శశాంకు తీరున వినుమా 18.

కం. అతివ! కనుంగవ నుండి వి
డుతు వానం దాశ్రువులు కొడుకు నారసి నీ
వతఁ డభిషిక్తుఁడు కాఁగ ను
చిత రీతిం దిరిగి వచ్చి సిరులన్ వెలుఁగన్ 19.

ఆ.వె. కలుగ దింత యేనిఁ గష్ట మిల రఘు రా
మున కశుభము, శోకమును ద్యజింపు
చేర రాఘవుఁడు ససీత సలక్ష్మణుఁ
డై యచిరము గాంతు వలర మనము 20.

కం. అనఘా! దేవీ! నీ వీ
జనవ్రజము నూఱడింపఁ జను నివ్వేళన్
మనమునఁ గుందుదు వేలా
ఘనముగ ధైర్యంబు నూనఁ గార్యము సుమ్మీ 21.

చం. వగవఁగ రాదు దేవి! నిజ బాలుఁడు రామునికై మనమ్మునన్
జగతిని సత్య మార్గమునఁ జక్కఁగ రాముఁడు నిల్చి నట్టుల
న్మగలను గాంచ మెచ్చుట జనమ్ముల మేఘు జలమ్ము భంగి నిం
పుగను నమస్కరింపఁ గని పుత్రుని రాల్తు ముదశ్రువుల్ వెసన్ 22.

చం. మరలగఁ దా నయోధ్యకుఁ గుమారుఁడు స్వీయ మృదూన్నతమ్ములౌ
కరముల నీ పదాబ్జములు గట్టిగఁ బట్టి నమస్కరింపఁగాఁ
వర సఖ బృంద సంయుతుఁడు వారిద పంక్తి గిరీంద్రుఁ దడ్పు రీ
తి రమణి! కార్తు వశ్రువులఁ దీరఁగ దుఃఖము హర్షజమ్ములన్ 23.

తే.గీ. లలన వాక్యోపచార కుశల వచించి
యనునయంపు వాక్కులు పెక్కు లంత రామ 24.

మాత తో నచట సుమిత్ర ప్రీతిని నన
వద్య విరమించెఁ బలుకంగ వనజ నేత్ర

తే.గీ. ఆలకింప లక్ష్మణ మాత యనిన గిరలు
రామమాత కౌసల్య నరవర పత్ని
శోక మెల్ల నశించెను జూడ శరదృ
తువున మేఘోదకము తగ్గిన విధ మడరి 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 45.

సీతా రామ లక్ష్మణులు రామునిపైఁ బ్రేమతోఁ బౌరులు సఖులు వనమున నుండుటకుఁ దోడు చనుచుండఁ దమసా నదీ తీరము సేరుట.

కం. మానవు లర్మిలి తోడుతఁ
గానన వాసార్థము ఘన కాకుత్స్థుం డా
మానవ వరేణ్యు సత్యం
బైన పరాక్రముని వెంట నరుదేరి రటన్ 1.

తే.గీ. బలిమిని మరలించిన రాజు నలయక సఖు
లపుడు వెడలిరి రాముని యరదము వెను
కనె రతిని రాముఁడు సుగుణాకరుఁడు నగరి
నందఱికిఁ బూర్ణ శశి వలె నయ్యెఁ బ్రియుఁడు 2.

కం. తన వా రభ్యర్థించిన
జనకుని సత్యవ్రతునిగఁ జల్పఁగ ధృతినిన్ 3.

వనమున కేఁగఁ దలంచెను
ఘనుఁ డా రఘు రాముఁ డట్లు కాకుత్స్థుండే

కం. కనులం గ్రోలెడు భంగిని
ననురాగమ్మున నరయుచు నాత్మజుల వలెన్
జనులను గాకుత్స్థుఁడు ప్రీ
తినిఁ బల్కెను వారి తోడఁ దియ్యగ నిట్లున్ 4.

శా. నా పైఁ జూపిన ప్రీతి గౌరవములన్ నా నోద రాగ్ర్యుండునున్
భూపాలాత్మజుఁ డైన యీ భరతుపైఁ బూర్ణంబుగాఁ జూపుఁడీ
నా పౌరోత్తములార కైకకు మహానందప్రదుం డింపుగా
నీ పుణ్యాత్ముఁడు సేయు మీ ప్రియము లింకెన్నేని మేళుల్ దమిన్ 5.

ఉ. వృద్ధుఁడు జ్ఞానమం దితఁడు పిన్నవయస్సునఁ గోమలుండు దా
నిద్ధ గుణోన్నతుండు పతి యింపుగఁ గాఁగల వాఁడు సుమ్ము మీ
కిద్ధర యౌవ రాజ్యమున నీతని నిల్పెను రాజు ధర్మ స
ద్బుద్ధుఁడు గౌరవింపఁ దగుఁ బార్థుని యాజ్ఞను నాకు మీకునున్ 6.

తే.గీ. నాకు మేలొనరింపఁగ వీఁక నున్న
చో నలరి వన మేగఁగ నేను రాజు
చింత నుండని రీతిని నంతరంగ
మందు సంచరింపఁగఁ గార్య మగును మీకు 7.

ఆ.వె. ఎంత యెంత ధర్మవంతపు పల్కులు
పల్కుచుండు నట నృవర కుమారుఁ
డంత యంత పౌరు లతని నధిపునిగఁ
గోరుచుండి రెల్లఁ గూర్మి మీఱ 8.

కం. పురవాసులు జను లా రఘు
వరుని సలక్ష్మణుని దీన వదను లరసి ధీ
వరు గుణములకు వశులయిన
వెరవున నాకర్షితు లయి వెలసిరి యచటన్ 9.

ఉ. మూడిట వృద్ధులౌ ద్విజుల ముఖ్యులు ప్రాయ వివేక కాంతులం
జూడఁగ నూఁగ మూర్ధములు సూచుచు దూరము నుండి రామునిన్
వేఁడిరి యుత్త మాశ్వముల పెన్కకు రండు చనంగ రాదు నాఁ
బాడిగ కూర్పుఁడీ హితము వారక మీ పతి కెంచి యుత్తటిన్ 10.

తే.గీ. వినికిడి మృగములకు నెల్ల ఘనము హయము
లకు విశేషించి విని మా గిరలను మరలుఁ
డిఁక ధృఢవ్రతు విమలాత్ము నీ పతిఁ బురి
నుండి యడవికిఁ గొనిపోక తెండు పురికి 11.

మ. కని యా విప్రుల నార్త చిత్తుల మహాక్రందమ్ములం జేయుచుం
జను చుండంగను బాదతామరస సంచారమ్ములన్ వృద్ధులన్
వనవాసార్థి రథమ్ము నుండి దిగి త్రోవన్ రాముఁడే మెల్లగాఁ
జనఁ జాగెన్ నడకన్ సహోదర ధరా జాతా సమేతుండునై 12.

కం. కాలి నడకఁ దన వెంటను
జాలిగ వచ్చు ద్విజులఁ గని స్యందన మందుం
దా లలిత వర్తనుఁడు సనఁ
జాలఁడు కరుణా రస భర చక్షుం డచటన్ 13.

ఉ. ఏఁగుచు నున్న రాముని ద్విజేంద్రులు గాంచి వచించి రివ్విధిన్
వేఁగుచు సంభ్రమం బడర విప్ర గణప్రియ! విప్ర వర్యులన్
నీ గమ నార్తులం గనుమ నెమ్మి భుజమ్ముల నుంచి యగ్నులన్
వేగమ నీదు వెంటఁ జనఁ బ్రీతిని నెల్లర నాగి యుత్తటిన్ 14.

ఆ.వె. గొడుగులు మన వెనుకఁ గోరి పొందిన యవి
వాజపేయ యాగ వరము నందు
ననుగమించి చక్క నరుదెంచు చున్నవి
వాన లాఁగ వచ్చు వర్షము లన 15.

ఆ.వె. ఎండ మ్రగ్గు చున్న నెట్టి ఛత్రము లేక
నీవు నడువ మేము నీడ నీయఁ
బేర్మి నిచట వాజపేయపు గొడుగుల 16.

నొసఁగ వత్తు మింక నుచిత రీతి

కం. శ్రుతి మంత్రానుగత విమల
మతులము నీ వలని ప్రేమ మారెద మింకన్
సుత! వన వాసానుసరణ
మతులుగ సంతోషముగను మానవ వర్యా! 17.

కం. ఉత్తమ ధనములు నిల్చును
జిత్తమ్ముల శ్రుతులె మాకు శ్రితమందారా!
యుత్తమ శీలమ్ముల దా
రోత్తమలు సురక్షిత లయి యుంద్రు గృహములన్ 18.

తే.గీ. నిశ్చయము మార్ప మాకింక నీతి కాదు
మనము లుండె నీ తోటి గమనమున కిఁక
ధర్మమును నీ వుపేక్షింప ధర్మ పథము
నందు నిల్చెడు వారెవ్వ రవని యందు 19.

తే.గీ. ఓ ధృఢవ్రత! తెల్లగ నుండు కేశ
రాశి దుమ్మంటి పడగ ధరాతలమున
నుండ మాకు నిన్నిట వేఁడు చుంటి మయ్య
తిరిగి రమ్మయోధ్యా పుర వరమున కిఁక 20.

తే.గీ. ఇక్కడకు వచ్చిన ద్విజులు చక్కఁగ మొద
లిడిరి పెక్కు యజ్ఞమ్ముల నడరి వాని
పరి సమాప్తి రాఘవ! నీదు తిరిగి రాక
పైన నాధార పడియుండుఁ బరమపురుష! 21.

తే.గీ. చరము లచరమ్ము లెల్లను నరయ భక్తి
మంతములు సుమ్ము నిన్నవి యంతు లేని
రక్తి వేఁడుచున్నవి తిర్గి రమ్మనుచును
భక్తిఁ జూపుమ తగ నీదు భక్తులకును 22.

ఆ.వె. పేరు లుండఁ గదల వీలు కాని తరువు 23.

లేడ్చు చుండఁగా నహీన వేగ
మారుతమ్ము వలన మంచిగ వంగి నీ
వెంట వచ్చు రీతి వెలయు చుండె

కం. కూటికి నాశం జెందక
దీటుగ వృక్షముల పైన ద్విజసంఘములే
పాటుల కోర్చి మఱలు మని
మాటికి మాటి కడిగెఁ గను మనుజ వరేణ్యా! 24.

కం. విలపించుచు నిబ్బంగి మ
రలు మనుచు ద్విజ వరు లుండ రామునిఁ బ్రీతిన్
విలసనముగ నగపడె నం
త లోన వారించు రీతి తమసా నదియే 25.

తే.గీ. అంతట సుమంత్రుఁ డలసిన హయ వరముల
స్యందనము నుండి తొలఁగించి చక్క దొర్ల
నిచ్చి ద్రావించి మునిఁగించి యెలమి నీట
విడిచె దగ్గర చరియింపఁ బ్రీతి తోడ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది యేనవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 46.

సీతా రామ లక్ష్మణులు తమసా నదీ తీరమున నా రాత్రి విశ్రమించి ప్రభాతమునఁ బౌరులు లేవక మున్న తమసా నది దాఁటి వెడలుట.

కం. రమ్యపుఁ దమసా నది నభి 1.

గమ్యం బట నాశ్రయించి కాంచి యవనిజన్
సౌమ్యుని సౌమిత్రిని రవి
సామ్యునితో రాముఁ డనియె సమయజ్ఞుండే

మ. చలుపం బూర్వపు రాత్రి నంప వనికిన్ సౌమిత్రి! యిచ్చోటునం
గలిగెన్ భాగ్యము నీకు భద్ర మగు నుత్కంఠన్ మదిన్ వీడుమా
నిలయమ్ముల్ దగఁ జేరె నీడజ మృగానేకంబు లింపారఁ గూ
తల నిండెన్ దిశ లెల్ల శూన్యముగఁ గాంతారంబు కన్పట్టెడిన్ 2.

మ. ధవళాక్షుల్ నర వర్యులున్ మన యయోధ్యా పట్టణం బం దహో
స విచారమ్ము తపింత్రు కానన మహా సంచార మూహించి వా
రవనీ నాథుని పైన నాపయిని నీ యందింకఁ దమ్ముళ్ల పై
న విశేషమ్ముగ రక్తులే భరతుఁడున్ నన్నెంచు శత్రుఘ్నుఁడున్ 3.

చం. వగచుచు నుంటి నోదర! యపారము తండ్రికి నింకఁ దల్లికై
పగలును జేయి నేడ్చుచు నవశ్యము పోదురె వార లంధులై
తగ భరతుండు ధర్మ గుణ తత్పరుఁ డింపుగ నూఱడించు వా
రిఁ గరము ధర్మ సంయుత వరిష్ఠ ధ నేప్సిత వాక్య సంతతిన్ 4.

కం. భరతు నన్నృశంసుఁ దలఁపఁగఁ
దిరిగి తిరిగి లక్ష్మణ! మదిఁ దీరును దుఃఖ
మ్ము రయముగ విచారింపఁ బి
తరునిం దల్లినిఁ దలంచి ధైర్యము తోడన్ 5.

కం. న న్ననుసరించి లక్ష్మణ!
మిన్న యయిన కార్య మూని మేటి మగండా!
చెన్నుగ నిల్చితి వవనిజఁ
బన్నుగఁ గాపాడఁగ నిలువ వలయు నాతో 6.

ఉ. నీటిని మాత్ర మేను గొని నెమ్మిని లక్ష్మణ యుందుఁ జక్కఁగా
నేటి నిశీధ ముండిన ననేక ఫలమ్ములు మెత్తు నీర మీ
మాటలు సెప్పి తాఁ గని సుమంత్రుని భద్రము సౌమ్య! గుఱ్ఱముల్
మేటివి యప్రమత్తతను మిన్నగఁ గావుమ పల్కె నివ్విధిన్ 7.

ఆ.వె. సూర్యుఁ డస్తమింపఁ జూచిఁ సుమంత్రుఁడు
కట్టి యపు డొసంగి గడ్డి యింత
గుఱ్ఱములకు వచ్చి కుదురుగ నిల్చెను
రాఘవేంద్రుల దరి రమ్యముగను 8.

కం. సూతుఁడు సంధ్యను వారిచి
రాతిరి కాఁ గాంచి తాను లక్ష్మణు తోడం
బ్రీతిని రాముని కొలుకున్
పే తల్ప మమర్చె నంత వినయము మీఱన్ 9.

కం. తమసా తీరమ్మున శయ
నము తరుదళ విలసితమ్ము నరవృషభుఁడు హృ
ద్యము నరసి విశ్రమించె సు
ఖముగ సలక్ష్మణ సదార కమనీయముగన్ 10.

కం. నిదురించు భ్రాత రాముని
సదార గని లక్ష్మణుండు చక్క సుమంత్రుం
గదిసి వచింపఁ దొడంగెను
సదుచిత రామ గుణములు భృశముగ వివిధముల్ 11.

తే.గీ. రాముని యనంత గుణములు రాతిరి వచి
యించు చుండఁగ సౌమిత్రి యంచితముగ
సూతునకుఁ దమసా నది శుద్ధ తీర
మందు మేల్కొని యుదయించె నర్కుఁ డంత 12.

తే.గీ. ఆలమందఁ గూడిన తమసాపగా త
టికి సమీపమునం బరుండెను బ్రకృతులఁ
గూడి రాముండు రాతిరి కూర్కు నుండి
లేచి యనుజుతో జనులను జూచి పలికె 13.

తే.గీ. లక్ష్మణా! కనుమా పుణ్య లక్షణ! మన
యందు ననురక్తి వృక్షమూలాదుల శయ 14.

నించు వీరి నిచట నిశ్చయించి రనుగ
మింపఁ జలము విడ రసువు లెల్లఁ జనిన

ఉ. స్యందన మెక్కి పోవుదము సక్కఁగ వీరలు నిద్ర నుండఁగాఁ
నెందును భీతి లేని గతి నింక నయోధ్యఁ జెలంగు వీరు స్వ
చ్ఛందమ యాశ్రయించి రిట సాల వరాంఘ్రుల రక్తి నుంచి నా
యందుఁ బరుండ నిట్లు తగ దారయ వీరికి నింక నెన్నఁడున్ 15.

తే.గీ. పౌరులకు స్వయంకృతముల బాధలను నృ
పాత్మజులు తీర్ప వలయు నృపాత్మజుల వె
తలను బౌరుల కీయంగఁ దగదు సుమ్మి
యెన్నఁ డైనను లక్ష్మణ! సన్నుత గుణ! 16.

కం. వినియా మాటలు లక్ష్మణుఁ
డనె నగ్రజు తోడఁ బ్రాజ్ఞ! యంగీకారం
బె నయపు టాలోచన యిది
య నాకు నెక్కెద మరదము నంబుజ నేత్రా! 17.

ఉ. అంత సుమంత్రు మంత్రుఁ గని యార్య రథమ్మును గూర్పు మేఁగఁగన్
సుంతయు జాగు లేక యనఁ జోదితుఁడై రఘు వీరు చేతఁ దాఁ
జెంతను నిల్పి యోజనము సేసి హయమ్ముల వేగ వంతముల్
కాంతుని కంతఁ జేసితిని కార్యము నంచు వచించెఁ బ్రాంజలిన్ 18.

కం. ఇదివో నీ యుక్త రథము
పదిలం బగు నెక్కుమ సతి భ్రాతయు నెక్కం
గఁ దిరముగ మహారథవర!
సదయా! యని సూతుఁ డనఁగ సవినయుఁ డంతన్ 19.

ఆ.వె. సుడులతో వడి నరిగెడి తమసా నది
స్వీయ వస్తువులను జెన్నుగఁ గొని
యరద మెక్కి దాఁటె నా రాఘవుండు సీ
తయు ననుజుఁడు దనరఁ దనదు వెంట 20.

కం. దాఁటి మహాబాహుం డా
యేటిని శ్రీమంతుఁ డిన కులేశుం డంతన్
మేటి యకంటకపు టభయ
వాటముఁ జేరె రఘువంశ వర వీరుండే 21.

ఉ. పౌరుల కీయ మోహమును బల్కెను రాముఁడు సూతు గాంచి యా
ర్యా! రథ మెక్కి యుత్తరపు టాశకు నేఁగి ముహూర్త మంతటం
దూరము నేఁగి వెన్క కిఁకఁ దూర్ణము మళ్లుమ నీకు భద్రమౌ
తా రిట నన్నెఱుంగని విధమ్మునఁ జేయుమ కృత్య మింపుగన్ 22.

కం. విని రాముని మాటలు రథ
ము నట్లు సూతుఁ డొనరించి ముదమున వచియిం
చెను మరలి వచ్చి యా రా
మునకు రథముఁ దెచ్చితిఁ గనుము విభూ యనుచున్ 23.

ఆ.వె. అంత సీత రఘు వరాన్వయ వర్ధను
లెక్క నరద మడరి చక్కఁగఁ దుర
గముల నడపె వనపు గతిని సారథి యా సు
మంత్రుఁడు వడివడిగ తంత్ర విదుఁడు 24.

తే.గీ. శుభములు వడయ రథమును సూతుఁ డుంచ
నుత్తర ముఖముగ నట రఘూత్తముఁడు మ
హారథి యధిరోహింప ససారథి చని
రంత వా రరణ్యమునకు సంతసమున 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది యాఱవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 47.

తెలవాఱఁగ రాముఁ డచట లేకున్నఁ బౌరులెల్ల శోకార్తులై విలపించుచుఁ దిరిగి యయోధ్యకు నేఁగుట.

కం. తెలవాఱిన రాత్రి గడచి
విలపించిరి కాంచక రఘువీరుని నిశ్చే
ష్టు లయిరి శోకార్తులు పౌ
రులెల్ల హత చేతనులె యురుతరం బకటా 1.

ఆ.వె. కాఱ వగపు మీఱ కన్నీళ్లు వీక్షించు
చు నలుదెసల వగచుచుఁ గన రాక
యెచట రాఘవుని యహీన వీర్యుని దుఃఖి
తులయి రెల్ల రపు డతులిత రీతి 2.

కం. సుహృదయు లా ధీమంత వి
రహితు లతి విషాద ముఖులు రాముని కొఱకున్
బహుళముగ జాలి గొలుపఁగ
సహింపఁ జాలక యనిరి వచనములు దమలో 3.

ఆ.వె. దొంగిలించె నకట దుష్టపు నిద్దుర
తెలివి నెల్ల నిట్లు తీరమం ద
హో విశాల వక్షు నున్నత బాహువు
రవి కులాబ్ధి చంద్రు రాముఁ గనము 4.

కం. మనలను భక్త జనుల నీ
ఘన బాహుఁడు రాముఁ డఫల కర్మాకృతుఁ డేఁ
గెను వదలి వివాసమునను
గన మెందును రాఘవేంద్రుఁ గరుణానిధినిన్ 5.

కం. కన్న కుమారుల భంగినిఁ
జెన్నుగఁ బాలించు మనలఁ జిత్రము సుమ్మీ
మిన్నయె రాఘవులం ద
న్నన్న విడిచి యెట్లరుగు మనల నవ్వనికిన్ 6.

తే.గీ. ఇక్కడ నిధన మగుఁ గాక యిదియ మనకు
నగుఁ దలఁప మహాప్రస్థాన మడరి యిపుడు
రామ రహిత మయిన మన బ్రతుకుల ఫల
మేమి మన కిట్టి జీవిత మేల యింక 7.

ఆ.వె. కలవు పెక్కు లెండు కట్టెలు గొప్ప వి
చ్చోటఁ జితినిఁ బేర్చి శోక మేల
మంట లందుఁ దూఱి వెంట వెంటఁ దగును
మనకు సెల్లర కనుమాన మేల 8.

చం. ప్రియములు పల్కువాని ఘనవీరు నసూయ తలంప నింత యే
ని యెడఁద లేనివాని దృఢ నిష్ఠు మహాభుజు రాఘవోత్తమున్
భయదము కాననమ్మునకుఁ బంపితి మంచు వచింపఁ బాడి యౌ
నె యకట యేమి సెప్ప మన కిత్తఱి నున్నది చింత సేయఁగా 9.

ఉ. ఆ పుర మక్కటా మనల నందఱఁ గాంచినఁ దిర్గి రాఁగ నా
భూప కుమార హీనముగఁ బొక్కును మిక్కిలి దీన చిత్తయై
యోపక హర్షహీన యయి యుండును సంతత మింక ఘోర సం
తాపము తోడ వృద్ధ జన తామరసాక్షి సబాల యుక్తమై 10.

తే.గీ. ఆత్మను జయించి నట్టి మహాత్ము తోడ
వీడి మన మయోధ్య నకట వీర వరుఁడు
లేక మన తోడ నిచటఁ దిరిగి పురమ్ము
నెట్లు గాంచఁ గలము మన మేఁగి యటకు 11.

కం. కరముల సెత్తి జనులు భీ
కరముగ సేడ్చిరి విచార ఘన తప్తాత్ముల్
గిర లని యనేకముల సె
ల్లరు దూడలఁ గనని యావుల పగిది తోఁపన్ 12.

ఆ.వె. కొంత దూర మరిగి యంత మార్గ మనుస
రించి యొక్క క్షణము గాంచ లేక
జాడ లింక మఱి విచారాంబుధి మునింగి 13.

రెల్ల రత్యధికము తల్ల డిల్లి

ఆ.వె. రథపు గుర్తు లెల్ల లయము లైన సుమన
స్కులు విధి హతుల మనుచు నకటా య
ని వెనుదిరిగిరి కడు నిశ్వసించుచు నేమి
చేయుద మని మీఱ చింత యంత 14.

కం. వచ్చిన దారిని వారలు
విచ్చిన హృదయముల తోడ వేదన మీఱన్
వచ్చి రయోధ్యకు వగచుచు
నచ్చపు సజ్జనులు తిర్గి యందఱు నకటా 15.

తే.గీ. శోకమునఁ గృశించిన మనస్సులు గలట్టి
వారు నగరమ్ము వీక్షించి బోరు మనుచు
దుఃఖ తప్తులై యేడ్చుచుఁ దూర్ణ మశ్రు
వులు నయనముల విడిచిరి కలఁతఁ జెంది 16.

ఆ.వె. రాము నరయని నగరమ్ము విరాజిల్ల
నేర దింత యేని యౌర యచట
నీటి నుండి ఫణుల మేటి గరుత్మంతుఁ
డు గొనిపోవ నేటి పగిది యపుడు 17.

తే.గీ. చందురుండు లేని నభపుఁ జందమునను
జలము లేని మహార్ణవ సన్నిభమ్ము
హర్ష హీనమైన పురమ్ము నపుడు గాంచి
రా విచార విచేతను లైన జనులు 18.

తే.గీ. శోక నిహత నరులు వారి సుందరంపు
సౌద రాజములం బ్రవేశమ్ము సేసి
తమ్ముఁ జూచు స్వజనుల నితరులఁ గాంచి
కూడ గుర్తింప నేరరు కుములు చుండి 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది యేడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 48.

రామునితో నేఁగి రామ విహీనము తిరిగి వచ్చిన భర్తలను గాంచి శోకమున మునింగి పౌర కాంతలు విలపించుచుఁ గైకేయిని దూషించుట.

ఉ. రాముని వెంట నేఁగి యనురక్తిని వెన్కకు వచ్చి నట్టి యా
భీమ విషాద భాష్పజల విప్లుత నేత్రులు హీన రాములై
పే మరణింప నిచ్చగల వెఱ్ఱులు దుఃఖ విలగ్న చిత్తులై
యా మగ లెల్లఁ గన్పడిరి యక్కట ప్రాణ విహీనులై నటుల్ 1.

ఆ.వె. వారి వారి పైన భవనమ్ముల కరిగి
పుత్ర దార సహితముగ విడిచిరి
యశ్రువులు ముఖమ్ము లందుఁ గన్నీటి చా
ర లవి కట్టఁగాఁ గరమ్ము సెలఁగి 2.

ఉ. సంతస మొంద ఱింతయును జూటరు  ప్రీతి నొకింత యేనియున్
వింతగఁ గొట్లు వెల్గవట   వీథుల నమ్మరు  బేరు లెవ్వ రే
నింతులు వండ రెవ్వ రట నిండ్లను గాసిలి వంటకమ్ములన్
వంత సెలంగ మిక్కుటము పార్థివ సూనునిఁ గానకుండుటన్ 3.

చం. కలఁగరు రాఁగ నష్టములు కానరు మోదము కల్ల లాభముల్
సెలఁగదు పుట్ట నాద్యమునఁ జెన్నుగఁ బుత్రుఁడు తల్లి యింతయున్
లలనలు ఘోర దుఃఖమునఁ గ్రాలుచు నింటికి రాఁగ భర్తలే
పలుకుదు రంకుశమ్మున నిభమ్మును గ్రుచ్చువిధమ్ము వాక్యముల్ 4.

చం. గృహముల నేమి లాభము నికృష్టపు విత్తపు రాసు లేలనో
యిహముల దార లేల మఱి యీ సుతు లేల సుఖమ్ము లేలనో 5.

సహజుఁడు లక్ష్మణుండు కద సన్నరుఁ డన్నను గొల్వ నేఁగెనే
సహచరి సీత భర్త కనిశం బొనరింపఁగ సేవ లేఁగెనే

చం. తగ దిగి చేయ రాఘవుడు తద్దయుఁ బ్రీతిని స్నానమే తదా
పగల సరోవరమ్ములయు భాగ్యము నేమని చెప్ప నేర్తు మా
పగలు ననూపముల్ వనులు పర్వత రాసులు సానుమంతముల్
మగ గమి నుత్త మోత్తముని మాన్యుని శోభను బెంచు మించుచున్ 6.

చం. వన మయినన్ నగం బయినఁ బార్థ తనూజుఁడు రాఘవుండు రాఁ
గ నతిథిగాఁ దరం బగునె కాంతున కీయక నిల్వ నర్చనల్
కనుఁ దరు లెల్ల రాముని సుఖమ్ముగఁ బూవులు లేఁత కొమ్మలన్
నన లవి పెల్లుచుండ భ్రమణమ్ములు తిర్గుచు నుండ నింపుగన్ 7.

ఉ. వచ్చిన యట్టి రామునకుఁ బర్వతముల్ దమిఁ జూపు నింపుగా
హెచ్చుగ కాని కాలమున నెత్తఱి నైనను బండ్లు పుష్పముల్
మెచ్చెడి రీతి స్వచ్ఛతను మీఱు జలమ్ముల నిర్ఘరమ్ములం
బచ్చఁ దనమ్ము తోడుతను బన్నుగ డెందము పొంగు భంగినిన్ 8.

ఆ.వె. గిరుల పైన నున్న తరువు లొసంగును
మోదము రఘురామ మూర్తి కచట
రాముఁ డున్న యెడ పరాభవ మేని భ
యంబు నేని యుండ దనవరతము 9.

కం. శూరుండు మహాబాహుం
డా రాజాత్మజుఁడు దూర మరుగక మునుపే
యా రాముని మన మిఁక పే
చేరెద మేఁగుచు పెనుకను జింతింపకయే 10.

ఆ.వె. అట్టి యమ్మహాత్ము నంఘ్రుల నీడ యొ
సంగు మనకు నెల్ల సత్సుఖములు
జనుల కతఁడె విభుఁడు శరణం బగును రాముఁ
డెల్లరకు గతి యగు నిలఁ దలంప 11.

తే.గీ. సేవ లిడుదుము మే మట సీత కెలమిఁ
ప్రేమ తోడఁ గొల్వుఁడు మీరు రాము నచట
పౌరవరుల భార్య లనిరి భాషణములు
ప్రీతి నివ్విధమ్ముగ నార్తి నాతు లెల్ల 12.

ఆ.వె. ఉచిత రీతి మీ సురుచిర యోగక్షేమ
ములను రాముఁ డరయు నెలమి మీఱ
రాగ మలర సీత లలిత యోగక్షేమ
ములను మాకు నరయుఁ బుడమి పట్టి 13.

తే.గీ. సంతసము లేని యుత్కంఠ సహిత జనుల
తోడ భగ్న మనమ్ములతో నరమ్య
పురము నందు నెవ్వరి కగుఁ దరము వాస
ముండఁ బ్రీతినిఁ గోల్పోయి నిండ వగపు 14.

తే.గీ. నాథ హీనమై రాజ్యము నాతి పర మ
యిన నధర్మ్యముగను గైక కింక నర్థ
మేమి మన జీవితములకు నేల పుత్రు
లేల విత్తరాసులు మన కిచటఁ దలఁప 15.

తే.గీ. విడువ నైశ్వర్యము కొఱకు స్వీయ భర్త
నింక సుతుఁ గులపాంసిని యింతి కైక
యెవ్వరిని వీడు పరికింప నెన్నఁ డేని
భృశము హింసింపక నిచటఁ బృథ్వి కొఱకు 16.

ఆ.వె. కైక బ్రతికి యుండ వీఁక రాజ్యము నేల
నిందు నుండ నిచ్చగింప మెడఁద
మేము బ్రతికి యుండ నేమి యయిన నింక
బానిసలుగ సుతుల పైన నొట్టు 17.

కం. దయ లేక రాజ తనయు స
దయుని ననిపి నట్టి దుష్ట తంత్రిణి కైకే
యి యధర్మముగఁ బుడమి నం 18.

ది యేలఁగ నెవరు సుఖం బది వడయుదు రిలన్

చం. కలిగెను గైక కృత్యములఁ గాంత విహీనత యూత లేమియున్
విలయము తప్ప దింకఁ బృథివిం గన నాపద లుద్భవించు రా
జిల బ్రతుకంగ నేరఁ డయొ యేఁగఁగ రాముఁ డరణ్య మివ్విధ
మ్ము లయము కాఁగ నీ నృపతి ముప్పులు తప్పవు రాజ్య మందిఁకన్ 19.

ఆ.వె. పుణ్యము నశియింప మూఁఱు దుర్గతు లిటఁ
ద్రాగు కైక! విషము తరలుము రఘు
వీరుఁ జేర లేక వెడలు సుదూరము
తగ దిచట వసింపఁ దథ్యముగను 20.

తే.గీ. మోసపుచ్చి పంపిరి వనమునకు రాము
సద్గుణుని ససీతా సలక్ష్మణుని మనల
నిచ్చిరి భరతునకు కసాయి కొసఁగు విధిఁ
బశువులను దయఁ జూప కల్పమ్ము నయిన 21.

ఉ. పూర్ణ శశాంక సన్నిభ సమోద ముఖుండు సుగూఢ జత్రుఁడుం
బర్ణ నిభాక్ష దీర్ఘ తమ బాహుఁడు లక్ష్మణ పూర్వ జన్ముఁడున్
నిర్ణయ పూర్వ భాషణుఁడు నిత్యము సత్యము పల్కువాఁడునుం
గర్ణ యుగ ప్రియైక మృదు గర్వ విహీన వచః ప్రియుండునున్ 22.

మ. ఘన వర్ణుండు మహాబలుం డఖిల లోకవ్రాత సోమాభుఁడే
ఘన సౌమ్యుండు నరర్షభుండు గజ విక్రాంతాభ సంచారి దాఁ
వన మందింపుగఁ దిర్గు చుండి వర శోభల్ గూర్చు నిత్యమ్ము కా
నన దేశమ్ముల నమ్మహా రథుఁడు పుణ్యస్వాంతుఁ డత్యంతమున్ 23.

తే.గీ. నగరమున నట్టు లేడ్చిరి నారు లపుడు
దుఃఖ సంతప్త లౌర మృత్యు వరుదెంచు
సమయ మందు భీతిల్లెడి సరణి తోఁప
మిక్కుటమ్ముగ నింటింట వాక్కు లడర 24.

ఆ.వె. రాముని కయి యిట్లు రమణు లేడ్చుచు నుండఁ 25.

దమ దమ భవనముల దారుణముగ
దినకరుం డపు డరిగెను పశ్చి మాద్రికి
రాత్రి పరఁగెను నగరమ్ము నందు

తే.గీ. ఆఱ నగ్ని హోత్రములు నధ్యయన సత్క
థలును శాంతింపఁ బుర మందుఁ దత్సయంబు
నందు రాతిరి  వ్యాపింప నత్యధికము
చీకటిఁ బులిమిన విధము సెలఁగెఁ బురము 26.

కం. మూసిన వర్తక గృహముల
మాసిన యరుసమ్ముల మఱి మాయ మయిన వౌ
యాసల నయోధ్య కన్పడెఁ
బాసిన తారాగణపు నభంపు విధంబై 27.

ఆ.వె. తనయు నైన నోదరు నయిన నెడఁబాసి
నట్లు తలఁచి యేడ్చి రచట స్త్రీలు
రాముని కొఱ కపుడు రాఘవుఁ డగు మిన్న
వారి కెల్ల నిజ కుమారు కన్న 28.

తే.గీ. లేక యుత్సవ వాద్య గీతా కలిత న
టనము లాఱ నానందము కనుమఱుఁ గయి
నట్టి యంగళుల నయోధ్య యయ్యె  క్షుబ్ధ
తోయ యుక్తార్ణవము భంగిఁ దోరముగను 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 49.

రాముఁడు మిగిలిన రాత్రి చాల దూరము ప్రయాణించి వేదశ్రుతి, గోమతి, స్యందిక నదులను దాటెను. మార్గ మధ్యములో గ్రామ జనుల మాటల నాలకించుచు నేఁగి సారథితో సంభాషణములు సలుపుట.

కం. మిగిలిన రాత్రి నరర్షభుఁ
డు గతిం జరియించె రాముఁడు సుదూరంబే
జగతీనాథుని నిజ జన
క గదిత మాజ్ఞను దలంచి కాకుత్స్థుండే 1.

ఆ.వె. వెడలు చుండ నట్లు వడి రాత్రి గడచెను
శుభపు సంధ్య వార్చి శుచిని రాముఁ
డంత దాటెను విషయాంతము చనుచుండి
ప్రీతి లక్ష్మణుండు సీత దనర 2.

చం. అరిగెను రాఘవుండు వడి నంతట దున్నిన నేల లుండఁగా
నరయుచు గ్రామ జాలముల నన్నిటిఁ బుష్పితముల్ వనమ్ములం
దురగము లేఁగ శీఘ్రముగఁ దోఁపఁగ మెల్లగ నేఁగు భంగినిన్
నరు లటఁ బల్కు నట్టి వచనమ్ములు చక్కఁగ వించు నత్తఱిన్ 3.

కం. ఎక్కడి నృపుఁడు దశరథుఁడు
మిక్కుటముగఁ గామ వశుఁడు మేదిని లోనే
యక్కట పాపిని కైకయె
చిక్కు లొసఁగెఁ బాపములను జేయుచు నిట్లున్ 4.

ఉ. హద్దులు దాటి తీక్ష్ణముగ నంగన వర్తిలు చున్నదక్కటా
తద్దయు ధార్మికుండు సతతమ్ము దయాగుణతత్పరుండునుం
బెద్దయుఁ బ్రాజ్ఞు లందు ఘన వీరునిఁ బంపెను గాననమ్మునం
బ్రొద్దును బుచ్చ సంతతము మూరి కుమారుని నీ జితేంద్రియున్ 5.

ఆ.వె. అక్కటా నచట మహాభాగ సీత జ
నక సుత సుఖములు ఘనమ్ముగ నల
వా టయిన కృశాంగి వగపు లెట్లు భరించు 6.

నిచట దారుణముగ నేమి వింత

ఆ.వె. దశరథుండు తనదు తనయు నక్కట వీడి
ప్రేమ విడువఁ గోరె నీ మనుజుల
ననఘుఁ బ్రీతిపాత్రు ఘనుని రాముని ఘోర
ముగను నిర్దయ నిట  భూవరుండు 7.

కం. జనపదుల యీ వచనములు
వినయులు గ్రామస్థు లనఁగ వీరుఁడు వినుచున్
ఘన కోసల దేశపు సీ
మను దాటెను గోస లేద్ధ మనుజేశుండే 8.

తే.గీ. అంత శుద్ధ తోయమ్ముల నలరు చుండు
నదిని వేదశ్రుతిని దాటి పదిలముగ న
గస్త్యుఁ డుండు దిశ కభిముఖముగ నేఁగఁ
జాగి రంత స్యందనమున వేగముగను 9.

కం. చిరకాలము పయనించుచు
నురుతర శీతల జలముల నున్నట్టి నదిన్
వర గోమతినిన్ గోవు ల
లరు చోటున దాఁటి రా జలధిఁ గలియు తటిన్ 10.

ఆ.వె. దాఁటి గోమతి నిఁక పాటవ హయముల
హంసల నెమళుల మహా రవముల
నలరు స్యందిక యను నంచిత నది వడి
దాఁటిరి తమి నంత మేటి మగలు 11.

తే.గీ. మున్ను మను వొసంగిన భూమి సన్నుత నృప
వరున కిక్ష్వాకునకు దానిఁ బన్నుగ సువి
శాల రాష్ట్రావృతమ్మును సదమల గుణ
సీత కట సూపె రాముఁడు ప్రీతి తోడ 12.

ఆ.వె. హంస భంగి మెత్త నైన స్వర మలర 13.

చూచి సారథిఁ దగ సూత! సూత!
యని పలుమరు లనుచు నంత నరర్షభుం
డనియె నిట్లు వాక్కు లలరి భృశము

కం. వనిని విడిచి నే నెప్పుడు
ఘనముగఁ బూయు వనినిఁ దమకమ్మున వేటన్
జననీ జనకుల తోడను
ఘన సరయూ తటిఁ జరింతుఁ గమనీయముగన్ 14.

తే.గీ. రాజ ఋషులకు ప్రీతి కరమ్ము దనరు
లోకమున వేట సలుపంగ లోలతఁ గన
నేను సరయూనది తటుల నెగడి వేట
సలుపఁ జిత్తమం దింతయు సారథి వర! 15.

ఆ.వె. ప్రీతి మిక్కుటమ్ము వేటాడ రాజర్షు
లకు ననంతరమ్ము రతి కలిగె న
రులకు నిఁక ధనుర్ధరులకుఁ గాంక్షిత మయ్యె
భృశముగ నది యకట వినుమ సూత! 16.

ఆ.వె. తీపి పల్కు లనుచు భూప వరేక్ష్వాకు
నందనుండు పుట్ట డెంద మందుఁ
దనదు తలఁపు లపుడు తనరి సూతుని తోడ
దారి నేఁగె నంత తద్దయు వడి 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నలువది తొమ్మిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 50.

కోసల సీమను దాటి రాముఁ డయోధ్యా దిక్కునకుఁ దిరిగి నమస్కరించి యామంత్రణ మడిగి గంగా నది యొడ్డునఁ గల శృంగిబేరపురమును జేరుట. నిషాదుల విభుఁడు గుహుఁడు స్వాగతము పల్కుట.

కం. సువిశాల కోస లావని
నవిరళ సుందరము దాటి యా లక్ష్మణ పూ
ర్వ వరోద్భవుం డయోధ్యకు
సవినయ మంజలి ఘటించి చక్కగఁ బలికెన్ 1.

తే.గీ. పురవర వరేణ్య! కాకుత్స్థ పుంగవ పరి
పాలితా! యనుజ్ఞ నొసఁగుమా లలితము
గ సుర లెల్లరు వసియింత్రు గాతురు నిను
సంతత మపార కృపనూని సంతసమున 2.

కం. మరలి వనవాస మొనరిం
చి రాజు ఋణ మెల్లఁ దీర్చి శీఘ్రమ చూతుం
బురవరమ! తల్లి దండ్రులఁ
దిరిగి కలసి ప్రీతి తోడ స్థిర చిత్తమునన్ 3.

ఉ. ఎఱ్ఱగఁ గన్నులుండ వడి నెత్తి ప్రసవ్య భుజమ్ము కన్నులన్
గిఱ్ఱునఁ దిర్గ నశ్రువులు కిట్టిన జానపదవ్రజమ్మునన్
గుబ్బలఁ బెద్దలం గనుచుఁ గూరిమి సూపితి రెల్ల నాపయిన్
బిఱ్ఱగు వంత పాప మగు పేగ చనుం డని రాఘవుం డనెన్ 4.

చం. అన విని యమ్మహాత్మునకు నందఱు సేసి ప్రదక్షిణమ్ములన్
వినతి నమస్కరించి విలపించుచు నిల్వఁగ నక్క డక్కడం
గనుచు నతృప్తులం జకచకం జనెఁ గన్పడ కుండ రాముఁడే
యినుఁడు నిశీథినిం గనుల కెవ్విధి కన్పడ కుండు నవ్విధిన్ 5.

మ. ధన ధాన్య స్థిర భాసితమ్మును సదా దానవ్రత స్వాంత స
జ్జన సంవాసముఁ బుణ్య దేశమును సచ్చైత్యాలి సంయుక్తమున్
ఘన యూపావళి భాసి తోత్తమము సత్కామాంగ వాటీ యుత 6.

మ్మును సంపన్న జలాశ యావృతము రాముండా మహా దేశమున్

ఉ. కోసల దాటె వీత భయ కోమల సన్నుత రమ్య దేశమున్
భాసిత తుష్ట పుష్ట జన పార్థివ సంచయ దర్శనార్థమున్
భాసుర వేద ఘోషచయ నాదిత భూమిని గో నికాయ స
ద్భాసిత భూతలమ్ము నరదమ్మున నేఁగుచు సత్వరమ్ముగన్ 7.

తే.గీ. రాముఁ డేఁగెను నడుమున రాజ్యమునకు
రాజులకు భోగ్య మైనది రమ్య తరపు
టుపవనముల నలరుచుండు నురు తరంపు
దేశమున కంత శ్రేష్ఠుఁడు ధృతిమతులను 8.

చం. చని యటఁ గాంచె రాఘవుఁ డశైవలముం ద్రిపథాపగా వర
మ్మును ఘన గంగఁ బుణ్య ముని పూజిత మాశ్రమ సంకులాతి శో
భనమును శ్రీ విరాజిత శివప్రద భాసిత మప్సరోజ నా
వనత శిరో విరాజితముఁ బావన తోయ విలాసితమ్మునున్ 9.

తే.గీ. దేవతల దానవుల నింక దివ్య గాయ
నులయు సకల గంధర్వ పత్నులయుఁ గిన్నె
ర ప్రముఖుల సేవల నందు సుప్రసిద్ధ
మైన గంగా నదిని శివ మైన దాని 10.

ఉ. దేవ గణార్థ మభ్రమున దీటుగఁ బాఱెడు దేవపద్మినీ
పావన నామమం దలరు వాహిని దేవ చయార్థమై శత
గ్రావ వరావృతమ్ము శత రమ్యత రోపవ నావృతమ్మునున్
జీవన భంగ ఘాతజ విజృంభిత హాస మహోగ్ర వేగినిన్ 11.

తే.గీ. అచ్చపు నురుగు నవ్వుల నలరు దాని
నొక్క చోట జడను బోలి నొక్క చోట
వంకర నడకల నలరి పాఱు దాని
స్తిమిత మింక లో తొక చోటఁ జెలఁగు దాని 12.

తే.గీ. ఒక్కచో నీటి వడి తోడ నుఱుకు దాని 13.

నొక్కచో గొప్ప స్రోతల నొప్పు దాని
నొక్కచో ఘోషణమ్ముల దిక్కు లెల్ల
బిక్కటిల్లంగఁ జేయుచు నిక్కు దాని

తే.గీ. దేవతలు ముగ్గ నొక చోట తేట తామ
ర లొకచోట శోభ లొసఁగ నలరు దాని
నొడ్లు వంకరగఁ జెలఁగ నొకట నొకట
దెల్లని యిసుక దిబ్బలు పల్లవింప 14.

తే.గీ. బెగ్గు రంచల కూతలు పెల్లు విరియఁ
జక్రవాకంపు టఱుపులు విక్రమింప
మత్తు నందు నిత్తెం బుండు మత్త విహగ
గణపు రావమ్ము లలరంగఁ గదలు దాని 15.

ఉ. ఒక్కటఁ జెట్లు మాల లన నొడ్డుల నీయఁగ శోభ లింపుగా
నొక్కటఁ గల్వ లుండఁ గడు నొక్కటఁ బద్మపుఁ బంక్తు లుండఁగా
నొక్కట నుండఁ గైరవము లొక్కట మొగ్గలు పెల్లుచుండఁగా
నొక్కట మత్తు గొన్న విధి నొల్కిన పుప్పొడి రవ్వలుండఁగా 16.

తే.గీ. దిగ్గజముల వన కరుల దేవతలకు
నర్హ మగు గజ నాదము లలరు వనులఁ
బ్రోవు పెట్టి నట్టి మురికి పుట్ట లుండ
మణి నిభము నిర్మలముగ నమరిన దాని 17.

తే.గీ. ఫలములఁ గుసుమమ్ములను మొగ్గలను గుల్మ
ముల ఖగమ్ముల విలసిల్లి భుజగ మకర
శింశుమారములను గూడి చెలువపు నగ
లూనిన వనితా రత్నము వోని దాని 18.

చం. వదలుచు విష్ణు పాదములు భర్గుని జూటము సేరి నట్టి యా
నదిని భగీరథ ప్రతిభ నైపుణిఁ బాపముఁ ద్రుంచు దాని నా
యుదధికి దారఁ బుణ్యవతి నొప్పఁగ సారస కహ్వ నాదముల్
కదిసెను శృంగిబేరపుర గమ్యపు దిక్కున రాముఁ డింపుగన్ 19.

ఆ.వె. కని మహారథుండు ఘన తరంగ కలిత
గంగను సుడులు చెలఁగంగ భృశము
పలికె సూతు గాంచి వసియింత మిట నేఁడు
చక్కఁగా సుమంత్ర! సంతసమున 20.

కం. నదికి సమీపమ్మున నిం
గుది వృక్షము చెంతఁ బూలు కోరకములతో
ముద మేపారఁగ సారథి!
పదిలమ్ముగ నుంద మిందుఁ బన్నుగ నింకన్ 21.

తే.గీ. నదుల శ్రేష్ఠమ్మును ఘనపుణ్యంపు జలము
లున్న గంగను దే వాసు రోత్కర సుర
గాయక నికాయ మృగ విహంగ నర సంఘు
నిత్య సంభావ్యఁ జూతము  నెమ్మి నిచట 22.

ఆ.వె. మంచి దనిరి యా సుమంత్ర లక్ష్మణు లంత
రాఘవేంద్రు తోడ రయముగ నర
దమ్ము నింగుదీ కుజమ్ము నెంతకు నడి
పి నిలిపె హయములను ఘనుఁడు సాది 23.

ఉ. చేరఁగ వృక్షరాజమును శీఘ్రమ రాముఁడు భార్య తోడుతన్
వీర వరుండు లక్ష్మణుని పేరిమి తమ్ముని తోడుతం దగన్
మూరి రథమ్మునుండి దిగె ముందుగ సూతుఁడు విప్పి వాజులం
జేరెను వృక్షమూలమును జేరి రఘూత్తము నిల్చెఁ బ్రాంజలిన్ 24.

చం. అట నధిపుండు రామునకు నాత్మ సమం బగు మిత్ర వర్యుఁడుం
బటుతర లుబ్ధకుండు బలవంతుఁడు శిల్పిగ విశ్రుతుండునున్
విటపము చెంత రాఘవుని వీరుని యున్కి గుహుండు నేరి య
చ్చట కరుదెంచె సేవకులు జ్ఞాతులు మంత్రులు వృద్ధు లుండఁగన్ 25.

కం. కని దూరమ్మున నరుదెం
చు నిషాద గణాధిపు గుహు సుగుణుని సామి 26.

త్రుని గూడి రాముఁ డెదురేఁ
గెను సంరంభమ్ముగ జెలఁగిన మోదమునన్

ఉ. రామునిఁ గౌగిలించి యనురాగము నార్తియు మీఱఁ బల్కె నే
నేమి యొనర్ప నొప్పు నిట నియ్యది నీకు నయోధ్య వంటిదే
రామ! వచింపుమా యని ధరాతల మందు లభింతురే తగం
బ్రేముడి నే మ హాతిథి వరేణ్యులు చక్కఁగ నిట్టు లేరికిన్ 27.

తే.గీ. అంత వివిధాన్న ములను రుచ్యమ్ము లెల్ల
నుంచి యర్ఘ్యమ్ముల నొసఁగి యంచితముగ
సత్వరమ్ము పలికె నిట్లు స్వాగతమ్ము
నీకు రాజు వీవు మహాత్మ! లోకమునకు 28.

తే.గీ. భృత్యులము మేము పాలింపు ప్రీతి మీఱ
మమ్ము భక్ష్యము లింక భోజ్యమ్ములు వర
పేయ లేహ్యములు కల వమేయ తల్ప
ములును హయ ఖాదనమ్ములు పుణ్య చరిత! 29.

చం. నుడువులు పల్క నా గుహుఁ డనుత్తమ రీతిని నాలకించి రా
ముఁ డనియె నిట్టు లందితిమి మోదము తోడుత నర్చ లెల్లనున్
నడచుచుఁ గాంచ వచ్చితి ఘనంపు సఖిత్వము నెంచి మిత్రమా
కడు ముద మయ్యె నిన్ను గన గాదిలి నొక్కుచు స్కంధయుగ్మమున్ 30.

తే.గీ. కంటిమి యరోగము నిను భాగ్యవశమున స
బాంధవమ్ము రాష్ట్రం బది భద్రమె కుశ
లురె సుహృదు లెల్ల నిచ్చలు పరఁగునె ధన
రాసు లింపుగఁ నీదు బురమున భృశము 31.

ఆ.వె. నే నెఱుఁగుదుఁ బ్రీతి నీ వొనగూర్చితి
వీని నెల్ల నిచటఁ బాటవమున
స్వీకరింప నేను వీని ననర్హుఁడ
నయ! నిషాద రాజ! నయము నరయ 32.

తే.గీ. జింక తోలు నింకయు నార చీర లూని
కంద ఫల మూలములు తిని కాననమ్ము
న వర తాపసు భంగిని నడవ వలయు
వానిగ నెఱుఁగుమా ధర్మ పరత నన్ను 33.

ఉ. వేఁడెదు ఘోటకమ్ములకుఁ బ్రీతి నొసంగఁ దృణమ్ము నింపుగా
వేఁడను నిన్ను నొండు తినిపించిన నింపుగఁ బూజితుండనే
నేఁ డివి ప్రీతి పాత్రములు నేతకుఁ దండ్రికి మిక్కుటమ్ముగం
బాడిగఁ జూడ వాజులను బన్నుగ నే నిట నర్చితుండనే 34.

ఆ.వె. విని గుహుండు రయమున నియమించె నరుల
నీయ నశ్వములకు నెలమి జలము
ఖాదనముల నెల్ల ఘనముగా నప్పుడు
రాము నాజ్ఞ నూని ప్రేమ తోడ 35.

తే.గీ. అంత భుజమున నుత్తరీయమ్ము నూని
పశ్చిమంపు సంధ్యను వార్చి పన్నుగ నను
జుండు లక్ష్మణుండు స్వయము శుద్ధ జలము
తేర రాముఁ డన్నమ్ముగ నారగించె 36.

ఉ. నేలఁ బరుండ నగ్రజుఁడు నెమ్మి సదారయె పాదపద్మముల్
లీలగ నంతఁ దాఁ గడిగి ప్రీతిని లక్ష్మణుఁ డంతఁ జేరి వే
సాలము చెంత నిల్వఁగ ససారథి లక్ష్మణు తోడఁ బల్కుచున్
మే లగు వింటితో గుహుఁడు మిత్రుని రాముని గాచె శ్రద్ధతో 37.

తే.గీ. దుఃఖముల నెన్నఁడు గనని తోరపు సుఖ
ముల నలరు యశస్విని మహాత్ముని దశరథ
సూను ధీమంతునిఁ బరుండు వానిఁ గాంచి
చిర మయి రజనీసతి గడచె నపు డట్లు 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 51.

సీతా రాములు నిదురించు చుండ నన్నకై మేలుకొని యున్న లక్ష్మణునిఁ గాంచి తాను వారిని మేల్కొని కాతు నని నిదిరింపు మనిన లక్ష్మణుఁ డంగీకరింపక మేల్కొని గుహునితో సంభాషించుట.

కం. అన్న కయి నిష్కపటి మే
ల్కొన్న సుగుణు లక్ష్మణుని రఘుప్రవరు నటం
గ్రన్నన గుహుండు గాంచి వి
షన్న హృదయుఁ డయి పలికెను జక్కఁగ నిట్లున్ 1.

తే.గీ. కనుము తండ్రి! యీ తల్పము ననువుగ నిట
నీ కొఱకయి నుంచితి నేను నిదుర పొమ్ము
సుఖముగ నృపనందన! వరసఖ! యుచితుల
మీ జనులు నేను శ్రమముల కెల్ల వినుమ 2.

ఆ.వె. సుఖముల కుచితుండ వఖిలములకు నీవు
రక్షణార్థ మిచట రాముని కయి
మేము రాత్రి యెల్ల మేల్కొని యుందుము
సత్తువ నిట నప్రమత్తుల మయి 3.

కం. భువి నాకు లేఁ డెద రఘు
ప్రవరుని కన్నఁ బ్రియ తముఁడు రాముని కన్నన్
రవికుల చంద్రా! నీ పయి
సవినయ మొట్టిడుదు నింక సత్యము పైనన్ 4.

తే.గీ. జగతిఁ గీర్తిని ధర్మము సద్ధనమ్ము
నంద వలె నన్న రామ దయా రసమ్ము
కేవలము నిశ్చయమ్ముగఁ గావలె నని
నేను భావింతు నిత్యము నెమ్మనమున 5.

ఉ. కావున సీత తోడుత సుఖమ్ముగ నిద్దుర వోవు నా సఖున్
నే విలు నూని జ్ఞాతులును నెమ్మి సహాయులునై చెలంగఁగాఁ
గావఁగ నిల్తు శర్వరిని గారవ మొప్పగ నిర్భయమ్ముగన్
నీవును జింత వీడి మది నిద్దుర వొమ్ము సుఖమ్ముగా నిటన్ 6.

కం. విదితంబే వన మెల్లయుఁ
గదలుచు నుండంగ మేము కానన మందుం
జెదరము చతురంగ బలం
బెదిరించిన సుంత యైన వీరత్వమునన్ 7.

కం. అన విని సౌమిత్రి వచిం
చె ననఘ! రక్షణమును దలఁచి మదిని ధర్మ
మ్మును నీ వీయ భయం బుం
డునె మా కిట సుంత యేని డుల్లక యెదలన్ 8.

తే.గీ. దాశరథి సీత తోడుత ధరణి యందు
నకట శయనించు చుండఁగ నరయు నట్టి
నాకు నిద్రయు నసుధారణమ్ము సుఖము
లేని లభియింపఁగా దర మౌనె తలఁప 9.

ఆ.వె. ఆజి దేవ దాన వాలిని నోడించు
వీరవరునిఁ జూడు దార తోడఁ
దృణముల నిదురింపఁ దేరి సుఖమ్ముగ
ఘనుఁడు రాజసుతుఁడు గాఢముగను 10.

చం. పరఁగిన నిష్ఠనున్ జప తపమ్ము లొనర్ప జనించెఁ దన్నుబో
లు రఘువరుండు రాముఁడు గురుండు యశస్వియుఁ జక్రవర్తి కి
ద్ధర సుతు లందు నా దశరథప్రియ పుత్రుడు నొక్కరుండు దా
నరుగ మనండు రాజు చిర మక్కట భూమి యనాథయౌ నిఁకన్ 11.

తే.గీ. అఱచి యఱచి ఘోరమ్ముగ నతివ లెల్ల
రలసి సొలసి యుందురు రాజ నిలయ మందుఁ 12.

దనరుచుండు నిశ్శబ్దము తప్పక యని
తలఁతు నచ్చట నిప్పుడు తథ్యముగను

కం. కౌసల్యయు నా జననియు
పేసరి దుఃఖం బడరఁగ భీకర రాత్రిం
గోసల పతియుం గడచెడి
యాస యెడఁద లేదు నాకు నావంతైనన్ 13.

కం. శత్రుఘ్ను నికై బ్రతికిన
నాత్రమ్ముగ నాదు తల్లి యవనిని నున్నం
బుత్రుఁ గనక కౌసల్య ప
విత్ర బ్రతికి యుండ దింకఁ బృథ్విని నకటా 14.

కం. అనురాగ జ నావృతమౌ
ఘన సుఖ విలసిత మయోధ్య కాంతుని విలయ
మ్ము నరసి దుస్సహ శోక
మ్మున లోక ముదావహమ్ము మునిఁగి నశించున్ 15.

కం. తనయు మహాత్ముని జ్యేష్ఠుని
ఘనప్రియునిఁ గాంచకుండఁ గాయమ్మున ని
ల్పును బ్రాణమ్ముల సెబ్బం
గి నమ్మహాత్ముండు రాజు కీర్ణ హృదయుఁడై 16.

ఆ.వె. పతి నశింప నంత భామిని కౌసల్య
తప్పక మరణించు ధరణిఁ గూలి
పిదప నాదు తల్లి సుదతి సుమిత్ర న
శించు వారి లయము గాంచి వేగ 17.

ఆ.వె. అయిన దయినది యిఁక నాత్మజు రాముని
రాజ్య మందు నుంచ రాక రాజు
కోరి నట్టి కోర్కి తీరకుండను నాదు
తండ్రి వే నశించుఁ దథ్యముగను 18.

తే.గీ. వార లెల్ల సిద్ధార్థులు మూరి యా స
మయమున నిలిచి తండ్రికి మానవేంద్రు
న కటఁ బ్రేత కార్యమ్ము లొనర్చి నట్టి
వారు సద్భక్తి నా పౌర వరులు దలఁప 19.

సీ. చక్కటి కూడళ్లఁ జక్కఁగఁ గూర్చిన రాజమార్గముల హర్మ్యవరములను
వేశ్యాంగనల హయ వేదండ రథ సంకులమ్ముల ఘన తూర్య రావములను
సర్వ కల్యాణ సుసంపన్న మానంద పుష్ట జ నావలి పూరితమ్ము
నారామ నోద్యాన వార భాసితము సమాజోత్సవ చయ విభ్రాజితమ్ము
ఆ.వె. పుర మయోధ్య పరఁగుఁ బూర్ణ మోదమ్మున
నోజ నాదు తండ్రి రాజధాని
జనులు సుఖము లరసి సంచరింపఁ గలరు
సంతతమ్ము నింక వింతగాను 20.

కం. జీవించున నా జనకుఁడు
వే వన వాసమ్ము సేసి వెడలినఁ బురికిన్
భూవరుఁ గాంచఁగ నగునే
పావను వ్రత దీక్షుని నటఁ బన్నుగ మాకున్ 21.

ఆ.వె. సదమ లాత్ముఁ డన్న సత్యప్రతిజ్ఞుని
తోడఁ బూర్తి సేసి తూర్ణ మా య
రణ్య వాసమును బురమ్ము ప్రవేశింప
నగునె మాక యోధ్య కలరి కరము 22.

కం. విలపించు చుండ నివ్విధ
ము లక్ష్మణుండు ఘన దుఃఖ పూర్ణుం డచటం
గలవర మంది మహాత్ముఁడు
తెలవాఱెను రాత్రి గడచి తెలియకె వింతన్ 23.

కం. జనహితము గోరు లక్ష్మణుఁ
డు నరేంద్ర సుతుఁడు నిజము నుడువఁ గడు బ్రీతిన్
వనరి గుహుఁ డశ్రువులు రా
ల్చెను జ్వర పీడిత కరివలెఁ జింతాత్ముండై 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది యొకటవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 52.

గుహుఁడు నావలో సీతారామలక్ష్మణులను గంగా నదిని దాటించుట, రాముఁడు తండ్రిని సేవించుటకునై సుమంత్రునిఁ దిరిగి పంపుట, సీతా దేవి జాహ్నవి మధ్య కరుగ నర్చించుట.

కం. నిసి యేఁగి తెల్లవాఱఁగ
వసుధా తలమున యశస్వి, భ్రాత శుభాంకున్,
విస్రుతోరుఁడు రాముఁ డరయు
చు సుమిత్రా సుతునిఁ బల్కె సురుచిర మిట్లున్ 1.

చం. రవి యుదయించు కాల మిది రమ్యపు రాతిరి యేఁగెఁ నల్ల నై
న విహగ మీ పికం బిట ఘనమ్ముగఁ గూతలు కూయు చుండఁగాఁ
జెవులకు నింపుగా నెమలి చిత్రముగా ధ్వనిఁ జేసెనే వనిన్
ప్రవిమల గంగ నంబుధికిఁ బాఱెడు దానిని దాఁటఁగా వలెన్ 2.

కం. మిత్రుల కానంద మొసఁగ
నాత్రము గలవాఁడు విని మహాత్ముండా సౌ
మిత్రి సుమంత్రుని గుహు నా
మిత్రు ననిపి సోదరుని సమీపము సేరెన్ 3.

ఆ.వె. స్థపతి యాలకించి సమ్ముదమున రామ
వచనములను బిలిచి సచివుల నటఁ
దూర్ణ మతఁడు వారి తోడ నివ్విధముగఁ
బలికె నంచితముగ భాషణములు 4.

తే.గీ. నావికునిఁ గూడి శుభమైన నావను ధృఢ
మైన దాని దాఁటింప వీలైన దానిఁ
దెచ్చి శీఘ్రంబ నిల్పుఁడు తీర మందు
యుక్త వాహన మీతని నుత్తరింప 5.

ఆ.వె. ఆలకించి విభుని యాజ్ఞ నమాత్యులు
తెచ్చి నావ నంతఁ దీర మందు
నిల్పి సురుచిరమును దెల్పిరి గుహునకు
సిద్ధ మంచుఁ బడవ స్నేహ మలర 6.

ఉ. అంత గుహుండు రాముఁ గని ప్రాంజలిఁ బల్కెను దేవ! తీరపుం
జెంతను నిల్పె నావ నరశేఖర! యింకను నాన తిమ్ము ని
శ్చింత నిలింప పుత్ర నిభ! సేయున దెయ్యది సువ్రతా! యుద
ధ్యంతిక మేఁగు గంగ నిఁక నార్య! తరింపఁగ నావ నెక్కుమా 7.

ఆ.వె. పల్కె గుహుని తోడ వచనమ్ములను మహా
తేజుఁ డంత నిట్లు భాజనముగ
రాముఁ డలరుచుఁ గృత కాముఁడ నైతి నీ
చేత నెక్కెదుఁ దరి శీఘ్రముగను 8.

తే.గీ. కట్టి యమ్ముల పొదులను ఖడ్గములు ధ
రించి యా ధనుర్ధరులు సమంచితముగ
రాఘవులు సీత తోడుత రమ్య నదిని
గంగఁ జేరఁగఁ జనిరి యభంగ భంగ 9.

కం. సారథి సుమంత్రుఁడు కదిసి
యా రాముని నడిగె నిట్టు లతి వినయుండై
గౌరవమున నే నింకను
నో రఘువర నేమి సేయ నొప్పునొ చెపుఁడీ 10.

కం. కుడి చేతి నిడి భుజమ్మునఁ
గడు ప్రీతిని దాశరథి యిఁకఁ జను సుమంత్రా!
పుడమి విభుని చెంతకుఁ గడు 11.

వడి భద్రమ్ముగ నరయుమ పార్థుని ననియెన్

కం. ఇంత దనుకఁ జేసిన యది
యంతయుఁ జాలును సుమంత్ర! యరుగు మరలి నే
నెంతును గాలినడకను జ
రింతు రథము వీడి వనిని లీలా కేళిన్ 12.

చం. వెడల ననుజ్ఞ నీయఁ గని వేఁగుచు సారథి యంతరంగ మం
దడలుచు నా నరర్షభుని నా రఘువంశ వరేణ్యుతో ననెం
బుడమిని నేరి కేని యిది పూర్వము కల్గెనె కాంచ నక్కటా
పడతియు నీవు దమ్ముఁడును  వచ్చిరి కానకుఁ బ్రాకృ తాభులై 13.

తే.గీ. బ్రహ్మచర్యమునను వేదపఠనమున బు
జుత్వమున మృదుత్వమ్మునఁ జోద్యముగను
ఫల మలవడదె రఘువీర! వ్యసన మిట్లు
మీ రరయఁగ విదిత మయ్యె భారముగను 14.

తే.గీ. తనరి ముల్లోకముల జయించిన లబించు
గతినిఁ బడయఁ గలవు వీర! ఖ్యాతి తోడ
భార్య నింక ననుజుఁ గూడి వనము నందు
రాఘవ వసింపఁ జక్కఁగ వ్రతము నూని 15.

చం. హతులము మేము రాఘవ నిరాశుల మైతిమి నీవు వీడఁగా
సతి కిఁక నిష్టు కైకకు వశంబయి పాపిని కివ్విధమ్మునం
బతితుల మింక దుఃఖములఁ బల్కుచు నిట్లు సుమంత్రుఁ డేడ్చెఁ గాం
చి తరల నంత దూరము నృశేఖరుఁ డా రఘు రాముఁ డత్తఱిన్ 16.

తే.గీ. తుడిచికొని తన కన్నీటిఁ దోయము గొని
శుచి యయిన సుమంత్రునిఁ గాంచి సుగుణ ధాముఁ
డు రఘురాముఁడు  పల్కెను దిరిగి యనున
యముగ సముచిత వాక్కులు సుమధురముగ 17.

తే.గీ. కనము నీ వంటి మిత్రు నిక్ష్వాకులకు సు 18.

మంత్రి! చేయుమ  చక్కఁగ మనుజ నాథుఁ
డెట్లు నా కయి చింతింప కెడఁద నుండు
నవ్విధముగ నగరి కేఁగి యంచితముగ

కం. వగపునఁ గ్రుంగిన వృద్ధుని
జగతీపతిఁ గామ భావ చకితుం గన నే
విగ తానందుఁడనై భృశ
ముగఁ బల్కుచు నుంటి నిట్లు మూరి సుమంత్రా! 19.

కం. కైకకుఁ జేయఁ బ్రియమ్మును
నీ కే యాజ్ఞ నిడిన ధరణీపతి దానిన్
వీఁకను శంకింపకయే
యే కార్యం బైనఁ జేయు మెన్నం డైనన్ 20.

కం. పను లన్నిట నడ్డంకుల
మనమ్ముల సహింప రయ్య! మనుజాధిపతుల్
ఘనముగ నివ్విధముగ భూ
మిని బాలింతురు సుమంత్రి! మిన్నగ వినుమా 21.

కం. ఎవ్విధిఁ దా దుఃఖమ్మున
నొవ్వండొ నరేంద్రుఁ డా ఘనుఁడు నప్రియ మిం
కెవ్విధి నందండొ యెఱిఁగి
యవ్విధిఁ జేయుమ సుమంత్రి! యడరుచు నెపుడున్ 22.

కం. నతులిడి నా మాటలుగాఁ
బతికి జితేంద్రియునకు నదవద లెఱుఁగని యా
యతి వృద్ధున కార్యునకు వి
నతిఁ బల్కుమ యీ మృదు వచనములను సూతా! 23.

ఉ. వీడితి నే నయోధ్య నని వేఁగను మైథిలి లక్ష్మణుండునుం
గూడఁ దలంప రవ్విధిని ఘోర వనమ్మున నుంటి మంచు మే
మేఁడుల నైదు తొమ్మిదుల నింపుగ నచ్చటఁ బూర్తి సేయఁగాఁ
బాడిగ మమ్ము గాంచ నగుఁ బన్నుగ వచ్చిన మే మయోధ్యకున్ 24.

మ. నరనాథుం గని పల్కి యిట్టులు దగన్ నా మాత నన్యాంబలం
దరుణిం గైకను దిర్గి తిర్గి సుఖ భద్రశ్రేణి వాటిల్లెనా
ధర మీకంచును నడ్గి తెల్పుము సుమంత్రా! తల్లి కౌసల్యకున్
ధరణీజాతయు నేను లక్ష్మణుఁడు పాదద్వంద్వముం గొల్చుటల్ 25.

తే.గీ. చెప్పు మింకను రాజుతో శీఘ్ర తరము
భరతు రప్పించి యింపుగ వాని నింక
నిల్పు మను రాజ్య పదమున నెమ్మి తోడఁ
దాను గోరిన యట్టులఁ దథ్యముగను 26.

ఆ.వె. యౌవరాజ్య మందు నాత్మజు భరతుని
నిల్పఁ గౌగిలింత సల్పి నెమ్మి
నాదు వలని వగపు మేదినీశ నిను బా
ధింప నేర దింక ధీర చిత్త! 27.

కం. చెప్పుము భరతుని తోడను
నప్పను గను నట్లు మాత లందఱి నిరతం
బొప్పుగ వీక్షింపు మనుచుఁ
దప్పక యనురాగ మడరఁ దనయుని యట్లన్ 28.

కం. కైకేయి సుమిత్రా సతి
నీ కెట్లు విశేష గతిని నెగడుదు రట్లే
యా కౌసల్యయుఁ జక్కఁగ
నీకును నా జనని హెచ్చు నిక్కం బెంచన్ 29.

ఆ.వె. వేచు చున్న దిచటఁ బ్రీతితో యౌవ రా
జ్యమ్ము నీ కొఱకయి జనకు కాంక్ష
నుభయ లోకములను శుభములు సుఖముల
నందు నట్లు తండ్రి ననుజ! చూడు 30.

కం. పో ననిపిన రాముం డనఁ
దా నా వచనముల నెల్లఁ దాపం బడరన్ 31.

ధ్యానమ్ముఁన విని యత్యభి
మానముతో సారథి యనె మాటల నిట్లున్

ఆ.వె. భయము వీడి స్నేహ భరమున నెవ్వి నే
నిట పలుకుదు నిట్టి యీపలుకుల
నాలకించి వాని నరసి భక్తుని పల్కు
లన క్షమింపఁ దగుదువయ! నరవర! 32.

చం. పురమున కెట్లు నేఁగుదును బూరుష పుంగవ నీవు లేనిచోఁ
బరఁగుదుఁ బుత్ర హీనమున భాధఁ దపించెడి మాత భంగినిన్
నరులును రాముఁ డుండ మును నన్నరదమ్ముఁనఁ గాంచి కూడి యా
పురమును నేఁడు గాంచి నను బోరున నేడ్తురు రామహీనతన్ 33.

తే.గీ. శూన్యపు రథమ్ము వీక్షించి చోద్యముగను
నగర రాజం బగు నిఁక దైన్యంపుఁ బురము
వీర వరుఁడు హతము గాఁగ దారుణముగ
సారథి యొకండు మిగిలిన సైన్యము వలె 34.

కం. దూరమ్ముఁన వసియించిన
నో రామా! నీవు తల్చి యున్నటు లెదురం
బౌరవరు లెల్లరు నిరా
హారమ యుందురు కలఁతల నంది యెడఁదలన్ 35.

కం. చూచితి వీ వట నీ కై
వేచిన శోకార్తుల ఘన విక్షోభము నే
నే చన నిను వీడి పురికిఁ
దూఁచుట శక్యంబె వారి దుఃఖము నింకన్ 36.

ఆ.వె. నీ వివాసమున వనికి నేఁగు నప్పుడు
జనుల రోదనముల ధ్వనులు వినవె
యార్త నాదము లవి యరయ నన్నొక్కనిఁ
దేరున శత గుణములౌ రవములు 37.

ఆ.వె. మేనమామ యింట నేను దింపితి నీదు
తనయు నంచు దేవి! తల్లడిల్ల
కు మని పలుక నగునె భ్రమియింపఁ బాడియె
యెఱుఁగ కుంటి సుంత యేని యకట 38.

తే.గీ. వచనముల నివ్విధమ్ముగఁ బలుక నేర
నకట సత్య దూరమ్ముల ననుచితముగ
నైన నప్రియపు నిజము లేని యెట్లు
పలుక నేర్తు సంకట మయ్యెఁ గలఁత రేఁగె 39.

ఉ. ఏ నదలించినన్ హయము లెప్పుడు నీవును నీదు బంధులున్
యానము నందు నిల్వగఁ బ్రయాణము సేయుచు నుండ నేఁ డహో
కానక నిన్ను దేరున సుఖమ్ముగ లాగునె సమ్మతింపుమా
యేనును వీడి నిన్ను బుర మేఁగ నశక్యుఁడ వత్తుఁ గానకున్ 40.

కం. అడిగిన నను వీడినచో
వడి నిచట నరదము తోడ వహ్నిఁ బ్రవేశిం
చెడి వాని నౌదుఁ దత్క్షణ
మడరి విడిచి నంతనె వినుమా నర వర్యా! 41.

కం. వనమున నుండును విఘ్నము
లొనరింప వ్రతముల వాని నుండి రథమునన్
ఘన సత్వములను బాధిం
తును రాఘవ! యుద్యమించి తూర్ణము ధృతినిన్ 42.

ఆ.వె. నీ వలన లభించె నీ వర సారథ్య
మడరి నాకు రామ! యడవి కేఁగ
నీ వలన లభింప నీ వనవాసము
కోరుదు రఘువీర గారవమున 43.

తే.గీ. చెంత నుండంగ నీ కిట నంతరంగ
మందు వాంఛింతు రాఘవ! విందనంగఁ
జెంత నుండుమ నా కని సంతసమున 44.

నీవు నుడువంగఁ గోరుదు నెమ్మి నేను

కం. వనవాసి వైన నీ కిట
కను మీ గుఱ్ఱములు సేయుఁ గమనీయముగాఁ
వనమున సేవలు పరమ గ
తినిఁ బొందఁ గలవు సుమీ తుదినిఁ గాకుత్స్థ 45.

ఉ. సేవలు నీకుఁ జేయుదును శీర్షము వంచి యరణ్య వాసినై
నే వసియింప నొల్ల నది నిర్జర లోకమునౌ యయోధ్యయౌ
భావన సేయ నిన్ను విడి వాసవు పట్టణ మందుఁ బాపి తా
నేవిధిఁ జేరఁడో యటుల నేఁ జొరఁ జాల నయోధ్య రాఘవా! 46.

కం. వన వాసాంతమ్మున స్యం
దనమునఁ జేర్తును మనోరథం బిదె నాకున్
నిను నగవరం బయోధ్యకు
నినకుల రత్నంబ తిరిగి యెలమి సెలంగన్ 47.

కం. క్షణ మాత్రంబ చతుర్దశ
గణ వర్షము లుండ నీవు కానన మందున్
గణియింపఁగ వందేం డ్లగు
గుణనిధి! లేకున్న నీవు ఘోర తరములై 48.

కం. భృత్యానుకంప! తగునే
నిత్యము భర్తృ సుత గతిని నిల్చిన నన్నున్
భృత్యుని విడువఁగ నర్హపుఁ
గృత్యమె భక్తుని నిజ విధి కృత్యుని రామా! 49.

కం. మఱిమఱి బహు విధములఁ దా
నఱిముఱి దీనముగ నిట్లు యాచింపంగం
దఱచు సుమంత్రుఁడు సారథి
యఱచుచు భృత్యానుకంపి యనె రాముఁ డిటుల్ 50.

తే.గీ. స్వామి భక్తిపరాయణ! చక్కని దగు 51.

నీదు నా మీఁది భక్తిని నే నెఱుఁగుదు
నిన్నిచట నుండి నగరికిఁ గ్రన్నన నను
పుటకుఁ గారణము వచింతుఁ ద్రుటిని వినుము

ఉ. నిన్ను నయోధ్యయం దరసి నెమ్మిని నమ్ము సుమంత్ర! కైక నా
చిన్నమ రాముఁ డేగె నని శీఘ్రము కానకు నంచు నచ్చటం
బన్నుగ సంతసించు నృపు భర్తను నమ్మును సత్యవాదిగా
నెన్నఁడు శంక నుంచదు నిజేశుని ధార్మికు పైన నింతయున్ 52.

ఆ.వె. ఇది యగుఁ బ్రథమంపు టిచ్ఛ నా పిన్నమ్మ
భరతుఁ డేలు చుండఁ బడసి రాజ్య
మును ముదమ్ము నంది పూర్ణముగఁ జరింప
వలయు నా యయోధ్య నెలఁత కైక 53.

తే.గీ. ఎవరి కెవరి కేమి వచింప నే నుడివితి
నొ యవి వారి వారి కటుల నుచిత రీతిఁ
జెప్పుమ రథముతో నేఁగి యప్పురికిఁ బ
తికిని నాకుఁ బ్రియము నీయ దృఢపు మతిని 54.

ఆ.వె. ఊఱడించి యిట్టు లొప్పుగఁ బల్కి ప
ల్మఱు సుమంత్రు తోడ మాన్పి వగపు
గుహునిఁ గాంచి పలికె సహ కారణంబు ధై
ర్యముగ వచనములను రాముఁ డిట్లు 55.

కం. జను లుండిన యీ గహనము
న నుండ యుక్తమ్ము కాదు నాకు గుహా! చ
క్కని యాశ్రమమున నివసిం
ప నగును గర్తవ్య మట్టి పనినిం గనుమా 56.

తే.గీ. తాపసుల నియమము నూని తండ్రి హితముఁ
గోరి గుహ! నేను సీతను గూడి లక్ష్మ
ణుని సహితముగను జడలు దనర నేఁగు
వాఁడ మఱ్ఱిపాలను దేరఁ బనుపు మయ్య 57.

ఆ.వె. రాజ సూను కొఱకు నోజః దెచ్చె గుహుఁడు
పాల తోడ నంత మేలుగాను
రాముఁడు జడః దనకు లక్ష్మణునకుః దీర్చె
సుందరమ్ముగ నటః జోద్య మలర 58.

శా. నరశార్దూలుఁడు దీర్ఘబాహువు జటానంద స్వరూపుండు కా
నరవిందాక్షుఁడు చీర వస్త్రములు హృద్యమ్ముల్ జటా జూటముల్
పరఁగన్ వెల్గిరి యన్నదమ్ములు పరివ్రా జాభ సందీప్తులై
పురుష వ్యాఘ్రులు రామలక్ష్మణులు నంభోజాక్షు లచ్చోటునన్ 59.

కం. ఘన వానప్రస్థమ్మును
ననుజునితోః గూడి రాముః డవలంబింపం
గ నిలిచి వ్రతమ్ము నూని గు
హుని సఖునిం గాంచి పల్కె యుక్తపుః బలుకుల్ 60.

కం. బల కోశమ్ములు దుర్గ
మ్ములు దేశము లప్రమత్తముగః గన వలయుం
గలవరము లేక కష్ట
మ్ములు పెక్కులు గావ మూరి భూతలము గుహా! 61.

ఆ.వె. గుహుని నంత వీడుకొలిపి యిక్ష్వాకు నం
దనుఁడు దార యింకః దమ్ముని సహి
తమ్ము కలఃత లేక తరలె శీఘ్రమ్ముగ
రాముః డుత్సహించి రమ్యముగను 62.

చం. తటమునః గాంచి నావ గుణధాముఁడు రాముఁడు శీఘ్రగామినిం
ద్రుటి నట దాట గంగ మది లోనః దలంచి వచించెః గాంచి య
చ్చటః దన తమ్ము నివ్విధము చక్కఁగ లక్ష్మణ! నావ నెక్కుమా
దిటవుగః బట్టి నావ జగతీ సుత సీతయు నెక్క నిల్పుమా 63.

ఆ.వె. అన్న యానతి విని క్రన్నన వ్యతిరేక
మెంచక మును ముందు నంచితముగ 64.

సీత నావ నెక్కఁ జేసి పిదప నెక్కెఁ
దాను లక్ష్మణుండు తరణి మీఁటి

ఆ.వె. లక్ష్మణాగ్రజుండు రాముండు తేజస్వి
యెక్కె నావ నంత నెలమి గుహుని
భటులఁ గాంచి నడుపఁ బడవను రయముగఁ
బ్రోత్సహించె నలరి యుత్సహించి 65.

చం. అనువుగ నంతటన్ నిజ హితార్థము సేసె జపమ్ము నెక్కి నా
వను రఘురాముఁ డింపుగను బ్రాహ్మణ రాజ కులానుసారమే
జనవిభుఁ డాచమించెఁ దగ శాస్త్ర విధమ్ముగ నా నదీ లలా
మను నుతియించె లక్ష్మణుని మానిని సీతను గూడి భక్తినిన్ 66.

తే.గీ. అనుమతి నొసంగి సారథి కంత గుహుని
బలముతోఁ జాగఁగ ననిపి పడవ లోన
నిలిచి చక్కఁగ నా నావికుల కొసంగె
నాజ్ఞ నడుపంగ నావను విజ్ఞవరుఁడు 67.

తే.గీ. అట్లుఁ బురికొల్పఁ బడి నావ యంత కర్ణ
ధారుల బలము తెడ్డుల దార్ఢ్యమునను
వేగవంతమై శీఘ్రము యేఁగి దాఁటె
జలముల నడరి యప్పుడు స్యందన మన 68.

తే.గీ. నదికి నడుమున కేఁగంగ సుదతి సీత
విమల శీల భాగీరథి విమల తోయ
మునకు నంజలి ఘటియించి వినయ మెసఁగఁ
బలికె నివ్విధముగ భక్తి భాషణములు 69.

చం. దశరథు రాజు నాజ్ఞఁ దలఁ దాల్చి యితండు సుతుండు గంగ! దే
వి! శుభద! నీదు రక్షణ నభీతి వనమ్మున నుండఁగాఁ జతు
ర్దశ సమ లేఁగు చుండెను సదార సహానుజుఁడై గతింపఁగా
భృశముగఁ గొల్తు మమ్మ నిను వేగమ వచ్చి ఫలింపఁ గోరికల్ 70.

తే.గీ. మూడు మార్గమ్ములఁ జరించు పుణ్య నదివి
బ్రహ్మ లోకమ్ము కంటివి పరమ పూజ్య!
వనధి రాజున కింపుగ భార్య వైతి
విజ్జగము నందుఁ గన్పడ వెలసి తీవు 71.

ఉ. అట్టి నదీ మతల్లి యమరాపగ నీకు నమస్కరింతు నే
నెట్టి విపత్తులం గనక యీ రఘునాథుఁడు తిర్గి వచ్చినన్
నెట్టన నిత్తు పే యిడల నేత్రము లన్నము లింక భక్ష్యముల్
పట్టము నంద రాజగను బ్రాహ్మణ కోటికి నీవు మోదిలన్ 72.

ఆ.వె. పురికిఁ దిరిగి వచ్చి సుర నిండిన ఘట స
హస్రముల నొసఁగియు నార్య! మాంస
భోజనమ్ము నిచ్చి పూజలు శుద్ధినిం
జేయుదాన నీకు శ్రేయముగను 73.

కం. తీరమున నుందు రమరులు
వారినిఁ దీర్థముల నింకఁ బన్నుగ గుడులన్
వారక గొల్తును మీఱ న
పారపు భక్తి మన మందుఁ బావన గంగా! 74.

కం. అనఘా! గంగా! రాముని
ననఘుని నా తోడను మఱి యనుజుని తోడన్
వన వాసము సేసి యయో
ధ్యను శుభముగఁ జేర నిమ్ము దయతో దేవీ! 75.

ఆ.వె. అట్లు గంగ తోడ నా యనిందిత సీత
ప్రాజ్ఞ పలుకు చుండఁ బన్నుగ నట
దక్షిణ తటి నంత సక్షేమము ముదము
సెలఁగ క్షిప్రముగను జేరి రపుడు 76.

ఆ.వె. తీర మంతఁ జేరి యా రాముఁడు నరర్ష
భుండు వీడి నావ భూజయు నను
జుండు తనకు వెంట నుండ తరలఁ జాగె 77.

శత్రుమర్దనుండు సంతసమున

తే.గీ. పలికె నట సుమిత్రానంద వర్ధను గని
రాఘవుఁడు మహాబాహుఁడు రాముఁ డంత
రక్ష ణార్థము లక్ష్మణ రమ్య గతిని
నిలుము నరు లున్న లేకున్న వలను తోడ 78.

ఆ.వె. నరులు లేని వనినిఁ గర మవశ్యము రక్ష
ణమ్ము ముందు నీవు నడవ వలయు
లక్ష్మణ! వెనుకను ధరా తనయ యనుగ
మించి నిన్ను నడచు నంచితముగ 79.

ఆ.వె. వెనుక నేను నడతుఁ దనరి నిన్నును సీత
నెలమి కాచు చుండి యివ్విధముగ
లక్ష్మణ యొక రొకరి రక్షించి కొనుచును
జాగ వలయును బురుషర్షభ! యిఁక 80.

తే.గీ. ఇంత వఱకు నెదుర్కొన మింత యేని
యెట్టి పనిని సుకర మయ్యె నింకఁ గాంచు
సీత వనవాసమునఁ గల్గు యాతనలను
దుఃఖముల నెల్ల మును ముందుఁ దోరముగను 81.

ఆ.వె. నష్ట మైన యట్టి నరుల సందడి హీన
ములయి నట్టి పొలము లాలయములు
నెత్తు పల్లము లవి యెల్ల నమరు నట్టి
వనము కదియు నిపుడు మనల నింక 82.

కం. విని రాముని మాటల నా
యనుజుఁడు లక్ష్మణుఁడు వేగ యరిగెను ముందున్
జనకాత్మజ నడవఁగ వె
న్కను రాముఁడు భార్యకు వెనుకను జనఁ జాగెన్ 83.

కం. ఆవలి తటి కేఁగు వఱకు 84.

నావ సుమంత్రుం డరసి కన నశక్యుండై
యా వర వీరుని దూరపు
భావమునఁ గుములుచు విడిచె భాష్పములు వ్యథన్

ఆ.వె. లోకపాల సదృశ రూప తేజుఁడు దాఁటి
యా మహా నదిని మహాత్ముఁ డంతఁ
గ్రమముగ వరదుండు కదిసెను సస్య స
మృద్ధ వత్స భూమి మేటి పుడమి 85.

తే.గీ. ఆకలిని నున్న రాఘువు లంత నల్ల
దుప్పి దుప్పిని మనుబోతు దొడ్డ కిటిని
నాల్గిటినిఁ జంపి తీసి నాణ్యపు టెఱచినిఁ
జేరిరి మునిమాపున నిల్వఁ జెట్టు నీడ 86.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 53.

కైకేయిచేఁ గౌసల్యాదుల కాపదలను శంకించి రాముఁడు లక్ష్మణునిఁ దిరిగి యయోధ్యకు పెడల మనఁగ లక్ష్మణుఁ డన్నను వీడి యుండ లేని తన బలహీనతను జాటఁ దనతో నరణ్యమున నుండుట కంగీకరించుట.

కం. ముద మొసఁగు వార లందున్
మొదట గణింపఁబడు వాఁడు భూజపు మొదటం
గదిసి దినాంతపు సంధ్యను
జదివి పలికె రాముఁ డనుజుఁ జక్కగఁ గనుచున్ 1.

ఆ.వె. జనపదములకుఁ జివరను సుమంత్రుఁడు లేని
మొదటి రాత్రి సుమ్మి యిది మనల క
యినను గలవరపడ కీవు లక్ష్మణ! మఱి
యంతరంగ మందుఁ జింత దగదు 2.

ఆ.వె. నేటి నుండి నిశలఁ బాటవముగఁ గావ
వలయు వీడి నిద్ర భద్ర సుఖము
లవనిజకు నలవడు నవరజ! యింపుగ
మన వలన నిట ననుమాన మేల 3.

ఆ.వె. కడపెదము నిశీథిఁ దడయక యెట్లైనఁ
బుడమిని శయనించి యడరి మనము
స్వయముగఁ గొనితెచ్చి చక్కనివి యనుజ!
లక్ష్మణ! యిఁక నిచట లలితముగను 4.

కం. శయనింప నర్హుఁడే సుఖ
శయనమ్ముల రాఘవుండు శయనించెను వ
ట్టి యవనిపైఁ గట వీక్షిం
చి యనుజు లక్ష్మణుఁ బలికె రుచిర భాషణముల్ 5.

చం. ధ్రువ మిది లక్ష్మణా! యచటఁ దీరని దుఃఖముతోఁ బరుండు నా
నృవరుఁడు తీరఁ గోరిక యనేక విధమ్ముల హర్ష మందుఁ గై
క వరము లిట్లు దాఁ బడసి కాంతుని నక్కట రాజ్య కారణ
మ్ము వదలునే కుమారుఁడు నమోఘుఁడు రా భరతుండు మన్కినిన్ 6.

కం. నన్నును వీడి యనాథుఁడు
నిన్నరపతి వృద్ధుఁ డింక నేమి యొనర్చున్
మిన్నగఁ గైకకు కామా
పన్నుం డయ్యెను గడింది వశ మయ్యెఁ గటా 7.

ఆ.వె. ఈ యుపద్రవమ్ము రాయని మతి విభ్ర
మమ్ము గాంచఁ దలతుఁ జుమ్ము కామ
మడరు మిక్కుటముగ నర్థ ధర్మము లందు 8.

సంతతమ్ము యంచు  సత్యముగను

కం. కలరే లక్ష్మణ! తండ్రులు
లలనకునై వినయుని వదలఁగ నిజ తనయున్
పెలయక యున్నఁ జదువు నా
వలె నున్న సుతులును గలరె వసుధను వెతకన్ 9.

చం. అతివను గూడి యా భరతుఁ డచ్చటఁ గోసల రాజ్య నాథుఁడై
యతుల సుఖమ్ము లెల్ల ననయమ్ము సెలంగ సుఖించు నింపుగం
బతి యగు నొక్కరుం డచటఁ బ్రాయము దండ్రికి మీఱ నేఁగ నీ
గతి వని కేను లక్ష్మణ! వికారము లేక రమించు రాజ్యమున్ 10.

ఆ.వె. అర్థ ధర్మములను ద్యజియించి కామము
నొక్కటిని గ్రహింప నుర్వి నిట్లు
నెల్లరకు నలవడు నిక్కట్లు రాజు ద
శరథు చందమునను సత్వరమ్ము 11.

చం. తలఁచెద సౌమ్య యా దశరథ క్షయ మింక నరణ్య వాసమే
చెలఁగఁగ నాది రాజ్యమును జేకొన నా భరతుండు క్షిప్రముం
గులుకుచు కైక మిక్కుటము ఘోరముగా జననీ ద్వయమ్మునుం
గలవర పోవఁ జేయు నటఁ గల్మి మదమ్మునఁ బో మదర్థమై 12.

ఆ.వె. దేవి యా సుమిత్ర నావలన నచట
బాధ లందఁ దగదు బయలుదేఱు
మీఁక నయోధ్యకు వడి నింపుగ లక్ష్మణ!
యుదయ మిచట నుండి యుచిత మదియె 13.

ఆ.వె. సీతఁ గూడి నేన ప్రీతిని దండకా
వనికి నేఁగు వాఁడఁ దనర వలయు
నీవ దిక్కుగ జననికి నింకఁ గౌసల్య
కచట దిక్కు లేని కాంత కెలమి 14.

తే.గీ. ద్వేష మూని యన్యాయము  దేవి కచట 15.

జనని కౌసల్య కొనరించుఁ దనరి నీచ
కర్మము లొనరించెడు కైక కనుక ధర్మ
విదుని భరతు నీడ నునుపు పేర్మిఁ జూడ

తే.గీ. మున్ను మేను లెందేనియుఁ గన్న తల్లు
ల కిడె నేమొ పెతలు సుతుల విడఁ దీసి
నాదు తల్లియె సౌమిత్రి! యా దురితము
నేఁ డొసంగె నీ దుఃఖమ్ము నిక్కముగను 16.

ఆ.వె. పెంచె నన్ను మాత మించిన కష్టమ్ము
తోఁ జిరమ్ము నకట తూర్ణము ఫల
మందు కాల మందు నందక కోల్పోయె
నిట్లు నన్ను వింత నేమి యందు 17.

కం. ఏ నొసఁగితి నంబకు నను
జా! నిర్భర శోక మిట్టు లకటా భువిలో
నే నారియు నను బోలెడు
వానిని సుతునిఁ గన రాదు వ్యర్థునిఁ జుమ్మీ 18.

కం. విని యీవాక్యం బచ్చటఁ
గని శుకమును గోరువంక కఱవుమ రిపు కా
లిని నన నది కర మిష్ట మ
గును మాతకు నన్ను మించి కూర్మిం జూపన్ 19.

ఆ.వె. అలమటం గుమిలెడు నమ్మకు నించుక
యేని చేయ లేని యీ కుమారుఁ
డేల యల్పభాగ్య హీన నందన కాంత
కేమి ఫలము కలుగు నెంచ ననుజ! 20.

తే.గీ. మాత నిదురించు నను వీడి వీత భాగ్య
దుఃఖ సాగరమున మున్గి తోరముగను
శోక సంతప్త కౌసల్య చోద్యముగను
నగర వర మయోధ్య నకట వగచు చుండి 21.

ఉ. ఒక్కఁడ నే నయోధ్య మఱి యుర్విని నెల్లను లక్ష్మణా! ధృతిం
జక్కని బాణ సంతతినిఁ జాలుదుఁ బొందఁగ రోష మందినం
దక్కుదు నే నకారణమ దాల్చుట వీర్య మధర్మ మంచుఁ బో
యెక్కఁ దలంప నాసనము నెంచి యధర్మ సులోక భీతులన్ 22.

కం. విలపించి యిటుల నన్య
ముృల జాలిగ రాముఁ డశ్రు పూరిత నయన
ముృలఁ గూర్చుండెను రాతిరి
పలుకులు విరమించి విజన వనమున నంతన్ 23.

కం. ఆరిన యనలము వోలె న
హో రయ మెల్లను నుడిగిన యుదధి విధమునన్
మూరి విలపించు రాముని
నారసి సౌమిత్రి యిట్టు లాశ్వాసించెన్ 24.

ఉ. తప్పక నేఁ డయోధ్య వర ధన్వుల శ్రేష్ఠ! ప్రభా విహీనమౌ
నప్పురి యేఁగ నీ విటుల నబ్జిజ హీన నిశీథినీ గతిం
జొప్పడఁ దాప మిప్పగిది శోకమునన్ వచియింప నిట్లు నీ
కొప్పునె నేను జానకియు నూనుదు మార్తిని మిక్కుటమ్ముగన్ 25.

ఆ.వె. ఒక ముహూర్త మైన నుండ లే మసువుల
నిన్ను వీడి నంత నేను సీత
యేని నీటి నుండి మీనములను నెట్ట
బ్రతుక లేని పగిది రాఘవేంద్ర! 26.

ఆ.వె. స్వర్గము నయిన మఱి శత్రుఘ్ను నైన సు
మిత్ర నైన నేను శత్రు దమన!
చూడ నిచ్ఛ గింప వీడి రాఘవ! నిన్ను
తండ్రి నయినఁ జూడఁ దలఁప నేఁడు 27.

కం. అల నా ధర్మప్రియు లుభ
యు లరసి కూర్చొనిన నేల కుపకంఠమునన్ 28.

వెలయఁగఁ జేసిన శయ్యఁ గ
దలిరి వటము చెంత కంతఁ దరుణము మించన్

కం. విని లక్ష్మణు శుభ పుష్కల
ఘన వాక్యము లనుమతించెఁ గానన వాస
మ్మును ధర్మ మూని చివరకు
మనమున నెంచె సమ లెల్ల మసల ననుజుతో 29.

కం. విజనం బైన వనమ్మున
సుజనద్వయ రాఘువులకుఁ జొప్పడదు భయ
మ్మఁ జిడిముడి యేని సానువు
లఁ జరించెడి సింగపు జత రమణ బలులకున్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది మూడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 54.

సీతా రామ లక్ష్మణు లా రాత్రి యా మహా వృక్షము చెంతఁ గడపి సూర్యోదయము కాఁగ నట నుండి కదలి గంగా యమునా సంగమ ప్రాంతమున మహర్షి భరద్వాజుని యాశ్రమము చేరుట, రాముఁడు తగిన నివాస స్థలమును జెప్పుఁ డనిన ముని జిత్రకూటమున నుండు డనుట.

కం. వా రా వర వృక్షమ్మున
నా రాత్రి శివమ్ముఁ గడపి యడరఁగ నా ధ్వాం
తారాతి తెల్లవాఱఁగఁ
దీరి యచట నుండి బయలుదేఱిరి ప్రీతిన్ 1.

చం. కదిసి యశస్వు లద్భుతపుఁ గానన మెన్నఁడు చూడ నట్టివౌ
పదిలపు భూమి భాగములఁ బన్నుగఁ గాంచు చనేక దేశముల్ 2.

హృదికి ముదం బొసంగునవి యెక్కడ గంగను జేరు నా యమీ
నది యట కేఁగ నెంచి రఘునందను లంత ససీత యేఁగుచున్

కం. క్రమముగఁ జూచుచు వివిదము
ల మానులను రాముఁడు గని లక్ష్మణు దివ సాం
తము కాఁగఁ బల్కె నిట్టుల
సుమిత్ర పుత్రకుని తోడ సురుచిర రీతిన్ 3.

తే.గీ. చేరువనఁ బ్రయాగ కచటఁ జిత్రపుఁ బొగ
కంబ మగ్ని పతాకము నంబరమ్ము
నంటు చుండెఁ గను మునీంద్రు నాశ్రమమ్ము
చేరువున నుండు నట్టు లెంచెదను నేను 4.

కం. గంగా యమునా తటినీ
సంగమముం జేరితి మని సంభావింతున్
సంగతిఁ జెలంగె నాదము
భంగావృత వారి వారి భండన మందున్ 5.

తే.గీ. వన్యములు గొని జీవించు వారి చేత
ఖండితమ్ములై పడి యున్న కాష్టములను
గాంతు మింకను వివిధవృక్షముల నెలమి
యా భరద్వాజు నాశ్రమ మందు వెలయ 6.

కం. కదియఁగ రవి పశ్చిమమును
విదిత ధనుర్ధరులు యమున విన్నదు లిల నె
మ్మది కలిసిన యెడ నున్న జ
డదారి వసతి కరిగిరి దడయక ముదమునన్ 7.

ఆ.వె. చేరి యాశ్రమమును జెల్లచెదర మృగ
విహగ తతులు గతిని వెడలి యొక ము
హూర్తము వడి వడిగ నుత్తము ముని భర
ద్వాజునిఁ గదిసె రఘు వంశజుండు 8.

ఆ.వె. సీత తోడ నంతఁ జేరి రాఘవు లాశ్ర
మమ్ము కోరుచు ముని మాన్య దర్శ
నమ్ము వీరవరులు నెమ్మి నిలిచిరి దూ
రమునఁ గొంత తడవు రమ్యముగను 9.

చం. అరిగి స సీత సానుజుఁడు నార్యుఁడు శిష్య గణాలి తోడుతం
బరఁగు మహాత్ము సంయమినిఁ బన్నుగ నారసి సంశితవ్రతుం
బరమ తపో జితాంబకుని భవ్య హుతాగ్ని వరేణ్యుఁ బ్రాంజలిం
దరుణియు రామ లక్ష్మణులు తద్దయు భక్తిని మ్రొక్కి రందఱున్ 10.

ఉ. లక్ష్మణ పూర్వజుండు రఘురాముఁడు తమ్మెఱిగింప నిట్లనెన్
సూక్ష్మ విధమ్ము పంక్తిరథు చోద్య కుమారల మేను రాముఁడన్
లక్ష్మణుఁ డీతఁ డీ సతి ధరా సుత నా సతి సీత దేవ! తా
లక్ష్మి సమాన మేఁ జన నరణ్యము తోడుగ వచ్చి రిద్దఱున్ 11.

తే.గీ. తండ్రి చేత నిర్వాసిత తనయు నన్ను
నన్న యన్న ప్రేమ కడింది యున్న యట్టి
వాఁడు సౌమిత్రి సుధ్రుఢ వ్రతుఁడు వనికి
ననుగమించె నిప్పగిదినిఁ దనరి మిగుల 12.

ఆ.వె. జనకు నాజ్ఞ దేవ! చనుచుంటి మికఁ దపో
వనమునకు ఫలము లశనములుగను
ధర్మ మనుసరించి కర్మములను సంచ
రింప మే మెడఁదల కింపు దనర 13.

చం. విని మతిమంతు రాజసుతు వీరుని పల్కులు ధర్మ చిత్తుఁ డా
మునియు నుతథ్య నందనుఁడు మూరి యొసంగె జలమ్ము లర్ఘ్యముల్
వనఫల మూల యుక్తములు పాన వరాన్న విభిన్నముల్ దపో
ధనుఁడు నివాసముం దగు విధమ్ముగ వారికిఁ గూర్చెఁ బ్రీతిమై 14.

తే.గీ. మునులు మృగ విహగమ్ములు దనరఁ జుట్టు
ముని భరద్వాజుఁ డపుడు వచ్చిన రఘువరు
నకుఁ బలికి స్వాగతమ్ము గయికొన నాతి 15.

ధేయ మతనితో ధర్మ గతిని వచించె

తే.గీ. రాఁగఁ గాకుత్స్థ యిచటకు రాఘువ! చిర
కాలమున కీవు గంటిని కాదె ప్రీతిఁ
గారణము లేని యట్టిదౌ కాననంపు
నీ వివాసపు వార్తను నేను వింటి 16.

తే.గీ. ఇది మహా నదులు కలియు నింపొసఁగు ప్ర
దేశ మేకాంతపు స్థలము స్థిరముగ నిటఁ
బుణ్య భూమి మనోహరము నగు చోట
నీవు వాస ముండఁ దగుదు నెమ్మి తోడ 17.

కం. పలుక భరద్వాజుఁ డిటులు
పలువుర హిత మరయు వాఁడు బదులు పలికె ని
ట్టులు రాముఁడు శుభ వచన
మ్ముల నంతఁ వినయము తోడ మునివరు తోడన్ 18.

ఉ. పౌరులు గ్రామ వాసులును బ్రక్కల నుందురు దేవ! యిచ్చటన్
వారికి నన్ను జూడ సులభం బగు నాశ్రమ మందు నెంచినన్
వారక వత్తు రెల్లరును బన్నుగఁ గాంచఁగ నన్ను సీత నా
కారణ మెంచ డెందమునఁ గా దుచితమ్ము వసింప నా కిటన్ 19.

ఆ.వె. ఏకతపుఁ బ్రదేశ మెచ టైన బ్రహ్మ వ
రేణ్య! తెల్పుఁ డెలమి పుణ్య శీల
జానకి రమియించు చక్కని చోటు సు
ఖముల కర్హ సతము కాననమున 20.

ఆ.వె. మేలి రాఘువేంద్రు మినుకుల నాలకిం
చి ముని పుంగవుండు సముచితముగ
నంతఁ బలికె నిట్టు లా భరద్వాజుఁడు
భావమును గ్రహింప వచనములను 21.

చం. గురుతర మైన కొండ పది క్రోశుల దవ్వులఁ జిత్రకూట మన్ 22.

గిరి ముని సంఘ సేవితము కృత్స్న మనోహర పుణ్య దేశముం
దిరుగఁగఁ గొండముచ్చులును దిమ్మల తోడ నెలుంగు బంటులుం
బరఁగఁగ గంధమాదన నిభం బది యోగ్యము నీకు నిల్వఁగన్

ఆ.వె. చిత్రకూట శైల శృంగము గాంచిన
నరుఁడు నిత్యము శుభకరము లైన
పనులఁ జేయుచుండు మనమున నెన్నఁడు
పాపుఁ దలఁపులను బరఁగ నీఁడు 23.

కం. తనరి శత శరద్రాత్రులు
ముని పుంగవు లచ్చటను దపోమహిమ చెలం
గ నవని దివమున కేఁగిరి
ఘనులు కపాలశిరసు లయి కమనీయముగన్ 24.

కం. అది యేకాంత మని తలఁతు
మది నీకు సుఖ మొసఁగు సదమల చిత్తా! చు
మ్మది కా దేని రఘువరా!
పదిలమ్ముగ నన్ను గూడి వసియింపు మిటన్ 25.

కం. ముని వరుఁడు భరద్వాజుఁడు
ఘను రాముని సత్కరించెఁ గాంతా సహిత
మ్మును దమ్ముని సహితం బతి
థిని వాంఛితము లవి యెల్లఁ దీర నయ విధిన్ 26.

చం. వర ముని యా ప్రయాగ తటిఁ బ్రక్కనఁ గూర్చొని పుణ్య కీర్తనల్
కర మను రక్తి చిత్రతమ గాథలు రాముని తో వచింపఁగాఁ
బరఁగెను రాత్రి సౌఖ్య తతి పాత్రుఁడు డస్సి తృతీయ సీత కాన్
నరవర రాముఁ డా నిసి ఘనమ్ముగ నాశ్రమ మందు నిద్రిలెన్ 27.

తే.గీ. రాత్రి గడచి కా నుదయము రాఘవుఁడు న
రర్షభుఁడు భరద్వాజ మహర్షి జ్వలిత
తేజుఁ గదిసి పలికె నిట్లు దేవ! సుఖము
గఁ గడచె నిసి యానతి నొసఁగఁ దగు మాకు 28.

కం. చన రాత్రి భరద్వాజుఁడు
ముని సత్తముఁ డిట్టు లనియె మూల ఫలమ్ముల్
తనరంగఁ జిత్రకూట
మ్మున దేనియలు పెడలుండు పుణ్యపు గిరికిన్ 29.

తే.గీ. తలఁతు వాస యోగ్యం బని తరువు లడరఁ
బెక్కు ఫణులు కిన్నరులు సేవింపఁ గేకి
రవములు కరులు దనరంగ రమ్య చిత్ర
కూట మా పుణ్య గిరికి రఘువర! చనుమ 30.

తే.గీ. అచటఁ గుంజర యూధమ్ము లజిన సంచ
యమ్ములు తిరుగ వని నిర్ఝరమ్ములు గుహ
లు నదులు జలపాతమ్ములు దనర సీత
తోఁ జరింతువు ముద మంది తోరముగను 31.

తే.గీ. కోకిలలు నింక కొంగల కూత లలర
మత్త గజములు మృగములు మసలు చుండఁ
జేరి రమ్యాశ్రమమ్మును శివపుఁ జిత్ర
కూట మందు వసింపుమ కొమరు మిగుల 32.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 55.

సీతా రామ లక్ష్మణులు, చిత్రకూట పర్వతమునకు మహర్షి భరద్వాజుఁడు దారి తెలిపి కొంత దూరము తోడు రా, బయలు దేరి యమునా నదిని దాఁటుట, సీతా దేవి యమునా నదిని దట్టంపు ముదు రాకు పచ్చని మఱ్ఱి వృక్షము నర్చించుట.

తే.గీ. శత్రు దమనులు పార్థివ పుత్రు లా ని
శీధినిఁ గడపి యట మహర్షికి నమస్క
రించి వినయమ్ము తోడ నా యంచితంపు
గిరికి నేఁగఁ బయన మైరి పురుష వరులు 1.

ఆ.వె. ఆ మహర్షి వారి నాశీర్వదించి పె
డలఁగ ననుసరించి యెలమి సుతుల
జనకు భంగి గాంచి సత్యపరాక్రము
రాముఁ బలుకఁ జాగె రాగ మలర 2.

తే.గీ. నెమ్మి గంగార్కజల సంగమమ్ముఁ జేరి
యచ్చట మనుజర్షభు లార! యమునఁ బశ్చి
మ ముఖిఁ గాళింది ననుసరించి మనము లల
రంగఁ రాఘువు లార! తరంగణిఁ జని 3.

తే.గీ. వడి గల నది తటిని గల పరమ పుణ్య
తీర్థముల నెల్ల వీక్షించి తెప్ప నొక్కఁ
టిఁ గొని యంశుమతీ నది డెందము లల
రంగ దాఁట వలయుఁ జుమ్ము రఘువరేణ్య! 4.

ఉ. అంతఁ దరించి యయ్యమున నత్యధికమ్ముగ నుండ వృక్షముల్
చెంతను నాకుపచ్చనివి శ్రేష్ఠ దళమ్ముల తోడ మట్టినిన్
సంతత సిద్ధ సేవితముఁ జక్కగఁ జేరి మహా మహీజముం
గాంత ధరా తనూభవ నగమ్మున కంజలి మ్రొక్కఁగా వలెన్ 5.

తే.గీ. చేరి యా వట వృక్షము మీ రచట వ
సింప వచ్చు లే దేని చరింపఁ గ్రోశ
దూరము యము నాటవినిఁ జూతురు తరుల ప
లాస బదరుల వంశముల రుచిరముల 6.

తే.గీ. చిత్రకూటము నింపుగఁ జేర దారి
యది యరిగితిఁ బలు తడవ లచటి కేను 7.

మృదువు రమ్యతరం బైన మేటి దారి
కనము కార్చిచ్చుల నచట వనము నందు

ఆ.వె. తేటపఱప గతిని దివ్య మునీంద్రుఁడు
వందనమ్ము లొసఁగి భక్తి నట్లె
యని పెడలుఁ డనంగ నంత మహర్షి మ
రలెను పేగ తనదు నిలయమునకు 8.

చం. పెడలఁగ మౌని పుంగవుఁడు విజ్ఞుఁడు రాముఁడు గాంచి లక్ష్మణున్
నుడిపెను బ్రీతి నిట్టులు ఘనుండు మునీంద్రుఁడు చూపెఁ బ్రేమనుం
గడు మన పైన ధన్యతను గాంచితి మిచ్చట సౌమ్య! యంచు పే
పడతిని సీత ముందు నిడి పన్నుగ నేఁగిరి చేర నర్కజన్ 9.

కం. పేగముగఁ బాఱు యమునకు
నేఁగి నదిని దాఁటఁ గోరి యెలమిఁ దలంపం
జాగిరి వా రెల్లరు లో
లోఁ గాళిందిని నగాధ రుచిరపు రీతిన్ 10.

ఉ. ఎండిన యట్టి బొంగులను నింపుగఁ గూరిచి కాష్ఠ కాయమున్
మెండుగ వట్టి పేరులను మేటి ప్లవమ్ముగఁ జేసి రంతటన్
గండఁడు లక్ష్మణుం డపుడు గట్టివి నేరెడు పేము కఱ్ఱలన్
నిండగు నాసనమ్ము నట నెమ్మినిఁ గూర్చెను సీత కోసమై 11.

ఆ.వె. అంత లక్ష్మిఁ బోలు నవనిజ సీత న
చింత్యఁ బ్రియను సుంత సిగ్గు దనరు
దార నపుడు మూరి దాశరథి పడవ
నెక్కఁ జేసెఁ బ్రీతిఁ జక్కఁగాను 12.

ఆ.వె. పడవ యందు నుంచె పైదేహి ప్రక్కన
వస్త్ర భూషణములఁ బాఱ గునప
ముల సహాయుధముల మూరి రాముఁ డపుడు
పురుష పుంగవుండు భూరియశుఁడు 13.

ఆ.వె. పడవఁ బట్టి ముందు వైదేహి నెక్కించి
దశరథాత్మజు లటఁ దరణి నెక్కి
దాఁటి రంత నదినిఁ బాటవముగ భద్ర
గతిని వీర వరులు నతివ తోడ 14.

తే.గీ. చేరఁ గాళింది మధ్యకు సీత పలికె
దేవి! దాఁటుచుంటిమి నిన్ను నా విభుని వ్ర
తమ్ము పూరింపు తల్లిరో నెమ్మి తోడ
స్వస్తి నొసఁగు కరుణ తోడ సదమల జల! 15.

తే.గీ. తిరిగి యిక్ష్వాకు పాలిత పురికి దేవి!
రాఘ వేంద్రుఁడు రాఁగ భద్రగతిఁ దనరి
నేను సద్భక్తి నర్చింతు నిక్కముగను
గో సహస్ర సురా ఘట కోటి నిన్ను 16.

కం. చేతులు మోడ్చి ధరాత్మజ
యాతతముగ వేఁడు చుండ యమునా నదినిం
బ్రీతిని దక్షిణ తీరము
నా తరణి కదిసెను వేగ మానందదమై 17.

చం. తరు గణ దీప్త తీరను నుదంచిత భంగ విరాజమాననున్
గురుతర వేగ గామిని నకుంఠిత మంశుమతీ నదమ్మునుం
దరణిఁ దరించి రా యమునఁ దద్దయు భక్తి ససీత రాఘవుల్
దరినిఁ బ్లవమ్ము వీడి తగు దారినిఁ జాగిరి యర్కజాటవిన్ 18.

ఆ.వె. ఏఁగి చేరి రంత నెచ్చట చల్లని
పచ్చఁ దనము నిండె నచ్చ టలర
ముదురు పచ్చని దగు భూజము వట రాజ
మును రఘుకుల తిలకులు నర వరులు 19.

తే.గీ. సీత యంతఁ గదిసి మఱ్ఱి చెట్టు నచటఁ
బలికె నిట్లు వందనములు పాద వోత్తె
మమ్మ! నా మనోనాథు వ్రతమ్మును దరి 20.

యింప నిమ్ము కరుణ తోడ నింపుగాను

ఆ.వె. నుత పరమ యశస్వినులను గౌసల్యా సు
మిత్రలఁ గన నిమ్ము మేటి వృక్ష
మ! యని యంజలించి మానుగ సీత బ్ర
దక్షిణమ్ము సేసె ధరణి తనయ 21.

చం. కని ప్రియ నా విధేయ నిజకాంత ననిందిత యాచమాన సీ
త ననియె గాంచి లక్ష్మణునిఁ దమ్మునితో రఘు రాముఁ డిట్లు మా
నిని నిడి ముందు నీ వరుగు నేఁ గొని వచ్చెద నాయుధమ్ములన్
వెనుకను బూరుష ప్రవర! ప్రీతి నొసంగుచు మీకు భద్రతన్ 22.

తే.గీ. ఎందు మన ముంచి సంతస మందు సీత
యెట్టి పూలు పండ్లు పుడమి పట్టి యడుగు
నట్టి యట్టివి లక్ష్మణ యన్నిటి నిడ
వలయుఁ జుమ్ము వెడలు చుండ వనికి నలరి 23.

కం. గజయాన సీత యా ధర
ణిజ నర కుంజరుల నడుమ నెమ్మి నరుగఁగన్
గజ రాజుల మధ్యను గరి
ణి జాడఁ దోఁచెను సుదతి వనికిఁ జనుచుండన్ 24.

తే.గీ. చెట్లు గుబురు లొక్కొక్కటి చిత్రములను
మున్పు చూడనవి లతలు పూల తోడఁ
గాంచ నలరి యబల సీత యంచితముగ
నాథు నడుగు చుండెను బ్రీతి నళిన నేత్ర 25.

ఆ.వె. జానకి యడుగంగ సంరంభియై లక్ష్మ
ణుం డనేకములను మెండుగఁ గుసు
మమ్ము లున్న యట్టి ప్రూనుల మొక్కల
వివిధములను దెచ్చె వీర వరుఁడు 26.

ఆ.వె. అగ్గలముగ వెలయ బెగ్గురు పక్షుల 27.

హంసల నినదమ్ము లక్కజముగ
నిసుక తిప్ప లుండగ సుజల నది నటఁ
గని రమించె నా యవనిజ భృశము

తే.గీ. వారు చని క్రోశమాత్రము దూర మంత
రామ లక్షణు లుభయు లరణ్యమున య
మున సరసను మేధ్యపు మృగములను జంపి
పెక్కు తినిరి కలసి యట నక్కజముగ 28.

కం. విహరించి బర్హి ణావలి
బహు నాదిత వానర మద వారణ యుతమౌ
గహనమున సమతలమ్మున
గృహ మేర్పఱచికొనిరి నదికి సమీపమునన్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది నేనవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 56.

సీతా రామ లక్ష్మణులు చిత్రకూట పర్వతమును జేరి దాని రమణీయతను గాంచుచు నానందించుట, వాల్మీకి మహర్షిని దర్శించుట, రాముని యాదేశమున లక్ష్మణుఁడు పర్ణశాలను నిర్మింప దేవతలను బూజించి మంచి ముహూర్తమునఁ బ్రవేశించుట.

కం. ముగియఁగ రాతిరి రాముఁడు
తగ లక్ష్మణుని నిదురించు తమ్ముని నట మె
ల్లగ నిద్ర లేపె నపు డిం
పుగ రఘువంశ తిలకుండు పురుషోత్తముఁడే 1.

కం. విను మవి సౌమిత్రీ! తి 2.

య్యని విహగ స్వనము లెల్ల నరిసూదన! కా
ననమున వెడలు సమయ మ
య్యెను బయనింప వలయు మన మిఁక సత్వరమే

చం. విడిచెను నిద్ర, బద్ధకము, వీవధ కష్టము లక్ష్మణుండు వీ
రుఁడు నిదురించు తన్నట సరోరుహ నేత్రుఁడు లేప నింపుగా
వెడలిరి యంద అంతఁ గడు ప్రీతిని ముట్టి శివోదకమ్ములం
దడయక చిత్రకూట గతిఁ దాపసి సెప్పిన యట్టి దారినిన్ 3.

కం. చనుచు నుదయమున సామి
త్రినిఁ గూడి కమలదళాక్షి హృదయేశ్వరినిం
గని సీతను రాముఁడు వ
ల్కెను వచనములు చిలుకలకొలికితో నిట్లున్ 4.

ఉ. పూచిన చెట్లు సీత! కను మోదుగ చెట్లను పూలు మాలలై
తోఁచె వసంత మందు నిటఁ దోరము వెల్గఁగ స్వీయ పీలులం
గాచిన జీడి చెట్ల నర కాయము వొందని పండ్ల వంగఁగం
దోఁచును వాస యోగ్య మని తుష్టి భృశమ్ము నొసంగు దేశమై 5.

తే.గీ. తేనెటీఁగలు ప్రేలాడి మ్రాను మ్రాను
లందు గుంపు గూడుచుఁ గుండ లంత తేనె
పట్టులను బెట్టి యెల్లెడ దిట్టముగను
నుండ, లక్ష్మణ చూడుమ, యుత్సహించి 6.

తే.గీ. కూయ దాత్యూహ మింపుగఁ గూసె నెమలి
తిరిగి యందంపు టా వన దేశ మందుఁ
బుష్ప తల్పమ్ము పఱచిన భూతలమ్ము
నచట లక్షణ! గాంచుమ హర్ష మొసఁగు 7.

తే.గీ. ఏనుఁగుల గుంపు తమి సంచరించు చుండఁ
బక్షి సంఘమ్ము లిడుచుండ ధ్వనులు మురిసి
కొండ శిఖరమ్ము లెత్తుగ గుబ్బతిల్లఁ
జిత్రకూట పర్వతము వీక్షింపు మనుజ! 8.

కం. సమ తలము సెంచి విరివిగ
ద్రుమములు చుట్టు గనిపింప రుచిరం బగు నీ
విమలంపుఁ జిత్రకూట న
గము చెంత వసింతు మయ్య! కమనీయముననన్ 9.

తే.గీ. కాలి నడక నేఁగుచు వార లా లతాంగి
సీత తోడఁ జేరిరి రమ్య చిత్రకూట
గిరిని నానా విహగ గణ చరితము బహు
మూల ఫల సర సోదక పూరితమును 10.

తే.గీ. ఇది మనోజ్ఞము తరువులు నింక లతల
తో నలరు పండ్లు పేరులు దొరకు చుండు
నధికముగ నిట సంతస మలరు మనకు
వాస ముండ నని తలంతు భ్రాత! నేను 11.

కం. మునులు మహాత్ములు వసియిం
చు నగవరేణ్య మిది సౌమ్య! సుఖముగ నిచటన్
మనము నివసింప భావ్య మ
గును గ్రీడింత మిచటఁ దిరుగుచు ముద మారన్ 12.

కం. సీతయు రాముఁడు లక్ష్మణుఁ
డా తఱిఁ జేతులు మొగిడ్చి యాశ్రమమునకుం
బ్రీతినిఁ జని వాల్మీకి మ
హా తాపసునకు నతు లిడి రానందముననన్ 13.

ఆ.వె. ఆ మహర్షి మురిసి యంత వారిని గౌర
వించి ధర్మ విధిని మించి యింక
స్వాగతమ్ము వల్కి స్వయముగ నాసీను
లగుఁడు నాఁ బలికెను దగిన రీతి 14.

తే.గీ. అమ్మహా బాహువౌ లక్ష్మ ణాగ్రజుండు
తన్మహర్షి వాల్మీకికిఁ దమ కథను య 15.

థా విధి నుడివి సర్వము దమ్మునిఁ గని
యంతఁ బలికె నిట్లు విభుండు సంతసిల్లి

తే.గీ. తెమ్ము లక్ష్మణ! కట్టెలు దృఢము లైన
వెల్ల మంచివి కట్టుమ యుల్ల మలరు
నింటి నిచట మనకు వాస ముంట నొప్పుఁ
జిత్తమం దాత్రము కరము సెలఁగు చుండె 16.

మ. విని వేగమ్ముగ లక్ష్మణుం డట మహావృక్షమ్ములం గాంచి తె
చ్చెను టెక్కింటినిఁ బర్ణశాల నటఁ దాఁ జిత్రమ్ముగాఁ జక్కఁ గ
ట్టెను దానిం గని యగ్రజుం డలరఁగా డెందమ్ము వానావృత
మ్మును వీక్షింపఁగ నాజ్ఞకై నిలువఁ దమ్ముం డప్డు రాముం డనెన్ 17.

తే.గీ. జింక మాంసముచే శాల నింక నిట య
జింతము మన మనుజ! వాస్తు శాంతి సేయ
వలయు జుమ్మి చిరమ్ముగ వాస మెంచు
వారి కెల్లఁ గర్తవ్యము వీరవరుఁడ! 18.

చం. మృగమును జంపి సత్వరము మేటి ధనుర్ధర! తెమ్ము ధర్మముం
దగిన విధమ్ము గాంచు మిది తప్పని కార్యము శాస్త్ర దృష్టిఁ బ
ల్కఁగ రఘు రాముఁ డివ్విధము లక్ష్మణుఁ డట్టులు సేసి చెంత ని
ల్వఁగఁ బర వీర నాశకుని లక్ష్మణుతో ననెఁ దిర్గి రాముఁడే 19.

తే.గీ. సౌమ్య! యేణీ పలలమును రమ్య రీతి
వండుమ యజింప వలయు సత్వరముగా, ము
హూర్త మాసన్న మయ్యె, శాలోన్నతమ్ము
నిపుడు త్వరపడు మని యన్న యెలమి ననఁగ 20.

ఉ. నల్లని జింక నంత సవనమ్మున కర్హము నైన దానినిన్
బల్లిదుఁ డైన లక్ష్మణుఁడు వహ్ని నుంచెను జంపి యత్తఱిం
దెల్లము కాఁగఁ బక్వ మని తీఱిచి రక్తము కాల్చి నంతటన్
మెల్లగఁ గాంచి యగ్రజు నమేయ గుణోన్నతుఁ బల్కె నివ్విధిన్ 21.

తే.గీ. దేవ సన్నిభ! చూడుమ దీనిఁ గృష్ణ
మృగము నింపుగఁ గాల్చితి మేను సెల్లఁ
గుశలుఁడవు యజింపఁగ నీవు భృశముగ యజి
యింపు మిఁక దేవతల సెల్ల నింపు నొసఁగ 22.

ఉ. పన్నుగఁ జేసి స్నానము జపమ్మును నేర్చిన పండితుండు రా
మన్న తదర్హ మంత్రముల నంతట నింపుగ సంగ్రహమ్ముగా
మిన్నగఁ దాఁ బఠించె నట మించి గృహాశ్రువ మందు శుద్ధుఁడై
గ్రన్ననఁ గొల్చి దేవతలఁ గా లిడి రెల్లరు పర్ణశాలలో 23.

చం. వర నరుఁ డందె హర్షమును బార్థివ తేజుఁడు రాముఁ డత్తఱిం
బరమపు వైశ్వ దేవ బలి వైష్ణవ రౌద్ర బలుల్ దనర్చి వా
స్తు రమణు పూజ సేసి శుచితోఁ బను లెల్లను మంగళమ్ములం
బరఁగఁగఁ జేసి స్నాతుఁడు జపమ్ము నొనర్చి యొసంగెఁ దద్బలిన్ 24.

తే.గీ. పాప శమనపు బలి నిచ్చి పర్ణశాల
యందు నగ్నివేదిని నమరాలయమ్ము
నాశ్రమమునకుఁ దగి నట్లు నంచితంపు
స్థలములను నిల్పె రాముఁడు సద్గుణుండు 25.

ఉ. శాంతిలఁ జేసి భూతములఁ జక్కఁగ దుంపలఁ బండ్ల మాలలన్
సాంతము పక్వ మాంసముల నప్పున దర్భల మంత్ర వాక్కులన్
సుంత సమిత్కుశమ్ములను శ్రుత్యుది తాలపనమ్ములన్ స్వ శా
లాంతర మేఁగె రాముఁడు నిజాంగన తమ్ముఁడు తోడు రాఁ దమిన్ 26.

తే.గీ. పత్ర రాశిచేఁ గప్పిన పర్ణశాలఁ
జేరిరి తగిన చోటున మూరి కట్ట
వాత భయ మింత లేని యవసధ మందు
యమర నిచయము సభ సుధర్మమును భంగి 27.

తే.గీ. వివిధ మృగపక్షి సంకుల విస్తృత వనిఁ
జిత్ర పత్రస్తబక తరు శ్రేణి కాన
నమ్ము నందు వ్యాల మృగ స్వనమ్ము లలర 28.

జిత మనస్కులు తిర్గిరి యతి సుఖముగ

కం. సుందరపుఁ జిత్రకూటము
నందు నిలిచి మాల్యవతిని నారసి హృద యా
నందము వడసి మృగ విహగ
బృందముల వెలికి వగవరు నృప నందనులే 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది యాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 57.

రాముఁడు గంగానది కావలి తీరమును జేరఁగాఁ జూచి గుహుఁడు సుమంత్రునితోఁ గొంత తడవు సంభాషించి తన గృహమునకు వెడల, సుమంత్రుఁ డయోధ్యకుఁ దిరిగి వెడలి రాజు దశరథునకు రాముఁడు చిత్రకూటపర్వతమున కేఁగె నని తెలుపఁగ రాజు, భార్య కౌసల్యయు దుఃఖమ్ము్మన మూర్ఛిల్లుట.

తే.గీ. దక్షిణపు టొడ్డు రాముఁడు దాఁటఁ గాంచి
గుహుఁడు దుఃఖ తప్తుఁ డపుడు కొంత తడవు
సారథి సుమంత్రుతో నటఁ జల్పి భాష
ణముల నేఁగె నిజ గృహమునకు వగచుచు 1.

కం. వా రెటేఁగిరి యట నిలిచిన
వారి వలన నా ప్రయాగఁ బడయుట నింకం
జేరుటయు భరద్వాజుని
నా రాముని చిత్రకూట మరయుట లెల్లన్ 2.

చం. అనుమతితో సుమంత్రుఁడు మహాశ్వములం దగఁ గట్టి తేరికిం
జనుట కయోధ్యకుం గదలి చాగుచు భార మనస్కుఁడై కడున్ 3.

వనములు గంధ యుక్తములు వాహిణు లింక సరోవరమ్ములం
గని పురు లింక జానపద కాయము లెల్లను దాఁటి శీఘ్రమే

ఆ.వె. మూడవ దిన మందు మూరి సాయంసమ
యమునఁ జేరెఁ బట్టణమున కా య
యోధ్యకు ముద మెల్ల నుడిగిన పురిని సు
మంత్రుఁ డరసె నపుడు మన మెరియఁగ 4.

తే.గీ. వగపు వేగము మించఁగఁ బరమ దుఃఖి
తుఁడు సుమంత్రుఁడు నిశ్శబ్ద మడరు పురిని
శూన్యమును బోలి యుండఁగఁ జూచి డెంద
మందుఁ జింతింపఁ దొడఁగె నమంద రీతి 5.

కం. గజములు హయముల తోడం
బ్రజల జనాధిపుని తోడఁ బట్టణ మకటా
సుజనుని రాముని వన వా
స జనిత శోకాగ్ని చేత జ్వలియించె నొకో! 6.

కం. చింతించు చుండ నివ్విధి
నంత సుమంత్రుఁడు వడివడి హయములు చేరెం
జెంతకు నగరద్వార
ప్రాంతమునకుఁ దూఱె వేగ పరువుల తోడన్ 7.

కం. కని యేతెంచు సుమంత్రుని
జను లట వందలును వేలు చనుదెంచి రయ
మ్మున నెక్కడ యా రాఘవుఁ
డని చుట్టును జేరి రంత నాత్రము తోడన్ 8.

కం. వారికిఁ జెప్పె సుమంత్రుం
డా రాముని యానతిఁ గొని యా యమర నదీ
తీరమున మహాత్ముఁ డొసఁగ
నే రయమున మరలితి నని నిట్టూర్పులతో 9.

ఉ. దాఁటితి రంచు వా రెఱిఁగి తద్దయుఁ జింతిలి భాష్పనేత్రులై
మాటికి నిశ్వసించుచు నమంద మహో రఘురామ యంచునున్
వీటనుఁ గాంచ నేర మిక వీరుని రాముని నా తపించుచుం
గూటమిగా నటన్ నిలిచి కుందుచు సుద్దులు పల్కి రెల్లరున్ 10.

ఉ. దానము లందు జన్నముల ధార్మికు రాముని నుత్సవమ్ముఁలం
గానఁగ లేము జట్ల జన కాయము కోరున దెద్ది యిష్ట మె
ద్దాని నగున్ ఘనమ్ము ప్రియ దాయక మెద్ది సుఖంబు నెట్లగున్
వాని నెఱుంగు రాఘవుఁడు పాలన సేయును దండ్రి భంగినిన్ 11.

కం. కిటికీల వద్ద నిల్చిన
యటమట నంగళ్ల నున్న యట్టి వధూటీ
పటలపు టాక్రందనములు
త్రుటి వినఁబడె రాముని కయి రోదింపంగన్ 12.

ఆ.వె. కప్పు కొనుచు ముఖము నప్పుర వీథిని
రథము పైనఁ దరలె రయముగా సు
మంత్రుఁడు దశరథుఁడు మానవేంద్రుం డున్న
సౌధ రాజమునకు బాధ తోడ 13.

చం. కదిసి రథమ్ము నుండి దిగి గ్రక్కున రాజగృహంపు కక్ష్యలం
బదముల నేడు దాఁట నటఁ బౌరజ నావలి సంకు లమ్మునుం
బదిలముగా సుమంత్రుఁ గని భామలు మేడల మిద్దె లందు నె
మ్మది కలఁగంగఁ జేసిరి కుమారునకై యట నార్తనాదముల్ 14.

ఆ.వె. విమలములు విశాల రమనీయ నేత్రము
లశ్రు పూరితములు నై చెలంగ
శోక వేగమునను జూచుచు నొకరి నొ
కరు నిలిచిరి స్త్రీలు కలఁత మించ 15.

ఉ. రామునికై చెలంగ వగ రాజ గృహమ్మున చక్రవర్తి కాం
తామణి సంచయమ్మునకుఁ దప్త మనస్కుల మాట లచ్చటన్
వేమఱుఁ బల్క నిట్లు వినిపించెను మెల్లఁగ నేఁగి రాముతో 16.

రాముని వీడి రా నడుగ రాముని మాత సుమంత్రుఁ డే మనున్

తే.గీ. పుత్రు నెడఁబాసి కౌసల్య పుణ్య శీల
బంధములు తెగ వని కేఁగ వర సుతుండు
కష్ట మగు జీవనమ్ము సుకరము కా దె
చటికి నేగిన నున్నను నిటు తలంతు 17.

ఆ.వె. నృపతి దార లట్లు నిజములు పల్కఁగ
నాలకించి మండు నట్లు వగపు
టగ్ని సారథి చనె నంత రాజ గృహము
లోని కతి రయమున ఱేనిఁ గాంచ 18.

ఉ. అష్టమ కక్ష్య దాఁటి వసుధాధిపుఁ గాంచి సుమంత్రుఁ డచ్చటం
గష్ట తరార్తు దీను సిత కాంతి గృహమ్మునఁ బుత్ర శోకునిం
జేష్టన హీను జేరి తగఁ జేతులు మోడ్చి నమస్కరించి తా
నిష్ట కుమారు భాషణము లెల్ల వచించె యథోక్త రీతినిన్ 19.

కం. విని యా మాటలు శీఘ్రము
గ నేలఁ గూలెను గుమార గత శోకముతో
డ నరేంద్రుండు దశరథుఁడు
ఘన మూర్ఛను జెంది భృశ వికా రాత్ముండై 20.

ఆ.వె. నృపతి యా విధముగ నేలఁ గూలఁగ మూర్ఛ
తోడ నంతిపురపుఁ దోయజాక్షు
లెల్లఁ జేతు లెత్తి తల్లడిల్లి భృశము
యేడ్వ సాగి రంత నింతు లార్తి 21.

తే.గీ. పడిన పతినిఁ గౌసల్య సపత్నియా సు
మిత్ర తోడురాఁ దగ లేపి యాత్రముగ వ
చించెఁ బతి తోడ దుష్కర్ముఁ గాంచు దూతఁ
దిరిగి వచ్చెఁ బలుక వేల నరవరేంద్ర! 22.

తే.గీ. చేసి యన్యాయ మిప్పుడు చింత నందు 23.

దీవు రాఘువ! లెమ్మిఁక నింపుగఁ గలు
గు యశ మది నీకు నివ్విధిఁ గుముల సేమి
ఫలము తో డెవ్వరుం ద్రిటఁ బార్థివేంద్ర!

కం. ఎవరి భయమ్మున దేవా!
యవనీశా! రాము నడుగ వకట సుమంత్రున్
సువదన కైకఁ గనము నీ
వు వలుక నగు నిర్భయముగఁ బుత్రుని కొఱకై! 24.

తే.గీ. భాష్ప పూరిత గళ నిజ భర్త తోడఁ
బలికి కౌసల్య శోకతప్త గిర లిట్లు
పుడమిఁ బడ నామెను బతిని ముదిత లరసి
గొల్లు మనిరి బిగ్గరగను దల్లడిల్లి 25.

కం. చెలరేఁగ నంతిపురమున
వలవల యేడ్పు లరసి యట వనితలు వృద్ధుల్
పలువురు తరుణులు నేడ్చిరి
కలవరమునఁ దిరిగి పురము కర మిఱు కయ్యెన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 58.

దశరథునకు సుమంత్రుఁడు రాముని సందేశమును దెల్పుట, కౌసల్యకు, భరతునకు రాముని
యనునయ వాక్యములను లక్ష్మణుని దశరథునిపై నాగ్రహపు వాక్యములను దెలుపుట.

తే.గీ. ఊఱడింప నరేశ్వరుఁ డూఱడిల్లి
కొంత తడవునకుఁ దనదు కూర్మి సుతుని 1.

వృత్త మరయఁగఁ బిలిపించె నత్తఱిని సు
మంత్రునిఁ దిరిగి యెదుటకు మనుజ వరుఁడు

ఉ. రామునె తల్చువానిని నిరంతర మార్తి చెలంగు వృద్ధునిన్
భీమ విచార సంయుతునిఁ బృథ్వికి నాథునిఁ బట్టఁ గ్రొత్తగా
సామజ రీతి నున్న పతి  స్పర్శ గజం బన మూల్గు వానినిన్
స్వామినిఁ జేరె నమ్రుఁ డయిసారథి యంతఁ గృతాంజలిం దగన్ 2.

తే.గీ. ధూళి నిండిన గాత్రము తోడ నున్న
వానిఁ జెంత నిల్చిన వాని దీన వదను
నా సుమంత్రుని వీక్షించి యశ్రు పూర్ణ
ముఖుని నార్తితోఁ బల్కెను బుడమి ధవుఁడు 3.

ఉ. అక్కట ధర్మ చిత్త ఘనుఁ డా రఘు వీరుఁడు నిల్చె నెచ్చటం
బెక్కు సుఖమ్ము లంది కట వృక్షపు మూలము నందుఁ బండునే
యెక్కడ యారగించు నతఁ డెయ్యది దుఃఖ మెఱుంగఁ డొందెనే
మిక్కిలి దుఃఖముం బుడమి మేనును వాల్చెనె భూప పుత్రుఁడే 4.

కం. సూత! యనాథుని భంగిని
నా తనయుఁడు నిల్చెనే వనమ్మున నకటా
యే తీరున విజన వనిఁ బ
దాతి రథ గజ సహితుండు దా నుండు నటన్ 5.

చం. అవనిజఁ గూడి పుత్రులు మహాత్ములు విక్రము లెట్లు చేరి రా
నవ వనిఁ గ్రూర కృష్ణ ఫణి నాగ మృగాలి నిషేవితమ్మునుం
దివురుచుఁ బాదచారు లయి తేరును డిగ్గి చరించి రెవ్విధిన్
సువదన రాజపుత్రులును సూతుఁడ! యా సుకుమారు లక్కటా 6.

తే.గీ. సూత! సిద్ధార్థుఁడవు నీవు చూడ నా కు
మారు లేఁగ నరణ్యము వారి నచట
మందర నగమ్మునకు నేఁగు సుంద రాశ్వి
నుల పగిదిని సుమంత్ర! ఘనుఁడవు సుమ్ము 7.

ఆ.వె. రాముఁ డేమి చెప్పె లక్ష్మణుం డేమి వ
చించె నట సుమంత్ర! యంచిత మతి
సీత యేమి సెప్పెఁ జేర నరణ్యము
చెప్పు మెల్ల నాకు శీఘ్రముగను 8.

తే.గీ. తినుట యాసీనుఁ డగుట శయనము లింపు
గ వచియింపు సూత! సుతుని కార్యములను
నా కొసఁగు నవి యసువులు నర వరుఁడు య
యాతి సాధు జనుల మధ్య నలరి నట్లు 9.

కం. అడుగ నరేంద్రుం డివ్విధిఁ
గడు దుఃఖమ్మునఁ జలించి కన్నీ రొలుకన్
బెడిదముగ రాజుఁ గని సూ
తుఁడు పల్కెను భాషణములు తూర్ణం బిట్లున్ 10.

ఉ. చెప్పెను మోడ్చి చేతులను శీర్షము వంచి నమస్కరించి తా
నప్పుడు రాముఁ డేలిక! మహాత్ముఁడు ధర్మము నెంచి యిట్టులం
జెప్పు సుమంత్ర నా గిరలు శ్రేష్ఠుఁడు విజ్ఞుఁడు వందనీయుడుం
తప్పక నాదు తండ్రికిఁ బదమ్ములు ముట్టితి నంచు భక్తినిన్ 11.

తే.గీ. చెప్పు మంతఃపురమ్మున స్త్రీల కెల్ల
నే నమస్కరించితి నని నీ వడుగుమ
నే నడిగి నట్లు తగు రీతి నీవు వారి
వారి యారోగ్యముల సూత! భద్రములను 12.

కం. నా జననిఁ గుశల మడుగుమ
నేఁ జేయు నతుల నొసఁగుమ నెమ్మినిఁ గౌస
ల్యా జననిని నిత్యము సూ
తా! జాగ్రత నుండ మని పిదప పలుకు మిటుల్ 13.

తే.గీ. నిత్య మగ్ని హోత్రము నందు నత్యధికపుఁ
దత్పరత నుంచు దేవి! భూధవుని దేవ
నిభుని పాదపద్మములను నెమ్మి నర్చ 14.

నమ్ము దైవమువలె సేయు మమ్మ! నిరతి

తే.గీ. మానము నభిమానమ్మును మాని మాత
లందు వర్తిలు తల్లిరో యార్య కైక
ను జననిని జనకునిపై ననువుగ నుండు
నట్లు చేయఁ దగు జననీ యనవరతము 15.

ఆ.వె. రాజు నందు వలె భరతు నందు వర్తిల్లు
జనని రాజ ధర్మ మనుసరించి
రాజు లధికు లర్థ రాసులందు వినుమ
తలఁపుమ మది రాజధర్మ మెలమి 16.

కం. నుడువుమ నా కుశలము నా
నుడులే యనఁగ భరతున కనుజునకుఁ బ్రీతిన్
నడువ మను సమమ్ముగ నె
ప్పుడమ్మ లందు ననురాగము మదిఁ చెలంగన్ 17.

కం. నిలిచి యువరాజ పదమున
లలి తేక్ష్వాకు కుల హర్ష రస దాయక దో
ర్బలుఁడు భరతుండు జనకుని
నిలాధవుని గౌరవించి యిల నేలఁ దగున్ 18.

ఆ.వె. తండ్రి వృద్ధుఁ డయ్యెఁ దగదు నాతని నిరో
ధింప యౌవరాజ్య మింపుగఁ బడ
సి జనకాజ్ఞ నూని శీర్షమునఁ బరిపా
లింపు మను మనుజునిఁ బెంపు మీఱ 19.

తే.గీ. తిరిగి నా తోడఁ బల్కెను గురియ యశ్రు
వులు భృశమ్ము తనయ శోక పూరి తాత్మ
జనని కౌసల్య నీకును జనని నాఁగఁ
జూడఁ దగును భరత! యంచు శోక మడర 20.

కం. అని యిట్లు మహారాజా 21.

కనుఁగవ నిండంగ భృశము కారం గన్నీ
టిని తుడిచికొనియె రాముఁడు
వనజాక్షుఁడు ఘన యశుండు పార్థివసుతుఁడే

ఉ. కోపము నూని లక్ష్మణుఁడు ఘోరముగా ననె నిశ్వసించుచున్
భూపతి రాజ నందనుని పూర్వజు నే యపరాధ మెంచి తా
నీ పగిదిన్ బహిష్కరణ మెట్లు విధించెను గైక శాసనం
బేఁపు నొసంగె మా కిచట నీ పతి సేయఁగ దుష్ట కార్యమే 22.

ఆ.వె. లోభ కారణముననో భార్య కిచ్చిన
వరముల నయిన మఱి నరవరుండు
దుష్కృత మొనరిచె బహిష్కారము విధించి
యెవ్విధినిఁ దలఁచిన నిది నిజమ్ము 23.

తే.గీ. రాముని వెలివేయుటకుఁ గారణము తోఁప
దిచట నాకు నిష్టం బగు తీరు నెంచి
చేయఁ దగు నన్న నొప్పదు చింత సేసి
దైవ కృత్య మంచును బల్కఁ దగదు చూపె 24.

కం. అవిచార మల్పబుద్ధి న
య విరుద్ధము నిర్ణయింప నాత్మజునకు ని
ట్లు వివాసము రాఘువునకు
నవిధేయ క్రోశ మడరు నత్యధికముగన్ 25.

ఆ.వె. రాజు నందు నే నరయను బితృత్వము
విగత రాగ ముందు మగఁడు నన్న
బంధువు జనకుండు పన్నుగ నెంచంగ
నాకు రాముఁ డగును లేక శంక 26.

తే.గీ. అందఱికిఁ బ్రియుఁ డందఱి కధిక హితము
కోరు వానినిఁ ద్యజియింప నేరు నిన్ను
నకట రంజింప నేర్తురు వికల మైన
కార్య మిట్లు సేయంగ లోకమ్ము నందు 27.

తే.గీ. ప్రజల కందఱి కొసఁగును బ్రమద మెల్ల
రాముఁ డెల్లప్పు డింపుగ రాగ మడర
ధార్మికుని నివ్విధము విరుద్ధ గతిని వెలి
వేయ నెట్లు బ్రతుక నేర్చు విశ్వ విభుఁడు 28.

ఆ.వె. అట్టె నిలిచె సీత నిట్టూర్చుచు మనస్వి
ని స్పృహ మఱచి యెడఁద నెలఁత నవ్వు
చును బిశాచ మకట తనువునం దున్నట్టి
విధము మెఱయ భృశము వింత తోఁప 29.

కం. మున్నెఱుఁగని వెతలు కదియ
నన్నుల మిన్న నృపకాంత యవనిజ యకటా
మిన్నఁగ నేడ్చుచు నింతయు
నన్ను గని వచింప దెద్ది నాకు నరవరా! 30.

కం. వెడలెడు నన్నరసి మొగము
కడు వాడగఁ గాంచుచు నిజ కాంతునిఁ గనులం
బుడమి తనయ కన్నీటిని
విడిచెను ధారాళముగను వేదన తోడన్ 31.

తే.గీ. లక్ష్మణ ఘన బాహుద్వయ రక్షితుండు
నిలిచి యుండెఁ గార్చుచును గన్నీరు నంజ
లించి సీతయు నేడ్చుచుఁ గాంచు చుండె
రాజ రథమును నన్నును రాజ! నిలిచి 32.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 59.

సుమంత్రుఁ డింకను నయోధ్యా నగర దురవస్థను వాడిన తరువులను కళతప్పిన కొలంకులను
మిన్నకున్న మృగ పక్షి జాలములను వివరింప దశరథుఁడు శోకమున మూర్ఛిల్లుట.

కం. వచియింప సుమంత్రుఁ డటుల
సచివుఁడు విని రాజు తిరిగి సారథి తోడన్
వచనము లింకను జెప్పు మ
నుచుఁ బలికె సుతు విన నెంచి నోయుచు నెడఁదన్ 1.

చం. విని వసుధేశు పల్కులను వేఁగుచుఁ బల్కెను భాష్పపూర్ణుఁడై
ఘనుఁడు సుమంత్రుఁ డిట్లు నరకాంతునితో రఘురామ వృత్తముం
దనయులు జూట ధారులయి తాలిచి యింపుగఁ జీర వల్కముల్
కని నది దాటి గంగను సుఖమ్ముగ నేఁగఁ బ్రయాగ కాష్ఠకున్ 2.

ఆ.వె. ముందు లక్ష్మణుండు మూరి రక్షించుచు
నా రఘుప్రవరుని నరుగు చుండ
నరసి వారి నేను మరలితి నిస్పృహా
యుండ నకట యచట నుండి దేవ! 3.

కం. వన మేఁగఁగ రాముఁడు పె
చ్చని నిట్టూర్పులు విడుచుచుఁ జనవు మరలి తో
లిన నాదు గుఱ్ఱములు దా
రిని నేమని చెప్ప నేర్తు నృపవర ముఖ్యా! 4.

ఆ.వె. అంజలి ఘటియించి యవనీప సుతు లిద్ద
ఱకును రథము నెక్కి వికల చిత్తుఁ
డ నయి దుఃఖ మంతయును మ్రింగి తరలితి
నచట నుండి నరవరాగ్రగణ్య! 5.

తే.గీ. అచ్చటనె యుంటి నేను బెక్కహములు గుహు
చెంత నిలిచి రాముఁడు తిర్గి చెంతకుఁ బిలు
వఁ గలఁ డన్న యాశ మదిని వఱలు చుండ 6.

మిక్కుటమ్ముగ నప్పుడు మేదినీశ!

ఆ.వె. నీదు రాజ్య మందు నృపవరేణ్య! యరసి
రాముని వ్యసనమ్ము ప్రాకు లవి మొ
లకలు మొగ్గ లక్కట కుసుమముల తోడ
వాడి యున్న వెల్లఁ బార్థివేంద్ర! 7.

తే.గీ. పేఁడిఁ గుతకుత లాడెను వేఁగినీ జ
లములు గుంటలు కొలకు లరయ భృశమ్ము
వనము లుపవనముల నెల్లఁ బత్రరాశి
యెండి యున్నది గాంచంగ మెండుగాను 8.

కం. నడయాడ వడవి మెకములు
పెడలవు క్రూర మృగములు కవియఁ బగ వానిం
గడు వింతగ నిశ్చబ్దం
బడరె వనిని రామ శోక మావేశింపన్ 9.

తే.గీ. తామరాకు లెల్ల మునిఁగె నా మడుఁగులఁ
గలఁగెఁ గొలనుల నీ రెల్లఁ గలఁత నెందెఁ
బద్మములు తటాకమ్ములఁ బక్షు లింక
మీనములు నరపుంగవ! కానరావు 10.

తే.గీ. నీటఁ బుట్టిన పువ్వులుఁ దోఁట విరిసి
న విరు లల్పముగను వాసనల నడరెడు
నట్టివియు ఫలములును మున్నడరు నట్టి
పగిది వెలుఁగ కున్న విపుడు పార్థివేంద్ర! 11.

తే.గీ. చూడ నుద్యాన వనములు శూన్యములు వి
హంగములు మాయ మయ్యె నరాధినాథ!
కాంచ నారామముల నంద మించు కేని
యక్కజమ్ముగఁ బరికింప నందు నిందు 12.

కం. చేర నయోధ్యాపురి నేఁ 13.

దేరున నభినందనములు దెల్పరు నాకుం
బౌరులు రాముని఼ గాంచక
యా రథమున నిశ్వసింతు రకట బలుమరుల్

ఆ.వె. రాజ రథముఁ గాంచి రామ హీనమ్మును
గంట నీళ్లు భృశము గాఱ జనులు
రాజవీథిఁ జేరి రగుల దుఃఖ మెడఁద
లందు దేవ! నిల్చి రంద ఱట్టె 14.

ఆ.వె. మిద్దె లందు నిళ్ల మేడలపై నిల్చి
వచ్చిన యరదమ్ముఁ జెచ్చెరఁ గని
యబల లెల్ల రంత నరయక రాము నాం
క్రందనములు సేసి రిందు ముఖులు 15.

కం. విమ లాయ తాక్షు లందు జ
లము లూర భృశమ్ముగ నబల లచట సంతా
పము నిండ నెదల నిల్చి ర
ట మౌనముగ నొకరి నొక రడ లొదవఁ గనుచున్ 16.

ఆ.వె. మిత్రు లందు నింక శత్రులం దేనియు
నితరు లందు నైన నించు కేని
యార్తి యందు భేద మరయకుంటి నరేంద్ర!
యెల్ల రొక్క విధము తల్లడిల్ల 17.

మ. ముద మేపారని మాన వౌఘములు సంక్షో భేభ గంధర్వముల్
కదలాడంగ విచార సంయుత మహో కాకుత్స్థ! దీనమ్ముగా
రొదలే నిండఁగ ఘోర దుఃఖమున నూర్పుల్ రేఁగ రామార్తినిం
గదియం దోఁచెఁ బురమ్ము హీనసుత యా కౌసల్య నా నార్తితో 18.

కం. విని సూతుని భాషణములు
మనుజేశుఁడు దీనముగ సుమంత్రుని తోడన్
మన మెరియ గద్గదస్వర
మునఁ దడఁబడఁ బలుకులే కుములుచు ననె నిటుల్ 19.

తే.గీ. క్షైక పాప భామిని నియుక్తమ్ము చేత
నకట మంత్రజ్ఞ వృద్ధ జనాళి నింకఁ
జెలుల మంత్రుల విబుధులఁ జేరి సమ్మ
తి గొన కిట్లు చేసితి నొక్క స్త్రీ కొఱకును 20.

తే.గీ. మోహమున నయినను సూత! మూరె నిది జ
రుగవలసి యుండఁగ యదృచ్ఛ సెగడెఁ గులపు
నాశ నార్థమ యీ వ్యసనమ్ము తార
సిల్లె నిక్కమ్ము సెంచంగఁ జిత్రముగను 21.

ఉ. ఇంచుక యేని మేలు మఱి యే నొనరించిన నీకు నెద్ది యే
నంచిత మున్నసూత వర యన్నుమ కానకు నన్ను బ్రాణముల్
మించుచుఁ దీవరించెడిని మిన్నగ రాము మరల్ప కున్నచో
ముంచును నాదు జీవనముఁ బుత్రుని దుఃఖము నిశ్చయమ్ముగన్ 22.

కం. కడు దూర మేఁగినను రా
ముఁడు దీర్ఘభుజుఁడు రథవరమున నను సూతా!
వడివడిఁ గొనిపొమ్ము వనికిఁ
గొడుకున కటఁ జూపు నన్ను గూరిమి మీఱన్ 23.

తే.గీ. గుండ్రముగ నున్న దంత పంక్తుల నడరెడు
లక్ష్మ ణాగ్రజుం డెచట గలండు సీత
తోడ నాతనిఁ గాంచిన వాఁడ నైన
నుందు నేను జీవమ్ముల నుర్వి యందు 24.

కం. యమ నిలయం బేఁగం ద
థ్యము సూడక యున్న రాముఁ దనయున్ సూతా!
విమ లారుణ నేత్రుని స్వ
ర్ణ మణి ఖచిత కుండలుని ఘన భుజ ప్రవరున్ 25.

ఆ.వె. ఇట్టి దుస్థితిఁ గని యిచట నే నిక్ష్వాకు
నందను గన కుంటి నరవరేణ్య 26.

రాఘవుని నకట తలంప దుఃఖ తర మొం
డు నరయంగ నగుసె మనము నందు

కం. హా రామా! హా మైథిలి!
హా రామానుజ! యెఱుంగ రకటా నన్నున్
భారం బౌ దుఃఖమ్మున
నీ రాజె యనాథుని వలె నిటఁ జావంగన్ 27.

కం. కడు దుఃఖమ్మునఁ దనయుల
కెడఁద సమర్పించి మున్గి యీదఁ దగనిదౌ
కడలి నగాధమునఁ బలికె
నొడుదొడుకున మాట లిట్టు లుర్వీపతియే 28.

సీ. కౌసల్య తోడ దుఃఖ జలధి మునిఁగితి నేను రాముని వగ నెగడ ఫణిగ
సీతా విరహ ముల్లసిల్ల నొడ్డయి నిశ్వసమ్ము లూర్ములుగను బమ్మ భాష్ప
జలము నురుగుగ హస్తద్వయ విక్షేప మడర మీనములుగ నార్పు లమర
ఘోషంపుఁ బగిదినిఁ గురులు చెదరి నాఁచు గాఁగఁ గైకేయి ముఖమ్ము బడబ
తే.గీ. గాఁగ కన్నీటి వేగపుఁ గలఁత తోడ
మందర గిరలు నక్రపు జంద మమర
వరములే వేల రామ వివాసము గన
దాఁట లేను దుఃఖాబ్ధి దుస్తరము దేవి! 29.

కం. కన లే నిచ్చట నా రా
ముని లక్ష్మణ సంయుతమ్ము మూరె నశుభమే
ఘనముగ నని మూర్ఛిల్లి ప
డెను దల్పము పైన ఱేఁడు డెప్పర మడరన్ 30.

కం. జాలిగ నరేంద్రుఁడు వడిన
మూలిగి రెట్టిం పయి వగపు చెలఁగ మదిలో
నాలోచింప సుతునకై
తూలెను గౌసల్య తిరిగి తోరపు భీతిన్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నేఁబది తొమ్మిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 60.

పుత్ర శోక తప్తయై విలపించుచున్న కౌసల్యను సారథి సుమంత్రుఁ డోదార్చుట. రాముఁ డడవిలో నున్న నానందముగా నుండఁ గలఁ డని వక్కాణించుట.

కం. దయ్యము వట్టిన యట్టుల
నయ్యమ కౌసల్య ధరణి నడలుచు మిగులం
గుయ్యిడుచు నా సుమంత్రునిఁ
జయ్యనఁ గని పలికె నిట్లు సంతాపమునన్ 1.

తే.గీ. ఎచ్చట రఘురాముం డుండె నెచ్చట సతి
సీత యుండె నెచ్చట గుణశీలుఁ డుండె
లక్ష్మణుం డచ్చటికి సుమంత్ర! కొని పొమ్ము
నన్ను వారిని వీడి మనంగఁ జాల 2.

కం. మరలింపు మీ రథమ్మును
ద్వరితము నన్ను గొని పొమ్ము తడయక యటకున్
వర దండకా వనమునకు
నరుగనిచో నరయు దాన యమ నిలయమ్మున్ 3.

కం. కన్నీటఁ గలఁగి తడబడ
మిన్నగ గిర లనునయింప మెల్లగఁ బల్కెం
బన్నుగ మోడ్చి కరమ్ములు
క్రన్ననఁ గని దేవి నిట్లు ఘన సూతుండే 4.

కం. భయ శోక మోహముల నా
ర్య! యెడఁద నుంచకుమ పుట్ట నతి దుఃఖముచే 5.

నయముగ సంతాపము వీ
డి యడవిలో  రాముఁ డుండు లీవి చెలంగన్

ఆ.వె. లక్ష్మణుండు ధర్మ రతుఁడు పూజించి రా
ముని జితేంద్రియుండు వనము నందుఁ
బాద సేవ సేసి పన్నుగ నన్నకుఁ
బడయుఁ బరము నెలమి నడలు వలదు 6.

మ. విజనం బైన యరణ్య వాసమును నిర్భీతిన్ ధరాజాతయే
నిజ సంవాసపు భంగి నెంచి నిలిచెన్ నెమ్మిన్ మనం బుంచుచున్
నిజ నాథుం డగు రాము నందు సతిలో నేఁ గాంచ దైన్యమ్మునే
బుజువై నట్టి గృహమ్ము నాఁ దలఁచు సంప్రీతిన్ మదిం బొందుచున్ 7.

కం. నగ రోద్యాన వనముల క
రిగి మును రమియించి నట్లు లీలగ సతి చ
క్కఁగ సీత విజన వనినిఁ ది
రుగు చున్న దడరుచు నేఁ డురుతర ముదమునన్ 8.

తే.గీ. బాల చందమ్మున శశి నిభ ముఖి సీత
రాముని కధీన మగు నంతరంగమున వి
జనపు టడవిలోన రమించు ననువు గాను
సంతసమ్మున మది వీడి వంత నెల్ల 9.

తే.గీ. హృదయ మెల్ల నర్పింప నిజేశుఁ డైన
రామునకు జీవితం బుండ రాఘువున క
ధీనమై రామ హీన మతివకు సీత
కు వన మగు నయోధ్యా పురి ఘోరముగను 10.

చం. కని నగరమ్ము లూర్లు జనకప్రభు కన్య నదీ నదమ్ములన్
ఘన గతు లెల్లఁ బాదప నికాయము నింపుగ రాఘువేంద్రు నిం
క నడిగి వీరు లక్ష్మణునిఁ గాంత యెఱుంగును బ్రీతిఁ దాఁ దలం
చును బురి కావలం గల విశుద్ధ విహార వనంబు నా మదిన్ 11.

కం.  ఇంతియ జ్ఞాపక మిటఁ దా
నెంతయొ వడిఁ బలుక సీత యీ కైకేయిం
గొంత దలంచి పలుకులను
సుంత ప్రకాశింప దిపుడు చోద్యము సుమ్మీ 12.

తే.గీ.  ఆపి యప్రయత్న మనిన యా వచనము
లంత ముదముఁ జేకూర్పఁగ నంతరంగ
మందుఁ గౌసల్య కాహ్లాద మడరు మధుర
వాక్యముల నిట్లు సూతుఁడు పల్కె నపుడు 13.

ఆ.వె.  చంద్ర కాంతి వెలుఁగు చారు నయన సీత
సంభ్రమమున నైనఁ జల్ల గాలి
నెండ నైన సుంత యేని వాడక యుండు
దారినిఁ జనుచుండఁ దరుణి యడరి 14.

తే.గీ.  సీత శతపత్ర సదృశ శశినిభ కాంతి
వెలుఁగు ముఖ బింబ మిపుడు వడలదు సుంత
లత్తుక పసను  పదములు లత్తుక నలఁ
దకయె తామర మొగ్గల దారి వెలుఁగు 15.

ఆ.వె.  నూపురధ్వను లపురూపముగఁ జెలంగ
నాడు సీత వనిని నేఁడు మించి
రాగ ముండ భృశము రామునందు విభూష
ణముల నూని యలరు నారి యచట 16.

కం.  కన గజ సింహవ్యాఘ్రము
ల నరణ్యమ్మునఁ బడయదు త్రాస మెడఁదలో
ఘన రామ బాహు రక్షణ
మున జానకి సుంత యేని మురియుచు నుండున్ 17.

తే.గీ.  వారి కొఱకు శోచింపఁగఁ బాడి కాదు
రాజునకు నీకును దగదు రగులనిట్టు
లీ చరితము శాశ్వతముగ  గోచర మగు 18.

లోక మందుఁ బ్రసిద్ధి గురుతర మడరి

ఉ. శోకము నెల్ల వీడి వని సువ్రత మూని రఘూద్వహుండు దా
వీఁకను తండ్రి మాట నిలబెట్టును వన్య ఫలమ్ము లానుచున్
నీ కొడు కుండు హర్షమున నీరజ నేత్రుఁడు మౌని మార్గముం
బ్రాకట రీతిఁ బూని తగ భార్యయు తమ్ముడు కొల్చు చుండఁగా 19.

తే.గీ. ఆ విధమ్ముగ యుక్త వాక్యముల సూతుఁ
డనునయించినఁ గౌసల్య యడర పుత్ర
శోక మాగదు రాఘవ యోకుమార!
యంచు నేడ్వఁగ సుంతయు నంబ యపుడు 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 61.

రాముఁడు వనమున కేఁగ నార్తితోఁ గౌసల్య భర్తను గాంచి పరుషముగఁ బలుకుట, పదునేనవ యేట రాముఁడు వనము నుండి తిరిగి వచ్చిన భరతుని నుండి రాజ్యమును గైకొన నిష్టపడఁ డని పల్క దశరథుఁడు దుఃఖముతో మూర్ఛిల్లుట.

కం. రమియించు వారియం దు
త్తముండు ధర్మపరుఁ డకట తరల మహా గో
త్రమునకు రాముఁడు కౌస
ల్య మగనిఁ గాంచి దశరథుని నార్తినిఁ బలికెన్ 1.

తే.గీ. మూడు లోకముల నరేంద్ర! మూరు నీదు
కీర్తి ప్రియవాది దయగల మూర్తి వంచు
రాఘవ! యెఱుఁగవె వదాన్య! రాజ్య మందు 2.

నిట్టి చర్యల నొనరింప నేల నీకు

ఆ.వె. నరవరేణ్య! తనయ వరులు సీతాసతిఁ
గూడి యడవి లోన ఘోర దుఃఖ
మెట్టు లోర్తు రకట యెల్ల సుఖముల క
ర్తు లయి నట్టి వారు తలఁప వలదె 3.

చం. తరుణి మహా సుఖార్హయు సతమ్మును మైథిలి యెట్టు లుష్ణ మా
గురుతర శీతలం బడర ఘోరముగా వని నెట్టు లోర్చునో
యరు దగు సూప భోజన వరాన్విత మింపుగ నారగించు సీ
త రమణి యెట్లు నివ్వరినిఁ దా భుజియించును వన్య మూలముల్ 4.

ఆ.వె. గీత వాద్యములను బ్రీతిని విని లేచు
పుణ్య శీల సీత మూరఁ గ్రూర
జంతు జాల సింహ శార్దూలముల ఘోష
లెట్లు వినును వనిని నీ లతాంగి 5.

తే.గీ. వర మహాభుజుండు మహేంద్ర వర పతాక
సన్నిభ భుజము నుంచి తాఁ బన్నుగఁ దల
గడగ నెట్లు నిద్రించును ఘనుఁడు రాఘ
వుండు వన మందు బలవంతు డుండు నకట 6.

తే.గీ. చక్కని కురుల చివరలు జాఱు చుండఁ
దామరను బోలు రంగునఁ దనరు చుండు
నలిన వాసన లీనెడు నలిన నేత్రు
ముఖ మరయఁ గల నెన్నఁడు పుత్రు నకట 7.

తే.గీ. నిక్కముగ ఱాతి గుండెయై నెగడి యుండె
నాకు నక్కట శంకయే లేక యుండెఁ
గానిచో వేయి ముక్కలు కాక యున్నె
చూడ కున్న నిచటఁ బుత్రుఁ జోద్యముగను 8.

తే.గీ. నాదు బంధువు లక్కట నీదు చర్య 9.

వలన నిర్దయ ననుపంగ వదలి సుఖము
లెల్ల జాలిగ వన మందుఁ దల్లడిల్లు
చుండి రిప్పుడు తగినను సుఖములకును

కం. పదునై దేండ్లకు రాముఁడు
కదియఁ దిరిగి పుర మయోధ్యఁ గాకుత్స్థుండే
మదిఁ దల్పఁ డీయ రాజ్యము
వదలఁడు కోశ మని యెంతు భరతుఁడు ధృతినిన్ 10.

ఉ. కొందఱు శ్రాద్ధ కాలమునఁ గుడ్వఁగ నెల్లరు స్వీయ బంధువుల్
గందురు బ్రాహ్మణోత్తములఁ గార్యపుఁ బిమ్మట నారగింపఁగాఁ
గొందురె భూసురోత్తము లొకో సుధ యైనను భుక్త శేషమున్
విందుల నిర్జ రాభులు వివేక గుణాఢ్యులు పండితోత్తముల్ 11.

ఆ.వె. విప్రులును దనిసిన పిదప ద్విజర్షభు
లు భుజియింప నొల్లరు బుధ వరులు
వృషభ రాజము లవి శృంగమ్ముల విఱువ
నీయ నట్టి భంగి నెన్నఁ డేని 12.

ఆ.వె. అనుజుఁ డనుభవించి నట్టి రాజ్యమ్మును
రాజ! యగ్రజుండు రాముఁ డేల
గొను వరిష్ఠుఁ డతుల గుణ ధాముఁ డాత్మ గౌ
రవము నెంచి యంతరంగ మందు 13.

కం. పర జంతువు భక్ష్యంబును
బరిగ్రహించి తిన దెపుడు వ్యాఘ్రము వనిలో
నర శార్దూలుఁడు రాముఁడు
పర లీఢము నెట్లు తినును బరికింపంగన్ 14.

ఆ.వె. హవియు నాజ్య మింక నప్పములు కుశలు
ఖదిరపు సవనంపుఁ గంబముఁ గడ
వంగ జాము వాని వాడరు జన్నము
లందుఁ దిరిగి రాజ! యెందు నరయ 15.

తే.గీ. రాజ్యమును బరు లేలఁగ రాముఁ డొల్లఁ
డెన్నఁ డేలఁ గైకొని దాని సన్నుతుండు
సార హీనపు మద్యపుఁ జందమునను
సోమ హీనపు జన్నపు సోయగమున 16.

చం. అలిగినఁ దాను మందరము నైన శితేషువులం బెగల్చుఁ బే
రలుక సహింపఁ డింతయును నాతఁడు ధర్షణ మెవ్విధమ్ము నం
జెలఁగ నెడంద గౌరవము చెన్నుగఁ దండ్రి పయిం గరమ్ము దాఁ
దలఁపఁ డొసంగ రాఘవుఁడు దండ్రికి హానిని సుంతయేనియున్ 17.

తే.గీ. రవి శశి గ్రహ నక్షత్ర రాశి నెల్లఁ
గూల్చుఁ గ్రుద్ధుఁ డైన నభము గూడి క్షోభ
పఱచుఁ జీల్చును భూమిని పర్వత తతి
తో నతిక్రమింపఁడు భక్తి తోడ నిన్ను 18.

కం. ఇట్టి యగౌరవ మెన్నఁడు
బట్టి సహింపం డెటు లన బలవంతంబౌ
దిట్టతనపు వ్యాఘ్రం బది
యెట్టులఁ వాలము మలఁప సహింపదొ యట్లున్ 19.

ఆ.వె. లోకములు రణమున నేకమై చెలఁగిన
నీయ భీతిఁ జాల వింత యేని
ధర్మ చిత్తుఁ డీ యధర్మపు జగమును
గూర్మి నుద్ధరించు ధర్మమునను 20.

ఉ. వీరుఁడు దీర్ఘ బాహుఁడు నభేద్య సువర్ణ నిజేషు పంక్తినిన్
వారిధులన్ దహించు వడి ప్రాణి సమూహముతో యుగాంతమౌ
దారిని నట్టి రాఘవుఁడు తానె హతుం డిటఁ దండ్రిచే నహో
వారక చేప పిల్లలను భక్షణ మొంచక చేసి నట్టులన్ 21.

తే.గీ. పుత్రుని బహిష్కరించితి క్షత్రియ కుల
ధర్మ మింక సనాతన ధర్మమెంచి 22.

శాస్త్ర దృష్టి గాంచితె రాజ! సద్గుణు వర
ధర్మ నిరతుని నివ్విధి ధర్మ మగునె

ఆ.వె. సతులకు గతి మొదటఁ బతి యగును ద్వితీయ
ము తనయుండు కాఁగ మూడవ గతి
జ్ఞాతి వర్గ మగును జనదు నాల్గవ గతి
నారులకుఁ దలంప నాథ! నిజము 23.

ఆ.వె. అందు నీవు నాకు నకట లేవు వనము
న కరిగె రఘురాముఁ డకట నేఁడు
వనికి నేఁగఁ దలఁపఁ బార్థివేంద్ర! నిహత
నైతి నీ వలననె యన్ని గతుల 24.

తే.గీ. రాజ్యము హత మయ్యె నిట స రాష్ట్ర మిపుడు
హతుఁడ వీవు మంత్రుల తోడ హత నయితి కు
మారు తోడ హతులయిరి పౌరు లెల్ల
సుఖులు నీదు భార్యయు నింక సుతుఁడు రాజ! 25.

తే.గీ. దారుణము లైన పల్కులు దార పలుక
విన వగపుతో సమసెఁ దెలివి నరపతికి
మున్ను నేరక తాఁ జేసి యున్న దుష్కృ
తమ్మును దలంచి ఘన శోక తప్తుఁ డయ్యె 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది యొకటవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 62.

కౌసల్యా దేవి పరుషముగాఁ బల్కిన పలుకులను విని దశరథుఁడు దుఃఖ ముప్పొంగ మూర్ఛిల్లి

కొంత తడవునకుఁ దేరికొనినఁ గాంచి కౌసల్యను గరుణింప మని వేఁడఁగఁ గౌసల్య పశ్చాత్తాపము
సెంది యనునయింప రాజు నిద్రా వశుఁ డగుట

కం. కనలుచు శోకమ్మున రా
ముని జనని పలుక నవి విని మూరిన దుఃఖ
మ్మున దశరథుండు మదిలో
వనరుచుఁ జింతింపఁ జాగె వసుధేశుండే 1.

కం. చిరముగఁ జింతించి కరము
పరితప్తేంద్రియుఁడు మూర్ఛఁ బడసెను జింతం
బరవీర దమనుఁడు వడసెఁ
జిర కాలమ్మునకు సంజ్ఞఁ జిత్తము లోనన్ 2.

తే.గీ. పొంది సంజ్ఞను నిట్టూర్చి పుడమి ధవుఁడు
వేఁడిగఁ గని కౌసల్యను దోడ నుండఁ
దిరిగి యాలోచనల మున్గె ధీర వరుఁడు
పొడమె నేరక చేసిన పూర్వ కృతము 3.

ఆ.వె. శబ్ద వేధిఁ గాఁగఁ జలిపిన దుష్కృత
పు వగ తనయు వలని పొగులును గలి
యంగ రెండు బాధ లడరంగఁ దప్తుఁ డ
య్యెఁ ధరణీశుఁ డప్పు డధికముగను 4.

ఆ.వె. మండుచు నిరు వెతల మనుజేంద్రుఁ డరసి కౌ
సల్య నంజలించి సతికిఁ బలికె
వణుకు చుండి భృశము వాంచి ముఖము దయఁ
గోరి యిట్లు జాలి గొలుపు గిరలు 5.

చం. కరుణను జూపు నాపయినఁ గాంచుమ యంజలి సల్ప నే నిటం
బరులను గూడ వత్సలతఁ బన్నుగఁ జూతువు హింస నేరవే
యరయఁగ భర్త నారులకు నౌను గుణుం డగుణుండు నైన ని
ద్ధరఁ దగ దైవ మెన్నఁగను ధర్మము నింపుగ దేవి! సన్నిధిన్ 6.

తే.గీ. సంతతము ధర్మ నిరతవు జగము నందు
మంచి చెడుల నారసితివి యంచితముగ
దుఃఖిత వయిన దుస్సహ దుఃఖితుఁ గని
విప్రియము లాడఁ దగదు దేవి! పతి తోడ 7.

తే.గీ. దీనుఁ డా రాజు పలుకఁగ దీనముగను
జాలి గొలుపు నట్లు విని కౌసల్య యంతఁ
గన్నులందు భాష్పము లొలుక నుదకంపు
గొట్ట మందుఁ గాఱెడు నవ కుశము భంగి 8.

తే.గీ. రాజు నంజలి తనదు శిరమున నుంచి
సంభ్రమించి కౌసల్య తత్క్షణమ దుఃఖి
త యయి భృశముగ పల్కులు తడఁబడంగ
వగచుచు నృపతి తో నంతఁ బలికె నిట్లు 9.

కం. కరుణింపు దేవ నన్ను హ
తురాల నయితి నడుగఁ బడి తోరము నీ చే
శిరము నిల నిడి యడిగెద నిఁ
క రాజ! క్షమ కర్హురాలఁ గా నిట నకటా 10.

కం. ఘనవీర! ధీనిధియు శ్లా
ఘనీయుఁ డగు భర్త చేతఁ గరుణింపుమ న
న్నని కోరఁ బడిన భార్య కుఁ
గన లోకద్వయము నందుఁ గలుగదు సుఖమే 11.

ఆ.వె. ధర్మ మెఱుక నాకు ధర్మజ్ఞ సత్య వా
ది వని నిన్నెఱుఁగుదు ధీర! శోక
తప్త నై పలికితి ధరణీధవ! పరుష
భాషణములు సుతుని వగ సెలంగ 12.

తే.గీ. శోకము నశింపఁ జేయును జొచ్చి ధృతిని
శోకము తెలివి నెల్లఁ గూల్చును సతమ్ము
శోకమున సర్వము నశించుఁ జుమ్మ ధరణి 13.

శోకమునకు మించు రిపునిఁ జూడ మెందు

కం. పగవాని చేతి దెబ్బలఁ
దగ సైపఁగ శక్యమగు నెదను శోకము క
ల్గఁగ సూక్ష్మం బైనను నో
ర్వఁగ శక్యము కాదు సుమ్ము పార్థివ చంద్రా! 14.

తే.గీ. చదువరులు ధర్మ వేత్తలు శంక లేని
వారు ధర్మార్థముల ముని వరులు నైన
శోకమున మునిఁగిన మనస్సులు కలట్టి
వారు వీర! తపింతురు వగపు వలన 15.

కం. చనెఁ బంచ రాత్రు లడవికిఁ
జని రాముఁడు లెక్క పెట్ట సంతాపముచే
త నశింపఁగ సంతోష
మ్ము నాకుఁ బంచాబ్దములుగ మూరెన్ నాథా! 16.

కం. తలఁచుచు నాతని నుండఁగ
విలసిల్లెను శోక మెడఁద వీరవరేణ్యా!
జలనిధి తోయముల వలె న
దుల నుండి జలమ్ము లెల్లఁ దోరము సేరన్ 17.

కం. కౌసల్య యివ్విధం బనఁ
గా సుద్దులు శుభము లంతఁ గదిసె రయమునన్
వాసుర చూచుచు నుండఁగ
పే సన్నగిలెఁ గిరణములు వినుకెం పరుగన్ 18.

కం. పతి నట్టు లూఱడింపఁగ
సతి కౌసల్య వచనములఁ జక్కఁగ నపుడున్
వెత మీఱఁగఁ జిత్తమున నృ
పతి నిద్రా దేవి కయ్యె వశుఁడు భృశముగన్ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 63.

దశరథుఁడు నిద్ర లేచి తాను మున్ను శబ్దవేధిగా గజ మనుకొని ముని బాలునిపై బాణ మేయ నతఁడు చనిపోవుచుఁ దన తల్లిదండ్రులకు నీ విషయమును దెల్పుఁ డని నాఁటిన బాణమును దీయ మని వేఁడఁ దీయఁగనే మరణించుట.

కం. కొలఁది తడవునకు మేల్కొని
కలఁత మునిఁగి నట్టి యెడఁదఁ గలవర పడుచుం
దలఁపఁ దొడంగె దశరథుం
డల మునుపటి దుష్కృతమ్ము నలమట నీయన్ 1.

ఆ.వె. రామ లక్ష్మణుల నరణ్యమునకుఁ బంప
శక్ర సన్నిభుఁడు దశరథున కెద
లో నుపద్రవమ్ము క్రూరముగఁ జెలంగె
నసురుచే రవిఁ దమ మడరి నట్లు 2.

చం. వెడల స దార రాఘవుఁడు వేదన తోడుతఁ గోశ లేశ్వరుం
డడలుచు రామ మాతకు వరాననకున్ వచియింప నెంచె ము
న్నడరిన స్వీయ దుష్కృతము  నాత్మ స్మరించి నిశీధి యంతయుం
గడచుచు నుండ నాఱవది గ్రన్నన రాతిరి తప్త చిత్తుఁడై 3.

ఆ.వె. పుత్ర శోక తప్త మూర్తియై స్మరియించి
పూర్వ నిజ కృతమ్ముఁ బుత్ర శోక
తప్తుఁ గాంచి యపుడు దార కౌసల్యను
బలికె దశరథుండు వచనములను 4.

తే.గీ. మంచి యైనఁ జెడ్డ యయిన మాన్యచరిత! 5.

కర్తకు లభించు కళ్యాణి! కర్మముల ఫ
లితము తద్విధముగ భద్ర! సతము వినుమ
వాని నెఱుఁగ కాదినిఁ జేయ బాలుఁ డగును

తే.గీ. ఒకఁడు మామిడి తోటను నుత్తరించి
పాతి మోదుగ చెట్లను బ్రీతిఁ బెంచ
నీరు వోసి ఫలాశతో ఘోరముగను
బంట తఱి విచారించెఁ బుష్పములఁ గాంచి 6.

చం. ఫలమును నేరకుండ మును పర్విడఁ గర్మము లెల్లఁ జేయఁగాఁ
గలఁగుఁ బలాశ సేచకుని కైవడి పండెడు వేళ నాతఁడే
లలన! త్యజించి పంట తఱి రామునిఁ జింతిలు చుంటి వింత నె
ట్టు లనఁగ మావి చెట్టులను డుల్చి పలాశముఁ బెంచి నట్టులన్ 7.

తే.గీ. శబ్ద విద్య యలవడఁ గౌసల్య చిన్న
తనము నందు ధనువు నూని ఘన తరంపు
శబ్దవేధినై చేసిన చారునయన!
పాప కార్యము నే నిప్డు పలుకు చుంటి 8.

కం. తెలియక పసివాఁడు విషము
నల త్రాగిన భంగి నాకు నకటా ప్రాప్తం
బిల దేవి స్వయంకృతమున
బలవత్తర దుఃఖము కలవరపడ నిట్లున్ 9.

ఆ.వె. కింశుకమ్ము పైనఁ గీలుకొనంగ మో
హం బొకనికి నాకు నకట శబ్ద
వేధ్య మయ ఫలమ్ము వెల్లివిరిసె నిట
దెలియ కుండ నంచుఁ దెల్ల మయ్యె 10.

తే.గీ. దార! యప్పు డీ వవివాహితవుగ నుండ
నేను యువరాజ పదమున నెగడు చుండ
వచ్చె వర్ష కాలము వృద్ధి పఱుప మదము
నింక కామమ్మును జనుల కెలమి తోడ 11.

ఆ.వె. పుడమిపౌ జలములఁ బూర్ణము ద్రావి ని
జాంశువుల జగముల నత్యధికము
ప్రేఁగఁ జేసి ప్రేత వితతి తిరుగు భీమ
దక్షి ణాశ కడరి తరణి చనెను 12.

ఉ. పేఁడిమి కాఁగ క్షీణ మిఁక పెల్లుల నీనుచు మేఘ రాశియే
వోఁడిమిఁ జూప భేక ఫణిభోజులు చాతకముల్ ముదమ్ముతో
నాడఁగఁ గ్లిన్న పక్ష విహ గావలి స్నానము సేసి యింపుగా
గాడుపుచేఁ జలించు నతి కష్టమునం దమిఁ జేరెఁ జెట్లనున్ 13.

కం. పడిన నిఁక నవిరళముగాఁ
బడు చున్న జలమ్ము వలనఁ బన్నుగ నగమే
యడరెను జలరాశి పగిది
నడయాడు మదించిన హరిణమ్ముల తోడన్ 14.

కం. ధవ ళారుణ వర్ణమ్ములఁ
బ్రవిమలపుఁ బ్రవాహము లటఁ బాఱుచు నుండెన్
నివుఱుల తోడన్ గిరి ధా
తువుల పయినఁ బాముల వలెఁ దోఁపఁగ వింతన్ 15.

ఆ.వె. కదియ నంత వానకాలము తేట నీ
రమ్ము గూడ సెఱుపు రంగు నూనఁ
గ సెలయేఱు లెల్లఁ గన్పడెఁ బాఱుచు
వివిధ దిక్కు లందు వేగముగను 16.

ఉ. ఆ సుఖ కాల మందు సశరాసన మమ్ముల తోడ వేటకై
యా సరయూ నదీ తటిని స్యందన రాజము నెక్కి చక్కఁగన్
వేసర కాత్మఁ జేరితినిఁ బ్రీతి నిశీధిని నీరు ద్రావఁగాఁ
గాసర మేని శ్వాపదము కంబువు రా సమయింప నెంచుచున్ 17.

తే.గీ. విచ్చలవిడి నొంటరిగను విల్లు నూని
యటకు రాఁగఁ గ్రూర మృగము నన్య వన్య 18.

మృగమును విని శబ్దమ్మును మించి వేగ
చంపితిని రెంటిని సుశిత శరము లేసి

కం. వింటిని యా చీకటిలోఁ
గంటికి నందని యెడవున గజ శబ్దమ్మున్
వింటకుఁ బోలు రవముఁ దెలి
గంటి! ఘటము నందు నింపఁగ జలంపు ధ్వనిన్ 19.

కం. శర మాశీవిష తుల్యము
గురుతర దీప్తము విడిచితిఁ గుంజరపు దెసం
గరినిఁ గ్రహింపఁగ లక్ష్యము
నరసి మహోద్ధతి సెలంగ నప్పుడు దేవీ! 20.

ఉ. వేయఁగ ఘోర బాణమును భీకర సర్ప నిభమ్ము నంత న
య్యో యిట నీ యుషస్సున వనౌకసు నాదము బాధ తోడ హా
హా యను రావముల్ శిత శ రార్దిత మర్మ నిజాంగు వాక్కులే
యా యుదకమ్ములోఁ బడుచు నార్తి సహింపక పల్క విన్పడెన్ 21.

తే.గీ. తాపసిని నను బోలెడు ధర్మ రతుని
పైన శస్త్రము వేయ సెట్లౌను కట్ట
నా మనుజు భాషణమ్ములు నాకు నపుడు
వినఁబడెను గూల నమ్మున వేగముగను 22.

చం. నది కిటు లేన యొంటరిగ నారములం గొన రాఁగ నక్కటా
బెదరక రాత్రి బాణమును వేసిన వారెవ రిందు నాదు త
ప్పది యిసు మంత యేని కలదా! తగ దండము వీడి కానలో
నఁ దబిసి యై చరింపఁగను న్యాయమె శస్త్రముతో వధింపఁగన్ 23.

తే.గీ. జడల బరు వూని నారలు చర్మములు ధ
రించి నట్టి నన్నెవరు కోరి సమయింప
నెంచి రిట్లు నా యపకార మెద్ది వారి
కి నొనరించినది తలంపఁ గనను సుంత 24.

ఆ.వె. ఇట్టి రిత్త పనుల నెవ్వరు హర్షింత్రు
సేయఁ దొడఁగినఁ గడు చిత్రముగఁ గ
పటపుఁ బనులు గురువు పడక నాశించు నీ
చ జనుల పగిది నది సాధు వంచు 25.

చం. వగవను నా లయమ్మునకు బాధఁ దపింతును దల్లిదండ్రులం
దగ మదిఁ దల్చి నాదు మృతి తప్పక కల్గిన వృద్ధ దంపతుల్
విగత కుమారులై యకట వేదన నెట్లు చరింత్రు మోసితిం
దగఁ జిర కాల మిర్వురను దల్లినిఁ దండ్రిని భక్తి రక్తులన్ 26.

కం. ఒక్క శరమ్మున నివ్విధి
నక్కట జననీ జనకులు నాత్మ సుతునితోఁ
జక్కడఁగిరి బాలునిచే
వెక్కసముగ దుష్టు వలన విడ్దూరముగన్ 27.

కం. విని నంతనె యా మాటలు
ఘన తాపార్తుఁడను నేను ! గరములఁ జాప
మ్మును బాణమ్ములు జాఱి ప
డినవి పుడమి పైనఁ గడు వడి నయ రతునకున్ 28.

చం. విని నిసి వాని మూల్గులను వేదన వేగము సంభ్రమమ్మునుం
దనర భృశమ్ము చేష్ట లవి తత్క్షణమే యుడుగంగ దీనతం
జని యట కంత వేగముగఁ జంచల చిత్తమునన్ శరార్తునిన్
మునివరుఁ గంటినా తటిని ముక్త జటా ధరుఁ ద్యక్త కుంభునిన్ 29.

ఆ.వె. నెత్తు రింక దుమ్ము లత్తఁజి యంగము
లందు నిండి నట్టి యార్తు బాణ
ఘాత తప్త దేహుఁ గలఁతతోఁ బడియున్న
వాని భృశము మూల్గు వానిఁ గంటి 30.

తే.గీ. కలఁత మున్గిన వాని వికంపిత హృఁద
యంబు వాని నన్నక్కట యక్షుల ప్రభఁ
గాల్చు చందమ్మునఁ గనులఁ గాంచి పలికె 31.

నతఁడు క్రూరంపుఁ బల్కుల నంత నిట్లు

కం. నే నే యపకారము రా
జా! నీ కొనరింపఁ గొట్టి తకటా యిట్లుం
గాననమున వసియింప న
హో నీరము తండ్రికిఁ గొను నూహ నిలువఁగన్ 32.

కం. అకటా యొక్క శరము వే
సి కొట్ట నామర్మములను శీఘ్రము రాజా
గ్ర్య! కను లగపడని నాదు జ
నకుఁడు జనని హతు లయిరి వనమ్మున వృద్ధుల్ 33.

తే.గీ. దుర్బలులు నంధులు పిపాసతో నిరువురు
నా కొఱకు నట వేచి యున్న జననీ జ
నకులు నీ రాశఁ గష్టమునఁ జిరకాల
మున్న వా రెట్లు సైఁతురు నన్ను గనమి 34.

చం. కన ఫలితమ్ము లే దకట కానన మందుఁ దపమ్ము సేసినన్
ఘనముగ నేర్చినన్ శ్రుతి నికాయము నా శయనమ్ము నిచ్చటన్
జనకుఁడు నేరఁ డింతయు భృశమ్ముగ నెర్గిన నేమి సేయు నౌ
ర నడవ లేఁ డశక్తుఁడు స్థిరమ్మును గాచునె ఛిన్నశైలమే 35.

ఆ.వె. సత్వరంబు రాజ సత్తమ నీ వేఁగి
యింక నాదు తండ్రి కెల్లఁ జెపుమ
కోపి కాల్చ కుండు ఘోరముగా నిన్ను
మండి యగ్ని వనము మాడ్చి నట్లు 36.

కం. ఇక్కాలి దారి చూపును
జక్కఁగ మజ్జనకు నిల్లు చని నీవటకున్
గ్రక్కున రాజ! శరణునకు
మ్రొక్కుము యాతఁడు శపింపఁ బోఁడు కరుణతో 37.

ఆ.వె. వాఁడి యైన యట్టి బాణముఁ దీయుమ 38.

రాజ! మర్మములఁ గరమ్ము గ్రుచ్చు
చున్న దెత్తు నందు నున్న తీరమ్మును
నీరు వొడుచు నట్లు భారముగను

తే.గీ. శల్య మసువుల బాధించు శాంతి దోఁచు
శల్యముం దీయ నతనికిఁ జావు వచ్చుఁ
దీయ శల్యము బొడమె సందియము నాకుఁ
జింత సేయంగ నివ్విధిఁ జిత్త మందు 39.

ఉ. దీనుని ఘోర దుఃఖితుని తీరని శోకముచేఁ దపింపఁగా
మానస మందు నున్న వెత మౌని కుమారుఁడు నేరి యింపుగం
దా నతి పీడ్యమానుఁడు సుతప్త నిజాంగుఁడు కంపితుండునున్
మేని లయమ్ము కన్పడఁగ మెల్లఁగఁ బల్కులు పల్కె నిట్టులన్ 40.

తే.గీ. శోకమును నిల్పి ధైర్యము వీఁక నూని
యుంటిని స్థిర చిత్తమ్మునఁ గంటె బ్రహ్మ
హత్య యంచు శోకింపకు మయ్య మదిని
బ్రాహ్మణుండను గాను నేఁ బార్థివేంద్ర! 41.

తే.గీ. వైశ్యునకు శూద్ర యందు భూవర! జనించి
తిని కలఁత వీడు కష్టమున నన నిట్లు
వంగి నట్టి వాఁ డార్తుని యంగమున శ
రమ్ముఁ దీయఁ జూచుచు విడ్చెఁ బ్రాణములను 42.

తే.గీ. మర్మమున వ్రణమునఁ బలు మఱులు నిశ్వ
సించి సరయూ తటిని శయనించి తడిసి
యున్న ముని కుమారునిఁ గాంచి మిన్నగ వెత
నందితిని భద్ర! భారంపు డెంద మందు 43.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది మూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 64.

దశరథుఁడు కౌసల్యకు ననూహ్యముగాఁ దాను జేసిన ముని పుత్ర వధను దెలుపుట, వాని తల్లిదండ్రులకు నా  విషయము వివరించి పశ్చాత్తాపమున శరణము వేఁడ వారు కడు దుఃఖించి పుత్రునకుఁ దర్పణము లొసఁగ ముని కుమారు నాత్మ యింద్రునితోఁ గూడి స్వర్గమున కేఁగుట, తండ్రి తమ వలె నీవు గూడ పుత్ర శోకమున మరణింతు వని రాజుని  శపించి ప్రాణత్యాగము సేయుట, దశరథుఁ డిట్లు చెప్పి రాత్రి  మరణించుట.

కం. అనితర విధ మమ్ముని పు
త్రుని వధ మా రాఘవుండు రోదించుచు దా
రను గౌసల్యను గని తొడఁ
గెను దిరిగి వచింప నిట్లు గిరలను వగతో 1.

తే.గీ. ఘోర పాప మజ్ఞానము గూడఁ జేయఁ
గలఁగ మనము భృశమ్ముగఁ దలఁపఁ దొఁడగి
తి నిఁక నేకాంతమున నెట్లు దీర్పఁ దగును
దీని సుకృతముగా నంచు మానసమున 2.

ఉ. అంత ఘటమ్ము  నందికొని యప్పును నింపి సుపూర్ణ మింపుగాఁ
జెంతకుఁ జెప్పినట్టి గతిఁ జేరి నివేశము దుర్బలాంధులం
జింతిలు వృద్ధ దంపతుల శ్రీఘ్రమ కాంచితి నాథ హీనులన్
వింతగ హీన పక్ష యుగ భీత విహంగ నిభమ్ము నుండఁగా 3.

ఉ. వాని కథోక్తులం దనరి పన్నుగ కూర్చొని యన్య కర్మముల్
లేని నిజాశ నావలన లీలగ క్షీణము కాఁగ వా రుదా
సీనత దిక్కు గానక వసింపఁగఁ గాంచిన శోక భీతులే
మానస మందుఁ బిక్కటిల  మ్రగ్గితి తిర్గి భృశమ్ము వంతచే 4.

చం. వినఁబడ నా పద స్వనము పేరిమిఁ బల్కెను దండ్రి పుత్రకా
చని తడ వయ్యె నీటి కయి సత్వర మీయుమ తోయ మింపుగన్ 5.

జనని తపించు చున్నది భృశమ్ముగ నాడితె నీట నచ్చటం
దనయ రయమ్ముగా నవసథమ్మును జేరు విలంబ మేలనో

మ. తనయా తల్లియు నైన నే నయిన సంతాపమ్ము కల్గించినన్
మనమం దుంచకు మయ్య తాపసివి యే మాత్రమ్ము నద్దానినిం
గన నీవే గతి హీన రక్షకులకుం గన్నుల్ సుతా నీవ లో
చన హీనద్వయి కీవ ప్రాణములు నాఁ జక్కంగ భాషింపవే 6.

ఉ. డయ్యెడు మాటలే తడఁబడంగ మునిం గని స్పష్ట హీనముల్
వ్రయ్యలు కాఁగ నక్షరపు రాశియె వాక్యము లంటి భీతితో
నయ్యెడ గుండె నూని ధృతి నంచిత వాగ్బల మాహరించి నే
నయ్యమి పుత్ర నాశనము నాతని కప్పుడు సెప్పఁ జాగితిన్ 7.

చం. దురితుఁడ నయ్య నే దశరథుండను జేసితి క్షత్రియుండ నీ
వర తనయుండఁ గాను బుధ వర్గము మెచ్చని కార్యమున్ మహా
త్మ! రతి సెలంగ వేట కయి ధన్వము తో సరయూ నదీ తటిం
గరి మృగ మన్య మేనిఁ గనఁ గ్రన్ననఁ జేరితిఁ జంపఁ గోరుచున్ 8.

తే.గీ. అంత వింటిని శబ్దము నక్కడ నొక
కుండను జలముతో నింపు కొనఁగ రాఁగఁ
దలఁచితి నది గజ మని యెద వడి బాణ
ము వదలితి దానిపై ఘోరముగ మునివర! 9.

తే.గీ. ఏటి యొడ్డున కేఁగఁగ నెదను దాఁక
బాణ మరసితిఁ బడియున్న బాలు నచట
శబ్దమును విని గురి పెట్టి శల్య మేయ
గజముఁ జంప నీట సుతుఁ డకట గతించె 10.

చం. శరమును పేఁడ, నాతఁడె ప్రశాంతినిఁ గోరుచు బాధతోడఁ దాఁ
గరము తపించి, తీసితిని గ్రక్కున మర్మము నుండి యంతటన్
మరణము నందెఁ దీయఁగనె మాటికిఁ దల్చుచు నీ సుతుం డహో
గురుడును మాత తోడుత నొకో మఱి యంధుఁడె యంచు నేడ్చుచున్ 11.

ఆ.వె. అకట జరిగె నెల్ల నజ్ఞానమున హతుఁ
డయ్యె నీ కుమారుఁ డవ్విధముగ
నా వలనఁ జమి మునినాథ! శేషము నాన
తిమ్మిఁకఁ గరుణింపు మిచట ననఁగ 12.

ఉ. నా వగు దోష కార్య వచనమ్ములు క్రూరము లేను బల్కఁగాఁ
దా విని దేవ తుల్య ముని తద్ద యమర్షము నాప లేక భా
ష్పావృత లోచనుండు నయి యంజలిఁ బ్రక్కన నున్న నన్ను శో
కావృత మానసుండు గని యంత వచించెను నిశ్వసించుచున్ 13.

ఆ.వె. ఇయ్యశుభపుఁ గర్మ మీవు వచింపక
యున్న స్వయము నాకు నొక్క క్షణము
నంద నీదు శిరము వందలు వేలు ము
క్కలుగ నయ్యెడిని పగిలి నరేశ! 14.

తే.గీ. రాజ యెఱిఁగి వధించిన రాచవాఁడు
ముఖ్యముగను వానప్రస్థుఁ బోవు నతఁడు
తనదు స్థానము నుండి యతండు వజ్రి
యైన నిస్సంశయమ్ముగ నవని లోన 15.

కం. మునినిఁ దప మొనర్చెడు వా
ని నెఱిఁగి యెఱిఁగియు నడిచిన నిజ శస్త్రము చే
త నతని శీర్షము వే పగు
లు నేడు రవలుగ నటులె గురుశ్రుతి పేదిన్ 16.

తే.గీ. నేర కిది యెల్లఁ జేసి తక్కారణమున
రాజ! నీవు బ్రతికితి వరయఁగఁ గాని
యెడల నిక్ష్వాకు నృప వంశ మెల్ల నాశ
న మగు నన్న నీ మాట ననంగ నేల 17.

చం. పుడమిప! వేగ మమ్ము గొని పొమ్ము కుమారుని రక్త సిక్తునిం
బుడమినిఁ బడ్డ వాని స్పృహ పోయిన వానిఁ బ్రకీర్ణ వస్త్రునిం
గడపటి చూపు చూచుటకుఁ గాలునికిన్ వశ మైన వానినిం 18.

దడయక యంచుఁ బల్కె ముని తద్దయు రోయుచు నన్ను గోరుచున్

కం. ఒక్కఁడను వారి నుభయుల
నక్కడకుం దీసికొని మహోర్తుల వడిగా
నక్కాంత తోడ మునివరు
నక్కొడుకును నంటఁ జేసి యచట నిలిచితిన్ 19.

ఆ.వె. తాపసు లిరువురును దనయుని స్పృశియించి
చేరి పైనఁ బడిరి చింత మీఱఁ
బలుకఁ దొడఁగెఁ దండ్రి వంతతో వాక్యమ్ము
లిట్లు జాలి గొలుపు నట్లు కరము 20.

ఉ. ఏల కుమార పల్క విట నేల నొసంగవు వందనమ్ములే
యేల ధరాతలమ్ము పయి నివ్విధి నుంటివి కోప మేలయా
బాలక! నే ప్రియుండ నని భావన సేయక యున్నఁ గాంచుమా
మేలుగ నీదు తల్లి నిట మేను స్పృశింపుమ మాటలాడుమా 21.

ఉ. ఎవ్వని చేత విందును బఠింపఁగ శాస్త్రము దాట రాత్రియే
యెవ్వరు సేసి స్నాన మట నిమ్ముగ సంధ్యను వార్చి వేగమే
నొవ్వక వేల్త్రు చేరి దరి నోయఁగ పుత్ర గతార్తి నన్నహో
యెవ్వరు పల్కరింతు రిఁక నెవ్వరు దిక్కిట మాకు నెంచఁగా 22.

తే.గీ. ఎవ్వ రిత్తురు కంద మూ లేతర ఫల
లమ్ములను బ్రియాతిథి వంచు నెమ్మి నింకఁ
బనులు లేని యనాథునకును గ్రహింప
శక్తి లేని నాకు నకట రిక్త మునికి 23.

ఆ.వె. ఈమెఁ గనుమ వృద్ధ యింకఁ దపస్విని
యంధురాలు పుత్రు నార్తిఁ దప్తు
రాలు వత్స యెట్లు రక్షింతు నీ మాత
నిచట నుంత తల్పవేమి మదిని 24.

తే.గీ. ఆగు మాతోడఁ బోకుమ యముని దరికి 25.

రేపు మనము జననితో నరిగెద మింక
మేము పుత్రార్తులము కద మించి యంధు
లము యమాలయ మరుగు వారలము గాదె

తే.గీ. అడిగెద యము చెంతకు నేఁగి కొడుకును భరి
యింపనీ తల్లిఁ దండ్రి క్షమింపుమ యమ
ధర్మరాజ! ధర్మాత్మ! యీఁ దగుదు వభయ
మొంటరికి నాకు లోకప! యుత్తమ యశ! 26.

తే.గీ. పాప కర్ముని చేతఁ జంపఁబడి తీ వ
పాపుఁడ వయితి నందనవర! నిజమ్ము
నెంచ శస్త్ర యోధు లడరి యేఁగు లోక
ములకు దానిచే నిఁక శీఘ్రముగ నరుగుమ 27.

ఆ.వె. ఆజి వెన్నుఁ జూప నట్టి శూరు లెదిర్చి
పరుల నెట్టి గతికి నరుగుదురొ గ
తించి పుత్ర యట్టి యంచితంపు గతికి
నింక నేఁగు మయ్య యిద్ధ చరిత! 28.

తే.గీ. సగరుఁడు దిలీపుఁడు జనమేజయుఁడు నహుష
దుందుమారులు సక్కఁగ నెందుఁ జనిరి
యట్టి సద్గతులను జేరు మయ్య పుత్ర!
సాధువులు నేఁగు గతులకు జనుమ తనయ! 29.

ఉ. వేదములం బఠించు శ్రుతి వేత్తలు నింక తపశ్చరాళియున్
భూద ఘనాహితాగ్నులును బూరుషు లేక సతీ వ్రతాత్ములున్
సాదర గో సహస్రముల నర్థి నొసంగెడి వారు పెద్దలం
దాదర మున్న వారు తను వాశను వీడిన వారు పుత్రకా! 30.

ఆ.వె. ఏ గతులకు సమసి యేఁగుదురో యట్టి
సద్గతులకు నీవు చనుమ యడరి
లేదు దుర్గతియె కలిగిన మన తెగను
నిన్ను జంపిన యతని కగుఁ జుమ్ము 31.

కం. విలపించుచు నివ్విధినిం
బలు మారులు జాలి కల్గ భార్యా యుతుఁడై
సలిలము లొసంగు కార్య
మ్ముల నొనరింపఁ దొడఁగెను సముచిత విధమునన్ 32.

కం. నిజ కర్మ మహిమ మున్యా
త్మజుండు దివ్య తను వూని ధర్మరతుం డం
తఁ జనుచు వడి శక్రుని తో
డఁ జక్కఁగ దివికిఁ బలుకఁ దొడఁగె సేంద్రుండై 33.

తే.గీ. ఊఱడించి వృద్ధుల నంత నుచిత రీతిఁ
బలికె వారితో నివ్విధి భక్తి మిమ్ము
నడరి సేవించి సద్గతి నందితి నిట
క్షిప్ర మిఁక మీరు నా దరిఁ జేరఁ గలరు 34.

కం. ముని పుత్రుండు జితేంద్రియుఁ
డని యివ్విధి దివ్య దేహుఁ డంత విమాన
మ్ము నలంకరించి స్వర్గ
మ్మున కేఁగెను దత్క్షణంబ పుణ్యాత్ముండే 35.

కం. మునివరు డంతఁ దగ నుదక
ము నొసంగి సభార్య గాంచి ముం దంజలి ని
ల్చిన నన్ను మహా తేజుఁడు
మినుకుల ననె నిట్లు వంత మీఱఁగ నెడఁదన్ 36.

తే.గీ. ఏక పుత్రు నపుత్రకు నేక శరము
నేసి చేసితి వక్కట యిప్పుడ నను
జంపుము మరణ మన్నను జంక నింక
బాధ నెంద నించుక యేని పార్థివేంద్ర! 37.

చం. తెలియక చంపి తీవు నృప! ధీనిధిఁ బుణ్య చరిత్రుఁ బుత్రునిం
గలఁత శపింతు నిన్నిపుడు కాఱియ నీయ సుదారుణమ్ముగాఁ 38.

గలుగును బుత్ర శోకమునఁ గాలపు టంతము నీకు నాకు నె
ట్టులఁ దనయార్తి కల్గెనొ నటుల్ సెలరేఁగి మహోన్నతమ్ముగన్

తే.గీ. చేసి తజ్ఞానముననను నీ చేత క్షత్రి
యవరు చేఁ జంపఁ బడె ముని యందు వలన
నార్య! బ్రహ్మ హత్యా పాప మంట దిపుడు
నిన్ను జింత వలదు నీకు నేల ఱేఁడ! 39.

ఉ. దాతకు నంది నట్లు తగు దాన ఫలమ్ము నరేంద్ర! నీకు నిం
కాతత దుఃఖ భావ మది యవ్విదిఁ గల్గును బ్రాణ ఘాత మం
చాతఁ డొసంగి శాపము మహార్తిని నేడ్చుచు దేహ ముంచి తా
నాతిని గూడి ఘోర చితి నాథ విహీనుఁడు సేరె స్వర్గమున్ 40.

ఆ.వె. జ్ఞప్తి కిపుడు వచ్చె శబ్దవేధిని నేర్వఁ
జేసి నట్టి దొడ్డ చెడ్డ పని స్వ
యమ్ము బాల్య మందు నాలోచనము సేయ
నివ్విధంబు నాకు నెల్ల దేవి! 41.

తే.గీ. దేవి యా పాప మిఁకఁ బండి తెల్ల మయ్యె
దాపురించె నిప్పు డిటుల దారుణముగ
నన్న రసము లందు నపథ్య మడరి తినఁగ
వ్యాధి ముదిరి విజృంభించు భంగి నాకు 42.

తే.గీ. కాన భద్ర! నాకిప్పుడు కల్గె నెట్టు
లయ్యుదారుఁడు పల్కెనొ యట్టు లకట
పుత్ర శోకమ్మున విడుతు నాత్రముగను
బ్రాణముల నింక నేఁడు సత్వరము నిజము 43.

ఆ.వె. కన్నులఁ గన నిన్ను గౌసల్య నే నశ
క్తుండ నయితి నిపుడు తొయ్యలి స్పృశి
యింపు నన్ను నీవ యింపుగ నని పల్కె
నింకను వగచుచు నరేంద్రుఁ డిట్లు 44.

ఉ. రాముని కేను జేసినది రామ! తలంపగ నాకుఁ దగ్గదే
రాముఁడు నాకుఁ జేసినది రాముని కొప్పును సత్య మెంచినన్
భూమినిఁ జెడ్డ వాఁ డయినఁ బుత్రుని వీడెడు తండ్రి యుండునే
వో మనఁ గాన యం దనఁగఁ బుత్రుఁడు గోప విహీనుఁ డుండునే 45.

ఆ.వె. ఒక్క మారు తాకు నొక్కొ న న్నిట రాఘ
వుండు లబ్ధ మౌనె మెండుగ నది
నాకు యమసదనమునకు నేఁగిన నరులు
చూడఁ జాల రింకఁ జుట్టములను 46.

కం. మతి మందగించు చున్నది
గతించు చున్న దిఁకఁ జూపు కౌసల్యా ని
న్నతివా! కన లేకుంటిని
పితృపతి దూతలు నను ద్వర పెట్టుచు నుండన్ 47.

తే.గీ. తనయు సత్యపరాక్రము ధర్మ వేది
రాము నంత్య కాలమున నరయ నశక్యుఁ
డ నయితి నకట దీని మించినది దుఃఖ
ముండునే నాకుఁ దలఁపంగ నుత్తమాంగి! 48.

తే.గీ. వారి రాశిని నెండ యపార మావి
రిగ నొనర్చు నటుల వేగముగఁ గుమారు
నప్రతిమ కర్ముఁ గాంచమి నడరి నట్టి
దుఃఖము నొగుల్చు చున్నది తోరముగను 49.

తే.గీ. మంచి పోఁగుల మించిన యంచితంపు
రాముని ముఖమును దిరిగి రాఁగ వనము
నుండి పదునైదవ దయిన యుర్వటమునఁ
జూచు వారు నరులు కారు చుమ్మి సురలు 50.

తే.గీ. తామరలఁ బోలు కన్నులఁ దనరు వానిఁ
జక్కని కనుబొమలు నింకఁ జక్క నైన
పండ్ల వరుస చక్కని ముక్కు వఱలు వాని 51.

శశి నిభ ముఖుఁ జూతురు ధన్య  జనులు రాము

ఆ.వె. శారదేందు నిభ ముఖారవిందము గంధ
యుతము వెలయు నాదు సుతుని ముఖము
గాంచి నట్టి వారె యెంచ ధన్య జనులు
సందియమ్ము సుంత యిందు లేదు 52.

కం. వనవాసము పూరించి ని
జ నగరముఁ గదియ నయోధ్య సంతోషముగం
గనఁ గలరు రాముని సుఖము
గ నున్న జనులు గతి శుక్రుఁ గన్న విధముగన్ 53.

కం. మది భ్రమ నిండఁగ నిట నా
హృదయం బది క్రుంగు చుండె నిస్సీ కౌస
ల్య! దిటవుగ స్పర్శ శబ్దము
లదలెను రుచి తోడ నాకు నాశ్చర్యముగన్ 54.

ఆ.వె. మతి చెడంగ నిట్లు మానిని! నా సక
లేంద్రియమ్ములు నశియించు చున్న
వరయఁ దైల మెల్ల నణఁగ దీపము సత్వ
రంబ యారు నట్లు వ్రాల నేను 55.

కం. సుతుని వలని శోకము న
న్నతివా బాధించు చున్న దత్యధికముగా
నతి వేగంపు నదీ జల
ము తీరమును గోయు నట్లు మూరి భృశముగా 56.

ఉ. హా రఘువీర! దీర్ఘభుజ! హాపితృ సుప్రియ! హా విచార నా
శా! రతి నేఁగి తీ వెటకు హా మమ నాథ! కుమార! విక్రమా!
హా రఘు రామమాత! కనుమా నిధనమ్ము తపస్వినీ సుమి
త్రా రమ! కైక నా రిపువ! త్రాస మొసంగితె వంశపాంసనీ! 57.

కం. విలపించుచుఁ గౌసల్యయు 58.

లలనా రత్నము సుమిత్ర లాలనఁ జెంతం
గలవరము సెందు చుండఁగ
నిలా ధవుఁడు నిధనముఁ గనె నిఁక దశరథుఁడే

కం. సదయుఁడు నర నాథుఁ డుదా
ర దర్శనుఁడు నంత నర్థ రాత్రి గడవఁగా
నెద దుఃఖ మావహింపగఁ
జెదర నెడఁద నసువుల విడిచెను బుత్రార్తిన్ 59.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 65.

రాత్రి గడచి తెల్లవాఱఁగనే వందిమాగధులు నుత్తమ సంస్కారులు రాజగృహమునకు వచ్చి రాజును మేలుకొలుప స్తుతింపఁగఁ బ్రాసాద మంతయు నాశీస్సుల రావములతో మారుమ్రోఁగ నంతఃపుర పరిచారికలు రాజును మేలుకొలుప రాజు లేవకుండుటచే శంకతో భయముతో వా రఱచుట, కౌసల్యా సుమిత్రాదులు లేచి రాజును స్పృశించి లేపినను లేవకుండుటచే మరణించెనని తెలియ నార్త నాదములతో రాజ గృహము దద్దరిల్లుట.

కం. గడవఁగ నిసి మఱునాఁ డిక
నడరఁగ నుదయమ్ము వంది లడర మగధులుం
గడు సంస్కారులు సూతులు
వడి గాయకు లింకను జదువరు లాగతులై 1.

తే.గీ. రాజ మందిరమున కంత రాజును స్తుతి
యింప విడివిడి నెల్లరు నింపుగాను
శుభ వచనములు నుత్తమ స్తుతు లడరఁగ
మారు మ్రోగెను భవనము తోరముగను 2.

ఆ.వె. అవ్విధమ్ము వార లవ్వసుధాపతిఁ
బొగడు చుండ సూత ముఖ్యు లడరి
పాణి వాదకులు శుభమ్ముగఁ జప్పట్లు
చఱచిరి విభు కృత్య చయము లనుచు 3.

కం. విని యా ధ్వనుల విహగములు
ఘన రాజ గృహమున నున్న ఘన శాఖల యం
దును బంజరముల నున్నవి
యును లేచి దొడఁగెను గూయ నుత్సాహమునన్ 4.

కం. నిండెను వీణా రవములు
మెండుగ నృప సౌధ మందు మీఱఁగ గాథల్
దండిగ నాశీస్సులతో
నుండగ గేయములు పాడ నుర్వీ పతికిన్ 5.

తే.గీ. శుచి నెఱింగిన వారు శుశ్రూష కోవి
దలును స్త్రీ లింకను నపుంసకులును జేరి
రంత నెప్పటి వలె వేగ సంతసమునఁ
గొలువ భూతల నాథునిఁ గూర్మి తోడ 6.

ఆ.వె. స్నాన శిక్ష యందు నైపుణ్య మున్నట్టి
వారు తగిన తఱినిఁ దీ రయిన వి
ధముగఁ దెచ్చి రపు డుదకము పచ్చని చంద
నమ్ముఁ గలిపి కాంచన ఘటములను 7.

ఉ. కన్యలు పెక్కు రుండఁగను గాంతలు మంగళ సంగ మార్హముల్
స్వన్యపుఁ బ్రాశనీయము లుపస్కరణమ్ములు తెచ్చి రింపుగా
నన్యము లన్ని లక్షణ సమన్విత సద్గుణ భాసితమ్ములే
మాన్య వరాభిహారిక సమంచిత వస్తు సమూహముల్ ద్వరన్ 8.

ఆ.వె. అంత నుత్సుకమున నందఱు సూర్యోద
దయము దనుక రాజు దరికి నరుగ 9.

కుండ నిల్చిరి మది మెండుగ ననుమాన
మడరు చుండ నేమి యంచు నిద్ది

ఆ.వె. ఎవ్వ రెలమిఁ గోసలేంద్రుని వర శయ
నమ్ము నడ్డు లేక యిమ్ముగఁ గను
నట్టి వారు వనిత లరిగి విభు దరికి
మేలు కొల్పి రపుడు మేది నీశు 10.

తే.గీ. ఉచిత వృత్తి వినయమున నువిద లంతఁ
దల్పమును దాఁకి మెల్లగ ధరణి ధవునిఁ
గాంచి నేరక యుంటిరి యించు కైనఁ
గదలిక నృపతి యందు నెడఁద లదరఁగ 11.

తే.గీ. నిదుర భంగుల నెఱిఁగిన నెలఁత లింకఁ
బనులు కదలిక లెఱిఁగిన వారు సంది
యమ్ము కలుగ రాజు నసువు లందు నూఁగి
రి గఱిక కొనల పగిది వెల్లి కెదు రుండ 12.

ఆ.వె. సంశయమున నున్న చామలు పార్థివుఁ
గాంచి యంతఁ దమకుఁ గల్గినట్టి
శంక డెంద మందు నింక వదలి నిశ్చ
యించిరి భయము నిజ మంచు నెల్ల 13.

తే.గీ. ఓడి పుత్ర శోకమునకు నుత్త మాంగు
లైన కౌసల్యయు సుమిత్ర యలసి నిద్ర
నుండి మేల్కన రక్కట దండ ధరునిఁ
జేరి నట్టి విధమ్ముగఁ జిత్రముగను 14.

తే.గీ. వెలవెలన నుండెఁ గౌసల్య కలఁత నిండ
సన్నగిల్లె వెల్గదు కాంతిఁ జదల నున్న
తార పగిది చీకటి నిండఁ దద్ద రాజు
ప్రక్కఁ దా నవతల సుమిత్ర నిదురింప 15.

ఆ.వె. రాణు లిద్దఱిని నరసి నిదురించుచు
నుండఁ దలఁచి రంత నువిదలు పృథి
వీపతి యకట నిసి వేళ నిద్రను మర
ణించి యుండ నోపు నంచు సెదల 16.

తే.గీ. అంత నేడ్చిరి దీనలు వంత సెలఁగ
నెడఁదల వరాంగన లకట బెడిదముగను
యూథమునఁ గుంజ రేంద్రుఁడె యుర్విఁ గూల
నేడ్చు నాఁడేనుఁగుల భంగి నెల్ల రడలి 17.

కం. వికటాంక్రందన రావము
లకుఁ గౌసల్యా సుమిత్రలకు భంగము ని
ద్రకు నయ్యె నంతఁ చేతన
ము కల్గె వారికి నిఁక భృశముగ శీఘ్రముగన్ 18.

తే.గీ. చూచి కౌసల్యయు సుమిత్ర చోద్యముగను
బతిని స్పృశియించి యంతటఁ బార్థివేంద్రు
నడలి హానాథ! యంచు వా రార్తిఁ జెంది
నేలఁ గూలిరి యిద్దఱు సెలఁత లకట 19.

ఆ.వె. కోసలేంద్ర కన్య ఘోరముగ వణఁకు
చుఁ బుడమి పయి దొర్లుచు మెయి దుమ్ము
తోడ నిండి యుండఁ దోరమ్ము దివినుండి
రాలి నట్టి తార వోలె నుండె 20.

ఆ.వె. శాంత గుణుఁడు గా దశరథుండు కౌసల్య
పుడమినిఁ బడి యుండ ముగుద లెల్లఁ
గాంచిరి హతమైన కరి వధూటి పగిది
నామె నంత వంత లలర సెదల 21.

ఉ. కైకయు నాదిగా నృవరు కాంతలు నంతట నొక్క రొక్కరున్
నాకముఁ జేరె నాథుఁ డని నారులు వచ్చిరి సంభ్రమమ్మునన్
శోకము మీఱ మిక్కుటము చూచి నిజేశుని నేడ్చియేడ్చి పే 22.

కాఁక చెలంగ డెందములఁ గాంతలు కూలి రచేతనల్ ధరన్

కం. నారీ రోదనముల ధ్వని
మూరి చెలంగె నట ద్విగుణముగ గృహమం దే
పారెం దిరిగి ప్రతిధ్వను
లారఁగ మిక్కుటము కాఁగ నాక్రందమ్ముల్ 23.

చం. నరవరుఁ డంద నంతమును నాశన మయ్యెను హర్ష మెల్లెడన్
గురుతర దుఃఖ మంతటను ఘోరపు రీతిఁ జెలంగెఁ గన్పడెం
బరివృత తప్తబాంధవ సపౌర జనాకుల దీన శోక ని
ర్భరముగ రాజ మందిర వరమ్ము మహారవ సంయుతమ్మునై 24.

తే.గీ. పార్థివర్షభుఁడు యశస్వి పరమ పదము
నందె నని యెర్గి నృప పత్ను లంద అంతఁ
జుట్టు ముట్టి జాలిఁ గొలుప శోక తప్త
లేడ్చిరి కరములం గొని హీనపతులు 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది యేనవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 66.

స్వర్గస్థుఁడైన నాథుని తలఁ బట్టు కొని కౌసల్య శోకించుచు బాధతోఁ గైకేయిని నిందించుట, దశరథు పార్థివ దేహమును దైలముతో నిండిన పెట్టెలో నుంచుట, మంత్రులు మున్నగు వా రిండ్లకు నేఁగుట. రాత్రి కాఁగఁ జీకఁటి నెలకొనుట.

మ. వెసఁ జల్లారిన యగ్ని నాఁ బరఁగెడిన్ వీతప్రభా దేహునిన్
విసమే లేని మహార్ణ వాభునిఁ బ్రభా విధ్వంసి తార్కాభునిం
బస క్షీణం బయి నాక మేఁగఁ గని భూపాలేంద్రుఁ గౌసల్య గాం 1.

చి సపత్నిం బతి శీర్షముం గొని యసెం జింతించుచుం గైకతో

కం. నెరవేఱిన కోర్కి యడరు
తరుణి వగుమ కైక ధాత్రిఁ దగ నేలుమ నీ
వరయక కంటకములు వీ
త రమణగ నృశంస! దుష్ట తర వర్తనపై 2.

తే.గీ. నన్ను వీడి నా రాముఁడు చన్న నిట్లు
భర్త యేఁగఁగ నివ్విధి స్వర్గమునకుఁ
దోడు విపథమునఁ జనంగ దూర మయిన
నిచ్చగింపను జీవింప నింక నేను 3.

తే.గీ. ధర్మముఁ ద్యజించు కైకేయి తక్క యన్య
మానిను లెవరు దైవ సమానుఁ డైన
స్వీయ భర్తను ద్యజియించి శీలవతులు
ధరను జీవింప నెంతురు తలఁచి చూడ 4.

తే.గీ. దోష మెఱుఁగక పిసినారి దుష్ట విష ఫ
లమ్ము తిను నట్టి రీతిని నమ్ముదుసలి
కుబ్జ మాటల రాఘవ కులము నకట
నాశనమ్ము సేసెను గైక యాశ తోడ 5.

కం. జనకుఁడు నా వలె శోక
మ్మున మిక్కుటముగ వినంగ మునుఁగును సుతు రా
ముని నన్యాయమ్ముగఁ బం
పె నటవికి సభార్య యంచుఁ బృథ్వీపతియే 6.

ఆ.వె. కమల పత్ర లోచనము లున్న రాముఁడు
ధార్మికుం డెఱుఁగఁడు తరల వనికి
మనిన నకట నన్ను మగఁడు లేని విధవ
నై నిలిచిన యట్లు కాననమున 7.

ఆ.వె. పాప మా తరుణి యవనిజ విదేహ రా 8.

జాత్మజ పెతలకు ననర్హ సీత
దుఃఖము వన మందుఁ దోర మనుభవించుఁ
గంపిత యగు భీతి కరము సెలఁగ

కం. అఱపుల బీషణముల విని
వెఱచుచు నిశఁ జేయఁగ మృగ విహగము లడవిం
బఱచి రయమ్ముగ నాథుని
నఱిముఱి తగ నాశ్రయించు నవనిజ యకటా 9.

కం. జనకాధిపుండు వృద్ధుం
డనందనుండు స్మరియించి యాత్మజ సీతన్
ఘన శోక తప్తుఁడై విడు
చును నిజ జీవితము నింకఁ జోద్యం బగునే 10.

కం. కాలాంత మేను బొందెద
శీలవతిఁ బతివ్రత నిఁక శీఘ్రమ దేహం
బాలింగన మొనరిచి యీ
జ్వాలిం జేరెదను నేఁడు పతితో నేఁగన్ 11.

కం. పతిఁ గౌగిలించి యేడ్చెడు
సతిఁ గౌసల్యను గని పరిచారిక లంతన్
వెత తార్తను గొనిపోయిరి
యతి వేగముగ నట నుండి యాత్రము తోడన్ 12.

ఉ. తైలపుఁ దొట్టి లోనఁ దగఁ దన్నృప కాయ మమాత్యు లందఱున్
మేలుగఁ జెప్ప నుంచ మని మెల్లగ నుంచి యొనర్చి రన్య కా
ర్యాలిని సెల్ల మంత్రివరు లంతఁ గుమార విహీన మా విదుల్
చాలక చేయ రాజునకు సంస్కర ణాదులు కాచి రోలమున్ 13.

తే.గీ. సచివు లుంచఁ దైలపు ద్రోణిఁ జక్రవర్తి
నంతఁ గాంచి స్త్రీ లెల్లరు నంతరంగ
మందుఁ జింత సెలఁగ రాజు మరణ మందె
నంచు నేరి వా రేడ్చిరి మించ ధ్వనులు 14.

ఉ. కన్నులఁ గాఱ నశ్రువులు కంజ నిభాస్యము లెల్ల నిండఁగా
మిన్నగ నంత నేడ్చుచు నమేయ విచార సుతప్త చిత్తలై
యన్నరదేవుఁ దల్చుచును హా వసుధాధిప! నీవు నేఁగితే
గ్రన్నన మమ్ము వీడి ప్రియ రాముఁడు దూరము కాఁగ మాకిటుల్ 15.

తే.గీ. అనుచుఁ జేతులనెత్తి మహార్తి నేడ్చి
యింక ననిరి రాముని వీడి యిట్లు పతిని
జంపినట్టి పాపపుఁ గైక సరస నెట్టు
లుండఁ గలము విధవలమై యండ లేక 16.

తే.గీ. మాకు నీకును రాముఁ డాత్మను వశమ్ము
నందు నుంచిన వాఁడు దిక్కయిన వాఁడు
తాను రాజ సంపద వీడి కాన కేఁగె
సత్య సంధుఁడు శ్రీమంతుఁ డత్యధికము 17.

ఆ.వె. వీరు రాము నిన్ను విడిచి వెతల ముగ్గి
నెలఁత కైక సతము నింద లిడుచు
నుండ నింక నెట్టు లుందుము మేము జీ
వముల నూని యిచటఁ బార్థి వేంద్ర! 18.

తే.గీ. సీతఁ గూడి రాముని నింకఁ జేవ నధికుఁ
డైన లక్ష్మణుని ననిపె నడవి కకట
కైక త్యజియించి నిర్దయఁ గాంత కినిసి
యెవ్వరిని విడువక యుండు నింక రాజ! 19.

తే.గీ. అట్లు దశరథు నర్ధాంగు లశ్రు పూరి
తలు వితత శోక తప్తలు ధరణిఁ గూలి
రలసి హీన హర్షలు నయి తెలివిఁ గోలు
పోయి యెల్లరు విలపించి బోరు మంచు 20.

ఆ.వె. చంద్రహీన రాత్రి సదృశమ్ము పతి చేత
విడువఁ బడిన వనిత విధ మయోధ్య 21.

రాజుఁ గోలు పోయి రాజిల్లక నిలిచె
నా సమయము నందు నార్తి సెలఁగ

తే.గీ. కనుల నిండిన కన్నీటి జనుల తోడ
నఱచి హాహా యని నిలుచు నబల లుండ
శూన్య వేశ్మాంతముల నింక శూన్య చత్వ
రముల నలర దెప్పటి వలె రాజపురము 22.

కం. అతి శోకమున దివమునకు
గతింప నరదేవుఁ డట్లు కాకుత్స్థుండే
సతులు పడ నేలఁ బశ్చిమ
గతి కేఁగ రవి నిసి నంధకారము సెలఁగెన్ 23.

తే.గీ. సుతులు లేకుండ దహనము సుహృదు లటకు
వచ్చి నట్టివా రత్తఱిఁ బలుకఁ గూడ
దంచుఁ జింతించి నరపతి నుంచ శయన
మందు వింతగ నగపడె నందు విభుఁడు 24.

తే.గీ. భాస్కరుఁడు లేని యట్టి నభమ్ము భంగి
తార లుడిగిన రాత్రి విధమ్ముగ మహి
తాత్మ రహిత నగర వర మశ్ర కంఠ
కలిత మార్గ చత్వరముల నలర లేదు 25.

కం. నర నారీమణు లటఁ గూ
డిరి సంఘములుగఁ బలికి కఠిన వాక్కులు తి
ట్టిరి యెల్లరు కైకను భూ
వరుఁ డట్లు గతింప నార్తిఁ బడయరు శాంతిన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది యాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 67.

నిరానందముగ నయోధ్యలో భారముగ రాత్రి గడచి సూర్యోదయము కాఁగ రాజ నియామకము
చేయు బ్రాహ్మణులు సభకుఁ జేరి రాజుల లేక యున్న రాజ్యమునఁ గల్గు నుపద్రవములను
వివరించి తగిన వానిని రాజుగ సూచింప మని వసిష్ఠ మహర్షిని వేఁడుట.

చం. కడచె నయోధ్య సాస్రు జన కాయ పరీవృత వీత హర్ష మం
దడులున ఘోర తప్త పురిఁ దద్దయు దీర్ఘపు రాత్రి యంతటం
బొడువఁగ సూర్యుఁ డత్తఱిని భూపతి కర్తలు బ్రాహ్మణోత్తముల్
వడి నటఁ జేరి రింపుగ సభాస్థలి నందఱు సంభ్రమమ్ముననన్ 1.

మ. ఘను లా కాశ్యప వామదేవ ముని మార్కండేయ మౌద్గల్యులుం
జన నా గౌతమ తాపస ప్రవరులౌ జాబాలి కాత్యాయనుల్
విన యామాత్యులు బ్రాహ్మణ ప్రముఖులున్ వే పల్కి రంతన్ వసి
ష్ఠుని నా రాజపురోహితుం గదిసి సంక్షోభంపు వాక్యమ్ములన్ 2.

చం. కుములుచుఁ బుత్ర శోకమున ఘోరముగా దివి కేఁగఁ బార్థివుం
డమల మనస్కుఁ డక్కట శతాధిక వర్షము లట్ల రాత్రి యె
ల్ల మనకుఁ దోఁచి క్రుంగినది రాముఁడు నేఁగె సభార్య కానకున్
విమల యశస్వి లక్ష్మణుఁడు ప్రేమ నిజాగ్రజుఁ గూడి యేఁగెనే 3.

మ. రుచి రాంతఃకరణ ద్వయుల్ భరత శత్రుఘ్నుల్ విపక్షఘ్నులే
సుచిరం బేఁగిరి గేక యాధిపు ఘనుం జూడంగ నా తాతనే
యచిరంబే యిఁక రాజు నొక్కనినిఁ జేయం బాడి యిక్ష్వాకులన్
రుచి రాలోచనఁ జేసి హీన పతి నీ లోకమ్ము నాశం బగున్ 4.

తే.గీ. మేఘు సహిత విద్యున్మాలి మించ గర్జ
నమ్ములు ధరాతలమున వర్షమ్ము నాపు
దేవ సద్గణ నాథుండు దివ్య వారి
రాజు లేని దేశమునఁ బర్జన్యుఁ డిడఁడు 5.

తే.గీ. రాజు లేని దేశమున మొలకలు రావు
విత్తనమ్ములఁ జక్కఁగ విత్తఁ దివిరి
రాజు లేని దేశమున భార్యయు సుతుండు
నక్కట వశత నుండరు నిక్కముగను 6.

ఆ.వె. రాజు లేనిచో నరయము విత్తమ్మును
లేదు దార రాజు లేని యెడల
నత్యహితము నొందు నలరు నరాజక
మైన సత్య ముండ దచట వెదక 7.

తే.గీ. పౌర జనులు గూడరు ముద మారఁగ నుప
వనముల నతి రమ్యముల దివ్య గృహ రాజ
ములను నిర్మింప రక్కట యలరి మిగుల
రాజు లేని దేశమ్మున నోజ నెంచ 8.

కం. అవని సురులు దాంతులు మఱి
సవన రతులు సువ్రతు లిఁకఁ జల్పరు క్రతువుల్
తివిరి మునిగణ వరేణ్యా!
యవనీపతి లేని దేశ మందుం గాంచన్ 9.

కం. ధనవంతు లైన విప్రులు
తనరించి మహాధ్వరములు దక్షిణ లీ రిం
క నవని ఋత్విగ్వరులకు
విను భూపతి లేని భూమి విప్రవరేణ్యా! 10.

చం. నట వరు లింక నర్తకులు నాగరి కోత్సవ వేళలందు ము
న్నటి వలెఁ గూడి సుంత యభినందము నందరు రాష్ట్ర వర్ధనుల్
కటు వగు వ్యాఖ్యగారులకుఁ గాలము గాథ లికం గథా ప్రియుల్
పటు కథలన్ వచింపఁ దగు వారలు నుండ రరాజకంబునన్ 11.

ఆ.వె. కన్య లుపవనులకు నన్యోన్యము కలసి
యేఁగ రక్కట విహరింప భూషి 12.

తలయి చక్క గాను దనరుచు మాపుల
రాజు లేని యట్టి రాజ్య మందు

ఉ. ఆరయ శీఘ్ర వాహనము లందుఁ జరింపరు కానలం దిఁకన్
నారులఁ గూడి పౌరులు ఘనంపు ముదం బది సందడింపఁగా
నీ రయితుల్ ధనాఢ్యులును నింకను గోపులు తీసి తల్పులన్
సేరరు పొందఁగా నిదుర సెమ్మది భూపతి లేని భూమినిన్ 13.

చం. తిరుగవు రాజ మార్గమునఁ దీరి గజమ్ములు గంట లుండఁగాఁ
గరముల షష్టి వర్షములఁ గ్రాలెడు నట్టివి పూర్వరీతినిన్
శరముల నభ్యసింపఁ దల శబ్దము లిత్తఱి సంతతమ్ముగా
నరుదయి యుండుఁ గాంచఁగ ధరాధిపుఁ డుండని దేశమం దిలన్ 14.

ఆ.వె. సరుకు లుండ నిండఁ జనఁ జాలరు వణిజు
లధ్వ మందు నిర్భయముగ దూర
గాము లిఁక సుఖముగ క్షేమముగఁ బుడమి
రాజు లేని యట్టి రాజ్య మందు 15.

కం. మును లొంటిఁ జరించు వశులు
మనమును మన మందుఁ దల్చు మనుజశ్రేష్టుల్
కన గృహము మాపున నిలువఁ
జనఁ జాలరు రాజు లేక చను రాజ్యమునన్ 16.

తే.గీ. యోగములకుఁ దగిన క్షేమ ముండదు జన
సంచయమునకు నక్కట యెంచి చూడ
సేన సమయింప దిఁక శత్రు సేనల నిల
రాజు లేనిచోఁ బాలింప రాజ్య మందు 17.

కం. మురియుచు శ్రేష్టాశ్వమ్ముల
నరులు సుమండిత రథముల నగరము నం దిం
క రతిని విహరింపఁగ సే
రరు వసుధేశుండు లేని రాజ్యము నందున్ 18.

కం. వనముల కుపవనములకుం
జని శాస్త్రజ్ఞులు తెగించి చర్చింపంగన్
ఘను లుత్సహింపరు నరులు
జననాథుఁడు లేని యట్టి జగమునఁ గాంచన్ 19.

కం. సుర పూజార్థము మాలలు
వర మోదక దక్షిణలను భక్త జను లిఁకం
బరఁగఁగ నియతిం జేయరు
నరనాథుఁడు లేని యట్టి నాఁట మునీంద్రా! 20.

కం. వర చంద నాగరు లలమి
నరేంద్ర సూనులు వసంత నగముల భంగిన్
సురుచిరము విరాజిల్లరు
ధరాత లేంద్రుండు లేని ధారుణిఁ గాంచన్ 21.

తే.గీ. ఉదక మావిరి యైనట్టి నదుల పగిది
పచ్చిక కఱపై నిల్చిన వనము భంగి
గోపక గణమ్ము లేనట్టి గోవుల వలె
భూత లేంద్రుండు లేనట్టి భూమి యుండు 22.

తే.గీ. తేరునకు నగు టెక్కెము తెలియ గుఱుతు
పొగ యగు గుఱుతు మంట కింపుగఁ దలంప
మనకు నెల్లర కగు రాజు తనరి సంజ్ఞ
యట్టి మన రాజు దేవత్వ మందె నిపుడు 23.

కం. మన దన్నది యుండ దవని
జను లొకరి నొకరు తినుదురు ఝుషముల భంగిం
గనలి నిరతంబు నక్కట
జననాథుఁడు లేని యట్టి జనపదములలో 24.

కం. మేరలు దాటిన వారును
ఘోరమ్ముగ శంక లుడుగు గురు నాస్తికులున్
భూరమణు దండ భీతినిఁ 25.

దీరైన పథమ్ము నందు స్థిరు లౌదు రిలన్

కం. కనులు శరీరమును సత
మ్మును గాచు విధమ్ము ధర్మమునకును సత్య
మ్మునకు మహీనాథుండ య
గును మూలము చింత సేయ గురుతర మెపుడున్ 26.

ఆ.వె. మంచి కులపు జనుల కెంచ రాజు కులమై
పరఁగు రాజు సత్య మరయ నింక
ధర్మ మతఁడె హితుఁడు తండ్రి తల్లియు నగు
హిత మొనర్చు జనుల కతఁడె యార్య! 27.

ఆ.వె. అందు వలన మించు నవనీపతి యముని
శక్రు నింకను ఘనసత్త్వ వరుణు
ధనదుఁ దన వర చరితమ్ము వలన నిల
నెంచి చూడ నెడఁద నంచితముగ 28.

ఆ.వె. మంచి చెడులను విభజించి తగ నరేంద్రుఁ
డరయ కుండ నున్న నవని నింకఁ
జీఁకటి కరము కవిసిన యట్లు శోభిల్ల
నేర దించు కైన నిఖిల జగము 29.

కం. జీవించి యున్నను నృపుఁడు
నీ వచనము ఉత్తరింప నేరము తనదౌ
యా వేలను దాటని పా
రావారము వోలె నెల్లరము ముని వర్యా! 30.

తే.గీ. కడచినది యెల్ల వీక్షించి కాననంబు
రాజు లేని దౌ రాజ్యంబు బ్రాహ్మణోత్త
మా! కుమారు నిక్ష్వాకులన్ మాన్య గుణుని
రాజుగ నభిషిక్తునిఁ జేయుఁ డోజ నింక 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది యేడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 68.

అందఱు సమ్మతింప వసిష్ఠుఁడు భరత శత్రుఘ్నులను రప్పింప దూతలను బంపుట; వారు వేగముగ గంగా నదిని, శరదండా నదిని దాటి, యభికాల గ్రామము దాటి, యిక్షుమతీ నదిని దాటి, బాహ్లీక రాజ్యమును దాటి గిరివ్రజ పురమును జేరుట.

కం. విని వారి భాషణమ్ములు
మునీంద్రుఁడు వసిష్ఠుఁ డంత భూసుర కాయ
మ్మును మిత్రామాత్యగణ
మ్ము నారసి పలికెను వచనముల నిబ్బంగిన్ 1.

చం. భరతుఁడు దత్తరాజ్యుఁడు శుభమ్ముగఁ దమ్ముని గూడి యుండె సం
బరముగ మాతు లింట వడి వారిని దూతలు తేరఁ బోవలెం
ద్వరపడి యశ్వ రాజములఁ దల్పఁగ నొండిఁక నేల యిత్తఱిన్
గిరలన మౌని యౌ ననిరి కేళులు మోడ్చుచు నంద ఱింపుగన్ 2.

తే.గీ. వారి సమ్మతి విని యంతఁ బల్కెఁ బిలిచి
విజయు సిద్ధార్థుని నశోకు సుజను నాజ
యంతు నందను వినుఁ డింక నంద ఱేను
జెప్పు కర్తవ్యమును మీకు నిప్పు డనుచు 3.

కం. వడి గల గుఱ్ఱమ్ములపై
వడి రాజగృహము మ దాఙ్ఞఁ బట్టణమునకున్
విడిచిన శోకమునఁ జని ఘ
నుఁడు భరతుని తోడ నిటు లనుఁడు నా నుడులన్ 4.

ఆ.వె. నీదు కుశల మడిగె నిను పురోహితుఁడు న 5.

మాత్య వరులు నడిగి రాత్యయికపుఁ
 గార్య మొండు కలదు క్రన్ననఁ జేయ నీ
కిచటఁ ద్వరగ మరలు మింక నీవు

తే.గీ. రాముని వివాసమును జెప్పరాదు మీకు
రాజు మరణమ్మును దెలుప రాదు చుమ్మి
రఘుకులపు టుపద్రవమును రాదు తెలుప
నేఁగి మీ రట కింతయు నేని వినుఁడు 6.

కం. కొని పట్టు బట్టలను నగ
ల నా నృపతికి భరతునకు రమ్యము లెల్లన్
ఘనముగ నీయంగ నచటఁ
జనుఁ డిఁక శీఘ్రముగ దూత సత్తము లారా! 7.

కం. వర హరుల నెక్కి దూతలు
తరలఁగ నిఁకఁ గేకయ వసుధాపతి పురి కం
త రయమ్ముగ దారికి నో
గిరముల నిడఁ జనిరి వారి గృహముల కంతన్ 8.

కం. పయనంపుఁ గార్యము లొనరి
చి యెల్లను వసిష్ఠు నాజ్ఞ శీఘ్రమ దూతల్
నయముగఁ గైకొని యంతన్
రయముగ నేఁగ దొడఁగిరి భరతునిం గాంచన్ 9.

ఆ.వె. అపర తాల గిరికి నంతికమునఁ బ్రలం
బాద్రి కుత్తరముగఁ బర్వతముల
మధ్యఁ బాఱు నట్టి మాలినీ నది యొడ్డు
ననుసరించి చాగి రంత వారు 10.

తే.గీ. హస్తినా పురమున దాఁటి యంత గంగ
నరిగి పడమటి దిశ వైపు నడరుచుఁ గురు
జాంగలమునకు మధ్యఁ బాంచాల దేశ
మును గదిసి యింపుగను దూత ముఖ్యు లచట 11.

ఆ.వె. పూర్ణపు సరసులను బుణ్యోదక నదుల
ను దిలకించుచు నట మది వహించి
కార్య దీక్ష నెల్ల ఘనముగ దూతలు
పోవఁ జాగి రంత మూరి వేగ 12.

తే.గీ. వారు నిర్మలోదక నిత్య పరమ భాసి
తమ్ము నానా విహగ సేవి తమ్ము పుర జ
నాకులమ్మును శరదండ నంత దాఁటి
యేఁగఁ జాగిరి దూతలు వేగముగను 13.

ఆ.వె. వరము లిచ్చు దివ్య తరువు సత్యోపయా
చనము తటిని నుండఁ జక్కఁగఁ గని
తగ నమస్కరించి తద్ద భక్తిఁ గులింగ
పురము సేరి రంతఁ దరలి వేగ 14.

ఆ.వె. అంతఁ జేరి పల్లె నభికాలమును వడి
బోధిభవన మనెడు పుడమి తాల్పు
నుండి పాఱు నదిని నుత్త రించిరి యిక్షు
మతినిఁ బూర్వుల దగు మహిని వారు 15.

ఆ.వె. భూసురులను గాంచి దోసిలి నీరమ్ముఁ
ద్రాగు వారి వేద తత్వ పార
గులను బాహ్లికమునకు నడుమను నరిగి
గిరి సుదామను గదిసిరి చెలంగి 16.

తే.గీ. విష్ణు పదము నరయుచుఁ బవిత్ర నది వి
పాశ శాల్మలీఁ దరువుల పల్వలముల
సరసులఁ దటాక వాపులఁ గరులఁ బులుల
సింహ మృగముల నరయుచు శీఘ్రముగను 17.

ఆ.వె. మిక్కిలి పొడ పైన చక్కని దారి నేఁ
గిరి రయమ్ముగఁ జెలఁగి ముని శాస 18.

నమ్ము తలను దాల్చి సమ్మదముగ దూత
లంత నడరి భరతు చెంత కేఁగ

కం. అలసిన గుఱ్ఱమ్ముల దూ
తలు దూరంపు గతి నెల్ల దాఁటి క్రమమునన్
లలితంపు గిరివ్రజ పుర
మలరుచు గమ్యమును జేరి రందఱు నంతన్ 19.

తే.గీ. ప్రమద మీయ మునికిఁ గుల రక్ష కొఱకు
భర్తృ వంశమ్ము రక్షించు నార్తి తోడ
గౌరవమ్ము మీఱంగ వేగమ్ము గాను
రాత్రి కంతఁ జేరిరి నగరమ్ము వారు 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 69.

దూతలు పురమును రాత్రినిఁ జేర నా రాత్రి భరతుఁడు నిద్రలో ఘోరము భయానకము నైన దానిని స్వప్నమునఁ గాంచ విచారముగా నుండ మిత్రులు కథలఁ బాటల హాస్య వచనముల నాహ్లాద పఱపఁ బ్రయత్నించినను భరతుఁడు విషణ్ణుఁ డగుట. భరతుఁడు తన స్వప్న వృత్తాంతమును దన మిత్రులకుఁ జెప్పుట.

కం. జేరిరి దూతలు పురము సు
దూరాధ్వమ్ముఁ గడచి నిసిఁ దూర్ణము భరతుం
డా రాతిరి స్వప్నమ్మున
ఘోరమ్మను భీతిదమ్ముఁ గుములుచుఁ గాంచెన్ 1.

తే.గీ. అడలి రాజాధిరాజ సూనుఁ డుదయమున 2.

లేచి కాంచ రాత్రిఁ గల నప్రియము  ఘోర
ము భయదమ్ముఁను భరతుఁడు మునిఁగి దుఃఖ
మునఁ దపించె భృశమ్ముగ మనము నందు

ఉ. మిత్రులు సేరి యాభరతు మిక్కుట మైన విచార మొందఁగా
నాత్రము తోడఁ జేరి సభ లందు విచారముఁ బాప నెంచుచుం
జిత్రము లైన గాథలను జేరి వచించుచుఁ దీపి పల్కులన్
మిత్రుని తాపముం జెఱుప మిక్కిలి యత్నము సేసి రెల్లరున్ 3.

తే.గీ. పడయ శాంతి వాయించిరి వాద్యములను
గొంద ఱాడ నాటకములు కొంద ఱింకఁ
గొంద ఱప్పుడు పల్కిరి యందము లగు
హాస్య భాషణములు పెక్కు లడరి మిగుల 4.

కం. నిజ మిత్రులు ప్రియములు హ
ర్షజ గిరలను బల్కు వారు సలిపిన గోష్ఠిన్
సుజనులు హాస్యమ్ముగ నెడఁ
ద జనింపదు హర్షము నృప తనయున కకటా 5.

ఆ.వె. అంత సఖుల నొకఁడు చెంత నిజ సఖులు
గూడి యున్న భరతుఁ గూర్మిఁ జేరి
పలికె నిట్లు ముదము వడయ వింతయు నేల
మిత్రమ యిట నీవు చిత్రముగను 6.

కం. అన విని యా భరతుఁ డపుడు
విను మెల్ల నుడివెద మిత్ర! విపరీతపు దీ
నుని నేల యయితినో  నే
ను నీకు  నెల్లరు వినంగను సమస్తమ్మున్ 7.

ఆ.వె. కంటిని కలలోన నొంటి మలినమునఁ
గురు లుడిగిన యట్టి శిరముతోడ
జనకుఁడు పడు చుండ శైల శృంగము నుండి
పేడ చెఱువు లోన వేగ జాఱి 8.

ఆ.వె. ఈదు చుండఁ గంటి నేను గోమయపు స
రస్సు నందు నింకఁ ద్రాగు చుండ
దోసిలించి తైల మాసతో మాటి మా
టి కట నవ్వు చుండి వికటముగను 9.

కం. నువ్వుల యన్నము తించును
రివ్వున దించుచు శిరమును గ్రిందున కింకన్
నివ్వెఱ నూనె మునింగిన
యవ్వర తను వుండ నూనె యంద చెలంగెన్ 10.

మ. కలలోఁ గంటిని యెండ సాగరము నింకం గంటి నా చందురుం
డిలలోఁ గూల నభమ్ము నుండి వడిఁ దారేశుండు నొక్కుమ్మడిన్
పెలయన్ సేరదు నిండఁ జీకఁటి మహా విశ్వంబు చిత్రమ్ముగాఁ
బలు ఖండమ్ములు నయ్యెఁ గుంజరపు టా వాహ్యంపుఁ తొండం బటన్ 11.

తే.గీ. మండు చున్న యనల మారి యుండఁ గంటిఁ
బుడమి యెల్లఁ బగులఁ గంటి నడలు మీఱ
నెండినవి వివిధ తరులు కొండ లెల్ల
ధ్వంసములు కాఁగఁ బొగ తోడఁ దనరఁ గంటి 12.

ఆ.వె. ఇనుప పీట పైన జనపతి కూర్చుండ
నల్లని వసనముల నెల్ల నూని
గేలి సేయు చుండఁ గృష్ణ పింగల వర్ణ
రమణు లవని పతి నరసితిఁ గలను 13.

కం. త్వరపడుచు ధర్మ బద్ధుఁడు
నరపతి ధరియించి చయ్యన నెఱుపు పూతల్
విరి దండలు సన ఖర యు
క్త రథమ్మున దక్షిణ దిశ దర్శన మిచ్చెన్ 14.

కం. ఎకసెక్కెముగా నొక నా
తుక యెఱ్ఱని బట్ట లూని తూర్ణము నృపునిన్ 15.

వికటానన యౌ రక్కసి
ప్రకటిత మయ్యెఁ గల లాగ భయ మేపారన్

తే.గీ. ఇవ్విధము కంటి డెందము నొవ్వ స్వప్న
మతి భయావహ మే నైన నగ్రజుండు
నైన రాజైన లక్ష్మణుం డైన నింకఁ
దప్పదు మరణించుట నేను దలఁతు నిట్లు 16.

కం. నరుఁ డెవ్వఁ డేని పెడలఁగ
ఖర యుక్త రథమునఁ గలను గన నబ్బంగిన్
నరుని చితిని రగులు పొగ య
చిరంబు గన్పట్టు నిఁక విచిత్రము గాఁగన్ 17.

తే.గీ. దీనుఁడ నయితిఁ గలఁ గని నేను మిమ్ము
నర్థ విధము సంభావింప నైతి నకట
యెండు చున్నది నా నోరు మెండుగాను
డెంద మస్వస్థతఁ బడసె నిందు వలన 18.

తే.గీ. ఎడఁద భయ మయ్యెఁ గారణ మీ భయమున
కే నెఱుఁగ కుంటి గద్గద మీ గళంబు
నయ్యెఁ గాంతి యెల్లను హీన మయ్యె దీని
కారణంబును నేర నకట తలంప 19.

ఆ.వె. పలు రకముల నిట్లు కలలో నపూర్వము
లఁ గని మున్నరయని రాజ దర్శ
నమ్ము నిట్లు గాంచ నా మది విడువదు
ఘోర మైన భయముఁ గొంచె మైన 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నఱువది తొమ్మిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 70.

దూతలు కేకయ రాజ గృహము చేరి రాజును వాని పుత్రునిఁ గాంచి రాజు పాదములకు మ్రొక్కి భరతునితో వసిష్ఠుని వాక్యములను దెలిపి తెచ్చిన బహుమతులు తాతకు మాతులనకు నిమ్మని యొసఁగి  యత్యవసర మైన పనిని నెరవేర్ప భరతుని శత్రుఘ్నునితోఁ గూడి రమ్మని పురోహితులు కోరి నట్లు చెప్పఁగ భరతుఁ డందఱి యనుమతినిఁ గొని తాత యిచ్చిన పరివారముతో నయోధ్యకు బయలుదేరుట.

చం. అనఘుఁడు వీరుఁడా భరతుఁ డట్లను చుండఁగ స్వప్న వృత్తమున్
ఘన పరిఖావృతంబు నరకాంతు పురమ్మును జేరి రంత డ
స్సిన వగు వాహనమ్ములను శీఘ్రమ దూతలు గాంచి రాజునుం
దనయుని గౌరవింపఁబడి తండ్రి పదమ్ములు ముట్టి యంతటన్ 1.

తే.గీ. భరతునిఁ గని పల్కిరి యిట్లు భాషణమ్ము
లడిగిరి కుశలము పురోహితుఁడు నమాత్యు
లెల్లరు నిను ద్వరితముగ నీవు మరల
వలె ననిరి చేయఁ  దప్పని పని కల దట 2.

తే.గీ. ఇవి మహార్హ వస్త్రమ్ములు నింక భూష
ణములు మామ కిమ్ము విశాల నలిన నేత్ర!
భరత! పదికోట్ల విలువవి నరవరేణ్యు
న కిరువది కోట్లు నీదు తాత కొఱ కిమ్ము 3.

తే.గీ. బంధు మిత్ర ప్రియుఁడు గొని వాని నెల్ల
నాదరించి యా దూతల నడిగినవి యొ
సంగి యెల్లఁ బలికె నిట్లు సద్గుణుండు
భరతుఁ డప్పుడు వారితో వచనములను 4.

ఉ. రా జగు నాదు తండ్రి కుశ లంబుగ నచ్చట నున్న వాఁడె వా
రోజఁ జరింత్రె హర్షమున నుత్తము లా రఘురామ లక్ష్మణుల్ 5.

పూజల రామ మాత యట మూరి యరోగము ధర్మసక్తయే
తాఁ జరియించునే కుశలతం దగ ధర్మము నాచరించుచున్

ఆ.వె. రహినిఁ గలదె యచట లక్ష్మణ శత్రుఘ్ను
లకు జనని సుమిత్ర లలితముగ న
రోగముగను జక్కఁ జాగు చున్నదె కుశ
లమ్ము తోడ నడిమి యమ్మ చెపుడి 6.

తే.గీ. నాదు జనని కైకేయి తనను సతమ్ము
ప్రాజ్ఞగఁ దలంచు నారియ స్వార్థ మనిశ
మెన్ను సతియె చండియు రోష మున్న యామె
తనరునె యరోగ మే మని యనియెఁ దాను 7.

కం. అన విని దూతలు గౌరవ
వినయమ్ముల తోడ నిట్లు ప్రీతి నొసఁగ నా
ఘనుని భరతుఁ గని నీ యడి
గిన వారు కుశలు లని పలికి యనిరి యింకన్ 8.

కం. వరియించె శ్రీయుఁ బద్మయె
భరత! నరర్షభ! తలంపఁ బన్నుగ నిన్నే
యరదమ్మును శీఘ్రమ్ముగ
వర హయముల నరుగఁ గూర్ప వలయును జుమ్మీ 9.

ఉ. అన విని పల్కె నా భరతుఁ డప్పుడు దూతలఁ గాంచి వేగ నే
జనపతి యాజ్ఞ గైకొనెదఁ జక్కఁగ వేగిరపెట్టు చుండిరే
నను జన నాథ యంచు నని నాథుని చెంతకు నేఁగి తాతతో
ననె భరతుండు దూత లిట నందఱు రమ్మను చుండి రిత్తఱిన్ 10.

తే.గీ. రాజ దూత చోదితుఁడనై రయమున జన
కుఁ గన నేఁగ వలయు నీవు కోరి నప్పు
డే నిట కరుదెంచఁ గలను కాన యాన
తిమ్ము నాకు నేఁగ ననుచు నెమ్మది ననె 11.

కం. విని భరతుని వచనము లె
ల్లను మాతామహుఁ డతని శిరము మూర్కొనుచున్
జన నాథుఁడు తన మనుమనిఁ
గని పలికెం బ్రీతిని శుభకర వాక్యములన్ 12.

తే.గీ. వెడలు మయ్య యనుమతింతు నడరి యేఁగఁ
గైక ముద్దుపట్టి! సుఖముగ నడుగుమ జ
నని కుశలము పరంతప! జనకుని కుశ
లమ్ము నడుగుమ యిక్ష్వాకు రాజ తనయ! 13.

ఆ.వె. ద్విజ పురోహిత వితతి కుశలమ్ము నడుగు
మయ్య! నే నడిగిన యట్లు నింక
వర ధనుర్ధరులును భ్రాతలు రామ ల
క్ష్మణుల కుశల మడుగు చక్కఁగఁ జని 14.

ఆ.వె. ఆతనికి నొసంగె నత్యుత్తమ కరుల
రాజు సాదరముగ రంగు రంగు
ల వగు కంబళులను రంకు చర్మమ్ముల
నింక విరివిగ ధన మెలమి నపుడు 15.

తే.గీ. పసిడి మాడలు మనుమని కొసఁగె రెండు
వేలు పదునాఱు వందల మేలి గుఱ్ఱ
ముల ధనంబును గేకయ భూధవుండు
ప్రీతి నొసఁగెను గైకేయి ప్రియ సుతునకు 16.

చం. భరతుని వెంటఁ జాగుటకు పార్థ హితమ్మును గోరు వారి నిం
కురువుగ విశ్వసింపఁ గల యుత్తము లైన యమాత్య వర్యులన్
నరపతి యిచ్చె నశ్వపతి నాథుఁడు కేకయ భూమి కింపుగా
వరగుణ యుక్త భాసితుల భద్రము నెంచి యెడంద మిక్కిలిన్ 17.

ఆ.వె. మేనమామ యొసఁగె మేటి యైరావ తైం
ద్ర శిర కుంజరములఁ ద్వరితముగఁ జ
రించు గాడిదలను మంచిగ శిక్షిత 18.

ములను సిరుల నింక నలరి మిగుల

ఆ.వె. అంతిపురము నందు సంతసమునఁ బెంచి
నట్టి పులుల మించు నట్టి బలము
లున్న దంతములు సమున్న తాయుధము లై
యడరెడు శునకముల నలరి యొసఁగె 19.

కం. గమ నాతురతం గైకే
యి ముద్దు బిడ్డండు కేక యేంద్రుఁ డొసఁగి న
ట్టి మహోపాయనముల డెం
దమున నలరఁ జాలఁ డపుడు తాపము నిండన్ 20.

కం. దూతలు తనను ద్వరపఱప
నాతత మది గాంచ నింక నా కల చేతన్
భీతి యడరఁగఁ గరము మది
నా తాపము వృద్ధి సెందె నత్యధికముగన్ 21.

చం. తనదు గృహమ్ము వీడి నర దంతి హయావలి సంవృతమ్మునున్
ఘన నృప మార్గ మంతట సుఖమ్ముగఁ జేరి రయమ్ము మీఱఁగాఁ
జనుచు నతిక్రమించి కని సద్మము నంతిపురం బవారిత
మ్మునఁ జనె లోని కంత వడి భూతల నాథునిఁ గాంచి యంతటన్ 22.

తే.గీ. తాత నడిగి యనుజ్ఞను మాతులుని యు
ధాజితునిఁ గూడ నంత రథమ్ము నెక్కి
భరతుఁడు పయన మయ్యె నవరజుఁడు సన
వెంట శత్రుఘ్నుఁ డడరుచు వేగముగను 23.

తే.గీ. రథములు సమూహము లయి చక్రమ్ము లుండ
వందకును మించఁగఁ గొని యశ్వ వృష భోష్ట్ర
బలములను గూడి భృత్యులు భరతు నంత
వెడలు వాని ననుగమించి రడరి యపుడు 24.

తే.గీ. భరతుఁడు మహాత్ముఁడు ధ్వజినీ పాలితుండు 25.

నాత్మ సదృశ మంత్రులు రాఁగ ననుజునిఁ గొని
విగత శత్రు శత్రుఘ్నుని వీడెఁ దాత
యింటి నిఁక సిద్ధుఁ డింద్రుని యింటిఁ బోలె

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 71.

భరతుఁడు పయనించి యేడు రాత్రు లనేక నదులు నరణ్యములు జనపదములు దాఁటి యయోధ్యఁ జేరి సందడి లేక బోసి పోయిన పురమును గాంచి సారథితోఁ దర్కించుచు ఖిన్న హృదయమునఁ దండ్రి ప్రాసాదమును జేరుట.

ఉ. రాజ గృహమ్ము నుండి తగఁ బ్రాఙ్ముఖుఁడై కదలెన్ రఘూద్వహుం
డోజ సుదామ నాఁ బరఁగు నుత్తమ వాహిణి దాఁటి యేగుచుం
దాఁ జని హ్లాదినీ నదినిఁ దద్ద వెడల్పగు దాని వారుణీ
రాజిత వేగ భాసితము ప్రోదిని దాఁటె శతద్రువున్ వడిన్ 1.

తే.గీ. నదిని దాఁటి యైలాధాన నగర మందు
నపర పర్పటములఁ జేరి యంత శైల
రత్న మాకుర్వతి నిఁక భరతుఁడు శల్య
కర్త నాగ్నేయ పురముల నార్తి దాఁటి 2.

తే.గీ. సత్యసంధుఁడు శ్రీయుత సద్గుణుండు
చూచుచు శిలావహా నది సుందరమును
జైత్యరథ వనపు దిశను శైలములను
సత్వరమ్ముగ దాఁటె మహత్వములను 3.

మ. వడి గంగా తటినీ సరస్వతుల సంభావించి కౌబేరి నుం 4.

డెడి దేశమ్ములు వీర మత్స్యముల సాన్నిధ్యంపు భారుండపుం
గడు దట్టం బగు కాననమ్ముఁ గదిసెం గాళింది నాహ్లాదినిన్
వడినిన్ దాఁటి కులింగ నూఱటను సైన్యశ్రేణి కిచ్చెం దగన్

తే.గీ. పర్వ తావృత మా నది వాజి గాత్ర
ములను జల్లఁబఱచి శ్రమము దొలఁగంగఁ
జేసి తాను తానం బాడి చేరి నీరు
ద్రావి నుదకమ్ము గైకొని తరలె నంత 5.

కం. నృప నందనుండు కానన
ము పరులు వసియింప నట్టి పుడమినిఁ గడు భ
ద్రపు వాహనమునఁ దరలె న
గపడి నభమునం జరించు గాడుపు భంగిన్ 6.

తే.గీ. చేరెఁ దూర్ణము నదిని భాగీరథిని ర
ఘుకుల ఘనుఁడు తరించుటకు నతి కష్ట
మైన నదిఁ బ్రాగ్వటపు టంశుధాన మందు
విశ్రుతం బైన నగరము వీర వరుఁడు 7.

ఆ.వె. ప్రాగ్వటమున దాఁటి వడిని గంగను జేరె
ను గుటికోష్ఠిక యను నగణిత నదిఁ
దన బలమ్ము తోడ దాని దాఁటఁగ ధర్మ
వర్ధనం బను జనపదము సేరె 8.

మ. పుర మా తోరణ దక్షిణంపుఁ దటి జంబూప్రస్థముం జేరి సుం
దర సుగ్రామము నా వరూథము గనెన్ ధాత్రీశ పుత్రుండు నా
భర తాఖ్యుం డట రమ్యమౌ వనమునన్ వాసంబు గావించి పే
తరలెం దూరుపు దిక్కునం దడరెడిన్ స్థానీయముం జేరఁగా 9.

తే.గీ. ఉజ్జిహాన మను పురంపు టుప వనమ్ము
నందు నెందుఁ గదంబ వృక్షాలి కలదొ
యందు విడిసి కొంత తడవు హయములు వడి
గలవి గొని సేన నొప్పించి కదలెఁ దాను 10.

తే.గీ. సర్వతీర్థ మందు నిలిచి పర్వతమ్ము
లందుఁ బుట్టిన వాజుల యండ తోడ
దాఁటి యుత్తాని కాది నదమ్ము లెల్ల
గజము నెక్కి దాఁటెను కుటికా నది వడి 11.

కం. అంత నరవ్యాఘ్రుఁ డటులె
దంతి పయినఁ జక్క నిలిచి దాఁటెను లౌహి
త్యాంతిక కపీవతిని ధీ
మంతుఁడు భరతుండు ఘనుఁడు మనుజోత్తముఁడే 12.

తే.గీ. ఏకసాలపు పల్లెలో నింక నుత్త
రించి స్థాణుమతీ నది మించి వినత
జనపదమున గోమతి దాఁటి చనెఁ గలింగ
పురపు సాల వనికి హయము లలయంగ 13.

ఆ.వె. అవ్వనమున నిసిఁ బ్రయాణము చేసి భ
రతుఁ డుదయ మడర పురవరము మను
నిర్మితఁపు టయోధ్య ధర్మ రతుం డంతఁ
గాంచె నేడు నిశలు గడవ గతిని 14.

ఉ. ఆ నగరం బయోధ్యఁ గని యాతఁడు సారథి తోడ నంచి తో
ద్యాన వ నావృతంపుఁ బురి నారయ దూరము నుండి ప్రీతినిం
గానఁగ లేక యుంటి నని క్రమ్మరఁ బల్కె యశో విరాజితం
బీ నగరమ్ము యాజక వ రేద్ధ గుణాన్విత విప్ర యుక్తమై 15.

ఉ. పాండుర మృణ్మ యాంచిత విభాసిత దేశము వేదపార గో
ద్దండ సమృద్ధ రాజఋషి ధర్మ నిబద్ధ నృపాల పాలి తా
ఖండ ధరాతలమ్ము ధనికవ్రజ పౌర వరాన్వితమ్ము స
న్మండిత రాజ వీవధ సమంచిత భక్త మయోధ్యఁ గాంచఁగా 16.

ఆ.వె. మున్నడరెడు స్త్రీల పురుషుల కోలాహ
లమ్ము ఘన రవ తుములమ్ము నేఁ డ 17.

కట వినఁబడ దెందుఁ గారణ మెద్దియొ
నేరకుంటి నయ్య నేను వింత

తే.గీ. ఉపవనమ్ములు క్రీడించి యుత్తమముగ
మాపు లందును విరమించి యేపుగఁ బరు
వులిడు నరులతో నిండుగ నలరు నట్టి
వపుడు కన్పట్టు చుండెడు నన్య గతిని 18.

ఆ.వె. అవియె నేఁడు విడిచి నట్టి ప్రియులఁ గాంచి
భృశముగ విలపించు విధము నుండఁ
బురము నేఁ డరణ్యపు విధము సారథి!
తోఁచు చున్న దకట దుఃఖ మడర 19.

కం. కనఁబడ రిక్కడ యెవ్వరు
చను చుండఁగ వచ్చు చుండ జన ముఖ్యులు వా
హనముల గజ తురగమ్ముల
మునుపటి రీతిని ఘనంపుఁ బురమునఁ గాంచన్ 20.

తే.గీ. మున్ను దనరె నీ యుపవనములు మదించి
ముదితము లయి జనుల కీయ మోదము రతి
కనుగుణమ్ముగ నిపు డుండె నాకు లెల్ల
రాల యేడ్చెడు తరులతో రహిని వీడి 21.

కం. వినఁబడ వింకను నుదయ
మ్మున మత్త మృగద్విజ గణము లడరి కూయం
గను మధుర కలస్వనములు
ఘనమ్ముగఁ బుర వరమున నకట చిత్రముగన్ 22.

చం. అగరువు లింక చందనపు టా పొగలం గొని గాలి వీవఁగా
నగణిత భంగి నిప్పు డిట నక్కట మున్నటి రీతి గాన మిం
కఁ గొడుపు తోడఁ గొట్టగను గట్టిగ బేరి మృదంగ గర్జ లిం
క గురు విపంచి కార్బటులఁ గాంచ మదీన గతిం బురమ్మునన్ 23.

ఉ. కన్పడు చున్న విప్పు డసుఖమ్ములు గొట్టులు బాధకమ్ములుం
బెన్పు నిమిత్తముల్ మదికిఁ బీడన మీయ ననేకముల్ పురిన్
మున్పటి భంగి బంధువులు వొందరు క్షేమము శంక యయ్యెడిం
గన్పడ కెట్టి కారణము కాఱియ నందె నెడంద సారథీ! 24.

కం. చేరెఁ బురమ్మును భరతుఁడు
మూరిన వెత నలసిన హృదిఁ బొగులుచు మిగులన్
దారుణపు టింద్రియమ్ముల
వీ రేక్ష్వాకు నరవరులు పెంచిన పురమున్ 25.

తే.గీ. అలయ గుఱ్ఱములు భరతుఁ డపుడు వైజ
యంతి యనెడు ద్వారమ్మున నచటి ద్వార
పాలకులు జయమ్మును లేచి వలుక వారి
తోడఁ గూడి వెడలె నంతఁ దూర్ణముగను 26.

చం. కుమిలెడు స్వీయ చిత్తమున గుమ్మము నందలి వారి కిచ్చి తి
ర్గి మిగుల గౌరవం బెడఁదఁ గ్లేశము మీఱఁగఁ దాత కిష్టుఁడౌ
విమలుని సారథిం గని నృ వీరుడు రాఘవుఁ డడ్గె బల్కి రే
ల మరలు వేగ యంచు నటఁ ద్రాసము కల్గ నకారణంబుగా 27.

చం. మనమునఁ గల్గు చున్న దనుమానము కీడు స్ఫురించు చుండె నో
యనఘ! భృశమ్ము శీలము లయం బగు నట్టులఁ దోఁచు చుండెనే
వినఁబడె రాజ నాశమునఁ బృథ్విని బూర్వము విన్న వట్టివే
కనఁబడు చున్న విత్తఱినిఁ గాంచఁగఁ జిహ్నము లెల్ల సారథీ! 28.

చం. తుడువని యిండ్లు కన్పడెను దుష్టముగా నిట వేయ నట్టివౌ
గడియలఁ దల్పు లుండె సిరి కల్గక యెల్లెడ హోమ హీనముల్
విడిచిన ధూప వాసనల వీత నిజాన్న కుటుంబ జాలముల్
మడిసిన కాంతిఁ బౌరులు నమంగళ వేశ్మము లెల్లఁ గన్పడెన్ 29.

కం. దేవాలయమ్ము లగపడె
నే విరి దండలును లేకయే మఱి వాకి
ళ్లే వెల వెల లాడె నిపుడు 30.

వావిరిఁ గలయంపు లుడిగి భక్త రహితముల్

ఆ.వె. దేవ తార్చ లెల్లఁ దెగెను సభలు క్రతు
వులును గాన రావు పూల యంగ
ళులఁ గనఁబడవు విరులు నకట కాంతి వి
హీనముగ నగపడె నెల్ల గుడులు 31.

కం. కనఁబడరు వర్తకు లిపుడు
మునుపటి వలె రాక బేరములు చెదరంగన్
మనములు సంతాపమ్మున
ఘనముగఁ గాంచఁ బురమం దకట చిత్రముగన్ 32.

తే.గీ. గుడులఁ జైత్యము లందును గూడ పక్షి
గణము లుండె దీనమ్ముగఁ గరము గాంచ
స్త్రీ పురుషు లశ్రు పూర్ణులు దీన గతిని
నన్య చింతలఁ గృశియింప నగపడి రట 33.

కం. పలికి భరతుఁ డిట్బంగినిఁ
గలఁత వడసి మనము నందుఁ గాంచి యయోధ్యా
నిలయమ్ము లం దయిష్ట
మ్ములు పెక్కులు రాజ వేశ్మమును జేరె వడిన్ 34.

తే.గీ. జనులు లేని యిండ్లు గతులు చదుకములను
దుమ్ముతో నుండు నెట్టని గుమ్మములు త
లుపుల నరసి యింద్ర పురాభ రుచిర పురము
వఱల మున్ను మిక్కుటముగ బాధఁ జెందె 35.

కం. కని యప్రియములు మున్నర
య నట్టి పెక్కింటి నా మహాత్ముఁ డపుడు వే
దన మీఱ దీనముగను ద
లను వంచి పితృ భవనము కలఁత వడిఁ జేరెన్ 36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది యొకటవ  సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 72.

భరతుఁడు రాజ సౌధమునఁ దండ్రి లేకున్నఁ దన తల్లి కైకేయినిఁ గాంచ జనని యింటికి నేఁగి తండ్రి యెక్కడ యని యడుగఁ గైక తండ్రి మరణించి నట్లు రామ లక్ష్మణుల గుఱించి యడుగ జరిగిన విషయ మెల్ల నుడువ దుఃఖముతో నతఁడు మూర్ఛిల్లి తేఱికొని విషయ మెల్లఁ దల్లి నడిగి తెలిసికొనుట.

కం. జనకునిఁ గన లేక తనదు
జనకుని యింట భరతుండు జననిని గాంచన్
జనని నిలయమ్మునకు రయ
మున నేఁగెను రాజసుతుఁడు మూరిన శంకన్ 1.

ఉ. వచ్చిన దూర దేశగత వంశ వివర్ధను బుత్త్రుఁ గాంచి తా
నచ్చపు హర్ష చిత్తమున నంతట వీడి సువర్ణ పీఠమున్
మెచ్చుచు నుర్కఁ గైక సిరినిం గన నట్టి నిజాలయమ్మునం
దచ్చరణమ్ము లంటి తన తల్లికి నా భరతుండు మ్రొక్కఁగా 2.

చం. కని సుతుఁ గౌగిలించి తలఁ గ్రక్కున మూర్కొని కీర్తిమంతునిం
దన యొడి నుంచి పల్కె నిటు తద్దయుఁ బ్రీతినిఁ దాత యింటి నం
దన! విడి యెన్ని రాతిరులు దారిఁ జరించితి స్యందనమ్మునం
జన శ్రమ యెల్లఁ దీరినదె సౌఖ్యమె తాతకు మామ కచ్చటన్ 3.

తే.గీ. అయ్యుధాజిత్తు మామతో నచట నుంటి
వే సుఖముగ నెల్ల వచింపు మింపుగ ననఁ
గైక కంతయు మాతకు కమల నేత్రుఁ
డంతఁ జెప్పఁ దొడంగెను సంతస మిడ 4.

చం. కడచిన పేడు రాత్రులు సుఖమ్ముగ వీడఁగ తాత యిల్లు వా
రడరుచు నున్న వారలరె యంబకు తండ్రి యుధాజితుండునుం
గడు ధన మింక రత్నములు కాంతుఁ డొసంగెఁ బరందపుండు నే
విడిచి య వెల్ల రా వెనుక వేగమ వచ్చితి భార మౌటచే 5.

తే.గీ. రాజ వార్తాహరులు నన్ను రమ్మని త్వర
పఱుప వచ్చితి వేగమ పలుక నర్హ
వీవు నా యడిగిన వాని నెల్లఁ దీర్ప
నంచు నిట్లడుగఁ దొడఁగె నంచితముగ 6.

తే.గీ. మే లయినది పరుండుట కేల పసిఁడి
పాన్పు నీది యివ్విధము గన్పడుచు నుండె
సున్నయై యిప్పు డిక్ష్వాకు సుజను లెవ్వ
రేని కన్పడరు రహిని నేల నమ్మ 7.

చం. జనకునిఁ గాంచ వచ్చితిని క్ష్మాపతి మాత గృహమ్ము నందు ని
ల్చు ననుచు నిశ్చయించి మదిఁ జోద్యముగా నిటఁ గాన నైతినే
జనకుని పాద పద్మములు సక్కగఁ దల్చితి మ్రొక్కఁ జెప్పుమా
కన నగునే నరేంద్రుని సుఖమ్ముగఁ బెద్దమ యింట నిత్తఱిన్ 8.

చం. అన విని రాజ్య లోభమున నంతయు నేరిన కైక యే దెఱుం
గని సుతుఁ గాంచి యప్రియము కాఁగఁ బ్రియంపు విధమ్ము పల్కె నీ
జనకుఁడు పుత్ర! భూత తతి సర్వము నేఁగెడి వీటి కేఁగెఁ దే
జన ఘనుఁ డా మహాత్ముఁడు యశోనిధి యాజకు లేఁగు చోటికిన్ 9.

తే.గీ. విని విమలుఁడు కులీనుఁ డవనిఁ బడె భర
తుండు తత్క్షణ మాహా హతుండ నైతి
నని యఱచి పితృఁ శోక ఘనార్తుఁడు కర
యుగము నెత్తి మహాభుజుఁ డోర్వ లేక 10.

కం. అంత విన పితృ మరణమున్
భ్రాంతాకులిత హృదయమున భరతుండు మహా
సంతాపమ్మున నేడ్చె న 11.

నంతమ్ముగ జాలికొలుప నత్యంతముగన్

కం. సురుచిర మీ శయనమ్మును
నరపతి భాసిల్లఁ జేసె నభమును నిశలం
బరఁగుచు వర్షాంతమ్మున
హరిణాంకుండు వెలిఁగించి నట్టి విధముగన్ 12.

తే.గీ. చంద్ర హీనంపు టాకాశ సన్నిభమ్ము
శుష్క తోయ జలధి నిభ నిష్కల యయి
వెలుఁగ నేరదు శయనమ్ము వీడ నేఁడు
ధీ యుతుండు దశరథుండు ధీరవరుఁడు 13.

కం. ఘనుఁడు విజయు లందు గళ
మ్మున నిండఁగ నశ్రువు లెద మూర వెత ముఖ
మ్మును వస్త్రము చేత తుడిచి
ఘనముగ రోదించె నతఁడు కలఁత సెలంగన్ 14.

ఉ. దీనునిఁ దప్తమానసునిఁ దీవ్ర కుఠార విఘాత సాలముం
బోని సురాభ పుత్రుఁ గని భూమినిఁ గూలిన యట్టి వానినిన్
దాన జలాన్వితప్రమద దంతి శశాంక దినేశసన్నిభున్
సూనునిఁ గైక లేపి తగ శూర వరేణ్యు వచించె నివ్విధిన్ 15.

తే.గీ. లెమ్ము లెమ్ము రాజ కుమార సమ్మతుండ
వు సభ లందు నీ వంటి వాఁడు సుగుణుఁడు య
శస్వి చింతింపఁ డివ్విధిఁ జనుసె నీకు
నేలపైఁ బడి విలపింప బేల పగిది 16.

ఆ.వె. బుద్ధి నీది నడచు బుద్ధి సంపన్న! శ్రీ
లశ్రుతి వచనమ్ముల సత మనుస
రించి యీవి కిష్టి కీ వధికారివి
యర్కకాంతి వోలె యలరు దీవు 17.

కం. చిరకాలము రోదించుచు 18.

భరతుఁడు దొర్లి పుడమి పయిఁ బలికె జననితో
గిర లిట్లు మునిఁగి మిక్కిలి
పరితాపమ్మున ఘనుండు బార్థివ సుతుఁడే

ఉ. పట్టము కట్టి రామునకుఁ బార్థుఁడు యజ్ఞము సేసి యుండు నా
గట్టిగ నమ్మి వచ్చితిని క్రన్నన హర్షము నంది చూడ ని
ప్పట్టున నయ్యె భిన్నముగ బాధఁ జెలంగెను మిక్కుటమ్ముగన్
దిట్టను రాజుఁ గాంచ నిటఁ ధీనిధి నిత్య హితాభిలాషినిన్ 19.

కం. నా రాకకు మున్న జనని!
యే రోగమున మరణించె నెవ్విధి నృపుఁడే
యా రామాదులు ధన్యులె
యారయ సంస్కరణములు స్వయమ్ముగఁ జేయన్ 20.

కం. తా నెఱుఁగఁడు నా రాకను
భూనాథుఁడు కీర్తి నడరు పుణ్యాత్ముండే
మే నలర వంగి జనకుఁడు
నా నుదుటను ముద్దిడండె నాపైఁ బ్రీతిన్ 21.

తే.గీ. ఏ కరము పల్మరు తుడిచె నెలమి నన్ను
దుమ్ము తో నిండ నా మేను సమ్మదమున
నట్టి యక్లిష్ట కర్ముని హస్త మెక్క
డుండె ముట్టఁడె నను జనకుండు నేఁడు 22.

ఉ. నాకును సోదరుండు మఱి నాయన బంధువు బుద్ధిమంతుఁడున్
రాకను నాది తెల్పు రఘు రామున కే నిఁక నౌదు దాసునిన్
వీక శ్రమం బెఱుంగకయె పెన్పను లింపుగఁ జేయు వానికిం
దాఁకుదు రామ పాదములు తండ్రి యగుం దగ జ్యేష్ఠుఁ డెన్నఁగన్ 23.

ఉ. ఇంకను నేమి సెప్పె వసుధేశుఁడు ధర్మ విదుండు తండ్రి స
త్యాంకుఁడు నిత్య ధర్ముఁడు మహాత్ముఁడు సువ్రత సత్య విక్రముం
డంకపుఁ బశ్చిమమ్ము లగు నాతని పల్కుల నెల్ల నే మదిన్
బింకము నూని విందు నిట వేగమ పల్కుమ తల్లి! నా ననన్ 24.

కం. హా రామా! హా సీతా!
యౌరా లక్ష్మణ! యనుచు మహాత్ముం డేఁగెన్
వీరుఁడు దివికి నట కరుగు
వారల శ్రేష్ఠుఁ డని కైక పల్కె సుతునితో 25.

చం. చివరను బల్కె నిట్లు నృపశేఖరుఁ డంతక పాశ బద్ధుఁడై
యవనినిఁ బాశ బద్ధ చది రాభము రాముని సీత నింక నా
యవరజుఁ డైన లక్ష్మణుని నారయు వారలు, తిర్గి వచ్చినన్,
నృవరులు ధన్యు లౌదు రని నీరజ నేత్రుఁడు నీదు తండ్రియే 26.

మ. విని యా మాటలు తప్త చిత్తుఁ డయి పే వీక్షించి కైకేయిఁ దా
ననఁగా రెండవ యప్రియంపు విషయం బత్యంత దుఃఖం బిడన్
ఘన వీరుండు విషణ్ణ వక్త్రుఁ డడిగెం గౌసల్య పుత్రుండు త
మ్ముని యింకన్ సతి తోడ నెక్కడికిఁ దాఁ బోఁ జాగె ధర్మాత్ముఁడే 27.

ఆ.వె. అట్టు లడుగఁ బడి నిజాత్మజుఁడు భరతు
చేత జనని యంతఁ జెప్పఁ దొడఁగె
నప్రియమ్ము లయిన యట్టి వానిఁ బ్రియము
లగు వచనములుగఁ దలంచు చుండి 28.

తే.గీ. రాముఁడు సలక్ష్మణుండు దార సహితంబు
నేఁగె దండకా వనమున కింక నూని
చీర వాసమ్ము లన విని చింత మీఱ
భరతుఁడు నిజ వంశ ఘనత నరసి యంత 29.

చం. అడుగఁ దొడంగె శంక మది నన్న చరిత్రము నందుఁ గల్గఁగాఁ
గడఁకను విప్ర విత్తమును గైకొనెనే రఘు రాముఁ డెన్నఁడే
నడరి దరిద్రులం గడు ధనాఢ్యులఁ బాపవిహీన కోటి రా
ముఁడు మఱి కష్టపెట్టెనె యమోఘముగా నని భీతిసెల్గఁగా 30.

తే.గీ. అన్య దారలఁ దా నెన్నఁ డైనఁ గోర
లేదు గద రాజ తనయుం డనాదరమునఁ 31.

బిండ ఘాతుకు వలె నృవరుండు పంప
దండకా వనమ్ము నకుఁ గతమ్ము చెపుమ

తే.గీ. అంత నతని జనని చప లాంతరంగ
కైక పండితమానిని వీఁకఁ జెప్పఁ
దొడఁగె స్వీయ కర్మమ్మును బడతి ప్రకృతి
వఱల నలరి జరిగినది భరతుఁ డడుగ 32.

తే.గీ. రాముఁ డించు కైనను భూసుర ధన మెన్నఁ
డేనియుఁ గొనండు ధనికుల నేని లేని
వారినిఁ బవిత్రులను హింస పఱపఁ డెపుడు
కన్నుల నయినఁ గనఁ డన్య కాంతల నిఁక 33.

ఉ. రామ మహాభిషేచనము రాజు దలంపఁగ నాలకించి నే
రామ వివాసమున్ సకల రాజ్యము నీకయి రాజు వేఁడితిన్
రాముని సీత లక్ష్మణుల రాజు వనమ్మున కంపె నవ్విధిన్
నీమపు సత్య వాక్కునకు నెమ్మది నిల్చి నరాధిపుం డిలన్ 34.

ఆ.వె. హీన తనయుఁడై మహీపాలుఁడు యశస్వి
పుత్ర శోకము మది మూర మిక్కు
టముగఁ గాంచ లేక విమల నందనునిఁ బం
చత్వ మందె రాజు సత్వరముగ 35.

ఆ.వె. నీ కొఱకయి యింత నేఁ జేసితిని ధర్మ
వేత్త! గొనుమ రాజ్య విభవ మెల్ల
శోక మూన కయ్య చూడు మనామయ
రాజ్య మింకను నగరమ్ము ధృతిని 36.

తే.గీ. కావున కుమార నియమ ప్రకార మీవు
వేద విదులు వసిష్ఠాది విప్ర వరుల
చే నదీన సత్వా! యభిషిక్తుఁడ వగు
మ పుడమికిఁ గాల్యమునఁ దగ నృపతి గాను 37.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 73.

భరతుఁడు తండ్రి వృత్తాంతము సోదరుల బహిష్కరణము వినఁగా మిక్కిలి దుఃఖించి తన తల్లి కైకను బహు విధముల నిందించి రాముని తిరిగి తీసికొని వచ్చి పట్టము కట్టి తాను సేవకునిగా నుందు నని నిశ్చయించి పల్కుట.

కం. విని తండ్రి వృత్త మింకను
దన సోదరుల వెలి నట్లు తాపము మీఱన్
ఘనముగ నెదఁ గుములుచుఁ బ
ల్కెను భరతుండు జననిఁ గని గిర లిట్బంగిన్ 1.

కం. జనకుండు నింక భ్రాతయు
జనక సమానుఁడును లేని సంతప్తునికిన్
ఘన శోకోపహతున కే
లనొ యీ రాజ్యమ్ము నా కిల విచారింపన్ 2.

తే.గీ. రాజుఁ జేసి శవమ్ముగ రాముని నొన
రించి తాపసునిగ వెత మించి వెత నొ
సంగితివి గడ్డ పైనసె క్షార మద్ది
నట్లు మిక్కిలి దుర్భర మయ్యె నకట 3.

ఆ.వె. కాల రాత్రి భంగి మేలైన కులము గూ
ల్పంగ వచ్చి తీవు పార్థివేంద్రుఁ
డెఱుఁగ కిట్లు నిన్ను నెడఁద మండెడు నిప్పు
వంచుఁ బ్రీతిఁ గౌఁగిలించె నకట 4.

చం. కులమునఁ బాపదర్శిని! సుఘోరము నాశన మయ్యె, మోహమే
యలరఁగ, సౌఖ్య మెల్లను నిజాన్వయ పాంసని! తండ్రి మృత్యువే
తలకొని నిన్ను బొందఁగనె తండ్రి యశస్వియు సత్యసంధుఁడే
కలవర మందె మిక్కుటముగా మరణమ్మును బొందె నక్కటా 5.

తే.గీ. చంపి తేల నీ ధర్మ వత్సలుని నాదు
తండ్రిని ధరాధినాథుని ధర్మ రతుఁడు
రాము నేల పంపితి మహారణ్యమునకు
నిర్దయ బహిష్కరించితి నీతి వీడి 6.

ఆ.వె. పుత్ర శోక మెడఁద మూరఁ గౌసల్యా సు
మిత్ర లకట నిలిచి యాత్ర మడర
నెట్లు నిన్ను జేరి యింక జీవింతురు
దుష్కరమ్ము సుమ్ము దుఃఖముననను 7.

ఉ. రాముఁడు ధర్మ చిత్తుఁ డనురక్తిని నిత్యము గౌరవించుగా
నీ మహి స్వీయ మాత వలె నింపుగ నిన్నును బెద్ద లెల్లరం
బ్రేమగఁ జెల్లి వోలెఁ గను బెద్దమ నిన్ను దలంచి ధర్మమున్
నీమపు దీర్ఘదర్శిని యనింద్య గుణాన్విత రామమాతయే 8.

తే.గీ. అట్టి కౌసల్య నందను నడవి కంపఁ
జీర వల్కలముల నిచ్చి ఘోరముగను
బాప మానస! శోకమ్ము వడయ వేమి
సుంత యేని చిత్తమ్మున వింతగాను 9.

ఆ.వె. పాప మెఱుఁగ నట్టి వాని శూరుని నియ
తాత్ముఁ గీర్తిమంతు నాతని వెలి
వేసి చీర వసను నా సచ్చరితుని హిం
సింపఁ గారణమ్ము సెప్పఁ గలవె 10.

ఆ.వె. రాముని పయి నాదు రక్తి నెఱుంగక
యాశ తోడ రాజ్య మంద నిట్లు
ఘోరమైన తప్పు వారక చేసితి 11.

కీడు కలిగె నకట నేఁడు నాకు

మ. పురుషవ్యాఘ్రులు రామలక్ష్మణుల నంభోజాక్షులం జూడ కె
వ్వరి శక్తిం బరికించి రాజ్యమును నేఁ బాలింప నుత్సాహమున్
ధరఁ జూపింతును రాము నంద సతమున్ ధాత్రీశుఁ డాశించునే
వరమౌ రక్షను మేరు మేరువనమే పాలించు చందమ్మునన్ 12.

ఆ.వె. పెద్ద దైన యట్టి యెద్దు మోయు బరువు
కోడె యెట్లు మోయుఁ గాఁడిఁ గూర్చ
నవ్విధముగ నిట్టి యవనీ భరమ్మును
నేను మోయ నిపుడు నేర్తు నెట్లు 13.

తే.గీ. లేనిచో నుపాయమ్ముల మేని బలము
న నయినను మోయఁ గల్గిన వినుమ నిన్ను
దనయు పై నాశ కల్గిన దాని కోర్కి
తీరి నట్టి దానిగఁ జేయ నేర నెపుడు 14.

తే.గీ. సంతతము నిన్ను రాముఁడె యంతరంగ
మున జనని భంగిఁ దలఁపక చనిన సుంత
యేని నేను నిన్ను విడువ నెడఁద సంది
యమ్ము నుంచ నఘచరిత్ర! యంట పైన 15.

ఆ.వె. కలిగె నెట్టు లిట్టి కలుషంపు బుద్ధి పా
పాత్మురాల! నీకు భ్రష్ట సాధు
చరిత! మనకుఁ  బూర్వ జను లెల్ల నిందించు
నట్టి భంగి నకట బెట్టిదముగ 16.

చం. మన కుల మందుఁ బూర్వులు గుమారుల జ్యేష్ఠుని భావి రాజుగా
నొనరిచి సంతసింతురు సహోదరు లన్యులు కొల్తు రాతనిం
గన వది రాజధర్మమును గట్ట నృశంస! యెఱుంగఁ జాలవే
యనుగుణ రాజ వృత్తము మహాంచిత శాశ్వత సంప్రదాయమున్ 17.

తే.గీ. రాజ్యమం దభిషిక్తుఁడౌ రాజ సంప్ర 18.

దాయమున జ్యేష్ఠ పుత్రుఁడు ధరణి రాజు
లెల్లర కిది సమంబుగ నుల్లసిల్లుఁ
దథ్య మిక్ష్వాకు వంశ నందనుల కెల్ల

తే.గీ. అట్టి ధర్మ రక్షకులకు నాత్మ కుల చ
రిత్ర వర్ధకులకును జారిత్ర్య దర్ప
మిపుడు నాశ మయ్యెను నిన్ను నివ్విధమ్ము
వడసి నంత సమూలము పాపచరిత! 19.

కం. సుమహా భాగులు నీ వం
శ మనుజ నాథులు దలంప సచ్చారిత్రుల్
కుమతి! జనించె నెటుల ని
ట్టి మోహ మక్కట నెడంద రీవియె తఱుఁగన్ 20.

కం. నీ కోరిక నెఱవేర్పను
దాఁకె వ్యసన మిట్లు నాకు దారుణ మగుచున్
నీ కతనను జీవితమే
నా కిఁక కఱవౌ పగిది ననాదర రీతిన్ 21.

ఆ.వె. ఇప్పుడ చని నేను దప్పక స్వజన ప్రి
యు ననఘు నిజ సోద రోత్తము రఘు
రాముని వని నుండి రక్తినిఁ దెత్తు నీ
కప్రియ మగు నట్లు క్షిప్రముగను 22.

కం. మరలం జేసి యడవి నుం
డి రాముని మహాత్ము నే వడి సుదీప్తాంగుం
బరగెఁద దాసునిగ స్వయము
స్థిరముగ నిల్పి నతని మది దీనావనునిన్ 23.

కం. పలికి యిట్లు మహాత్ముఁడు భరతుఁ డింక
నప్రియంపు వాక్య తతుల నామెఁ దూఱి
కరము శోకతప్తుఁ డఱచెఁ గందరమ్ము
నందు గర్జించు మృగరాజు చంద మంత 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది మూడవ  సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 74.

భరతుఁ డింకను దుఃఖముతోఁ బరిపరి విధములఁ దన తల్లి కైకను నిందించి రాముని వనము నుండి తీసికొని వచ్చి రాజుగఁ జేయ సంకల్పించితి నని చెప్పుట.

కం. జననిని నిందించి యటులఁ
దనయుం డబ్బరతుఁ డలుక తద్దయు మీఱన్
మన మెఱియంగ భృశము ప
ల్కెను దిర్గి వచనములను సఖేదము లిట్లున్ 1.

తే.గీ. దుష్ట చారిణి! కైకేయి! భ్రష్టు రాల
వగుదు గాక రాజ్యము నుండి వదల ధర్మ
గతిని నీవు శోకింతువు కరము నేను
మృతుఁడఁ గాఁగ నృశంస! త్వరితముగ నిఁక 2.

కం. ఇరువురకు సమానమ్ముగఁ
బరఁగెను నీ చే మరణ వివాసమ్ములహో
నరపతి రాముఁడు సేసిరి
వర ధార్మికు లేమి కీడు వసుధను నీకున్ 3.

ఆ.వె. ఈ కులంపు నాశ మివ్విధిఁ గలుగంగ
భ్రూణ హనన పాపము తలకొనెను
నీకుఁ బొమ్ము నీవు నిరయమ్మునకు భర్తృ
సుగతి కేఁగ రాదు సుమ్ము నీకు 4.

చం. తనరిచి ఘోర కృత్యమును దద్దయుఁ బాపము కూడఁ బెట్టితే
జనులకు నెల్లఁ బ్రీతుఁ డగు సద్గుణు వీడితి కూర్ప నాకు భీ
తిని ధర నీదు చేష్టలను ధీనిధి భూపతి వొందె మృత్యువున్
వనమున కేఁగె రాముఁ డప వాదము నాకు నొసంగి తీ విటుల్ 5.

మ. అరి వీ వైతివి మాతృ రూపమున రాజ్యాకాంక్షిణీ! దుష్ట! నీ
పురుషుం జంపిన దాన! నిన్నరసి నేఁ బొమ్మింక మాటాడ న
క్షర మొక్కండును దప్త లైరి వెతఁ గౌసల్యా సుమిత్రా సతుల్
కరముం బొందఁగ నిన్ను స్వీయ కుల సంఘాతంబుఁ గావింపఁగా 6.

చం. కన వర ధార్మి కాశ్వపతి కన్యవు కావు జనించి తక్కుల
మ్మునఁ గడు చెడ్డ రక్కసిగ ముంచితి వా కుల మెల్ల నివ్విధిన్
ఘన నియముండు రాము నటఁ గానకు నంపితి సత్య వాక్కునిం
దనయుని గాంచ లేక వెతఁ దండ్రి దివమ్మున కేఁగఁ జేసితే 7.

ఆ.వె. వఱలి చేయ నీవు పాప మయ్యది నన్ను
జనక హీనుఁ జేసెఁ జాల కింక
భ్రాతలకును దూర మైతిని లోకుల
కప్రియుండ నైతి నత్యధికము 8.

తే.గీ. చేసి కౌసల్య నివ్విధి శీలవతిని
ధర్మ సంయుక్త సుత వియుక్తగను బాప
నిశ్చయ! నరక మేఁగక నీవు చనుదు
వింక నెట్టి లోకములకు నెంచి చూడ 9.

ఆ.వె. ఎఱుఁగ వేల క్రూర! యితనిఁ గౌసల్య నం
దనుని బంధు శరణుఁ దండ్రి భంగి
నాకు జేష్ఠ సుతుని నయవిశారదుని జి
తేంద్రియు రఘు వంశ చంద్రు నకట 10.

ఆ.వె. ఆత్మజుండు పుట్ట నంగాంగముల నెద
నుండి ప్రియతముండు మెండు గాను
దల్లి కెంచ సతము తక్కిన బంధులు 11.

ప్రియులు సుమ్ము నిజ మరయఁగ నెపుడు

మ. ఒక నాఁ డారసెఁ గామధేను విల దేవౌఘార్చ్య ధర్మజ్ఞయే
వికలాంగమ్ముల మోయుచుండ బరువున్ వీతస్పృహుల్ పుత్రులం
జకి తద్వంద్వము భార తప్తము మనస్తాపంబు సంధిల్లగా
నొక ఘస్రార్థము డయ్య నేడ్చెఁ గడు భాష్పోదమ్ము దా రాల్చుచున్ 12.

చం. దిగువఁ జరించు చుండ నట దేవగణాధిపు గాత్రమందు వె
చ్చగ సుమగంధ భాష్పకణజాలము రాలఁగ మించి శక్రుఁ డం
తఁ గని తలంచె నిట్టు లవి తప్పక కామదు ఘాశ్రులం చెదం
దగ వెదకంగ నభ్రమునఁ దాఁ గనె దీనను గామధేనువున్ 13.

తే.గీ. కని భృశంపు దుఃఖితను గగనము నందు
నున్న దానిని నేడ్చుచు నున్న దాని
సంభ్రమించి యశస్విని శక్రుఁ డంజ
లించి సురభితో నిట్లు వచించె నంత 14.

చం. హితమును గోరు దెల్లరకు నెట్టి భయం బిట మాకు కల్గెనే
వెత మదిఁ బొంద నేల నిట వీడి భయమ్ము వచింపుమా యనన్
నుత సుర నాథుఁ గాంచి మది నొవ్వ నెలంగఁ గరమ్ము గోవు ధీ
రత వచియించె నివ్విధము రమ్యపుఁ బల్కులు వాక్య నైపుణిన్ 15.

తే.గీ. పాపము శమించు గాక యే వలను గొంచె
మైన మీకు నాపద లేదు నేన మునిఁగి
దుఃఖమున విచారింతు నా దూడ లుండ
విషమపుఁ బరిస్థితుల నిప్డు వితతముగను 16.

తే.గీ. ఎండ మ్రగ్గు చుండి కృశించి యీ బలతర
ధుర్య యుగ్మము పీడింపఁ దోరముగఁ గృ
షీవలుఁడు దీనముగ నుండ నేద మీఱఁ
దప్త నైతి పుత్ర సముల ధరను గనము 17.

ఉ. వేయికిఁ బైన నందనులు ప్రీతిఁ జెలంగ జగమ్ము నందుఁ దా 18.

నీ యుభ యాత్మ సంభవుల నివ్విధిఁ గాంచి విచార మందెనే
యీ యమ రార్జునీ వర మహీన యశస్విని గాంచి నంతసే
యీ యవనిం గుమారులకు సెక్కుడు లేరని యెంచె శక్రుఁడే

ఉ. మంచిని మించి వర్తిలెడి మాన్య జగమ్ము భరించు కాంక్షతో
సంచిత సంప దత్యధిక సద్గుణయున్ నిజ భావ చేష్టయున్
మించ సహస్ర నందనలు సెమ్మది వీడి విచార మందఁగాఁ
గాంచఁగ రామ మాత సుతు కానన వాసము సైప నోపునే 19.

తే.గీ. ఒక్క బిడ్డఁడు కల్గిన నుత్తమ సతి
నకట కౌసల్య నొనరించి తదయఁ బుత్ర
హీనగ నిటులఁ గావున నిహమునఁ బర
మందు నిత్యము దుఃఖమ్ము నందఁ గలవు 20.

ఉ. నే నిఁకఁ దండ్రి కన్నకును సెమ్మదిఁ గూర్చెద గౌరవమ్మునున్
మానుగ కీర్తి వర్ధిల సమంచిత రీతి నొనర్తు సందియం
బేని యొకింత యిందుఁ గన సెట్టియు రాముఁడు రాక యున్నచో
నేన వసింతు నా వని మునివ్రజ సేవిత మందు నిత్యమున్ 21.

కం. భరియింపఁ జాల నీ పని
దురిత వినోద! యఘు మిద్ది దుర్భరము సుమీ
పురజను లశ్రుకణ గళులు
నిరీక్షణము సేయు చుండ నే సెట్బంగిన్ 22.

ఆ.వె. అట్టి నీవు నింక నగ్ని దూకుమ లేక
దండ కాటవికిఁ గదలుమ లేక
పాశ బంధనమున వదలు మసువు లన్య
మార్గ మెద్ది లేదు మనఁగ నీకు 23.

తే.గీ. అతుల సత్య పరాక్రముఁ డంద రాజ్య
మింక వచ్చి వనము నుండి యంకము లవి
యెల్లఁ దొలఁగ వెడలఁ గొట్ట నేర్పడినవి
నే నగుదు కృతకృత్యుఁడ నెమ్మి దనర 24.

కం. అని యిట్టు లరణ్యమ్మున
ఘనాంకుశ విఘాత మత్త గజరాజు వలెం
గనలుచును గూలెఁ బన్నగ
పు నిభమ్ముగ నిశ్వసించి భూమి పయి వడిన్ 25.

కం. కను లెత్తిన కాఁగ నిజ వ
సనములు నలఁగ నగ లెల్ల సడలి చెదరఁగా
జనపాల సుతుఁడు కూలఁగఁ
గనిపించెను బండుగ తుది ఖదిరు సిడ మనన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది నాల్గవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 75.

భరతుఁడు కౌసల్యను గాంచ నామె నిందింపఁగఁ దనను జరిగినవి యేమియుఁ దనకుఁ దెలియ వని తన్ను దాను శపించు కొనుచుఁ బలుకఁగఁ గౌసల్య యాతనిని విశ్వసించుట.

తే.గీ. లేచి చిరకాలమున కంత లెస్స సంజ్ఞ
నంది వీరుఁడు కడుదీన నశ్రు పూరి
తను జనని నమాత్యుల మధ్యఁ గని భరతుఁడు
దూఱె మిక్కుటముగ నెద దుఃఖ మడర 1.

శా. ఎన్నం డేనియుఁ గోర రాజ్యమును జింతింపంగ నా దల్లితో
నన్నా నేరను భూమినాథు నభిషే కాకాంక్ష నే నేరనే
చెన్నారంగ సుదూర దేశమున సక్షేమమ్ము శత్రుఘ్నుతో
నున్నన్ నేరఁగ సంభవం బగునె యయ్యో దారుణం బెవ్విధిన్ 2.

తే.గీ. రాముని వనవాస మెఱుంగ నా మహాత్ము
నిది సుమిత్రా తనయు ఘనుని మఱి జాన
కీ సతి వివాసము నెఱుంగఁ గేలి లీల
నెట్లు జరిగెనొ మది కొంచె మేని నిజము 3.

కం. విని యా మాటలు భరతుం
డనఁ గౌసల్య ధ్వని నెఱిఁగి యంత సుమిత్రం
గని గుర్తించి భరతునిగ
ఘన తప్తునిఁ బల్కె నిట్లు కాఱియ తోడన్ 4.

ఆ.వె. కైక క్రూర తరపుఁ గర్మము చేతను
వచ్చెను భరతుండు పరమ దీర్ఘ
దర్శనుండు నిటకు దర్శింప నాతని
నిచ్చ గింతు నింక నిపుడు నేను 5.

చం. పలికి సుమిత్ర తో నిటుల భామ కృశాంగి రజో దుకూల యా
కలఁగిన రామ మాత సుతుఁ గానఁగఁ జాగుచు నుండ నంతలో
నల తన దమ్మునిం గలసి యా భరతుం డరుదెంచెఁ గాంచఁగాఁ
గలవర మందు పెద్దమను గ్రన్నన వీటికి సంభ్రమమ్మునన్ 6.

తే.గీ. అంత భరత శత్రుఘ్నులు చెంత కేఁగి
కాంచి కౌసల్య నతి తప్తకాంత నణఁగి
నట్టి చేతన నేడ్చెడు నట్టి దానిఁ
గౌఁగిలించిరి యడర దుఃఖమ్ము భృశము 7.

మ. కని కౌసల్య వచించె నా సుతునితోఁ గాఠిన్య వాక్యమ్ములన్
ఘన రాజ్యం బిది గాంచు మో భరత నీ కామ్యంబు ప్రాప్తం బిఁకం
దనరం గంటక హీన రీతి రతినిన్ దత్తంబు కైకేయిచే
నొనరింపంగ సుఘోర కర్మమును దా నుత్సాహ మేపారఁగన్ 8.

తే.గీ. నార చీరల తోడ వనమున కంపి
నాదు తనయు రామునిఁ గైక యేది క్రూర
దర్శిని యకట సాధించెఁ దఱలుప నను 9.

సుతు హిరణ్య నాభు దరికి హితము సతికి

చం. చనుదు సుమిత్రఁ గూడి తగ జ్వాలిని గైకొని రాముఁ డున్న చో
టున కిఁక లేనిచో రహిఁ బటుత్వము నూని సుఖమ్ముగాను లే
క నను స్వయమ్ము నీవ కొని క్రన్నన దింపుమ మానవర్షభుం
డ నియతిఁ గానలోఁ దపము నంచిత భక్తి నొనర్చు చోటినిన్ 10.

చం. అతులిత విత్త ధాన్య యుత హస్తి రథాశ్వ విరాజితమ్ము నౌ
వితత వరాగ్ర రాజ్య మిది విస్తృతముం గొను మాత యీయఁగా
సతి పలుకంగ నిట్లు పరుషమ్ముగఁ బుండును గ్రుచ్చ సూదిచే
నతులము బాధ కల్గు విధి నా భరతుండు భృశమ్ము నొవ్వుచున్ 11.

తే.గీ. మోహము కలుగ సంభ్రమమున వడిఁ బడె
సంజ్ఞ వీడి కౌసల్య సచ్చరణ పద్మ
ముల పయిన నంత భరతుండు పొంది తెలివి
కొంత తడవునకు నిలిచి వంత తోడ 12.

కం. విలపించెడి కౌసల్యను
గలఁత సెలఁగ నంజలించి కని శోకమునం
బలుకుల నివ్విధి భరతుఁడు
పలికెను బదులుగ ఘనుండు పార్థివ సుతుఁడే 13.

ఆ.వె. అంబ యెఱుఁగ కుండ నక్కట నిందింతు
వేల తప్పులేమి నింత యేని
నా వలనను నా ఘనంపు రాముని పయిఁ
బ్రీతి నెఱుఁగు దీవు విపుల మడర 14.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
సత్య సంధు బుధశ్రేష్ఠు నిత్య ముండ
వాఁడు పొందఁగఁ జాలఁడు పరమ శాస్త్ర
ముల ననుసరించు నట్టిదౌ బుద్ధి సెపుడు 15.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి 16.

వాఁ డగును భువి భృత్యుఁడు పాపులకును
విడుచు వాఁడు మూత్రమ్ము రవి కెదురుగను
దన్ను వాఁడు గోవుఁ బరుండఁ దన పదమున

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వానికిఁ గలుగు యజమాని సేవ
కునకుఁ గష్ట మైన పనినిఁ జేయించి ధ
న మిడ కున్న నగు నఘము సెలంగి 17.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వానికి నిజ సుతుల భంగి పాల
నమ్ము సేయు పుడమి నాథుని నిందింపఁ
గలుగు పాప మెల్లఁ గలుగు సుమ్ము 18.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాని కాఱవ దగు భాగము గొని
రాజు పౌరజనుల రక్షింపకున్నఁ బ
డయు నఘం బడరి తడయక కల్గు 19.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వానికి మునుల కిష్టుల వచన మొసఁగి
దక్షిణల నిత్తు నంచును దదుపరి నవి
యీయ కున్నఁ గలుగు పాప మెల్లఁ గల్గు 20.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వానికి సమరమున వాజు లరద
ములు గజములు శస్త్రములు నుండ నని సేయ
కున్నఁ గల్గు పాప ముదిత మగును 21.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వానికి దురిత స్వబావున కతి
సూక్ష్మ ధర్మములను సు గురువు లుడివినఁ
దివిరి శూన్యము లగుఁ దెల్లముగను 22.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు చూడఁ దగఁడు వ్యూఢ బాహు వక్షుఁ
జంద్ర భాస్కర సన్నిభ చారు తేజు
స్స్వీయ రాజ్యస్థు రామునిఁ జేర లేఁడు 23.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు పులగమ్ము ఛాగము పాయ సాన్న
మెల్ల రిత్త తిను నఘము నింకను గురు
దూష ణాఘము వొందును దోరముగను 24.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు స్పృశియింప గోవును బాద మెత్తి
గురువుల నవమాన పఱప ఘోరముగను
సఖుల వంచింప నగు కలుషమ్ము లొందు 25.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు దుష్టుఁడు నమ్మిక తోడ నుడువ
మంతనపు నింద గూడిన మాట లెల్ల
నుగ్గడింపఁ గల్గు నఘము నొందు భృశము 26.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁ డనుపకారి దయ లేని వాఁడు నీఁకఁ గృ
తఘ్నుఁడు నిరంతర నిరపత్రపుఁడు నింక
నగును ద్వేషింప నర్హుండు ననవరతము 27.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు పుత్ర దార బంధు భృత్య
సహిత ముండ నొకఁ డశనము కుడువ నింటఁ
బొందు పాప మెల్లఁ బొందఁ గలఁడు 28.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు సదృశ దారఁ బడయ కుండఁ 29.

బుత్ర హీనుఁ డయి సముచిత ధర్మక్రియా
హీనుఁ డగుచుఁ దుది నశించుఁ గాక

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు పూర్ణంపు టాయువుఁ బడయకుండ
సంతు నిజదార యం దెద వంత మీఱఁ
జూడ కుండు నెన్నండును శోక మడర 30.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు స్త్రీజన భూనాథ బాలవృద్ధ
హనన పాపము నిజ భృత్య జనుల విడిచి
నట్టి పాపమ్ము ఘోరము నందుఁ గాక 31.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు పుత్ర దార భటుల నెల్లఁ
బెంచ నమ్మి లక్క మించి విషము మాంస
లోహ సురల నగు కలుషముఁ బొందు 32.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు శత్రు భయంకర భండనమునఁ
బోరు వర్ధిల్లఁ బాఱిన మూరి చంపఁ
బడిన వాని కగు నఘము వడయఁ గలఁడు 33.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు సంచరించుఁ బాణిఁ గుండ
పెంకు నూని సతము భిక్ష మెత్తుచుఁ జుట్టి
చీర పిచ్చివాని తీరు పుడమి 34.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు తరుణీ మధువు లింకఁ బాచికలకు
దాసుఁ డౌను గామక్రోధ తత్పరుఁ డగు
సంతతము మిక్కుటమ్ముగ సత్యముగను 35.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాని చిత్తము నిలువ దరయంగ
ధర్మ మందు సత మధర్మము సేవించు
నిడు నపాత్ర దాన మడరి యెపుడు 36.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాని సంచితంపు వసు సహస్ర
మెల్ల బరుల చేతఁ గొల్లకొట్టఁబడును
గాక తల్లడిల్లఁ గరము వాఁడు 37.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు వొందు నట్టి పాప ముభయ
సంధ్య లందు నిదుర సలుప కలుగు నెట్టి
పాప మెల్లర కిల వార కుండ 38.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁ డిలులఁ గాల్పఁ గల్గెడు పాప మింక
నాక్రమింపఁగ గురుశయ్య నడరు నఘము
మిత్ర ద్రోహంపుఁ బాపమ్ము మించి పొందు 39.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు దేవతలకు భక్తిఁ బితరు
లకును దల్లిదండ్రులకును సేవ లొనరిం
పమినిఁ గల్గు నఘము వడయఁ గలఁడు 40.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు క్షిప్ర మిపుడ భ్రష్టుఁ డగును
బుధ జగముల నుండి భూరి యశము నుండి
తగిన పనుల నుండి తథ్యముగను 41.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
దీర్ఘ బాహు విశా లోరు దివ్య పురుషు
వాఁడు మాతృ శుశ్రూషను వదలి వ్యర్థ 42.

ముగ నిలుచు సంతతమ్ము నీ భూమి యందు

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁ డగును గాక జ్వర రోగ పీడితుండు
బహు సుతుఁడు దరిద్రుఁడు నిత్య బాధితుండు
ఘోరతరముగ నిశ్శంకఁ గుత్సితుండు 43.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు సేయు నాశల నెల్ల వ్యర్థములుగ
నర్థి జనుల దీనుల రక్ష నరసి పైకి
జూచు వారివి జాలినిఁ జూప కుండ 44.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు మాయ యందుఁ బరగు వాఁడు
పరుషుఁ డశుచి దుష్ట పురుషుఁడు కొండెకాఁ
డడలు దొర కధర్మ మడరి చేయు 45.

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు స్వీయ ఋతుస్నాత భార్య సాధ్వి
కీయ కుండ నానందము వాయు దుష్టుఁ
డొందు నట్టి పాపమ్మును బొందఁ గలఁడు 46.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు తనదు సతిని వీడి యన్య
దారఁ గోరు నట్టి ధర్మహీనుఁడు మూఢుఁ
డొందు నట్టి పాప మొందఁ గలఁడు 47.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు సుతులు లేని బ్రాహ్మణుండు
చేసి నట్టి దుష్ట చేష్టితంపు టఘము
వొందు లేదు శంక యిందుఁ గాంచ 48.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి 49.

వాఁడు నీటి సెల్లఁ బాడుచేయ
నింక ఘోర విషము నీయ నొకఁడు పొందు
నట్టి యఘము నొందు దట్టముగను

తే.గీ. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు పూజ సేయఁ దొఁడఁగ బ్రాహ్మణునకుఁ
దొలఁగఁ జేయ నింకను జిన్ని దూడ యున్న
యావుఁ బితుక నగు నఘము లరయఁ గలఁడు 50.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు దప్పిగొనిన వాని కీయ
నీరు నాపఁ గల్గు ఘోర పాపమ్మును
బొందఁ గలఁడు వలదు సందియమ్ము 51.

ఆ.వె. ఎవ్వఁ డనిపె నార్యు నిటుల నియ్యడవికి
వాఁడు కలుగ భక్తి వాద మిరువు
ర కొక వైపు తాను రక్తి నుంచి పలుకు
వాని యఘము సెల్లఁ బడయఁ గలఁడు 52.

చం. తనయుఁడు భర్త లేని దగు తల్లిని జూచుచు రాజ నందనుం
డని యటు లూఅడించి తగ నార్తినిఁ గూలెను బాద యుగ్మమం
ద నయ విశారదుండు ఘనుఁ డా భరతుండు సుత బ్రతిజ్ఞలన్
విని కని శోక తప్త సుతుఁ బ్రీతిలి తల్లి వచించె నివ్విధిన్ 53.

చం. శపథము లెల్ల నే వినఁగ సత్సుత దుఃఖము మీఱె నింక నా
కిపు డసువుల్ చలించినవి యింపుగ ధర్మపథమ్ము వీడ వీ
వపరిమి తార్తి కాలమున నారయ లక్ష్మణుఁ గూడి కాంచు దీ
వు పరమ పుణ్య లోకములు పుత్రక! సత్యతమ ప్రతిజ్ఞుఁడా! 54.

చం. భరతుని భాతృవత్సలునిఁ బల్కుచు నివ్విధిఁ గౌఁగిలించి ని
ల్పి రహిని నంక మందుఁ గడు పేదనతో విలపించె మాతయే
భరతుఁడు గూడ దుఃఖమున బాధ సెలంగఁగ మిక్కుటమ్ముగం
గరము చలించె మోహమునఁ గన్నుల నశ్రులు పొంగుచుండఁగన్ 55.

కం. విలపించు చుండ మతి సెడి
కలవర మందఁగ నిజాత్మ కరమున్ భరతుం
డిల నిట్టూర్పఁగ పెచ్చగ
నల శోకమ్మునఁ గడచిన దా నిసి యంతన్ 56.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది యేనవ సర్గము.

# అయోధ్యా కాండము

# సర్గము 76.

వసిష్ఠ మహర్షి యాదేశమున భరతుఁడు తండ్రికి సరయూ నదీ తీరమున నంత్య క్రియ లొనరించి యయోధ్యకుఁ దిరిగి వచ్చుట.

కం. ఇవ్విధి శోకించు భరతు
నవ్వర గుణు కైక సుతుని నరసి వసిష్ఠుం
డవ్వాక్య విశారదుఁ డనె
నివ్విధముగ వాక్యములు మునీంద్రుం డంతన్ 1.

ఆ.వె. వనట యింకఁ జాలు భద్ర మగును రాజ
సుత! యశస్వి! నీకుఁ జూడు కాల
మిది నృపునకుఁ జేయ నింక సంయానము
శాస్త్ర రీతి నిపుడు చనుము సేయ 2.

తే.గీ. ఆలకించి వసిష్ఠుని మే లగు వచ
నమ్ములను భరతుం డంత నరవిభునకుఁ
బ్రేత కార్యము లొనరింప వేగముగను
దొడఁగె నెల్ల ధర్మయుతము కడు వగచుచు 3.

ఉ. తైలపుఁ బెట్టె నుండి తగఁ దండ్రినిఁ బచ్చని మోము వానినిన్
నేలను శయ్య పై నునిచి నిద్రిలు భంగిని నున్నవానినిన్
మేలుగ దివ్య రత్నములు మించి వెలుంగఁగ భూమి నాథునిం
జాల చెలంగ దుఃఖ మెద క్షత్రియుఁ డేడ్చెను గైక పుత్రుఁడే 4.

తే.గీ. రాజ! నే నుండ వెలుపల రాక మున్న
నే నిటకు నేమి రాముని నిత్య ధర్మ
విదుని లక్ష్మణు భ్రాతను వీర్యవంతు
ని నకట బహిష్కరించితి నిశ్చయించి 5.

తే.గీ. రాము నల పెఱుఁగక పనుల నొనరించు
వానిఁ బురుష శార్దూలు వివాసితునిగఁ
జేయ దుఃఖించు జనులను శీఘ్ర గతిని
వీడి యెట కేఁగితి నృపేంద్ర వీత దయను 6.

తే.గీ. ఎవ్వ రరయఁ జాలుదు రిప్పు డీ పురంపు
యోగములను క్షేమమ్ముల నేఁగ రాముఁ
డడవికి మఱి దివమ్మున కరుగ మాన
వేంద్ర! నీ విప్విధమ్ముగ నింకఁ జెపుమ 7.

కం. నిను వీడి పుడమి నేఁ డ
య్యెను విధవగ భూమి నాథ! యిప్పుడు వీక్షిం
ప నిది శశి విహీనంపు ర
జని వోలె నగపడు చుండె ఛవి హీనంబై 8.

కం. దీనమ్ముగ నిబ్బంగిని
నా నర వృషభుండు భరతుఁ డప్పుడు వనరం
దా నరసి వసిష్ఠుఁడు ఘన
మౌనీంద్రుఁడు తిరిగి యనెఁ గుమారుని తోడన్ 9.

తే.గీ. నృపతి ప్రేత కార్యములు సలుప వలయును
దీర్ఘ బాహు! శ్రద్ధ వహించి స్తిమితముగ వి
చార మెల్ల వీడి యనంగ సవినయమ్ము 10.

నట్ల యంచును బూజించి యా మునివరు

ఆ.వె. భరతుఁ డంతఁ దివిరి త్వరపఱచెఁ బురోహి
తులను మఱియు యాజకులను నొజ్జ
లను నరేంద్రు పనుల నొనరింప నింకఁ దొ
డఁగుఁ డని వినయం బడర వచించె 11.

తే.గీ. రాజ హోమశా లాగ్నిని నోజఁ దెచ్చి
యాజకులును ఋత్విక్కులు నంత నగ్ని
నుంచిరి విధివంతమ్ముగ నంచితముగ
వేద పారగు లెల్లరు వేగముగను 12.

ఆ.వె. భటులు భాష్ప గళులు వనరుచు విగత జీ
వుని నృపతిని నంత ఘనపు శిబిక
యందు నుంచి తరలి రపుడు వికల మన
స్కులయి మోయు చుండి శోక మడర 13.

ఆ.వె. చల్లిరి జను లంతఁ జనుచు మార్గమ్మున
మంచి రంగు పసిడి నంచితములు
వస్త్ర రాజములను బార్థుని ముందుగ
నడచుచు వివిధములఁ గడు వగచుచు 14.

చం. సరలము దేవదారువులు చక్కని పద్మక సాల రాజముల్
గురుతర చంద నాగరులు క్షోణిజ సారము లుత్తమమ్ములం
బరిమళ వృక్షరాజముల త్వక్కులు దెచ్చి యిడంగ భూవరున్
గురువులు నింక ఋత్విజులు కూర్చిరి యా చితి మధ్య శ్రద్ధతో 15.

తే.గీ. అంత ఋత్విజు లంటించి యగ్ని శాస్త్ర
ముల ననుసరించి తగు జపము లొనరించి
సామ వేద గానమ్ముల నేమముగను
గాన మొనరించి రప్పుడు ఆని కొఱకు 16.

కం. నరవరు కాంతలు నన్యులు 17.

నరుదెంచి రచటకు వారి కర్దము లగు న
ట్టి రథాది వాహనమ్ముల
గురుజన పరివృత లగుచును గుములుచు నంతన్

ఆ.వె. అప్రదక్షిణమ్ము క్షిప్రము సేసిరి
చితిని నున్న యా నృపతికి ఋత్వి
జులును భూవ రాంగన లగు కౌసల్యాదు
లెల్ల శోక తప్త లెల్ల నంత 18.

తే.గీ. క్రౌంచ పక్షుల భంగిని రామ లెల్ల
నేడ్వ వినిపించె శబ్దము లెల్ల నపుడు
కరుణ తోడ భృశార్తలు కాంత లెల్ల
వేల సంఖ్యల నచ్చట నోలి తూలి 19.

ఆ.వె. వివశలై కడింది విలపింప మఱల మ
ఱల నబలల నెల్ల కలవర పడు
చుండఁ జేర్చి రంత శోక తప్తల సర
యూ నదీ తటికిని యానములను 20.

తే.గీ. తర్పణము లిచ్చి యెల్లరు తనయుఁ డా భ
రతునిఁ గూడి యమాత్యులు రాజ సతులు
నా పురోహితులు నయోధ్య కరిగి కడపి
రి వెత నేల పయిఁ బరుండి దివములు పది 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది యాఱవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 77.

భరతుఁడు పదవ దినము గడవ శుచియై పండ్రెండవ దినమున జనకుని శ్రాద్ధ కర్మములను జరిపించి పదమూడవ దినమున నస్తికలను గ్రహించుటకు శ్మశానమున కరిగి దుఃఖము మీఱ మోహముతో భరత శత్రుఘ్నులు నేలపైఁ గూల వసిష్ఠ సుమం త్రాదులు వారిని లేవఁ దీసి యోదార్చి కార్యక్రమమును బూర్తి చేయమని పల్కుట.

కం. అంతఁ గడవఁ బదవ దినము
వంత యెడందఁ జెలఁగంగ భరతుఁడు శుచియై
సొంతము ద్వాదశ దివసపుఁ
దంతును జరిపించె శ్రద్ధ ధరణిపు సుతుఁడే 1.

ఉ. దానము లిచ్చె విప్రులకుఁ దద్ద ధనమ్ము్మను రత్న రాసులన్
మే నల రంగ మిక్కుటము మేలిమి వస్త్రము లింక నన్నముల్
యానము లింక దాసులను నావుల మేకల వంద వందలం
గానఁగ నౌర్ధ్వదేహిక నికాయము రాజ సుతుండు భక్తిమై 2.

చం. అరిగి చితా ప్రదేశమున కా పదుమూడవదౌ దినమ్ము్మనన్
భరతుఁడు తమ్ముఁ గూడి ఘనబాహువు పే యుదయమ్ము్మనం జి తా
కరమున శోధ నార్థ మయి కంఠము శబ్ద విహీనమై చెలం
గ రవి కులోద్భవుండు కడు కాఱియ నేడ్చి వచించె నంతటన్ 3.

తే.గీ. తండ్రి నన్ను నీ వెవ్వరి దండ నుంచి
తట్టి రఘురాము నంపితి వడవి కిట్లు
విడువఁ బడితి శూన్యమ్ము్మన విగత దయను
నేఁడు నేను నీ చేతను నృపవరేణ్య! 4.

కం. జనని కనాథకు దిక్కయి
న నందనుఁడు రాముఁ గాననమున కనిపి యా
ఘను నిప్పు డకట కౌస
ల్యను వీడి యెచటకు నేఁగి తవనీ నాథా! 5.

మ. కని యా యెఱ్ఱని భస్మ మచ్చటను భూకాం తాస్థి థగ్ధస్థలిన్
ఘనుఁ డా రాఘువుఁ డార్తి నెల్గ మది నాక్రందించి దీనుండు కూ 6.

లెను శీఘ్రమ్ముగ నేలపై నపుడు వజ్రిశ్రేష్ఠ శూలమ్ము లే
ప నమోఘం బది కూలి నట్టి పగిదిం బార్థుండు విభ్రాంతినిన్

కం. త్వరపడి వచ్చి రమాత్యులు
భరతుండు శుచివ్రతుండు పడ భువి పైనన్
నరపతి యయాతి చివరన్
ధరఁ గూలఁగ ఋషి వరుల విధము వేగముగన్ 7.

కం. అనుజుఁడు శత్రుఘ్నుఁడు కూ
లిన యగ్రజుఁ గాంచి వగపు రేఁగఁగ భృశమున్
మనుజేంద్రు స్మరించుచు సం
జ్ఞను వీడి పుడమినిఁ గూలె సంతాపమునన్ 8.

ఆ.వె. పిచ్చి వాని భంగి విలపించె శత్రుఘ్నుఁ
డెంచి మఱల మఱల నంచితముగ
దండ్రి గుణము లెల్ల తల్లడిల్లుచు మదిఁ
జేతనమ్ము లేక చిత్రముగను 9.

తే.గీ. మంథర మొదలుగను గైక మకర మనఁగ
వర చయమ్ములు సుస్థిర భంగములుగ
వెల్గు శోక సాగరమున భీకరముగ
మున్గితిమి యెల్లర మిపు డమోఘముగను 10.

కం. అతి సుకుమారుని బాలుని
సుతు భరతుని వీడి కరము శోకార్తుని ని
ట్లతులిత రీతి సతము లా
లితుని నెచట కేఁగితివి పరితపింప నిటన్ 11.

తే.గీ. అన్న పానము లందు వస్త్రాభరణము
లందు మమ్ముల నిష్టమ్ము లైన వెల్లఁ
గోరుకొను డంచుఁ బల్కును గూర్మి మీఱ
నిప్పు డెవ్వ రందు రటుల నెలమి తోడ 12.

ఆ.వె. ధరణి విభుఁడు నేఁడు ధర్మజ్ఞుఁడు మహాత్ముఁ
డకట లేక యున్న నవని పగుల
వలసి యున్న నింకఁ బగుల కున్నది ముక్క
లుగను వింత వొడమె మిగుల నాకు 13.

చం. చన జనకుండు వేగముగ స్వర్గ తలమ్మున కింక రాముఁ డేఁ
గ నడవి కన్న నే బ్రతుకఁ గాంచ బలమ్మును వహ్నిఁ దూఱెదం
జన నిఁక నే నయోధ్యకు విచారము మీఱను చూడ కిద్దఱిన్
ఘనులను శూన్య పట్టణము గాంచను జేరుదు నా తపోవనిన్ 14.

ఆ.వె. ఇవ్విధమ్ము వార లిరువు రట్లు విలపిం
పంగఁ గాంచి నట్టి వారి ననుస
రించి నట్టి వార లెల్ల రపుడు తిర్గి
దుఃఖమున మునిఁగిరి తోరముగను 15.

కం. మునిఁగి భరత శత్రుఘ్నులు
ఘన దుఃఖమ్మునఁ బుడమిని ఖండిత నిజ శృం
గ నినద వృషభ నిభము గూ
లిన శ్రాంతులఁ గాంచి నంతఁ బ్రీతి సెలంగన్ 16.

తే.గీ. అంత సహజస్థిరుండు విద్యాధికుండు
భరతు జనకపురోహితుఁ డరసి ముని వ
సిష్ఠుఁడు కరుణ నాతని శీఘ్రముగను
లేపి యంతఁ బలికె నిట్లు శ్రేష్ఠ గిరలు 17.

తే.గీ. విభు! దివంగతుని జనకు వీరవరు త్ర
యోదశ దినపుఁ గార్యము నుచిత రీతి
ని నవశే షాస్థి నిచయము నీవు ప్రోఁగు
చేయ కుండ విలంబము సేయ నేల 18.

తే.గీ. కలుగు భువి జనులకు ద్వంద్వము లవి మూడు
తప్పక విశేష రీతిని నెప్పు డట్టి
వాని కయి నిట్టు లగుట ధీవర! సమంజ 19.

సమ్ము కాదు సుమ్ము కనుక లెమ్ము వేగ

ఆ.వె. చని రయమున లేపి శత్రుఘ్నుని సుమంత్రుఁ
డంత నూఱడించి యాదరమునఁ
జావు పుట్టుకలు విశదముగ వినిపించెఁ
దత్వ వేత్త మంత్రి సత్వరముగ 20.

తే.గీ. ఎండ వానల మునిఁగిన యింద్రు ధ్వజము
లనఁగఁ బురుషర్షభు లచట నగపడిరి య
శస్వి లిద్ద ఱుత్తితులై విశాల భుజులు
విడి విడిగ వెలుఁగుచు నుండి వీర వరులు 21.

కం. త్వరపఱచి రమాత్యులు వా
రిరువర దీన వచనుల నహీ నాశ్రువులం
గరముల తుడుచెడి వారి నొ
నరింప నపరంపుఁ బనుల నయ నారుణులన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 78.

రామునిఁ గాంచుటకై పయనమును దలంచుచు భరతుఁడు శత్రుఘ్నునితోఁ బలుకు చుండ మంథర సర్వాభరణ భూషిత యక్కడ తిరుగు చుండఁ గని ద్వారపాలకుఁడు శత్రుఘ్నునితో నీమెయే రాముని వనవాసమునకు కారణమని తెలుపఁ గోపముతో వధింప నెంచ భరతుఁ డట్లు చేసిన రాముఁ డెన్నఁడు తమతో మాటలాడఁ డని నివారించుట.

కం. పయనము నూహించి భరతుఁ
డె యనెను శత్రుఘ్నునిఁ గని యీవాక్యములన్ 1.

నియతాత్ముఁడు కడు దుఃఖిం
చి యధిక దుఃఖితుని తోడఁ జింతాకులుఁడై

తే.గీ. ప్రాణులకు నెల్ల దిక్కైన వాఁడు తనదు
దుఃఖ మేల హరింపఁడు దుష్టురాలు
కాంతచే వివాసితుఁ డయ్యెఁ గాన కకట
సత్వ సంపన్నుఁ డివ్విధి సద్గుణుండు 2.

కం. బలవంతుఁడు వీర వరుం
డు లక్ష్మణుఁడు కూడ నా కఠోరుని జనకున్
లలితుని రాముని విడిపిం
ప లాఘవమ్మున నెదిర్చి వారింపఁ డహో 3.

కం. మునుప విచారించి నయం
బనయము దివి కేఁగి నట్టి యవనీ పతియే
వనితా వశుం డయిన కత
మున వారింపండు ఘోరము నివార్యమ్మున్ 4.

మ. భరతుం డివ్విధిఁ బల్కు చుండగను దాపం బంది శత్రుఘ్నుతో
గిరలం దూరుపు దిక్కు ద్వారమునఁ గైకేయీ సఖీ కుబ్జయే
వర భూషా సమలంకృ తాంగన మహా పాటీర లిప్తాంగ భూ
వర వస్త్ర ప్రవర ప్రభా లసిత తావచ్చెన్ వడిం గుల్కుచున్ 5.

ఆ.వె. మేఖ లాదు లైన మేలిమి పసిడి యా
భరణములను గుబ్జ బంధిత యయి
రమ్య రీతి నపుడు రజ్జు బంధిత వాన
రి వలె నగపడెను వికృతముగ నట 6.

చం. కుమతిని ద్వారపాలకుఁడు కుబ్జను దుర్భర పాపకారిణిన్
సమముగ గాంచి నిర్దయను శత్రు నిహంతకుఁ జూపి పల్కెఁ గాం
చుమ విభు! తండ్రి చావునకు క్షోభపు కానన వాస మన్న కున్
విమలున కీమె కారణము వీర వరేణ్య! యథేచ్ఛఁ జేయుమా 7.

తే.గీ. ఆలకించి శత్రుఘ్నుఁడు పాలకు వచ
నమ్ము లంత నంతఃపుర నారులఁ గని
పలికె ధృత సువ్రతుం డతి పరుషముగను
భాషణమ్ముల నివ్విధిఁ బార్థసుతుఁడు 8.

ఆ.వె. క్రూరురాలు సేసి క్రూర మైనట్టి క
ర్మము నొసంగె నాదు భ్రాతలకును
దండ్రి కిపుడు తీవ్ర తరమైన దుఃఖమ్ము
దాని ఫలము నందుఁ దప్ప కీమె 9.

ఆ.వె. పలికి యివ్విధమ్ము భర తానుజుండు స
ఖులకు మధ్య నున్న క్రూరురాలు
కుబ్జ నొడిసి పట్ట ఘోరముగ నఱవ
నామె దద్దరిల్లె నా గృహమ్ము 10.

తే.గీ. కాంచి శత్రుఘ్ను కోపము కాంత లెల్ల
భీతిఁ దల్లడిల్లి భృశము వేగ పర్వు
లిడిరి సకలదిక్కుల కంత వడి మనల నొ
నర్చు నిశ్శేష మంచు వనరుచు ననిరి 11.

ఆ.వె. దయ గలట్టి భామ ధర్మజ్ఞ కౌసల్య
ఘన యశస్విని నిఁక కాఁ గలదు మ
నకు గతి యని తలఁచి నారులు నిశ్చయిం
చి రెడఁదలను శరణ మరయ నేఁగి 12.

తే.గీ. రోష కలిత తామ్రాక్షుఁడు భీష ణారి
మర్దనుండు శత్రుఘ్నుఁడు మనుజ పుంగ
వుండు నీడ్చెను గుబ్జను మెండుగ నట
నేడ్చు దానినిఁ బుడమిఁ కోపించి భృశము 13.

చం. చెదరెను మంథ రాభరణ చిత్రము లెల్ల ధరిత్రిపై నటన్
బెదరుచు నేడ్చు చుండ భృశ భీత మనస్విని హా కృ తార్తితోఁ
గదలఁగ భూషణమ్ములు నృకాంత గృహమ్మునఁ దోఁచెఁ గాంచఁగాఁ 14.

బదిలపు శార దాంబర నిభమ్ముగ రాజ నివాస మత్తఱిన్

తే.గీ. పట్టి కోపమ్మున బలుండు పార్థ నంద
నుండు శత్రుఘ్నుఁ డా కుబ్జ నుగ్రుఁ డయి వ
చించెఁ బరుష వాక్యమ్ముల నెంచి కైక
నంత భయపెట్టు చుండి యత్యంతముగను 15.

కం. విని యా కఠోర వాక్యము
లను భీతిల్లి భృశముగ శరణ మరయంగం
దనయుని చెంత కరిగె వడి
ఘన శత్రుఘ్న భయ చిత్త కంపము తోడన్ 16.

ఆ.వె. చాల క్రుద్ధుఁ డైన శత్రుఘ్ను వీక్షించి
భరతుఁ డిట్లు పలికె భ్రాత తోడఁ
జంపఁ దగదు సుమ్ము సకల భూతమ్ములఁ
బ్రమదల క్షమియింప వలయు సతము 17.

తే.గీ. దుష్ట చారిణిఁ గైకను దురిత మతిని
నేన వధియింప నెంతును నిత్య ధార్మి
కుండు రాముఁడు తిట్టక యుండు నేని
నన్ను మాతృ ఘాతకుఁ డని మిన్న గాను 18.

ఆ.వె. ఎఱిఁగె నేని రాముఁ డీ కుబ్జను వధించి
నట్టు లెన్నఁ డైన నట్టి మనలఁ
గనఁడు పలుక డింక ఘన ధర్మ చిత్తుఁడు
సంది యమ్ము సుంత యిందు లేదు 19.

కం. విని యన్న భరతు మాటలు
ఘనుఁ డా శత్రుఘ్నుఁడు కినుక విడిచి యా కు
బ్జను వదలె సత్వరమ్ముగ
ననుజుఁడు లక్ష్మణునకు వినయాధికుఁ డంతన్ 20.

కం. పడె మంథర కైకం గని 21.

యడుగులపై నిశ్వసించి యార్తిని శోకం
బెడఁద చెలంగ భృశమ్ముగఁ
గడు దీనముగ విలపించె ఘన రావమునన్

తే.గీ. వీడ శత్రుఘ్నుఁడు పుడమి వీత సంజ్ఞఁ
బడిన మంథర నార్తను భరత మాత
యూఱడించెను మెల్లగ నుచిత రీతి
జాల మందు చిక్కిన క్రౌంచి చంద ముండ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది యెనిమిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 79.

పదునాల్గవ దినపు టుదయమున రాజకర్తలు భరతునితో రాజ్యాభిషిక్తుఁడవు కమ్మని పలుకఁ దిరస్కరించి రాముని వనము నుండి తీసికొని వచ్చుటకు తగు దారినిఁ గల్పింప శిల్పులకు నాజ్ఞ నొసఁగుట.

కం. పదునాల్గవ దివసమ్మున
నుదయమ్మునఁ బలికి రంత నుర్వీ పతినిం
బదవిని నిల్పెడి వారలు
సదమల భరతుని నరసి వచనముల నిట్లున్ 1.

ఉ. ద్యో గతి కేఁగఁగా దశరథుండు గురూన్నతుఁ డివ్విధమ్ముగా
నేఁగఁగఁ బంప రాముని నహీనపరాక్రము నింకఁ గానకున్
వేగమ జ్యేష్ఠ నందనుని వీరుఁడు లక్ష్మణుఁ డేఁగ వెంటఁ దా
నీ గతి భాతృ వత్సలత నిప్పుడు రాజ్యపు మేలు నెంచఁగా 2.

ఉ. నీ విఁకఁ గమ్ము రాజసుత! నెమ్మి వహించి ధరాధినేతగా 3.

వావిరి కీర్తి వంతుఁడవు పన్నుగ భారము నూన నింపుగా
నీ విభు హీన రాజ్యము సమీక్షణ మింపుగఁ జేసి శత్రువుల్
చేవఁ దలంచి మార్కొనరు శీఘ్రము భాగ్య వశంబ కాంచఁగన్

ఉ. పౌరులు నింక వర్తకులు పార్థివ నందన! తెచ్చి వస్తువుల్
వా రభి షేచనార్థ మయి పన్నుగ నిల్చిరి నిన్ను గాంచఁగన్
మూరిన ప్రీతి నెల్లరును ముచ్చటఁ జూడఁ దలంచి రాజ్య స
ద్భారము నీవు దాల్ప జన బాంధవ! యిత్తఱి సంభ్రమమ్ము నన్ 4.

తే.గీ. స్వీక రింపుమ రాజ్యము ప్రీతి తోడు
త పితృ పైతామహం బిది ధవుని నంద
న! యభిషిక్తుఁడ వగుమ యనవరతమ్ము
మమ్ము పాలింపు మెల్లర సమ్మదమున 5.

తే.గీ. సుధృఢ సువ్రత భరతుండు చూచి యచ్చ
ట యభిషేక బాండము నెల్ల నియతి తోఁ బ్ర
దక్షిణ మొనర్చి యంత సద్భక్తిఁ బలికె
జనుల వీక్షించి బదులుగ సద్గుణుండు 6.

కం. మా కులము లోన జ్యేష్ఠుఁడ
లోకులఁ గావ నగు రాజు రుచిరముగ నిలన్
మీ కివ్విధి భాషింపఁగ
నా కీయఁ దలంచి భూమి న్యాయము కాదే 7.

ఆ.వె. అగ్రజుండు రాముఁ డవనిఁ బాలించు జ
నాధి నాథుఁ డయి మహాత్ముఁ డిపుడు
సప్త సప్త సమలు తృప్తితో వనవాస
మేను జేయఁ జనుదు నింక వినుఁడు 8.

తే.గీ. సిద్ధ పఱుపుఁడు చతురంగ సేన నింక
తెత్తు రాముని జ్యేష్ఠుని ధీర వరుని
వనము నుండి రఘూత్తము భ్రాత నెలమి
నిప్పు డేఁగి వేగమ్ముగఁ దప్పకుండ 9.

ఆ.వె. ముం దిడి యభిషేకపు నిచయ మంతయు
రాఁగ సకల జనులు రాముని కయి
తత్క్షణంబ యేఁగఁ దలఁతు నరణ్యము
న కతి వేగముగను నర వరుఁ గన 10.

ఆ.వె. అచ్చట నభిషిక్తు నతని నరవ్యాఘ్రుఁ
జేసి యింపు కొలుప శీఘ్రముగను
రాము నిటకు తెత్తుఁ గ్రతువు నుండి యనల
ముఁ గొని తెచ్చి నట్లు ముందు నుంచి 11.

తే.గీ. వనమున వసింతు నే నింకఁ బంత మూని
రా జయి ధరను బాలించు రాముఁ డడరి
తల్లి నా ననఁ బడు నాదు తల్లిఁ గోర్కి
తీరి నట్టి దానిగఁ జేయ మూరి నేను 12.

తే.గీ. చేరి దారి సేయ వలెను శిల్పు లింక
నెత్తు పల్లముల నరసి యిత్తఱి సమ
ముగ నొనర్ప వలయు భృశము గతి నెఱిఁగి
నట్టి భటు లెల్ల వెన్నంటి యరుగ వలయు 13.

తే.గీ. పలుక భాషణము లడరి భరతుఁ డిట్లు
రాముని కయి చెలువముగ రాజ సుతునిఁ
గాంచి జనులు బదు లిడిరి యంచితంపు
వాక్యముల నంత నిబ్బంగి నైక్యముగను 14.

కం. ధర నీయ జ్యేష్ఠ తనయున
కు రామునకు నివ్విధమ్ము కూర్మి చెలంగన్
భరతా నీ విట్టు లనఁగఁ
బరఁగును శ్రీ లక్ష్మి నీకుఁ బన్నుగఁ బుడమిన్ 15.

కం. విన నృప నందను వాక్యము
ల నట సమీపమ్మున బుధుల నయనముల రా 16.

లిన కన్నీ ళ్లవి వక్త్రము
ల నుండి జాఱె ముదజములు రహి మీఱంగన్

తే.గీ. పలికి రిట్లమాత్యులు పరివార యుతము
వీత శోకులు ముద మంది విని భరతుని
పలుకులు నరవర! యనుజ్ఞ వడసిరి పథ
ము నొనరింప శిల్పులు నీదు ముదల నూని 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు డెబ్బది తొమ్మిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 80.

భరతు నాజ్ఞ నడవికిఁ బోవుటకు వివిధ విద్యల నేర్పరులు నయోధ్య నుండి గంగా నది వఱకు దారి నేర్పరుచుట, యక్క డక్కడ గుడారములను నిర్మించుట.

తే.గీ. మన్నెఱిఁగిన వారును ద్రాటి మర్మ విదులు
కర్మ నిపుణులు శూరులు ఖనకు లింక
యంత్ర సువిశారదులు సేవ కాలి శిల్పి
జనులు వడ్రంగులు గతినిఁ జలుపు వారు 1.

ఆ.వె. చెట్ల నఱకు నరులు చెన్నుగ నూతులు
త్రవ్వు వారు బుట్టల గము లల్లు
వారు వెల్ల వేయు వారు పరీక్షా స
మర్థులు వెడలిరి క్రమముగ ముందు 2.

కం. ముద మంది యేఁగ వారలు
తదున్నత జనౌఘ మటకుఁ దద్దయు పేడ్కం
గదలుచుఁ బర్వదినం బం 3.

దుదిత మహా వేగ వనధి యోజం దోఁచెన్

కం. మార్గ సుకర్మ నిపుణులు స్వ
వర్గ జనులఁ గూడి తగు నుపకరణ యుతులై
దుర్గమ దేశమ్ముల కయి
నిర్గమనాభి రతులై చనిరి ముందు వడిన్ 4.

తే.గీ. తీగలఁ బొదల మోడులఁ దీసి యెల్ల
ఱాళ్ల నేఱి వృక్షముల నఱికి భృశమ్ము
వివిధముల నెల్ల మార్గము వెడలఁ జేసి
రద్భుతమ్ముగ నడరుచు నపుడు వేగ 5.

ఆ.వె. చెట్లు లేని యట్టి చోట్ల నాఁటిరి కొంద
ఱలమిఁ దరులు కొంద ఱెంచి గండ్ర
గొడ్డళుల బొరిగలఁ గొడవళుల నఱికి
దారిఁ గూర్చి రంత మూరి వారు 6.

ఆ.వె. బల్లిదు లొరు లింక బలమైన యవురుగ
డ్డిఁ బొడఁ గాంచి మీఱ తేవయె దొలఁ
గించి రింపుగాను మించి దుర్గమ్ముల
సమ మొనర్చి రన్య జనులు తివిరి 7.

ఆ.వె. కూపముల బొఱియలఁ గొందఱు మట్టిని
నింపి పూడ్చి రంత నిమ్న తలము
లెల్ల చోటులఁ బరికించి సమతలమ్ము
లుగ నొనర్చి రట సురుచిరముగను 8.

ఆ.వె. కట్టఁ దగిన చోటఁ గట్టిరి వంతెన
వొడి యొనర్పఁ దగినఁ బొడి యొనర్చి
పగుల గొట్టఁ దగిన వడినిఁ బగులఁ గొట్టి
రంత సంభ్రమించి యంచితముగ 9.

కం. కొలఁది సమయమ్ము లోనన్ 10.

జలరాసు లనేకములను సాగర సదృశ
మ్ము లనే కాకారమ్ముల
లలితమ్ముగఁ గూర్చి రంత రమ్య తరములన్

కం. జలహీన దేశముల నూ
తుల నుత్తమ జల యుతములఁ దూర్ణముగా భా
సిలఁ జేసి యింపుగను ది
న్నెల నిర్మించిరి సరసన నిపుణత సెలఁగన్ 11.

చం. వెలిఁగెను దేవ మార్గసమ విస్తృత మార్గము కూడఁగా సుధా
తల వర కుట్టిమమ్ములు లతా కుసు మావృత వృక్ష పంక్తులన్
విలసిత మత్త పక్షి పరివేష్టిత భవ్య పతాక యుక్తమై
సలలిత సిక్తచందన సశంబర రాజితమై ధ్వజాఢ్యమే 12.

చం. తగ నధికార మున్న నృప తత్పరు లాజ్ఞ లొసంగి రంత నిం
పుగఁ బని సేయు వారలకు భూపుఁడు యానతి యిచ్చినట్టి దౌ
పగిదిని నంద మైనదగు ప్రాంతములో భరతుండు సేరి ని
ల్వఁగ ఫల యుక్త దేశమున వాసము నొక్కట నెంచి యంతటన్ 13.

తే.గీ. ఏర్పఱచి నివాసమ్ము నరేంద్రున కయి
చక్కఁగ నలంకరించిరి స్వర్ణ భూష
ణము పగిది కన్పడఁగ భూషణముల మించి
వేదులు సుముహూర్తమ్మునఁ బేర్మి మీఱ 14.

చం. విరివిగ దుమ్ము కూడినను వీథుల తోడ నగడ్త యుండఁగా
గరిమపు టింద్రకీల నిభ కమ్ర గృహావలి వెల్గ నింపుగాఁ
బరమ పతాక యుక్త మయి వాసము లెల్ల నభ స్స్పృశమ్ములై
యరుదుగ నిర్మితమ్ములు బలారి పు రాభము వెల్గె నయ్యెడన్ 15.

కం. కదియఁగ గంగా తీరము
సదమల నీరము వన తరుచయ భాసితమున్
విదిత మహోమీ నావృత
నదీ వతంసము కృతార్థ నరవరు లంతన్ 16.

కం. విలసిల్లె నరేంద్ర పథము
కలువలఱేఁడు మఱి తారకలు శార్వరిలో
వెలుఁగ నభమ్ము పగిది శి
ల్పులచేఁ గల్పితము కాఁగ రుచిరపు రీతిన్ 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 81.

ఆ రాత్రి గడవ వంది మాగధులు స్తుతులతో భరతుని మేలుకొలుప వసిష్ఠ మహర్షి రాజసభ కరుదెంచి భరతుని రాజసభకు రమ్మని కబురు పంపఁగా భరత శత్రుఘ్నులు రాజ సభకు వచ్చుట.

కం. ఉరుతర వాక్యజ్ఞులు కది
సి రాత్రి గడవంగ దొల్లి శ్రీ శుభదమ్ముల్
భరతుని సూతులు మాగధ
వరు లిచ్చిరి ప్రీతి నుతులఁ బరమ ముదమ్మున్ 1.

ఆ.వె. పసిడి కొడుపు లడరఁ బన్నుగ మ్రోగిన
వంత దుందుభు లట నలరె శంఖ
నాదములు భృశమ్ము మోదము సెలగంగ
వంద వంద సంఖ్య లందు నూద 2.

ఆ.వె. వాద్య శబ్దములు దివమ్మును బూరించు
నట్లు మ్రోగ నచట నార్తుఁ డైన
భరతు శోక మపుడు తిరిగి నిండెను డెంద
మందు మిక్కుటముగఁ గంద నతఁడు 3.

కం. విని లేచి భరతుఁ డపు డా
పి నినాదమ్ములఁ బలుకుచుఁ బృథ్వీశుని గా
నని తాను గాంచి శత్రు
ఘ్ను నిజానుజుఁ బలికె నిట్లు కుందుచు నంతన్ 4.

ఆ.వె. కైక లోకులకును గాంచుమ శత్రుఘ్న!
చేసె కీడు భృశము చెలఁగి యిట్లు
దశరథుండు దుఃఖ తప్తునిఁ జేసి న
న్నివ్విధమ్ము దివికి నేఁగె నకట 5.

తే.గీ. ధర్మరాజు దశరథుని ధర్మమూల
రాజ్య లక్ష్మి నేఁ డకట ధరాతలమున
తిరుగు చున్నది జల మందు తెడ్డు నూను
వాఁడు లేని యట్టి పడవ పగిదిఁ గాంచ 6.

చం. మన కిట గొప్ప దిక్కయిన మాన్యుని రామునిఁ బంపి రివ్విధిన్
వనమున కంత లక్ష్మణుఁడు భ్రాతయు దారయు నేఁగి రక్కటా
యనయ మదీయ మాతయె మహాత్ముని ధర్మము వీడి క్రూరయై
పనిచె స్వయమ్ముగా నకట పార్థ కుమారునిఁ గాన కేఁగఁగన్ 7.

కం. విలపింప నివ్విధమ్ముగఁ
గలవరమున నబ్భరతుఁడు క్షయ చేతనుఁడై
వలవల యేడ్చిరి జాలిగ
లలనలు బిగ్గరగ నంత రాజగృహమునన్ 8.

కం. అలమట నుండఁగ భరతుఁ డ
టుల నట భృశముగ వసిష్ఠుఁడు గురుం డిక్ష్వా
కులకు నృపధర్మ విదుఁ డవి
రళ కీర్తి ధనుండు వచ్చె రాడ్వర సభకున్ 9.

ఆ.వె. బంగరు మయ మైన వర మణి రత్న స
మాకులంపు సభకు నరుగు దెంచె
వఱల నది సుధర్మ పగిది వెలుంగుచు 10.

ముని సగణము ధర్మమూర్తి యడరి

తే.గీ. కాంచన మయ పీఠమ్ము సుఖం బొసంగు
పఱుపు పైనను గూర్చుండి భద్రముగను
వేదవిజ్ఞుఁడు దూతలఁ బిలిచి యాజ్ఞ
నొసఁగె నిట్టుల వారికి నుచిత రీతి 11.

తే.గీ. బ్రాహ్మణులను క్షత్రియులను వైశ్య జనుల
మంత్రుల గణ నాయకులను మాన్య దూత
లార! కొని రండు వేగమ యరిగి యిటకుఁ
గృత్య మొకటి గలదు చేయ నత్యధికము 12.

తే.గీ. రాజ భృత్యుల తోడ భరతు యశస్వి
ననుజుని ఘనుని శత్రుఘ్ను నా యుధాజి
తుని సుమంత్రుని రాజ హితు లగు జెలులఁ
బిలిచికొని రండు వారల వేగముగను 13.

తే.గీ. చెలఁగె గళగళ ధ్వను లంతఁ జేర నటకు
జనులు గుఱ్ఱమ్ములఁ గరుల స్యందనముల
నొక్క రొక్కరు వేగమ మిక్కుటముగ
నంతరంగములఁ దనర సంతసములు 14.

కం. కదిసెడు భరతుని గాంచి ము
ను దశరథుని మెచ్చు గతి జను లొసఁగి నుతులన్
బదిలముగ స్వాగతించిరి
ముదమున నిర్జరులు శక్రుఁ బొగడిన భంగిన్ 15.

కం. దశరథ సుత! శోభితమౌ
దశరథు సభ గాంచ నది స దశరథు భంగిన్
భృశ మణి శంఖ ససికతా
సశకులి ఘణి యుతపు టచల సరసిగఁ దోఁచెన్ 16.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది యొకటవ  సర్గము.

# అయోధ్యా కాండము

# సర్గము 82.

వసిష్ఠ మహర్షి భరతుని రాజ్యాభిషిక్తుఁడవు కమ్మనిన భరతుఁడు నిరాకరించి రాముని వనము నుండి తీసికొని వచ్చుట కరణ్యమున కేఁగ నాజ్ఞాపింప నందఱు ప్రయాణమునకు సన్నిద్ధు లగుట.

కం. కనియెన్ భరతుం డార్యక
జన సంపూర్ణ సభ నపుడు స్వాగత మీయన్
ఘన ధీనిధి పూర్ణ శశి యు
త నిశా నిభ మలరి తనరు దానిని నచటన్ 1.

ఉ. దిట్టలు గౌర వోన్నతులు తీరుగ నాసన పంక్తి నుండగం
బుట్టము లింక గొప్ప మెయి పూతల వెల్గ సభాస్థలంబు క
న్పట్టె  స పండితావలి ఘనం బగు వర్షపు టంత మందుఁ జూ
పట్టెడి పూర్ణ చంద్ర యుత భాసిత శర్వరి భంగి నింపుగన్ 2.

తే.గీ. ధర్మ విదుఁడు వసిష్ఠుఁడు ధరణి నాథు
మంత్రి వర్యుల వీక్షించి మనుజ వరుని
భరతు తోఁ బురోహితుఁ డంతఁ బలికెఁ బ్రీతి
మృదు వచనముల నివ్విధి మేలు నెంచి 3.

ఉ. నీ జనకుండు నాయన! సునీతిఁ జరించుచు విత్త ధాన్య వి
భ్రాజిత విస్తృ తావనినిఁ బన్నుగ నీ కిడి స్వర్గ మేఁగఁగాఁ
దా జన కానుశాసనము దాఁటఁడు రాఘవుఁ డెంచి ధర్మమే
యోజ వహించి సత్యధృతి జ్యోత్స్నను వీడని చంద్రు భంగినిన్ 4.

ఆ.వె. గురుఁడు నగ్రజుండు కూర్మి నొసంగిన
విగత కంటకంపుఁ బృథ్వి నెల్ల 5.

ననుభవింపుమ ముది తామాత్యు లుండఁ క్షి
ప్ర మభిషిక్తుఁడ వయి రాజు వగుమ

తే.గీ. ఉత్త రాపర దక్షి ణాపూత రాజు
లెల్ల రాజేత రాంతికు లింక వార్ధి
వర్తకులు కోట్యధిక రత్నవరము లిచ్చు
వా రలరి యుంటి రిక్కడఁ బార్థిపేంద్ర! 6.

కం. విని యా వాక్యమ్ములు దా
మునిఁగి భరతుఁడు భృశ దుఃఖమున ధర్మజ్ఞుం
డు నరవరుని రామునిఁ దన
మనమున ధర్మ రతిఁ జేరె మమకారమునన్ 7.

కం. కన్నీటి గళమ్మునఁ గడు
సన్నని కంఠస్వరమున సభలో నంతం
గ్రన్నన విలపించె భరతుఁ
డన్నన్న పురోహితు ననయ మనుచు దూఱెన్ 8.

తే.గీ. బ్రహ్మచర్యవ్రతుండును వఱల విద్య
లందు ధీమంతుఁడును ధర్మ మనుసరించు
వాఁడు నెవ్వఁడు నా వంటి వాఁడు రాజ్య
మిట్లు హరియింప నిజ మది నెంచు నార్య! 9.

చం. దశరథ జాతుఁ డెట్టు లగుఁ దల్పఁగ నెన్నఁడు రాజ్య హర్తగా
విశదము నేను రాజ్య మిట వీరుని రాముని నొత్తు చూడఁగా
యశమున నా దిలీప నహు షాభుఁడు రాముఁడు ధర్మచిత్తుఁడే
దశరథు భంగి జ్యేష్ఠుఁ డగు ధాత్రికి నర్హుఁడు శ్రేష్ఠుఁ డెమ్మెయిన్ 10.

మ. కడు దుష్టాత్ములు సేయు నట్టి పని స్వర్గం బంద కుండంగఁ జే
సెడి కార్యమ్మును నేను జేసిన నహో శీఘ్రుంబ నిక్ష్వాకు వం
గడ మం దేను కులక్షయుం డగుదు నిక్కం బెంచ హర్షింప నె
న్నఁడు నాతల్లి పనిన్ వనస్థునకు దండంబుల్ తమిం బెట్టెదన్ 11.

ఆ.వె. అనుసరింతు నిత్య మా రాముని నర పుం
గవుని రాజు ముజ్జగముల కర్థుఁ
డతఁడు పాలనమ్ము నడరి చేయంగ సం
ప్రీతి రాఘువుండు పృథ్వి నెంచ 12.

కం. విని యా మాటలు ధర్మం
బు నెంచి పల్కఁగ భరతుఁడు పూర్ణ మనమునన్
ఘనులు సభాసదులు ముద
మ్మున విడిచిరి యశ్రులు మనమున నిడి రామున్ 13.

చం. వనమున నుండి రాఘువునిఁ బన్నుగ నే మరలింపకున్నచో
ననుజ వరుండు లక్ష్మణుని నార్యుని భంగిని నుందు కాన లో
ననువుగ నుండఁ దెచ్చుటకు నన్న బలమ్మున నెట్టి కార్య మై
నను నొనరింతుఁ మిమ్ముల జనప్రవ రాలినిఁ గూడి సాధులన్ 14.

తే.గీ. మున్న నియమించితిని పథంపు గతి నరయు
వారి రక్షకులను భృత్య వార మింపు
గ సమకూర్పఁ బనుల నెల్లఁ గాననంపు
యాత్ర నిచ్చగింతును మన మందు నేను 15.

తే.గీ. భరతుఁడు పలికి యివ్విధి భాతృ వత్స
లుండు ధర్మాత్ముఁడు సరస నున్న మంత్రి
వర్యుఁ దంత్రవేది సుమంత్రుఁ బలికె నరసి
యాత్ర కిమ్మనుజ్ఞ ససైన్య మరుగ వలయు 16.

ఆ.వె. పలుక నివ్విధముగ భరతుండు విని సుమం
త్రుండు హర్ష మంది తోరముగను
జెప్పి నట్టి రీతి శీఘ్ర మాదేశ ము
సంగె నందఱకును సంభ్రమమున 17.

ఆ.వె. యాత్ర నాలకించి యానంద మందిరి
పౌరు లత్యధికము బలపతులు బ
లమ్ము వనమునుండి రాముని మరలింప 18.

నేఁగ నాజ్ఞ నంది యెల్ల రపుడు

ఆ.వె. గృహగృహమ్ములఁ బరికింప యోధాంగన
లెల్ల యాత్ర నెఱిఁగి యెలమి తోడఁ
దమ తమ పతుల నల త్వరపఱిచిరి సంత
సించి యెడఁద లందు నంచితముగ 19.

ఆ.వె. వేగ మేఁగు నట్టివౌ గోరథముల శీ
ఘ్ర గతి నేఁగు హరులఁ గదలఁగ నర
దము లనేకములను ద్వర పఱచిరి బలా
ధిపతు లెల్లర నతి ధీరవరులు 20.

తే.గీ. సిద్ధముగ నుండ ధ్వజము వీక్షించి భరతుఁ
డంతట పురోహితుఁడు నుండ చెంతఁ దనదు
ప్రక్క నున్న సుమంత్రునిఁ జక్కఁగఁ గని
తేరు తనకుఁ గూర్ప మనియె వీరవరుఁడు 21.

కం. భరతుని యానతిఁ గైకొని
హరి వరములఁ గూర్చి నట్టి స్యందన వరముం
ద్వరితముగ సుమంత్రుఁడు గొని
యరుదెంచె ముదాన్వితుఁ డయి యచ్చట కంతన్ 22.

చం. అతి దృఢ సత్య విక్రముఁడు నంచిత నిశ్చయ మానసుండు నా
తత వచనమ్ము లట్టు లని తద్భరతుండు వనమ్ము నందు సం
తత వస నార్థ మేఁగిన వదాన్యుని రాముని గౌరవించు న
ట్టి తలఁపు నూని యింపుగను డెందము నందు వచించె నివ్విధిన్ 23.

తే.గీ. లెమ్ము వెడలు సుమంత్ర! బలమ్ము తోడ
ధ్వజ పతుల నెల్లరను గూర్ప వనమున కరు
గ వలయు రఘు రామునిఁ దేరఁ గాన నుండి
యిచ్చ గింతు జగద్ధిత మెంచి నేను 24.

తే.గీ. సూత సుతుఁ డంత భర తాజ్ఞఁ బ్రీతిఁ దాల్చి 25.

పూర్ణ కాముఁడై యాదేశమును సుహృజ్జ
నులకు సేనాపతులకు జనులఁ బ్రధాను
లకు సుమంత్రుఁ డొసఁగె సర్వులకును వేగ

తే.గీ. అంత గృహగృహమ్ముల లేచి యవనిసురులు
క్షత్రియులు వైశ్య శూద్రులు స్యందనముల
కపుడు కూర్చిరి యొంటెల హయ గజముల
ఖరములఁ గులజాతముల వేగమ్ముగాను 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 83.

మరునాఁటి యుదయము భరతుఁడు రాముని దర్శింప వలె నన్న కోరికతో రథ గజ తురగ వాహనములపై రాణులు పురోహితులు మంత్రులు పౌరులు సైన్యము వెంట రాఁగ రథము నెక్కి పయనమై గంగా తీరమున విడియుట.

కం. ఉదయమ్ము కాఁగ భరతుఁ డ
రద మారోహించి యంత రామాంతికముం
గదియంగ నేఁగె నెద రా
మ దర్శ నాకాంక్ష మీఱ మనుజోత్తముఁడే 1.

కం. ముందు దినకర రథాభ
స్యందనముల నెక్కి చనిరి హయ యుక్తములన్
బృందమ్ములుగఁ బురోహితు
లందఱు మంత్రులను గూడి యానందముగన్ 2.

ఆ.వె. తోడుగ నడచినవి తొమ్మిది వేల యే 3.

నుఁగులు రాజ నందనుని భరతుని
నెప్పటి వలె నంత నిక్ష్వాకు కుల హర్ష
వర్ధను వని కరుగు వాని నెలమి

కం. అరువది వేల రథమ్ముల
వర ధానుష్కులు ధరించి పర మాయుధముల్
నరనాథ సూను నరిగెడు
భరతు ననుగమించి రంతఁ బరమ యశస్విన్ 4.

ఆ.వె. లక్ష గుఱ్ఱములను రమ్యముల నధిరో
హించి యాశ్విక వరు లంచితమ్ము
గను వెడలెడు వాని ఘన జితేంద్రియు సత్య
సంధు ననుగ మించి చనిరి ప్రీతి 5.

ఆ.వె. కైకయును సుమిత్ర కౌసల్యయు యశస్వి
ని ముద మడర సూనునిఁ గనఁ జనిరి
వాహనమ్ము నందు భాసిల్ల భృశ మర
దమ్ము మీఱ సంభ్రమమ్ము లెదల 6.

తే.గీ. వెడలె నార్య సంఘము వెనువెంటఁ గాంచ
రాముని సలక్ష్మణమ్ముగ రామ కథలఁ
దలఁచుచుఁ బరస్పరమ్ము ముదమ్ము నిండి
నట్టి చిత్తమ్ముల నతి రయమ్ముగాను 7.

చం. ఘనభుజు మేఘవర్ణుని జగంపు విచారము వాపువానినిం
దనరెడి నిశ్చలోర్జుని వ్రతమ్ముల సుస్థిరుఁ జూతు మెన్నఁ డా
తని రఘురాము లక్ష్మణయుతమ్ముగఁ జూచిన యంతఁ బాపునే
మన వగ నుద్య దంశుఁడు తమమ్మును బాపెడు నట్టి రీతినిన్ 8.

ఆ.వె. నాగరికులు ముదమునఁ బలుకుచు శుభ వ
చనము లిట్లు లొకరిని నొక రటఁ బ
రిష్వజించికొని లలితముగఁ బయనించి
రెల్ల రంత నుత్సహించి భృశము 9.

కం. ఇతరులు వణిజులు సమ్మద
మతు లెల్లరు నేఁగి రపుడు మాన్యుని ధరణీ
పతి సూనుని వీక్షింపఁగ
నతి రయమునఁ బురజనులు మహానందమునన్ 10.

సీ. మణులఁ బదును వెట్టు మనుజ వరేణ్యులు కొందఱు చక్కఁగఁ గుండ లమ్ము
వా రాయుధమ్ముల బ్రతుకు వా రింక వడ్రంగులు శిఖిఁ బెక్కు భంగుల నుప
యోగించు వారలు నొప్పుగ అంపము వాడు వారు నగల వర్తకులును
ముత్తెపుఁ బనివారు నిత్తెపు దంతపు పనివారు సున్నపుఁ బనుల వారు
తే.గీ. గంధముల నమ్ము వారును గంబళుల ను
తికెడి వారు కంసాళులు నిఁక రజకులు
వేడి నీరిచ్చు వారును భిషజులు పొగ
లొసఁగు వారు మధు వణిజు లుండ నింక 11.

తే.గీ. కుట్టు పనివారు పల్లెల గట్టి వారు
నటవరేణ్యులు పట్టణ నారు లింక
మత్స్యకారు లనుగమింప మనుజ పుంగ
వు భరతుని సంతసమ్మున విభవ మొప్ప 12.

కం. నియత మతులు వేదజ్ఞులు
నయ వృత్తులు విప్ర వరులు నడచిరి పే యా
శ్రయము గొని యెడ్ల బళ్లను
బయనించు భరతుని వెంటఁ బలువురు ప్రీతిన్ 13.

తే.గీ. వివిధ వాహనమ్ముల మంచి వేష ధరులు
శుద్ధ వస్త్రములు ధరించి శుద్ధ తామ్ర
వర్ణ చందనముల నద్ది భరతు ననుగ
మించి రప్పుడు మెల్లగ మించ ముదము 14.

కం. తన యన్నను గొనితేరఁగఁ
జను భాతృప్రియుని భరతు సంతోషముతో
డ ననుగమించెను గైకే 15.

యి నందనుని నడరి  సేన హిత మొనరింపన్

ఉ. చేరిరి శృంగిబేర పురి చెంతను గంగను వాహ నాదులన్
వారు గుహుండు పాలనము పన్నుగఁ జేయును బట్టణమ్మునున్
మూరి సబంధు సంచయము మోద మొసంగు నమేయ మిత్రుఁడే
శూర వరుండు రామునకు శుద్ధ మనస్కున కాతఁ డిద్ధరన్ 16.

కం. కదియంగఁ జక్రవాక ని
నద భాసిత గంగ దరి ఘన పతాకిని స
మ్మదమున నిలిచె ఘను భరతు
సదయు నను‌గమించి యంతఁ జక్కఁగ నచటన్ 17.

కం. తనవెంట వచ్చిన బల
మ్మును సదమల గంగఁ గాంచి భూమీశ్వర నం
దనుఁడు భరతుండు సచివుల
గని యెల్లర వాక్యవిదుఁడు  కరుణను బలికెన్ 18.

ఆ.వె. నాదు సైన్య మతము నాదరింతును నిల్చి
యుండుఁ డెల్లెడలను మెండుగ నిట
పెడల వచ్చు నింక విశ్రాంతిఁ గైకొని
దాఁటెదము నదిని నుదయము రేపు 19.

ఆ.వె. అంత దనుక నిత్తు నౌర్ధ్వదేహ నిమిత్త
మేను జలము దివికి నేఁగి నట్టి
తండ్రి కిచట నదిని ధరణీపతికి భక్తి
ననఁగ నాలకించి యంద అపుడు 20.

కం. కలసి సచివు లట్టులె యని
పలికి యథేచ్ఛగ నిలిచిరి వారి కనువులౌ
స్థలముల పేర్వేఱ విడిచి
కలవరముల సెల్ల రాత్రిఁ గమనీయముగన్ 21.

తే.గీ. సైన్య మొనరింప రాజ లాంఛనము లచట 22.

గంగ యొడ్డున విడిసి రాజాంగజుండు
రాముని మహాత్ముఁ దెచ్చు తలఁపు లడరఁగఁ
జిత్తమునఁ గడపె నిశీధి శీఘ్రముగను

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది మూడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 84.

గంగా తీరమున విడిసిన భరతుని సైన్యమును గాంచి నిషాద రాజు గుహుఁడు తన జ్ఞాతులను ద్వరపఱచి భరతుఁడు దురుద్దేశముతో నున్న నదిని రక్షింప ననేక నావలతో నప్రమత్తత నుండ మని పలికి తాను భరతుని సమీపించి వినయముతో నాతిథ్యమును స్వీకరింప మని వచించుట.

కం. నిలిచిన యా సైన్యమును వి
మల గంగా తీర మందు మాన్యుండు నిషా
దులకు విభుఁడు కని నంతనె
పలికెఁ ద్వరితపఱుప జ్ఞాతి వర్యుల తోడన్ 1.

ఆ.వె. సాగర సదృశమ్ము సైన్యమ్ము కన్పించు
చున్న దిచట గనుఁడు చోద్య మంత
ము కన రాదు హృదయమునఁ దలంపఁ దరము
కాక యున్న దకట నాకు వినుఁడు 2.

తే.గీ. గొప్ప వృక్షరాజం బది కోవిదార
చిహ్న ముండె రథమ్మునఁ జేరి యుండ
నోపు భరతుండు దుర్బుద్ధి నూని యిటకు
స్వయముగ ఖలుండు సబలమ్ము రయము మీఱ 3.

చం. మనలను గట్ట నెంచెనొ యమానుష భంగి వధింప నెంచెనో
జనక బహిష్కృతుం డయిన సద్గుణు రామునిఁ జంప నెంచెనో
మనమున నెంచి దుర్లభపు క్ష్మాతల మెల్ల గ్రహింప సంపదం
గొన భరతుండు వూని మదిఁ గోపము వచ్చెనొ కైకపుత్రుఁడే 4.

కం. నిలువుఁడు జాహ్నవి యొడ్డునఁ
దలపడ రఘు రాముని వగు ధనములు గామ
మ్ముల రక్ష ణార్థముగ నా
కిల రాముండు విభుఁ డింక హితుఁడును జుమ్మీ 5.

కం. కొని మాంస మూల ఫలములు
ఘన బల యుక్తు లయి మత్స్యకా రాన్వయ స
జ్జనులార! నిల్వుఁ డిచ్చో
టున గంగా తీరమునఁ గడు మెలపు తోడన్ 6.

తే.గీ. జాలరులు నూర్గు రుండఁగ మేలి నావ
నట్టి నైదు వందల నావ లందు నుంచి
యొవను లట సన్నద్ధులై యరయ వలయు
నంచు వారి నెల్లర నుత్సహించె గుహుఁడు 7.

తే.గీ. తెలియ నపకారి కాదని తెల్లముగను
రామున కితండు దాఁటును క్షేమముగను
సేన గంగా నదిని నేఁడు మానితముగ
మన్ననల నందు మనచేత మనుజ వరుఁడు 8.

ఆ.వె. పలికి యిట్లు గుహుఁ డుపాయనములఁ గొని
మత్స్యమాంస భక్ష్య మధువులను ని
షాద ధవుఁడు భరతు శంకితునిఁ గదియ
నేఁగె సంభ్రమమున వేగముగను 9.

కం. సూత సుతుఁడు వినయజ్ఞుం
డాతత విక్రముఁడు వినయుఁ డగుచు సుమంత్రుం
డాతని వచ్చెడు వానిని 10.

వే తా నరసి భరతుఁ దగ వీక్షించి యనెన్

కం. ఈతఁడు విభుండు వృద్ధుఁడు
జ్ఞాతులు వేలు కలవాఁడు సకల మెఱుఁగు వాఁ
డీతండు దండకా వని
భ్రాతకు మిత్రుండు కరము పార్థివ పుత్రా! 11.

కం. కాన నిషాదప గుహునకు
నానతి నీఁ దగును గాంచ నాఁతడు నిన్నుం
దా నెఱుఁగు వాఁడు నిలిచిన
స్థానము నిశ్శంక రామ సౌమిత్రు లిలన్ 12.

ఆ.వె. శీఘ్రమ నను జూడఁ జేర నిమ్ము గుహుని
నంచు నపుడు భరతుఁ డానతి నిడె
నాలకించి పలుకు లట్లు సుమంత్రుఁ డ
నంగఁ బ్రీతి తోడ నాదరించి 13.

ఆ.వె. ఆజ్ఞ వడసి యంత హర్షించి గుహుఁడు స
బంధు గణము వచ్చి భరతుని గని
నమ్రుఁడై తగ వచనమ్ములు వల్కెను
వాక్య నిపుణుఁ డిట్లు భద్ర మడిగి 14.

ఆ.వె. ఉపవనమ్ముఁ బోలు నుర్వి నిచ్చోటు దా
సులము మేము నీకు సువ్రత విన
యముగ నడుగు చుంటి నడరి యీ దాసుని
యింట నిలువుఁ డెల్ల రెలమి నేఁడు 15.

కం. కొని వచ్చి రీ నిషాదులు
వనమూల ఫలములు నవ్య పలలము లెల్లం
దనరెను యెండిన వెల్లను
గనుఁ డిట గల వింపు గొల్పఁ గమనీయముగన్ 16.

కం. తిని సేన సేద దీరి ని 17.

సి నిట వసించి సుఖ మడరఁ జెన్నుగ మా చే
సిన యాతిథ్యము గొని తీ
ర నెల్ల కోరికలు రేపు రహినిం జనుఁడీ

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది నాల్గవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 85.

గుహుని మాటలు విని మెచ్చి భరతుఁడు భరద్వాజ మహర్షి యాశ్రమమునకు దారి తెలుప మని యడుగ వారికి తోడుగ తన వారితోఁ దాను వత్తు నని గుహుఁడు పలికి రాముని కపకార మొనరింపఁ బోవుట లేదు కదా యని యడుగ భరతుఁడు తన యన్నను రాముని వనము నుండి తిరిగి తీసికొని వచ్చుటకు వెడలు చుంటి నని పలికి యా రాత్రి యక్కడ గడపుట.

కం. పలుకంగ నివ్విధము బో
యల నాథుఁడు గుహుఁడు విని మహా ప్రాజ్ఞుం డా
బలవంతుఁడు భరతుఁడు దాఁ
బలికెను హేత్వర్థ యుతము పన్నుగ నిట్లున్ 1.

ఆ.వె. గొప్ప దౌను నీదు కోర్కి నా యన్నకు
మిత్రమ! పరికింప మేటి సైన్య
మునకు నొంటరిగను మూరి యాతిథ్య మీ
యంగ నిపుడు వేఁడి తయ్య నీవు 2.

మ. అని యిబ్భంగి మహాప్రభా మయుఁడు నత్యంతోత్త మాలాపముల్
కని శ్రీమంతుఁడు నెమ్మినిన్ భరతుఁ డా కాకుత్స్థుఁడే తిర్గి యి
ట్లనె మిత్రుండు నిషాదనాథు గుహు నే యధ్వమ్ము నం బో వలెన్
వన గంగా తట మౌ యభేద్యము భరద్వా జాశ్ర మార్థం బిటన్ 3.

తే.గీ. గహన గోచరుండు గుహుఁడు క్షత్రియ సుతు
భరతు ధీమంతు పల్కులఁ బన్నుగ విని
యంజలించి పలికె నిట్టు లంత సేను
దాశ ధన్వుల టకు  వచ్చెద మని ప్రీతి 4.

చం. వెడలుట లేదు కాదె వని వీరుని రాముని కీయ కష్టముల్
వడయుదు శంక చిత్తమున వావిరి సేనను గాంచి నంతసే
నుడు లివి యాలకించి సుగుణుండు నభో నిభ నిర్మలుండు తా
నడరుచుఁ బల్కె నా గుహుని నారసి యబ్భరతుండు మెల్లగన్ 5.

తే.గీ. అట్టి  కష్టకాల మిట నెప్పట్టు నైన
రాక యుండుఁ గాక తగదు మీకు నిట్లు
నన్ను శంకింప రాముఁడు నాకు భ్రాత
జ్యేష్ఠుఁడు పితృ సముఁడు పేర్మి కెక్కుఁ డౌను 6.

ఉ. కానకు నేఁగు వాఁడఁ బర కారణ మెద్దియుఁ దల్ప రాదిటన్
నే నర పుంగవుం డయిన నీరజ నేత్రుని రాము నింపుగా
నీ నగరం బయోధ్యకు గ్రహించి మరల్తు స హేతుకమ్ముగా
నే నిటఁ బల్కు చుంటి గుహ! నిక్కము నెల్లను విశ్వసింపుఁడీ 7.

తే.గీ. హృష్ట వదనుండు గుహుఁ డంత  నృవరు భరతు
భాషణము లాలకించి తాఁ బలికె తిరిగి
ముదము వడసి వాక్యమ్ములు మూరి యిట్లు
ధన్యుఁడవు నీ సములు లేరు ధరను భరత! 8.

చం. లలిత మయాచితం బయిన రాజ్యము వీడఁగ నెంచి తీ వహో
వెలుఁగును నీదు కీర్తి యిఁక విశ్వము నందు మహోన్నతమ్ముగాఁ
దలఁచితి వీవు రాఘవుని ధర్షితు నింపుగ తేర వీటికిం
గలవర మించు కేనియు వికారము నొందవు మానవర్షభా! 9.

కం. పలుకులు గుహ రాఘవు లవి
యలరుచు నుండంగ నిట్టు లాదిత్యునివౌ
వెలుఁగులు క్షీణం బయ్యెను 10.

మలఁగఁ బగలు వచ్చె నంత మాపు రయమునన్

ఆ.వె. నిలిపి సేన నంత నెమ్మి వడసి గుహు
ని వలన భరతుండు నిద్ర నాశ్ర
యించెఁ దనదు చెంత నుంచి శత్రుఘ్నుని
రాము నెదఁ దలఁచుచు రాఘవుండు 11.

ఆ.వె. రామ చింతయె తనరఁగ మహాత్ముం డగు
భరతున కిల ధర్మ పరున కడరె
దుఃఖ మత్యధికము దుఃఖముల కనర్హుఁ
డైన యట్టి వాని కకట యపుడు 12.

తే.గీ. దాఁగి తరు వందు దావాగ్ని తరువుఁ గాల్చు
చంద మతి ఘోరముగను గాంచ భరతు హృది
లోని సంతాప మను నగ్ని మేనిఁ గాల్చు
చున్నది యడరి నిత్యమ్ము మిన్నగాను 13.

కం. రవి కిరణ ఘోర తప్త హి
మవంతుఁడుశిఖాగ్రముల హిమము కార్చు గతిన్
రవికుల భరతుఁడు ఘన శో
క వహ్ని సకలాంగములను గార్చెను జెమటన్ 14.

తే.గీ. తలఁపులు బొఱియ లుండని శిలలు గాఁగ
బుసలు లోహములై జాలి భూజ గణము
గాగ వగలు కొనలు కాఁగ కాఁగ మోహా
మఖిల సత్త్వరాసులు వెదు రడర పెతగ 15.

ఆ.వె. కైక నందనుండు శోక శైలమ్ము చే
నాక్రమితుఁడు నయ్యె నపుడు ఘోర
తరముగ సత ముండ దశర థాత్మజుఁ డైన
రాము తలఁపు లందు రక్తి తోడ 16.

ఆ.వె. నిశ్వసించుచు మది నెగడ సంతాపము 17.

పెట్టి యొాచు పెతలు విరివి కలఁప
శాంతి నొందఁడు మది సుంత నరర్షభుఁ
డయ్యె మంద వీడి నట్టి యెద్దు

కం. స్వజనులఁ గూడి భరతుఁ డా
సుజనుని గుహు తోడ నుండె శోకం బడరన్
నిజ మన మందు దశర థా
త్మజ రామ నిమిత్తపు వగ మాన్పెను గుహుఁడే 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది యేనవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 86.

గుహుఁడు భరతున కా రాత్రి మహాత్ముఁ డగు లక్ష్మణుని సద్భావములను వచించి తాను సీతారామ లక్ష్మణులను గంగానదిని దాఁటించె నని చెప్పుట.

ఆ.వె. గహన గోచరుండు గుహుఁడు భరతునకు
నప్రమేయునకు మహాత్ముఁ డైన
లక్ష్మణుని తలంపుల సుగుణమ్ముల నుడు
వంగ దొడఁగెఁ దమి నభంగముగను 1.

ఉ. రాముని రక్షకై సుగుణ లక్ష్మణుఁ డమ్ములు చాప ఖడ్గముల్
భీమబలుండు వూనఁ గని పేరిమి మేల్కొని యుండఁ బల్కితిన్
క్షేమము నెంచి నీ కొఱకు శ్రేష్ఠపుఁ దల్పము నే నమర్చితిన్
ధీమతి! నమ్మి నిద్రిలుమ తీరుగ రాఘువ నంద వర్ధనా! 2.

ఆ.వె. సుఖముల కుచి తుండ వఖిలములకు నీవు
జనులు వీ రుచితులు శ్రమము లకును 3.

మేము రాత్రి యెల్ల మేల్కొని యుందుము
రక్షణార్థ మిచట రాముని కయి

కం. భువి నాకు లేఁ డెద రఘు
ప్రవరుని కన్నఁ బ్రియ తముఁడు రాముని కన్నన్
రవికుల చంద్రా! నీ కే
ను వచింతు నిజము తహతహను విడుము మదిలో 4.

తే.గీ. జగతిఁ గీర్తిని ధర్మము సద్ధనమ్ము
నంద వలె నన్న రామ దయా రసమ్ము
కేవలము నిశ్చయమ్ముగఁ గావలె నని
కామములకును భావింతు నే మది నిల 5.

ఉ. కావున సీత తోడుత సుఖమ్ముగ నిద్దుర వోవు నా సఖున్
నే విలు నూని జ్ఞాతులును నెమ్మి సహాయులునై చెలంగఁగాఁ
గావఁగ నిల్తు శర్వరిని గారవ మొప్పగ నిర్భయమ్ముగం
గావున నంతరాయ మిటఁ గల్గదు నిద్రకు నింత యేనియున్ 6.

కం. విదితంబే వన మెల్లయుఁ
గదలుచు నుండంగ మేము కానన మందుం
జెదరము చతురంగ బలము
నెదిరింతుము యుద్ధ మందు నెన్నం డైనన్ 7.

కం. అన మే మెల్లర మివ్విధి
విని ధర్మం బరయు వాఁడు వీరుఁడు సౌమి
త్రి నుడివెను మహాత్ముఁడు మ
మ్ము నరసి వచనమ్ము లిట్లు మోదము తోడన్ 8.

తే.గీ. దాశరథి సీత తోడుత ధరణి యందు
నకట శయనించు చుండఁగ నరయు నట్టి
నాకు నిద్రయు నేని కనంగ సుఖము
లేని లభియింపఁగాఁ దర మౌనె తలఁప 9.

ఆ.వె. ఆజి దేవ దాన వాలిని నోడించు
వీర వరుని నిచట దార తోడఁ
దృణముల నిదురింపఁ దేరి సుఖమ్ముగ
ఘనుని రాజసుతునిఁ గాంచుమ గుహ! 10.

చం. పరఁగిన నిష్ఠనున్ జప తపమ్ము లొనర్చ జనించెఁ దన్ను బో
లు రఘువరుండు రాముఁడు గురుండు యశస్వియు భూమిజాని కి
ద్ధర సుతు లందు నా దశరథప్రియ పుత్రుడు నొక్కరుండు ద
న్నరుగఁగఁ జేయఁ దా బ్రతుక డక్కట రా జిల హీన నాథ యౌ 11.

తే.గీ. అఱచి యఱచి ఘోరమ్ముగ నతివ లెల్ల
రలసి సొలసి యుందురు రాజ నిలయ మందుఁ
దనరు నిశ్శబ్ద మెల్లెడఁ దప్పక యని
తలఁతు నచ్చట నిప్పుడు తథ్యముగను 12.

కం. కౌసల్యయు నా జననియు
గోసల పతియుం గడింది ఘోరపు రాత్రిన్
పేసరి గడవ గల రనెడి
యాస యెడఁద లేదు నాకు నావంతైనన్ 13.

కం. శత్రుఘ్ను నికై చూచుచు
నాత్రమ్ముగ నాదు తల్లి యవనిని నున్నం
బుత్రుఁ గనక కౌసల్య ప
విత్ర నశించు నలమటను పేగమ యకటా 14.

ఆ.వె. అయిన దయిన దైన నాత్మజు రాముని
రాజ్య మందు నుంచ రాక రాజు
కోరి నట్టి కోర్కి తీరకుండను నాదు
తండ్రి పే నశించుఁ దథ్యముగను 15.

తే.గీ. వార లెల్ల సిద్ధార్థులు మూరి యా స
మయమున నిలిచి తండ్రికి మానవేంద్రు
న కటఁ బ్రేత కార్యమ్ము లొనర్చి నట్టి 16.

వారు సద్భక్తి నా పౌర వరులు దలఁప

సీ. చక్కటి కూడళ్లఁ జక్కఁగఁ గూర్చిన రాజమార్గముల హర్మ్యవరములను
వెలుఁగ మణుల హయవేదండ రథ సంకులమ్ముల ఘన తూర్య రావములను
సర్వ కల్యాణ సుసంపన్న మానంద పుష్ట జ నావలి పూరితమ్ము
నారామ నోద్యాన వార భాసితము సమాజోత్సవ చయ విభ్రాజితమ్ము

ఆ.వె. పుర మయోధ్య పరఁగుఁ బూర్ణ మోదమ్మున
నోజ నాదు తండ్రి రాజధాని
జనులు సుఖము లరసి సంచరింపఁ గలరు
సంతతమ్ము నింక వింతగాను 17.

ఆ.వె. సదమ లాత్ముఁ డన్న సత్యప్రతిజ్ఞుని
తోడఁ బూర్తి సేసి తూర్ణ మా య
రణ్య వాసమును బురమ్ము ప్రవేశింప
నగునె మాక యోధ్య కలరి కరము 18.

కం. విలపించు చుండ నివ్విధ
ము లక్ష్మణుండు ఘన దుఃఖ పూర్ణుం డచటం
గలవర మంది మహాత్ముఁడు
తెలవాఱెను రాత్రి గడవ దీర్ఘం బంతన్ 19.

ఆ.వె. సుప్రభాత మందు సూర్యు విమలుఁ గని
జడల నూని యిద్ద ఱడర నంత
గంగ నుత్తరింపఁ గమనీయముగ వారి
నేను వెడలి రంత మౌనముగను 20.

ఆ.వె. నార చీర లూని మూరుచు జట లందు
బల్లిదులు విలులు కృపాణములు ధ
రించి యుత్తమముల నిభ యూథ నిభు లేఁగి
రంత సీత తోడ నరయు చుండి 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది యాఱవ  సర్గము.

# అయోధ్యా కాండము

# సర్గము 87.

గుహుని మాటలను విని భరతుఁ డున్న చోటునే ధ్యాన ముద్రుఁడై మూర్ఛిలి తేరుకొని రాముని వివరము లింకను దెలుప మన గుహుఁడు రాముఁడు తా నొసఁగిన వేమియు స్వీకరింపక వృక్షము క్రింద గడ్డి పఱుపుపై సీతా సహితము పరుండ లక్ష్మణుఁడు రాత్రి యెల్లఁ దమతోఁ గలసి వారిని కాచికొని యుండెనని చెప్పుట.

కం. విని యప్రియములు వాక్యము
లను గుహుఁ డవ్విధ మనం గలఁగి డెందమునన్
ఘనుఁ డున్న చోటుననె ము
న్గెను జింతల నా భరతుఁడు నృవరుం డంతన్ 1.

చం. మృదు హృదయుండు బల్లిదుఁడు మేటి మృగేంద్ర నిభాంస బాసి చే
యి దువ విశాలమై బరఁగు నిద్ధ చరిత్రుఁడు నూఱడిల్లి కొం
త దనుక నంత దుఃఖ మెదఁ దద్దయు రేఁగఁగఁ గూలె నేలపై
నదురుచు వీరుఁ డా భరతుఁ డంకుశ విద్ధ కరేంద్రు భంగినిన్ 2.

కం. భరతుని యవస్థఁ గాంచి య
వరజుఁడు శత్రుఘ్నుఁ డుండ భ్రాతకుఁ జెంతం
గర మలమటఁ గౌఁగిలి పె
ద్ద రవమ్మున నేడ్చె సంజ్ఞ తగ్గఁగ నంతన్ 3.

చం. పరుగున వచ్చి యా భరతు భర్తృ మనోవ్యథ లంబ లెల్లరుం
గర ముపవాస బాధితలు  గాంచి కుమారుని భూమిఁ గూలఁ గూ
డి రతని కంతఁ జుట్టును వడిం దగఁ గోసల కన్య యంత వే
భరతునిఁ జేరి దుఃఖమునఁ బన్నుగ నక్కునఁ జేర్చెఁ గూర్మినిన్ 4.

ఆ.వె. పొదివి పట్టుకొంచుఁ బుత్రు భరతుని వా
త్సల్యమునను దూడఁ దల్లి యావు
పగిది నంత నడిగె బాధతోఁ గౌసల్య
యా తపస్విని యెద నాత్ర మడర 5.

ఆ.వె. వత్స! యెద్ది యైన వ్యాధి బాధించు చు
న్నదె శరీరమును ఘనముగ నిన్ను
జెపుమ రాజకులపు జీవితం బుండెను
నీ యధీనముననె నేఁడు గాంచ 6.

తే.గీ. రాముఁ డేఁగ నిప్పగిదిని భ్రాత తోడ
రాజు దశరథుం డకట మరణము నంద
నిన్ను గాంచియె జీవింతు నేను బుత్ర!
యొక్కఁడవు నేఁడు మాకెల్ల దిక్కు వీవు 7.

తే.గీ. అప్రియమ్మును వింటివే యనుజు లక్ష్మ
ణుని గుఱిచి యేని నేక సుతుని రఘూత్త
ముఁ డగు రామునికై యేని వోవఁ గాన
నమునకు సతి తోడఁ జెపుమ నాకుఁ దనయ! 8.

కం. ఒక్క క్షణమ్మునఁ గోల్కొని
చక్కఁగ శాంతింపఁ జేసి సతి కౌసల్యన్
మిక్కిలి కుందుచు నా గుహుఁ
బ్రక్కన గాంచి భరతుండు పల్కెను గిరలన్ 9.

కం. ఎక్కడ వసించె రాముం
డెక్కడ లక్ష్మణుఁడు నింక నీ యవనిజయుం
జిక్కని నిసి నేమి తినెనొ
యెక్కటి శయ్య నిదురించె నెల్లం జెపుమా 10.

కం. ముద మంది నిషాద పతి త
నదు సఖునకు నతిథికి ఘనునకు రామునకున్
సదయున కే మేమి యొసఁగెఁ 11.

బదిలమ్ముగ నెల్ల నుడివె భరతున కెలమిన్

కం. తెచ్చితి నన్నము భక్ష్యము
ఉచ్చావచములు ఫలమ్ములుత్తము లెల్లన్
హెచ్చుగ రాముని కొఱకై
యిచ్చితి నవి యెల్ల నంత నింపెసలారన్ 12.

తే.గీ. వాని సత్యపరాక్రముఁ డాని యంది
నట్లు వచియించి యంతట నన్నిటిని గ్ర
హింప నొల్లఁడు నృప ధర్మ మింపుగ నెదఁ
దలఁచి రాముఁడు రాఘవ! ధర్మరతుఁడు 13.

ఆ.వె. సంతతమ్ము నీయ జనులకుఁ దగు మాకుఁ
దిరిగి పుచ్చు కొనుట ధరను దగదు
మాకు రాజ! మిత్రమ! యని మహాత్ముఁడు
పలికి యనునయించె భరత! మమ్ము 14.

కం. అనుజుండు లక్ష్మణుం డి
చ్చిన నీరము నారగించి సీతయుఁ దానున్
ఘనముగ నుపవాసం బుం
డెను రాఘవుఁ డా యశస్వి డెందం బలరన్ 15.

ఆ.వె. మిగిలి నట్టి నీరు మిన్నఁగ గొన లక్ష్మ
ణుండు మౌనమూని మండితముగ
ముప్వు రంత సంధ్య మూరి వార్చి రపుడు
సాయపు సమయమునఁ జక్కగాను 16.

ఆ.వె. దర్భ తృణము దెచ్చి ధరణి పైనఁ బఱచి
తల్పము నొనరింపఁ దనిసి రాముఁ
డంత సీత తోడ నందుఁ జేరఁగ వారి
కాళ్లు లక్ష్మణుండు కడిగి తొలఁగె 17.

కం. కనుమీ యింగుది మూల 18.

మ్మును బఱుపును నిచ్చ టుంచ మూరి పరుండెన్
ఘనుఁడా రాముఁడు నిజ దా
రను సీతం గూడి యలరి రాతిరి భరతా!

తే.గీ. వేళ్లఁ దొడుగులు ధరియించి వీరవరుఁడు
ముల్కు లమరిన యమ్ముల పొదల నూని
గొప్ప వింటిని ధరియించి కూర్చి నారి
లక్ష్మణుఁడు పరంతపుఁ డుండెఁ బ్రక్కన నిసి 19.

తే.గీ. విల్లు నమ్ములఁ గైకొని యెల్ల జ్ఞాతి
జనులు నట్టుల నుండంగ జాగరూకు
లై మహేంద్ర సమానుఁ డైనట్టి రాము
నరయుచును లక్ష్మణుని చెంత నడరి యుంటి 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది యేడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 88.

భరతుఁ డమాత్యుల తోడ నింగుదీ వృక్ష మూలము చెంత కేఁగి రాముఁడు పరుండిన చోటును మాతలకు జూపుచు విచారముతోఁ దాను గూడ నాఁటి నుండి జడల నూని నార చీరలుతో నుందు నని పలికి రాముఁడు తనతో నయోధ్యకు రాకున్నఁ దాను గూడ నరణ్యము నందు నుందు నని పలుకుట.

ఉ. శ్రద్ధగ నాలకించి నర సత్తముఁ డా భరతుండు వాక్యముల్
శుద్ధ మనస్కుఁ డార్తి వడిఁ జూచుచు నింగుది మూల మేఁగి తా
నద్దర కంత మంత్రి వరు లందఱు వెంటఁ జరింప వేదనా
విద్ధుఁడు వల్కె మాతలను వీక్షణ మింపుగఁ జేసి యివ్విధిన్ 1.

ఆ.వె. అమ్మహాత్ముఁ డిచట నవనిఁ బరుండెను
రాత్రి యెల్ల నకట రాఘవుండు
మాతలార! గనుఁడు మనుజేంద్రు నంగమ్ము
ల నలఁగెఁ బుడమి యిట రమ్యముగను 2.

కం. జనియింప మహావంశ
మ్మునను మహా భాగుఁ డీ సుపుత్రుండు మహా
జనపతియౌ దశరథునకు
ననర్హుఁడు పరుండ రాముఁ డకటా యవనిన్ 3.

ఆ.వె. మెత్తని యజినమ్ము లుత్తమము లగు ప
ఱుపు లమరఁగ నఱిముఱుల నరయక
సుఖముగ నిదురించు శూరుఁడు రాముఁడు
నేల నెప్పగిదిని నిదుర వోవు 4.

చం. నిరతము సౌధ రాజముల నివ్వటిలంగ సువర్ణ పాండు రే
ద్ధ రజత భాసి తావనులు తల్ప నికాయ విశుద్ధ శయ్యలున్
విరి గమి చిత్రముల్ విరియఁ బ్రీతి నొసంగెడు చంద నాగరుల్
మురియుచుఁ గూయఁ జిల్కలు నభో నిభ కాంతులు సంతరింపఁగన్ 5.

ఉ. శీతల గంధ యుక్త సువిశేష గృహావర ణాంతరమ్ము లం
దాతత మేరు సన్నిభ సదాలయ పంక్తి సరుక్మ భిత్తులన్
గీత మృదంగ శబ్దములఁ గించి దపూర్వ విభూష ణార్భటిన్
సూత స మాగధ ప్రవర చోదిత సుప్రతిబోధితుండునై 6.

ఆ.వె. వంది జన కథా వివశత నలరి స్తుతి
వాక్యములను వినుచుఁ బర దమనుఁడు
మోద మందు చుండు భూరమణాత్మజుం
డంతరంగ మందు ననవరతము 7.

చం. తగ దిది నమ్మకమ్మునకుఁ దల్పను దీనిని సత్య మంచునున్
భగభగ మండు నాదు మది పన్నుగ స్వప్నమె యంచు నెంతు నే
నగపడ దెట్టి దైవ మిల నారయఁ గాలము కన్న మిన్నగాఁ 8.

దగునె పరుండ రామునకు ధాత్రిని నక్కట యివ్విధమ్ముగన్

తే.గీ. అవనిజ విదేహ రాజవ రాత్మజాత
సీత ప్రియ దర్శన దయిత చెన్నుగ రఘు
రామునకుఁ గోడ లా దశరథునకు శయ
నించె నేలపై నక్కట యెంచఁ దరమె 9.

ఆ.వె. చూడుఁ డిదియె శయ్య యేడ నిద్రించె రా
ముండు కరము దొర్లు చుండి యకట
గట్టి నేల మీద గడ్డి నలఁగె గాత్ర
మడరి తిరుగు చుండ నరయఁ గలరు 10.

ఆ.వె. అక్క డక్కడ నరయంగ నగుఁ బసిడి
బొట్టు లెల్లఁ బుడమి పట్టి తొడవు
లుండఁగ నిదురించె నుర్వి పైన ననుచుఁ
దలఁతు నే నెడందఁ దథ్యముగను 11.

ఆ.వె. ఉత్తరీయ మిచట నొప్పుగఁ దగిలి యు
న్న దన నిశ్చయమ్ము నాతి పట్టు
బట్ట పోగు లిచట వన్నెల నలరి క
న్పట్టు చున్న వెల్ల దిట్టముగను 12.

కం. సుకుమారి యైన సీత త
న కాంతుని కఠినపు శయ్య నారీమణి యుం
డి కనదు చింతఁ దపస్విని
వికార మరయ దని బాల భృశముగఁ దలఁతున్ 13.

కం. క్రూరుఁడ నే నక్కట కా
నీ రీతినిఁ గారణంబ యెవ్వరు లే న
ట్లా రాముఁడు శయనింపఁగ
ధారుణిఁ దృణ తల్ప మందు దారుణ రీతిన్ 14.

ఉ. అక్కట సార్వభౌమ కుల మందు జనించి జగచ్చయమ్మునన్ 15.

మిక్కిలి సమ్మతుం డగు నమేయుఁడు నిష్ఠుఁడు లోక రాశికిం
జక్కని రాజ్యమున్ వదలి సౌఖ్యము లెల్లను రక్త నేత్రుఁడే
నిక్కపు భూమి నిద్రిలెను నీరద వర్ణుఁ డనర్ఘుఁ డార్తికిన్

తే.గీ. ఆపద లలము కొన్నట్టి యవసరముల
రాము ననుసరించిన యట్టి లక్ష్మణుండు
సుశుభ లక్షణుం డఖిల వసుధఁ దలంప
ధన్యుఁడే మహాభాగుఁడు తథ్యముగను 16.

కం. సిద్ధార్థ జానకీ సతి
యిద్దరఁ బతితోఁ జనంగ నింపుగ వనికిన్
బద్ధానురాగమున న
య్యిద్ధ చరితు వీడ శంకయే మన కింకన్ 17.

ఆ.వె. ఏఁగ దశరథుండు వేగ దివికిఁ గాన
కేఁగ రఘువరుండు సాగి నేఁడు
నావికుండు లేని నావగఁ గనిపించు
చుండెఁ బుడమి యిప్పు డుండ లేక 18.

తే.గీ. కోర రెవ్వరు మది నైన మూరి భూమిఁ
గాననమ్మున నున్నను గాచు చుండ
బాహు యుగ్మ వీర్యమ్మున బల్లిదుండు
రాముఁ డిమ్మహాత్ముఁ డలఘు రక్తి తోడ 19.

చం. ప్రహరుల సంతతమ్ముఁ దగఁ బాలన సేసెడి వారు లేక యు
న్న హయ గజోత్కరమ్మును ఘనమ్ముగఁ గట్టడ సేయకున్ననున్
రహిఁ గన నట్టి సైన్యము పురమ్మున దోరము లుండ విచ్చి యే
యహితులు ముట్టడింపరు విషాన్నము భంగిని శూన్య రాజ్యమున్ 20.

కం. శయనింతు భూమిపై లే
క యర్జునపు శయ్య పైనఁ గతుకుచు ఫలముల్
నియతిన్ వేరులు జడలు ధ
రియించి నే నేటి నుండి ధృతితో నారల్ 21.

కం.  కొని యాతని ప్రతినను సే
వనమున నివసింతు రహిని౹ బరమ సుఖమునం
దనకై యుత్తర కాలము
సన నేరదు మిథ్యగాను శపథం బింకన్ 22.

ఆ.వె.  భ్రాత కొఱకు నుండ వనమున శత్రుఘ్ను౹
డుండు నాదు వెంట నుల్ల మలర
రాము౹ డయ్యయోధ్య లక్ష్మణ సహితమ్ము
పాలనమ్ము సేయు౹ బట్టణమును 23.

ఆ.వె.  చేయుదు రతని కభిషేకము రామున
కడరి విప్ర వరులు తడయకుండ
నాదు కోర్కె నమరు లాదరించి దయతో
నిజము సేయ౹ గలరె నెమ్మి నీయ 24.

కం.  నన్ను నుపేక్షింప౹గ౹ దగ
దెన్న౹డు రామునకు సే వసింతు వని ననం
బన్నుగ నతులిడ శిరసున
మన్నింపనిచో వినతిని మనుజవరుండే 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 89.

గుహు౹డు భరత శత్రుఘ్నులతో నందఱిని గంగా నదిని దాటించుట, భరతు౹డు భరద్వా
జాశ్రమమునకు వెడలుట.

కం. నిసి గంగా తటినిఁ గడపి
పెస లేచి యుదయము నందుఁ వీరుఁడు భరతుం
డు సహోదరు శత్రుఘ్ను న
రసి పలికె వచనము లిట్లు రాన్నందనుఁడే 1.

కం. నిదు రేల యింక శత్రు
ఘ్న! దరిం జేర్పఁగ ధ్వజమును గ్రక్కున గుహునిం
గదలి పిలువుమా భద్రం
బుదయం బగు నీకు శీఘ్రముగ నరుగ వలెన్ 2.

కం. అన విని శత్రుఘ్నుఁడు ని
ద్రను లేను మెలకుఁవ నుంటిఁ దలఁచుచు నార్యున్
ఘను రాముని నంచు వచిం
చెను జోదితుఁడై యనుజుఁడు శీఘ్రమ యంతన్ 3.

ఉ. వా గసమాన నైపుణులు పార్థివ సూను నరర్షభద్వయిం
జాగుచు నుండ వాక్యములు సక్కఁగ నిర్వుర మధ్య నంతటన్
వేగమ యంజలించుచును ప్రీతి నిషాద గణాధి నాయకుం
డా గుహుఁడే ప్రభాతమున నచ్చటి కింపుగ వచ్చి యిట్లనెన్ 4.

తే.గీ. సుఖముగఁ గడచినదె రాత్రి యఖిలము నది
యొడ్డు నందుఁ గాకుత్స్థ! మహోన్నతంపు
టీ బలమ్ముతో నింపుగ నిచట మీకు
లేక యెట్టి యస్వస్థత లేశ మైన 5.

ఆ.వె. గుహుని భాషణములు గూర్ప నానందము
స్నేహ పూరితములు నెమ్మనముల
రామ వశుఁడు నైన రాఘువుండు ఘనుఁడు
భరతుఁ డపుడు ప్రీతిఁ బలికె నిట్లు 6.

ఉ. చక్కఁగ గౌరవింపఁబడి సద్యశ! యెల్లర మిట్లు నీ కృపన్
మిక్కిలి సౌఖ్యవంతముగ మేము నిసిన్ గుహ! యుంటి మిత్తటిన్
మక్కువ దాట నిమ్ము మము మాతను గంగను మేటి నావలం 7.

టెక్కుల సత్వరమ్ముగను బ్రీతి దలిర్పఁగ దాశ కోటిచే

ఆ.వె. భరతు నాజ్ఞ నంతఁ బన్నుగ నాలకిం
చి వడి నేఁగి గుహుఁడు చెన్నుగ నిజ
నగరమునకుఁ దనదు జ్ఞాతి జనుల నెల్లఁ
గదిసి పల్కె నిట్లు ముదము మీఱ 8.

ఆ.వె. లెండు మేల్కొనుండు మెండగు భద్రము
కల్గు మీకు సతము కట్టుఁ డిపుడు
నావ లెల్ల దాఁటి నదిని గంగ నిపుడు
వార లరుగ వలెను బల యుతమ్ము 9.

ఆ.వె. పాలనమ్ము సేసి పన్నుగ నధిపుని
యాజ్ఞ నంత వార లప్పు డైదు
వందల పడవలను బన్నుగఁ దెచ్చిరి
యెల్ల చోట్ల నుండి యుల్లసిల్లి 10.

తే.గీ. కొన్ని స్వస్తిక సంజ్ఞలఁ గూడి యుండ
గంట లమరి యుండ ధ్వజ నికాయముల న
లంకరింపఁ బడి యడర రమ్యముగను
జక్కఁగ నిలిపి రటఁ గాలి చాప లుండ 11.

కం. ధవళంపుఁ గంబళముతో
వివృతం బయి స్వస్తికమ్ము వెలుఁగచు నుండన్
సువిశాల నావ నొక్కటి
నృవరుండు గుహుండు తెచ్చె నెగడఁగ ధ్వనులన్ 12.

మ. రుచిరంబౌ తరి నెక్కి రా భరత శత్రుఘ్నుల్ మహోత్సాహులై
శుచులై యెక్కిరి యా సుమిత్రయును సంక్షోభార్త కౌసల్య ము
న్న చరింపంగఁ బురోహితుండు గురువుల్ నందంబునన్ బ్రాహ్మణుల్
ప్రచురమ్ముల్ శకటమ్ము లింక సరకుల్ రాజాంగనల్ సేరఁగన్ 13.

ఆ.వె. శిబిరములకు నిప్పు సేర్చు వారి దిగెడు 14.

వారి రేవు నందు వస్తు రాశి
నిఁ దరలించు వారి నిస్వనమ్ములు మూరి
యంటు చుండె నపుడు మింటి వింత

కం. పెలయం బతాకములు పడ
వలు జాలరు లెల్ల నెక్కి పట్టియుఁ దెడ్లన్
లలితమ్ములఁ జనఁ జాగిరి
జలమున రయ మతిశయింప సంభ్రమ మడరన్ 15.

తే.గీ. నావ లట కొన్ని నిండెను నారులఁ దగ
గుఱ్ఱముల తోడ నిండెను గొన్ని కొన్ని
బండ్ల లాగు నెడ్లను నిండెఁ బరమ విత్త
రాశి నిండెను మఱికొన్ని రమ్యముగను 16.

కం. చేరి యపర తీరమ్మును
వారిని నెల్లరను దింపి పన్నుగ నంతం
దోరపు నైపుణ్యమ్మునఁ
జేరిరి జాలరులు తిరిగి స్వీయాలయముల్ 17.

ఆ.వె. టెక్కెములను గూడి యక్కుంజరమ్ములు
తోల మావటీలు తోఁచె నీట
నీద జెక్క లున్న యిద్ధ పర్వతముల
భంగి ముద మొసఁగ నపారముగను 18.

ఆ.వె. పడవ లెక్కఁ గొంద అడరి తెప్పల పైనఁ
గొంద అరుగ నెమ్మి కుండ లూని
కొందఱు నది దాటఁ గొంద ఱింకను నిజ
కర యుగముల నీది యరిగి రటకు 19.

తే.గీ. పుణ్య వాహిని దాఁటింప మూరి దాశ
జనులు బహు పుణ్యవాహిని స్వయముగాను
బయన మైరి యంతఁ బ్రయాగ వనము వైపు
చక్క మైత్ర ముహూర్తంపు సమయ మందు 20.

తే.గీ. నిలిపి సైన్యమ్మును యథేచ్ఛ లలితముగ మ
హాత్ముఁ డా భరతుండు శుద్ధాంతరంగుఁ
డరయ నా భరద్వాజ మహర్షి నంతఁ
గదలె ఋత్విక్కులను గూడి గౌరవమున 21.

కం. అమర పురోహితు బ్రాహ్మణు
విమ లాశ్రమము భరతుండు ప్రీతిఁ గదిసి పే
గ మరసెఁ గుటీరముల వృ
క్షముల వెలుఁగు చున్న దానిఁ జక్కని దానిన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నెనుబది తొమ్మిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 90.

భరతుఁడు భరద్వాజుని యాశ్రమమును గోసు దూరమునఁ గని సైన్యము నెల్ల నచట నుంచి యస్త్రములను విడిచి వసిష్ఠునితో భరద్వాజునిఁ జూచుట, భరద్వాజుఁడు రాముఁడు భార్యతోను దమ్మునితోను జిత్రకూటమున నుండె నని వచించుట, యా రాత్రి యాశ్రమమున నుండి మరునాఁడు రాముని చూచుట కేఁగ నిశ్చయించుట.

కం. కని కోసు దూర మందున్
ఘనుని భరద్వాజు మఠము కాకుత్స్థుండే
తన సైన్య మెల్ల నిలిపి చ
నెను మంత్రులఁ గూడి నడక నిశ్శస్త్రములన్ 1.

ఆ.వె. ధర్మవిదుఁడు రాము తమ్ముఁడు విడిచి నృ
ప వసనములు కట్టి పట్టు బట్ట
లను బురోహితుని భరతుఁడు తగ నునిచి 2.

ముందు నా వసిష్ఠు మూరి వెడలె

తే.గీ. ముని భరద్వాజు వీక్షించి యినకులుండు
భరతుఁ డంత నిలిపి మంత్రి వరుల నెల్ల
ననుగమించెఁ బురోహితు నా వసిష్ఠుఁ
జేర సంయమీంద్రుని భక్తి శీఘ్రముగను 3.

ఉ. ఆ జనవంద్యు మౌని వరు నారసి రాఁగ వసిష్ఠు నా భర
ద్వాజుఁడు రాఘు వాత్మజునిఁ దద్దయు సంభ్రమ మంది పీఠ మం
దోజను లేచి శిష్య తతి నొప్పుగ నర్ఘ్యముఁ దేరఁ బంచియుం
దాఁ జనె నా వసిష్ఠ ముని దాపున కా భరతుం డిడన్ నతుల్ 4.

తే.గీ. దశరథ కుమారు గుర్తించి తాపసుండు
నా భరద్వాజుఁడు సుమహా యశుఁడు వారి
కొసఁగె నర్ఘ్యము లింపుగ నుత్తమములు
ఫలములు క్రమముగాను గుశలము లడిగె 5.

ఆ.వె. అయ్యయోధ్య యందు నడిగె మంత్రి బల కో
శ సఖుల కుశలముల సంయమీంద్రుఁ
డడుగఁ డెఱుఁగ దశర థావనీశు లయ ము
తథ్య నందనుండు ధరణిసురుఁడు 6.

ఆ.వె. ఆ వసిష్ఠ భరతు లడిగిరి భద్రము
మేను లగ్ని తరుల మేటి శిష్య
జనుల విహగ బృంద జంతు జాలమ్ముల
నాశ్రమమ్ము నందు నడరి మునిని 7.

కం. కుశలం బంతయు నంచును
విశదమ్ముగఁ బల్కి తపసి విఖ్యాత మహా
యశుఁడు భరద్వాజుఁ డడిగె
దశరథ సుత రామ సఖ్యత భరతు నిట్లున్ 8.

తే.గీ. కారణం బేమి రాకకు నో రఘూద్వ 9.

హుండ! రాజ్యము నేల మహోన్నతమ్ము
నిటకు సంశయ మయ్యె నా కెడఁద లోన
నిజము వచియింపు సర్వము నీరజాక్ష!

తే.గీ. అరిదమనుఁడు కౌసల్యాతి హర్ష వర్ధ
నుండు సభ్రాతయు ససీత నొగిలి వనికి
నేఁగెఁ జిరకాల ముండ మహీశుఁ డంప
వనిత మాటలఁ బదునాల్గు వర్షములకు 10.

కం. తలఁచితె పాప మపాపికి
నిల కంటక హీన భూమి నేలఁ దలఁచుచుం
జలుపంగ రామునకు నిం
క లక్ష్మణున కెట్టి దయినఁ గాకుత్స్థ వరా! 11.

కం. పలుక భరద్వాజుఁ డిటులఁ
గలవర మంది నయనములఁ గాఱఁగ నశ్ర
మ్ములు దుఃఖమ్మున భరతుఁడు
పలికె బదులు తడబడంగ వాచ్యము లిట్లున్ 12.

చం. అన భగవంతుఁ డిట్లు ముని యక్కట నేను హతాశుఁడం జుమీ
యనఁ దగ దిట్లు నన్నిట మహాత్మ! వితర్కము కూడ దింతయున్
జననియె నేను లేని యెడ శాసన మిచ్చెను నే సహింప నో
పను వచనమ్ము లెల్ల నవి పాపపుఁ గర్మము నొల్ల నెన్నఁడున్ 13.

ఆ.వె. వేఁడి రాము నిటకుఁ దెక్కు విధమ్ముల
నర వరేణ్య నా వనమున నుండి
తేఁ దలంచి ప్రీతిఁ బాదము లంటి మ్రొ
క్కఁగను వచ్చితిని వికలపు మదిని 14.

ఆ.వె. ఎంచి యివ్విధమ్ము మించి యనుగ్రహిం
పంగ నర్హు లెలమిఁ బన్నుగ నను
రాముఁ డవని భర్త యో మునిపుంగవ!
దేవ! యెచటఁ గలఁడొ తెలుపఁ గలరు 15.

మత్తకోకిల అవ్వసిష్ఠుఁడు నింక ఋత్విజు లట్ల పల్కఁగఁ దాపసుం
డవ్వలన్ వచియించె నబ్బర తాఖ్యుఁ గాంచుచు మెచ్చుచున్
నవ్వుచున్ రఘు వంశ మందు ఘనమ్ముగాఁ దగు దెన్న నీ
వివ్వసుంధర సచ్చరిత్ర! జితేంద్రియా! సుజనావనా! 16.

తే.గీ. ఇంక ననె భరద్వాజ మునీంద్రుఁ డిట్టు
లెఱిఁగియును నీ మదిని నున్న దెల్లఁ దెల్ల
ముగ నడిగితి దృఢపఱప నెగడ నీదు
యశము ధరను నరర్షభ! యత్యధికము 17.

కం. సేరుదు ధర్మజ్ఞుం డా
యా రాముఁడు సీత తోడ ననుజుని తోడన్
మూరుచును జిత్రకూటము
నా రమ్య గిరిని వసించు నరపుంగవుఁడే 18.

ఆ.వె. నేఁ డిచట వసించి పొడిగ మంత్రులం
గూడి రే పచటికిఁ గూర్మి నాదు
కామనఁ దగఁ దీర్చి కామార్థ కోవిద!
యేఁగ నర్హుఁడవు నరేంద్ర! యెలమి 19.

కం. పలుక విని యట్టులే యని
లలిత విశాల హృదయుఁడు భరతుఁ డా మునితోఁ
దెలియఁబడఁ దనదు రూపము
నిలువఁ దలఁచె నాశ్రమమున నృప సుతుఁడు నిశన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 91.

భరతునకు సపరివారము రాజార్హ మైన యద్భుతాతిథ్యము రాజోచితాసనము నన్య వ
రాసనములతో విరాజిల్లు నిజాశ్రమమున భరద్వాజ మహర్షి యొసఁగుట.

కం. కని యా కైకేయీ నం
దనుని వసింపఁ దలపంగఁ దాపసి యింటన్
ముని వరుఁడు భరద్వాజుఁ డ
తనిఁ దన యాతిథ్యమునకుఁ దరలఁగఁ బిలిచెన్ 1.

తే.గీ. భరతుఁ డంతఁ బలికె మునివరుని తోడ
వినయముగను మీ రొసఁగ నీ వనము నందుఁ
బాద్య మర్ఘ్యము లెల్లఁ గృపారసమున
మించి యాతిథ్య మందితి మంచితముగ 2.

కం. అన విని నవ్వుచుఁ బల్కెను
ఘనుఁడు భరద్వాజుఁ డంతఁ గాకుత్స్థునితోఁ
దనియెద వం చెఱుఁగుదు నొసఁ
గ నే దయిన దాని తోడఁ గమనీయముగా 3.

ఉ. ఉంచితి వేల దూరమున యుష్మ దఖండ బలమ్ము నివ్విధిం
బంచ వదేల సైన్యమును బార్థివ నందన నిల్వ నిచ్చటన్
మించిన నీ బలమ్మునకు మేలుగ భోజన మీ దలంతు నీ
వుంచుమ నాకుఁ బ్రీతి యయి యొప్పెడు రీతిని నీదు చిత్తమున్ 4.

చం. భరతుఁడు పల్కె నంతఁ దగఁ బ్రాంజలి నివ్విధి సంయమీంద్రుతోఁ
బరఁగిన మీ భయమ్మునను బాడిగ దేవ! సుదూర మందు నా
గురుతర సైన్య ముంచితిని కూడదు తేనికి రాచ బిడ్డకున్
వరముని యాశ్రమమ్ముల సవాహిని చేర సతమ్ము నెంచఁగన్ 5.

చం. హయములు మత్త కుంజర నరావలి నిండి ధరాతలమ్మునుం
బ్రియముగ నాదు వెంటఁ జను వృత్తిని వచ్చెను దేవ పుంగవా!
రయమున నాశ్ర మావరణ రంజిత వృక్ష కుటీర వారులన్ 6.

లయ మొనరింప రాదను తలంపున నొక్కఁడ నేఁగుదెంచితిన్

తే.గీ. సేన నెల్లను రావింపు నా ననంగ
మునివరేణ్యుఁడు భూవరు పుత్రుఁ డంత
నాన తిచ్చె నిక్ష్వాకు మహా ధ్వజమున
కడరి చేర సంయమివరు నాశ్రమమును 7.

తే.గీ. చేరి యగ్ని శాల విమల నీరము గొని
కడిగి హస్తపద్మమ్ముల నడరి నొసఁగ
వారి కాతిథ్యమును భరద్వాజుఁ డెలమి
విశ్వకర్మ నెదఁ దలంచి పిల్చె నిట్లు 8.

ఉ. విందు నొసంగ నెంచితిని ప్రీతినిఁ ద్వష్టను విశ్వకర్మ నా
చందము సేయఁ గోరుచును జక్కగఁ బిల్చుచు నుంటి నిత్తఱిన్
డెందము నందు మ్రొక్కుచుఁ గడింది స వాసవ లోకపాలురన్
వందితు లైన ముగ్గురను బన్నుగ వే సమకూర్ప నన్నిటిన్ 9.

చం. భువి దివు లందు పాఱునవి పూర్వ దిశాపర దిక్కు లేఁగు న
ట్టి వర నదీ నదమ్ములును ఠీవి యెలర్పఁగ వేగ రాఁ దగున్
వివిధము లన్య వాహినులు వెల్లువలై ప్రవహింపఁ జేయుఁ గా
క విరివి మద్యముల్ చెఱకు కల్లును నిక్షు ని భోదకమ్ములన్ 10.

తే.గీ. ఎలమి నింక నాహ్వానింతు నిట హహా హు
హూల విశ్వావసు వియచ్చరోత్కరముల
నిద్ధ గంధర్వుల సతుల నింక నప్స
రసల సకల దిక్కుల నుండి రక్తి తోడ 11.

ఆ.వె. మృగనయన ఘృతాచి మిశ్రకేశి నలంబ
సను హిమను నగమ వసనను హేమ
నింక నాగ దంత నింతి విశ్వాచినిఁ
బిలుతును జనుదేర వీరి నెల్ల 12.

ఆ.వె. ఇంద్రు చెంత నున్న యింతుల నెల్లర 13.

బ్రహ్మ వద్ద నడరు పరమ గాయ
కులను సపరివార మల తుంబురుని గూడి
యాదరముగఁ బిలుతు నలరి రాఁగ

కం. కురు భూముల సతము వెలుఁగు
గురుతరపుఁ గుబేర వనము కూడ దళమ్ముల్
వర వస నాభరణము లయి
సుర నారీ ఫల యుతమ్ము చొప్పడు నిచటన్ 14.

ఆ.వె. భక్ష్య భోజ్య లేహ్య వర చోష్యములు వివి
ధముల నన్నములను విమల సోముఁ
డింపుగ సమకూర్ప నిచ్చట వేడుదు
నుత్పల ప్రియ విభు నుత్సహించి 15.

ఆ.వె. తరుల నుండి రాలుఁ దరళ మాలలు నింక
మద్యములు బహు విధ మాంసము లను
చును సమాధి నిలిచి ఘన తపో నిష్ఠ వే
దస్వరములఁ బలుకఁ దపసి యపుడు 16.

ఆ.వె. తలఁప మనసు నందుఁ దాపసి ప్రాఙ్ముఖుఁ
డయి కృతాంజలిఁ దగ నమరు లెల్ల
విడి విడిగ నచటకు వేగమ వచ్చిరి
సంయమీంద్రుఁ గాంచఁ జక్కఁగాను 17.

చం. అనిలుఁడు తాఁకి దుర్దర మహా మల యాద్రుల యుక్త రీతినిం
దనువుల నున్న స్వేదములు దద్ద తొలంగఁగ వీచెఁ బ్రీతినిన్
ఘనముగఁ బుష్ప వర్ష మటఁ గాఱె వియత్తల మందు నుండి ని
స్వనములు మ్రోగ దుందుభులు పన్నుగ విన్పడె నెల్ల దిక్కులన్ 18.

తే.గీ. వీచె మంచి గాలులు సురవేశ్య లెల్ల
రాడి రింపుగ గంధర్వు లమరు లింకఁ
బాడ వినిపించె వీణా రవములు లయయు
వెలయ స్వర్భూమి జనులకు వీను లందు 19.

కం. విన సొంపులు దివ్యము లగు
నినదము లణఁగంగ భరతుని ధ్వజిని యెల్లం
గనె విశ్వకర్మ కర్మం
బు నద్భుతంబును మనముల మోదం బలరన్ 20.

తే.గీ. ఐదు యోజనముల భూమి యడర సమ త
లముగఁ గడు లేత పచ్చికలను వెలుఁగుచు
మిక్కుటముగఁ గన్పట్టెను మేలి నీల
వర్ణ వైడూర్యముల వలె వఱలు చుండి 21.

కం. వెల్వడె మాదిఫ లాగమ
బిల్వామలక పనస స కపిత్థామ్ర తరుల్
చెల్వముగ ఫలాభరణ
మ్ముల్విరివిగఁ జూచు చుండ ముని వాటికలో 22.

తే.గీ. ఉత్తర కురు భూముల వెలయు వన మంద
లి నదు లెల్ల నరుగు దెంచె ఘన తరువులు
తీర మందు భాసిలు చుండ దివ్య భోగ
వంతములు ముని వాటికిఁ జెంత కడరి 23.

కం. వెలసెను శుభ్ర చతుశ్శా
లలు గజ హయ శాలలు విమల ప్రాసా దా
వలులు భవనములు తోరణ
ము లనేకములు కడు శ్రేయములు చిత్రముగన్ 24.

చం. సిత ఘన సన్నిభమ్ము సవిశిష్ఠ సమంచిత తోరణమ్ములున్
వృత సుమ మాల్యభాసితము ప్రీతి నొసంగెడి దివ్య గంధ సం
యుతము విశాల చత్వర సుయోజిత సచ్ఛయ నాస నాది క
ల్పితము స పాన భోజన సలేహ్య సుధౌత విశుద్ధపాత్రలన్ 25.

తే.గీ. వివిద భక్ష్యము లలరార వివిధ వస్త్ర
సంచయము లమర వివి ధాసనము లడర 26.

సెల్లరకును శయ్యలు విలసిల్ల దుప్ప
టుల నచట రాజవేశ్మము వెలసెఁ ద్రుటిని

చం. భరతుఁడు కైక నందనుఁడు పన్నుగ నీయ ననుజ్ఞ నత్తప
స్వి రుచిర రత్నపూర్ణ నృప వేశ్మము సేర సుదీర్ఘ బాహుఁ డ
గ్గురు సచివుల్ పురోహితులు గూర్మి సెలంగ సెడంద లందు నే
గిరి భవనంపు టట్టి విధికిం గడు సంతస మంది యెల్లరున్ 27.

మ. రమణీయమ్ముగ వెల్గు దివ్యపు మహా రాజాసనం బచ్చటన్
విమలాత్ముండు సమంత్రి కోటి కని రీవిం జేరి రాడ్లీల ఛ
త్రము వాలవ్యజనమ్ములం గొనుచుఁ దాఁ దత్పీఠముం గొల్చి చి
త్తము నందన్నకు మ్రొక్కి కూర్చొనియె నంతన్ మంత్రి పీఠమ్మునన్ 28.

తే.గీ. మంత్రి గణ పురోహితులు క్రమముగ సెల్ల
రచట నాసీను లయి యుండ నంత సెలమి
సేన కధి నేత లెల్ల రాసీను లయిన
పిదప కూర్చొనె ముఖ్యుఁడు విడిది కెల్ల 29.

తే.గీ. అంత నొక్క ముహూర్తమ్ము నందుఁ బాయ
సమ్ములే పంకములు కాఁగఁ బమ్మి వేగ
భరతు రాఘవేంద్రు నెదుటఁ బరమ నదులు
చక్కఁ గదిసె భరద్వాజు శాసనమున 30.

ఉ. వానికిఁ గూల యుగ్మములఁ బన్నుగఁ దెల్లని లేపనమ్ములం
గానఁగ వచ్చె వేశ్మములు కంజుని పంపున సుందరమ్ములున్
మానిను లేఁగు దెంచిరి ఘనమ్ముగ నిర్వది వేల సంఖ్యలే
యా నలు మోములయ్య దయ నంతట దివ్య విభూషి తాంగనల్ 31.

ఆ.వె. పసిడి పచ్చఱాలు పగడమ్ము లలరంగ
వే లిరువది మంది వెలఁదు లంప
నా కుబేరుఁ డిటకు నా సమయమ్మున
నరుగుదెంచి రెల్ల తరుణు లడరి 32.

కం. చెచ్చెర మత్తులుగా నరు
లచ్చెలువల ముట్టి నంత నగుపించెడు నా
యచ్చర లిర్వది పేవురు
వచ్చిరి నందనము నుండి భామామణులే 33.

ఆ.వె. పాడఁ జాగి రంత భరతు చెంతను నార
దుండు గోపుఁ డింకఁ దుంబురుండు
ఘన దినకర నిభులు గంధర్వ రాజులు
ముఖ్య గాయకులు సముచిత రీతి 34.

కం. తమిఁ బుండరీక వామన
యు మిశ్రకేశియు నలంబు నోజ్వలముఖి నృ
త్య మొనర్చిరి భర తాగ్రము
న ముని భరద్వాజ శాసనమునం దరుణుల్ 35.

కం. అమరుల మాలలు ధనదు వ
న మం దడరు దండ లిచట నరులకు నిడ మో
ద మెడఁద లందుఁ బ్రయాగ వ
నమున భరద్వాజ శాసనమునఁ గనఁబడెన్ 36.

తే.గీ. బిల్వతరు తాళ పాదప పిప్పలమ్ము
లయ్యెను మృదంగ ఘన వాద్య హస్త తాళ
వాద్య కారక నర్తక వ్రజము భంగిఁ
జక్కఁగ ముని భరద్వాజ శాసనమున 37.

ఆ.వె. సరళ నక్తమాల తరులు తాళ తిలక
పాదపములు ముదము వడసి కుబ్జ
లు నయి గూను లగుచుఁ దనరి మిగుల నిల్చెఁ
జక్కఁగ ముని వరుని శాసనమున 38.

తే.గీ. ఇరుగు డుసిరి సేరేడులు నింక వనుల
నున్న యన్య వృక్షమ్ములు సన్న జాజు
లింక మల్లెలు జాతుల నెల్ల లతలు 39.

వనితలై ముని వాటికఁ బలికి రిట్లు

తే.గీ. త్రాగ నెంచు వారు తనియఁ ద్రాగుఁ డిపుడు
మద్య మడరి యథేచ్ఛగ మఱియుఁ దినుఁడు
నాకలిని నున్న వారెల్ల వీఁకఁ బాయ
సమ్ము లింక మాంసమ్ముఁ జిత్తమ్ము లలర 40.

తే.గీ. అలది నూనె మర్దించియు నబల లంత
నేడు నెనమండ్రు నొక్కొక్కని నదులందు
స్నాన మాడించి రందఱిఁ జక్కగాను
దుడిచి రింకఁ ద్రావించిరి తొయ్యలు లల 41.

ఆ.వె. జంతు పాలకులు గజమ్ముల హయముల
గాడిదలను నెడ్లఁ గదిసి తగిన
రీతిని దినిపించిరి యథా విధమ్ముగ
భోజ్యములను గుక్షి పూర్ణములుగ 42.

తే.గీ. ప్రేప నిక్ష్వాకు యోధులు ప్రేమ తోడ
వారి వారి వాహనముల బల్లిదులు మ
ధువు కలిపిన యన్నమ్మును దోరపుం జె
ఱకు గడలు తినిపింప వఱలిరి యంత 43.

చం. తమ తమ యశ్వరాజములఁ దామె యెఱుంగఁగ నోప రాశ్వికుల్
దమ తమ కుంజరమ్ములను దామె యెఱుంగరు వింత మావటుల్
ప్రమదము తోడ మత్తిలెను బన్నుగ సైన్యము తీరఁ గోర్కె లె
ల్ల మసల నప్సరోజనులు రంజిలి పల్కిరి గంధ చర్చితుల్ 44.

తే.గీ. పట్టణ మయోధ్య కేఁగము నట్టడవికి
దండకా వని కేఁగము మెండుగ నగు
భద్రము భరతునకు నింక వడయు సుఖము
రాముఁ డచ్చట వసియింప రమ్యముగను 45.

కం. భరతు ననుయాయులు నరులు 46.

పరమ ముదము నంది యంత  ధ్వనులం గడు సే
సిరి బిగ్గరగ మఱియుఁ బ
ల్కిరి స్వర్గం బిది యని తగఁ గేళీ లీలన్

కం. పేల కొలఁది సైనికు లటఁ
జాల మురిసి పర్వు లిడిరి చక్కఁగ మెడలో
మాలల నాడిరి పాడిరి
కోలాహలముగ హసింప గోత్రం బదిరెన్ 47.

ఆ.వె. అమృత తుల్య మన్న మా దివ్యము నరయ
భక్ష్య రాజములను బన్నుగ భుజి
యించి నట్టి వారి కింకను దిన బుద్ధి
కల్గె మనము లందుఁ జెల్గె  నాశ 48.

ఆ.వె. తనిసి రెల్ల రచటఁ బనికత్తె లింక దూ
తలు భటులు వధూమణులును పేల
మంది భద్రముగ నమలిన వస్త్రమ్ముల
నలరి నట్టి వారు నంచితముగ 49.

తే.గీ. ఎద్దు లొంటె లేనుంగులు నింక గాలి
గాండ్లు గుఱ్ఱమ్ములు పెను మెకములు  పులుఁగు
లెల్లఁ దనియంగ నొండొరు లెట్టి పోరు
లెఱుఁగ కుండ నిల్చిన విట నెలమి మీఱ 50.

కం. మాసిన బట్టలు బూడిద
పూసిన సిగ లాకలి కడుపులు గల నరులన్
పేసిన గాలము కానము
వాసి యయిన ముని వరేణ్యు  వాసము నందున్ 51.

తే.గీ. అజ వరాహ మాంస చయము లచట మజ్జి
గ పులుసులు పండ్లు నింకఁ బక్వంపు పప్పు
లు ధవలాన్న రాసుల నలరు నినుప తళి
గలను విరులతో పేపేలు గనిరి నరులు 52.

తే.గీ. నూతు లా కాన ప్రక్కనఁ బ్రీతి నీయ
నిండెఁ బాలకూటిని గోవు లుండె కామ
ధేనువుల భంగి తరు లెల్లఁ దేనె లొలుకు
చుండె ముని భరద్వాజు విశుద్ధ మహిమ 53.

తే.గీ. దిగుడు బావులు నిండెను దేట చెఱకు
రసములను పేడి కుండల రమ్యముగను
జింక కోడి నెమళుల విచిత్ర మాంస
ము లడరెను మిక్కుటమ్ముగ మోద మీయ 54.

సీ. వేల పాత్రలు పదివేల గిన్నెలు వంద కోట్ల పళ్లెరములు గొప్ప పసిడి
మయములు బిందెలు మట్టి కుండలు నెల్ల నిండ పెరుఁగు పేల పిండి తోడ
నింక శుద్ధమ్ము లయిన తెల్ల క్రొంగ్రొత్త పెరుఁగుతో నింకయు వెలఁగ రుచిని
వెల్గు దధుల తోడ విరివిగా నచ్చోట నమరి యుండఁగ మదు లంద ముదము
ఆ.వె. రసము నిండి నట్టి రమ్యంపుఁ గొలనులు
పెరుఁగు నిండగా నితరము లుండఁ
బాయసమ్ము లింక పటిక బెల్లము తోడ
భక్ష్య రాజము లగపడెను మిగుల 55.

కం. సరసి తటుల వీక్షించిరి
నరులు పొడులఁ జూర్ణములను స్నానార్థంబై
వర భాజనమ్ములఁ గషా
య రాజములు భాసిలంగ నానందముగా 56.

సీ. ధవళపుఁ గుంచెలు దంతంబులను దోము సంభారము లమరెఁ జక్కఁగాను
దెల్లని చందన దివ్య చూర్ణమ్ము లుండెను దొన్నెలందు మోహనముగాను
తుడిచిన యద్దమ్ము లడరెను బట్టల పోగు లచ్చట నుండె ముద్దు గొలుప
వేవేల జోళ్లట వెలసె జతల తోడ దువ్వెన ల్కాటుక తోర మమరెఁ
తే.గీ. గుంచెలను గూడి ధనువులు కోలలు కవ
చములు చిత్రమ్ము లమరెను శయ్య లాస
నమ్ములు వెలసెఁ ద్రావ ప్రాదమ్ము లుండెఁ
గుంజ రోష్ట్ర ఖర తురగ పుంజములకు 57.

తే.గీ. కలువలను గూడి కొలనులు వెలసె మునుఁగ
గగన వర్ణాభ విమ లోదకముల తోడ
నిలువఁ బశువులు కన్పట్టె నీప తరులు
నింక దినఁ బచ్చని గఱిక లెలమి నమరె 58.

కం. కలలో ననంగ యద్భుత
ముల నాతిథ్యమ్ము నీయ ముని హర్షమునన్
లలి మీఱ భరతునకు మన
ముల నాశ్చర్యము వడసిరి పూరుషు లెల్లన్ 59.

కం. నిసి గడచె వార లివ్విధి
వసింప మునిపుంగవుని నివాసం బందున్
పెస రమియించుచు మిక్కుట
ము సురలు నందన వనమునఁ బోలెం బ్రీతిన్ 60.

ఆ.వె. కాంతలు నదు లింక గంధర్వులును భర
ద్వాజు నాజ్ఞ తోడఁ దరలి రెల్ల
వారు వచ్చి నట్టి దారిని నింపుగ
ముగియ పేడ్క లట్లు మురిపెముగను 61.

తే.గీ. మద్య మానిన మనుజుల మత్తు నిలిచె
నద్ది నట్టి చందన గంధ మట్లె యుండె
నరులు నల్పిన దండలు మరులు గొనుచు
విసర విడివిడిగఁ జెదరి వెలసె నట్ల 62.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది యొకటవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 92.

భరతుఁడు పరివారముతో నారాత్రి ముని యాశ్రమమునఁ గడపి మరునాఁడు భరద్వాజుని యనుమతిఁ గైకొని రాముని౯ జేరుటకునై చిత్రకూట పర్వతమునకుఁ బయన మగుట.

తేగీ. కొని భరద్వాజు నాతిథ్యమును భరతుఁడు
స్వపరివారము తో నా నిశను గడపెను
దనదు కోరికం దలఁచి యెద వడి నరిగె
ముని భరద్వాజు చెంతకు ముదము తోడ 1.

కం. భరతుని౯ బ్రాంజలి వచ్చెడి
నరర్షభుని౯ దాపసుం డనల కార్యమ్ము౯
నెరవేర్ప యథా విధముగ
నరసి పలికె భాషణమ్ము లంచిత రీతి౯ 2.

చం. కడచెనె నా గృహమ్మున సుఖమ్ముగ రాతిరి రాఘువాత్మజా!
పడసెనె తృప్తి నీదు పరివారము నే నిడ నాతిథేయముం
గడు విమ లాత్మ పల్కు మనఁగా భరతుం డనె మ్రొక్కి యంజలిం
బడసెను దేవ! కామములు వాహన మంత్రి ససైన్య వర్గముల్ 3.

తే.గీ. దూతలను గూడి మేమెల్ల వీత తాప
తను పరిశ్రమల సుఖము దనరఁ గణ పె
ఋంగ నట్టి మీ యాశ్రమ ప్రాంగణమునఁ
బ్రీతి వసియించితిమి దేవ! రాతి రడరి 4.

చం. అనుమతి మిమ్ము వేడెద మహాత్మ! మునీశ్వర! యన్న చెంత కేఁ
జన వలె స్నేహ వీక్షలు ప్రసారము సేయుఁడు మా పయి౯ దయ౯
వనమున రాము నాశ్రమపు బాటను దెల్పుఁడు దూర మెంత యుం
డు నిటకు ధర్మవేత్తను గడుంగడు ధార్మికుఁ జూడ నెంచెద౯ 5.

కం. బదు లిచ్చె భరద్వాజుఁడు
విదిత మహా తేజుఁడు ముని వృషభుం డంతం 6.

గదియంగ వడి  ని జాగ్రజు
సెద నువ్విళ్లూరు భరతు సెలమిం గనుచున్

తే.గీ. మూడును నర యామడ దూరమునను భరత!
చిత్రకూట మనెడు గిరి శ్రేష్ఠము సెల
యేరులను గూడి తరు లెల్ల నింపు గొలుప
రమ్యముగ నలరారు నరర్షభుండ! 7.

ఉ. ప్రాకట మైన యట్టి నది పాఱుచు నుండును రాఘవేంద్ర! మం
దాకిని యుత్తరంపు దిశఁ దద్దయు వెల్గుచుఁ బుష్పి తేద్ధ వృ
క్షాకర కాననమ్ముల కనంతర ముండును జిత్రకూటమే
యా కడ నుంద్రు రాఘవులె యంచిత పర్ణకుటీర వాసులై 8.

తే.గీ. దక్షిణ పథము నందు రథ గజ తురగ
సంయుత ధ్వజినిం గూడి సైన్య నాథ!
లేక నైరృతిని ననుసరించి యేఁగఁ
గాంచెదవు తథ్య ముగను రాఘవుల నచట 9.

కం. పయనంపుఁ బల్కు లవి రా
జ యోషితల చెవులఁ బడఁగ శకటార్హలు మూ
రి యపుడు రథములు దిగి వే
గ యవని సురుఁ జుట్టి రంతఁ గౌసల్యాదుల్ 10.

ఆవె. దీనముగ వణఁకుచు దేవి కౌసల్య సు
మిత్ర తోడ సంయమి వరు చరణ
పద్మ యుగము నంతఁ బట్టె భక్తి దనర
గురు కృశాంగి కదలి కోమలముగ 11.

ఆ.వె. తీర నట్టి కోర్కి నారి కైకేయి సి
గ్గును నతిక్ర మించి ముని వరేణ్యు
పాద పద్మములను బట్టె సకల లోక
గర్హిత దశరథుని కాంత యంత 12.

కం. మునికిం జేసి ప్రదక్షిణ
మును దీన మనస్విని యయి పుత్రునకుం జెం
తను నిల్వఁ గైక భరతునిఁ
గని మాతల ముని విడివిడిగఁ దెలుప మనియెన్ 13.

కం. విని యిట్లు భరద్వాజుఁడు
ముని ధీమంతుఁ డన రాజపుత్రుఁడు వినయ
మ్మునఁ జేతులు మొగుడిచి ప
ల్కెను వాక్య విశారదుండు గిర లిట్బంగిన్ 14.

మ. స్థిర చిత్తాన్విత రామ మాత సుకృశ స్వీయాంగఁ దచ్ఛల్యనుం
దరుణీ రత్నము దేవి తండ్రికిని శుద్ధ స్వాంత సాకల్యనుం
బురుష శ్రేష్ఠునిఁ గన్న తల్లి సుర సంపూజాత్త కైవల్య వ
ల్లి రమామ ణ్యదితి ప్రతిం గనుఁడు గౌరీ తుల్య కౌసల్యనున్ 15.

మ. కనుఁడీ యచ్చట దేవ! సన్మతిని నక్కాంతా మణిం బుత్ర ని
ర్గనవా సార్తను వారి నేత్ర యుగఁ గౌసల్యా సతీ మిత్రనున్
ఘన హృద్భాస పవిత్ర లక్ష్మణ మహా గంభీర శత్రుఘ్నులం
దనయ ద్వంద్వముఁ గన్న మాతను సుమిత్రన్ శుద్ధ చారిత్రనున్ 16.

మ. నర శార్దూలుల దుఃఖ కారకను భూనాథక్ష యోద్యోగనుం
బరమ క్రోధను భాగ్య మానిని మహా భాగ్యార్థినిం గాంచుఁడీ
పర మానార్యఁ దదార్య రూపిణిని మద్బాధా నిమిత్తాంగనన్
గురు పాపోత్కర నిశ్చ యాత్మ జననిం గ్రూరాత్మఁ గైకేయినిన్ 17.

చం. పలుక నరర్షభుం డిటుల భాష్పజ లావృత గద్గదస్వర
మ్ములఁ గడు నిశ్వసించుచును మూరిన కృద్ధ ఫణీంద్రు భంగినిం
బలికెను గాంచి యా భరతుఁ బార్థివ సూనుని సంయమీంద్రుఁడే
లలిత తరంపు బుద్ధి వఱలన్ మృదు సూక్తులు నర్థవంతముల్ 18.

తే.గీ. దోష మంచును మాతను దూఱ రాదు
భరత నీ కిప్పగిది రామ వన వివాస
నము పరమ సుఖదం బగు నర వరేణ్య! 19.

నిశ్చయమ్ముగ వల దిందు నీకుఁ జింత

ఆ.వె. దేవ దానవ ముని భావితాత్ముల కెల్ల
రకు హితమ్ము నొసఁగు రాఘవేంద్రు
పుర బహిష్కరణము భరత! విచారము
వొందఁ దగదు నీకు డెంద మందు 20.

తే.గీ. అంతఁ బ్రణమిల్లి యమ్మని కాచరించి
తగఁ బ్రదక్షిణం బనుమతిని గొని భరతుఁ
డానతి నొసంగె సేనకు నడరి తరల
మంచు పేగిర పఱచెఁ దా నంచితముగ 21.

తే.గీ. పసిడి తోడ నలంకరింపఁ బడి నట్టి
తురగ యుక్త రథమ్ములు విరివి నుండ
నెక్కిరి పయనింప వడి ననేక విధ జ
ను లడరి భరతు నానతిఁ దలను దాల్చి 22.

కం. కరటి కరేణు చయము బం
గరు మొల త్రాడు లలరంగఁ గదళీ ప్రభలం
దరలెను పేసవి చివరం
బరఁగు జలద ఘోష నిభ రవమ్ముల తోడన్ 23.

ఆ.వె. పెద్ద వింక చిన్నవి శకటమ్ములు వివి
ధమ్ము లుత్తమములు తరలినవి ర
యముగఁ గాలి బంటు లందఱు నిజ పాద
చారు లైరి భృశము సంతసించి 24.

ఆ.వె. అతి విశేష రథము నందుఁ గౌసల్యాది
భామ లంత నిలిచి రామ దర్శ
నాభిలాష లెల్ల నాత్ర మడర బయ
నింపఁ జాగి రెదల నింపి ముదము 25.

కం. పరివారము వెంట నడవఁ 26.

దరలెం బల్లకి నిభమ్ము తరుణార్కసుధా
కర రుచికి నెక్కి శ్రీ మ
ద్భరతుఁడు రఘురామ దివ్య దర్శనమునకై

తే.గీ. ఏనుఁగులు గుఱ్ఱములు తేరు లెల్లఁ గూడి
నట్టి సేన నిండఁగ దక్షిణాశ వనులు
గిరులు నదులు మృగ విహగ కీర్ణములను
దాఁటె గంగ కవల నీరదంపుఁ బగిది 27.

కం. కరి తురగ యోధ సంఘము
మురిసి ప్రవేసింప వన మపుడు భయ మిడుచుం
గరము మృగగణ విహం గో
త్కరములకు వెలింగెను భరత మహా ధ్వజమే 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది రెండవ సర్గము.

## అయోధ్యా కాండము
## సర్గము 93.

ససైన్యము నరణ్యమునఁ బయనింప భరతుఁడు దూరమునఁ బొగలు కనిపింప రాముని యాశ్రమ మచట కలదని యూహించి సైన్యము నట నిలువ మని సుమంత్ర వసిష్ఠులతోఁ గలసి ముందుకుఁ బోవుట.

కం. కదల మహా సేన యడవి
నదురుచు మత్త గజ నాథు లటవీ చరు లా
బెదరిన మందఁ గలసి భయ
మొదవఁ గరము బాఱి రంత నుద్వేగమునన్ 1.

ఆ.వె. దుప్పు లెలుఁగు గొడ్లు నప్పిఱికిమెకమ్ము
లంతట గిరులు నదు లడవి పంక్తు
లం దుఱుకుచుఁ గనుల విం దొనరించు చు
న్నవి విరివిగ నజ్జన పతి పరికి 2.

తే.గీ. గొప్ప నలు దండ్ల చప్పుళ్లు ముప్పిరిగొన
నెల్లెడల దాశరథి వని నెలమిఁ గదలఁ
గడలిఁ బోలు నా సేనతోఁ బుడమి నిండె
వానకారు మేఘముల నభమ్ము భంగి 3.

తే.గీ. వేగముగఁ జాగ వనమున వేగవంత
ములు తురగ మత్త వారణములు చెలంగి
యా సమయ మందుఁ జిరకాల మవని యింకఁ
గనఁబడక యుండె నింతయుఁ గనుల కకట 4.

కం. కడు దూర మేఁగి దారిని
బడలిన రథ్యముల తోడ భరతుం డంతం
గడు శ్రేష్ఠుండు సచివుల గు
రుఁ డగు వసిష్ఠుని నరసి పలుకు లిట్లనియెన్ 5.

తే.గీ. ఎట్టి రూపము కన్పట్టె నెట్లు వింటి
నెవ్విధమ్ము భరద్వాజుఁడే పలికెనొ
యట్టి దేశము ప్రాప్తించి నట్టు లున్న
దిప్పు డిచ్చోట మునివర్య! యొప్పుగాను 6.

కం. ఇది యద్రి చిత్రకూటం
బది మందాకిని యను నది యదె పెల్లుచు ను
న్నది నీలంబౌ మబ్బు ప
గిది దూరమ్మున వనమ్ము కీర్తిత భంగిన్ 7.

ఆ.వె. నాదు శైల తుల్య నాగ రాజమ్ములు
మద మడర భృశమ్ము మరులు గొల్పు 8.

చిత్రకూట గిరినిఁ జెల్వంపు సెత్తమ్ము
లందు నడచు చున్న వందముగను

తే.గీ. కొండ లోయల నున్నట్టి కుజము లిచట
కురియు చున్నవి సుమ వృష్టి పరిఢ విల్లి
యెండ కాలంపుఁ జివరను గుండపోత
గఁ గురియుచు నుండు నీల మేఘముల భంగి 9.

తే.గీ. కిన్నరులు తిర్గు కొండను మిన్న యయిన
దేశముఁ గనుమ శత్రుఘ్న! యాశ లెల్ల
నిండె మృగ సంచయము తోడ మెండుగాను
సాగరమ్మున మకర సంచయము భంగి 10.

కం. వడి సేఁగు నీ మృగమ్ములు
కడు చోదితము లయి చక్కఁగా నవియె కనం
బడుచున్నవి శరదృతువున
నడరు నభో మేఘ రాశి యనఁ జిత్రముగన్ 11.

ఆ.వె. పత్రములు వెలుంగఁ బర్జన్యముల భంగి
నీ తరులు విరుల వహించు చున్న
వి తమ శిరసు లందు వెలయ సుగంధము
దక్షి ణాశ నరుల దారి మీఱి 12.

ఆ.వె. వనముఁ జూడ మున్ను ఘనముగ భయదమ్ము
కాఁగ కూత లెల్లఁ గరము కఱవు
జనుల గూడి యిపుడు ఘనముగఁ దోఁచె న
యోధ్య వోలె నాకు నుల్ల మందు 13.

కం. గిట్టల రేఁగిన దుమ్మి
ప్పట్టున వన మందు నెల్ల వ్యాపింపంగన్
దట్టముగ వీచి యనిలుం
డిట్టె తొలఁగఁ జేసెఁ బ్రీతి నీయఁగ నాకున్ 14.

తే.గీ. అరదముల లాగ గుఱ్ఱము లంచితముగ
సూతులు నడుప శత్రుఘ్న! చూడు చేర
భయము మీఱ నెమళు లెల్లఁ బాఱ వేగ
గూళ్లకుఁ గనుమ పక్షులఁ గూర్మి నొసఁగ 15.

చం. మిగుల మనోహర స్థలము మేటి మునుల్ వసియించు చుండఁగా
నగపడు స్వర్గ మార్గముగ నందఱి కిచ్చట నుండు మెండుగా
మృగములు నాడు జింకలును మించి యొసంగ ముదమ్ము కన్పడం
దగ నిటఁ జెక్కి నట్టి గతి తద్దయు నేర్పునఁ బుష్ప రాశితో 16.

ఉ. సేన భృశమ్ముగా వెతకఁ జేర వలెన్ వని రాఘవేంద్రులన్
మానవ సింహ విక్రములు మాన్యులు కన్పడు నంత దన్క నా
నా నరు లెల్ల సాయుధులు నా భరతుం డన నాలకించి పే
కానన మందుఁ దిర్గఁ బొగ కన్పడె శూరుల కంత వింతగా 17.

చం. కని పొగ కంట మచ్చటఁ దగం జని యబ్బర తాంక మంత వా
రని రిటు లగ్ని యుండుట నరావలి లేక యసంభవం బగుం
గన నగు రామ లక్ష్మణులఁ గావున నచ్చట నిశ్చయమ్ముగన్
వనమున నంచు సైనికులు పల్కిరి యింపుగ రాఘవేంద్రుతో 18.

తే.గీ. అడర కున్న నరవ్యాఘ్రు లరి దమనులు
రాజ సుతు లట నన్యులు రామ సన్ని
భులు తపస్వులు తప్పక నిలువ వచ్చు
నచట సందేహ మింతయు నందు లేదు 19.

కం. విని యా మాటలు శత్రు ద
మనుండు భరతుండు సర్వ మనుజశ్రేష్ఠుం
డును సాధు సమ్మతములను
దన సైన్యము గాంచి పలికెఁ దద్దయుఁ బ్రీతిన్ 20.

తే.గీ. నిలువుఁ డిచ్చట మీరలు నెమ్మి తోడ
ముందుకుఁ జనఁ దగదు మీకు ముందు నుంచి
గురు నిఁక సుమంత్రు నేఁగెదఁ గూర్మి మీఱ 21.

నంచుఁ బలికి నిల్పెను వారి నందఱి నట

కం. నిలువ నట వార లెల్లరు
నలరుచు భరతుండు దృష్టి నడరం జేసెం
జెలువమ్ముగ ధూమాగ్రము
వెలయు దిశకు నాత్ర మడర విరివిగ మదిలో 22.

కం. భరతునిచే నుంచఁ బడిన
గురు సేనయె వేచి యుండ గోత్రములోఁ దా
నరయంగ వచ్చు రాము న
చిరం బని తలంచుచుఁ బడసెను హర్షమ్మున్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది మూడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 94.

శ్రీరాముఁడు సంతోషముగ భార్య సీతకు నానందము నీయఁ జిత్రమైన చిత్రకూట పర్వతపు టందములను వర్ణించి చూపుట.

చం. వన గిరి సంచయ ప్రియుఁడు వాస మొనర్చ చిరమ్ముగా గిరిన్
ఘనముగఁ బ్రీతి నీయ నిజ కాంతకు సీతకు హర్ష మందగా
మనమునఁ దాను గూడ నసమానపుఁ జిత్రపుఁ జిత్రకూటమున్
వనమునఁ జూపె రాముఁ డగ వైరి శచీసతికిన్ వలెం దగన్ 1.

తే.గీ. భద్ర! రాజ్య భ్రంశము సీత! బాధ నొసఁగ
దింతయును స్వీయ బంధు జనాంతి కమ్ము 2.

గాంచ కున్న  మనమునకుఁ గాంచ నంద
మైన చిత్రకూట మహాద్రి మే నలరఁగ

తే.గీ. వివిధ విహగ గణావృతము వినువీథిఁ
దూఱు నట్టి శిఖరముల తోడ ధాతు
గణ విభూషితం బైన నగమ్ముఁ జిత్ర
కూటమును గనుమ యిచటఁ గోమలాంగి! 3.

ఉ. ఇన్నగ ధాతు సంచయము నీక్షణ మింపుగఁ జేయఁ జక్కగం
గొన్ని వెలుంగు రౌప్య రుచిఁ గొన్ని కనంబడు రక్త కాంతులం
గొన్ని హరిద్ర శోణ రుచిఁ గొన్నిమణివ్రజ కాంతి వెల్గుచోఁ
గొన్నియుఁ బుష్యరాగములఁ గొన్ని సితోపల కేతకాభముల్ 4.

ఆ.వె. పలు మెకముల గములు పులులు సివంగులు
నెలుఁగు గొడ్ల మూక లలరఁ జేరు
గొండ్లు కాని వెల్ల గువ్వల గుంపులఁ
గూడి వెలుఁగు చుండెఁ గొండఁ గనుమ 5.

ఉ. మామిడి సేరెడుల్ పనస మ్రానులు వేఁగిస లొద్దుగుల్ తరుల్
పే మొరళుల్ తినాసములు వేములు నుమ్మెత లూడుగుల్ ద్రువుల్
ప్రేములు మారెడుల్ తుమికి రేఁగులు గుమ్ముడు లింక నిప్పలున్
గోముగ బొట్టుగుల్ కడిమి క్షోణిజముల్ తడచెట్టు లింకనున్ 6.

ఆ.వె. వెదురు లురిమిడులును విరివి నుసిరులు ఫ
ల కుసుమ భరితమ్ముల నడరంగ
విత్తనమ్ములెల్ల వెదజల్లఁ బడ నీడ
నొసఁగు రమ్య గిరిని నువిద! గనుమ 7.

తే.గీ. అందము లొలుకు సానువు లందు నొడలు
వొందఁ గగగురు పాటు లా చందమునను
గిన్నరుల జంట లాడంగఁ బన్నుగ నిట
వఱల నానందము మదుల భద్ర! కనుమ 8.

కం. కొమ్మల ప్రేలాడు కఠా
రమ్ముల శుద్ధాంబరముల రమ్యతరములన్
సమ్మద విద్యాధర నిచ
యమ్ములవి సతులవి గనుమ యాట స్థలములన్ 9.

చం. నగవర దేశ సంజనిత నార చయస్రవ నీర పాతముల్
ధగధగ చిత్రకూటమున ధారుణి వెల్గుల నీని పాఱఁగా
నగణిత మాద వారి యుత హస్తి నిభమ్ముఁగఁ దోఁచు చుండె విం
త గిరి వరమ్ము కన్నులకుఁ దద్దయుఁ బ్రీతి నొసంగి కాంచుమా 10.

కం. నానా సుగంధ సంయుత
సూనోద్భవ కందర ప్రచోదిత తద్ధి
వ్యానిల నాసా తర్పిత
మానవ పుంగవుఁ డరయఁడె మదిలో ముదమున్ 11.

చం. నిలువఁగ నీవు లక్ష్మణుఁడు నే శర దావళు లైన నుందు నే
కలవర మంద కుండ మదిఁ గానన మం దవిచార మింపుగాఁ
బలు ఫల పుష్ప రమ్యమునఁ బక్షి గణావృత చిత్ర శృంగ ని
ర్మల తటి శైల రాజమున మానిని! హర్షము నందు చుండుదున్ 12.

ఆ.వె. ఫల యుగము వడసితి వనవాస మేర్పడ
రమణి నాకు నిపుడు రాజు నుంచి
తిని ఋణ రహితునిగ స్థిరపు ధర్మము నందు
భరతుఁ డవనిఁ  బ్రియముఁ బడయఁ గంటి 13.

ఆ.వె. చిత్రకూట గిరినిఁ జేరఁగ విషయము
ల మనమునకు మాటలకును మేను
నకుఁ గరము  కలిగెనె నందము వైదేహి
నన్ను గూడి యుండఁ జెన్నుగ వని 14.

కం. నృపునకు వనవాసము మూ
రి పడయ మరణమ్ము పిదప భృశ జన్మం బీ
విపుల నమృత తుల్యంబ య 15.

ని పూర్వ రాజర్షు లనిరి  నిజ పితృ సురులున్

ఆ.వె.  నలుపు పసుపు నెఱుపు తెలుపు రంగు లనేక
శతములు విలసిల్లు  శైల శిలలు
బహు విశాలములు ప్రభల తోడ నిచ్చట
రమ్యముగ సెదలకు రహి నొసఁగుచు 16.

కం.  తమ తమ కాంతుల నగద
ధ్రుమము లనేకములు వెలుఁగుఁ దోరముగా నీ
విమ లాచల మందు నిశా
సమయమ్మున నగ్ని శిఖల సదృశమ్ములునై 17.

తే.గీ.  ఒక్కచో వేశ్మముల భంగి నొక్క చోట
నుపవనముల భంగి నడరు నొక్క చోట
నమరు నేక శిలా గతి రమణి! చిత్ర
కూట పర్వత రాజము పాటవమున 18.

ఆ.వె.  పుడమినిఁ బెకలించి యడరి లేచిన యట్లు
చిత్ర కూటము విలసిల్లుఁ జిత్ర
కూటపు శిఖరమ్ము మేటి రీతి సకల
దిక్కులం దగపడుఁ దెల్లముగను 19.

తే.గీ.  ఇందుఁ జెంగల్వ జేకుల నందివర్ధ
నముల పున్నాగ భూర్జ పత్రముల పద్మ
దళముల పడక యమరి సంతసము నీయఁ
గాముకుల కడరుచు నుండెఁ గనుమ సీత! 20.

ఆ.వె.  కామి కామినీ నికరము రంజిల్లుచు
నలిపి విసిరి నట్టి లలిత కుసుమ
మాలలను ఫలముల మానిని! గాంచుమ
వివిధము లగపడఁగ విరివి నిచట 21.

ఆ.వె.  పండ్ల పేర్ల నీటఁ బన్నుగ భాసిల్లు 22.

చిత్రకూట నగము చిత్రముగను
మించు నిలఁ గుబేరు నంచి తోత్తర కురు
దేశ పుర సరసుల దీప్తి యందు

కం. కుల ధర్మ వృద్ధి కారక
లలిత నియమ బద్ధతం బరమ సత్పురుషా
వలి పథము ననుసరించుచు
సలక్ష్మణ సదార యుందు సంతోషమునన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 95.

శ్రీరాముఁడు సీతకు మందాకినీ నదీ సౌందర్యమును వర్ణించి చూపుచుఁ జిత్రకూట పర్వత సమీపమున విహరించుట.

కం. అంత గిరిన్ దిగి కోసల
కాంతుఁడు మందాకిని నదిఁ గమనీయముగా
నింతి కలరి శుద్ధోద
న్వంతముఁ జూపింపఁ దొడఁగె వైదేహి కటన్ 1.

కం. పలికెను రాముఁడు రాజీ
వ లోచనుఁడు చారు చంద్ర వదన వరారో
హ లలన నలినాక్షిని మై
థిలి వీక్షించి గిర లివ్విధి మనోహరముల్ 2.

ఆ.వె. అక్కజము లొలుకుచు నందము లిసుక తి
న్నె లలరంగ హంస నిచయ సార
స చయ మలరఁ బద్మ సంపన్న మందాకి
నీ నది నిటఁ గనుమ నీరజాక్షి! 3.

చం. ఫల కుసు మావృత ద్రుమ విభాసిత తీర యు తాపగా వరం
బలరుచు నుండె నా ధనదు పద్మిని భంగిని వెల్గు లీనుచున్
జలమును ద్రావ జింక లట సంక్షుభితం బుదకమ్ము మిన్నఁగా
వెలయఁగ దివ్య తీర్థములు వీనినిఁ గాంచ జనించె హర్షమే 4.

ఆ.వె. జడల నూని జింక చర్మ ముత్తర వస్త్ర
ముగ నడరఁగ మునులు మునుఁగు చుందు
రెలమి సుప్రభాతముల లోన మందాకి
నీ నదినిఁ బ్రియతమ! నిత్య మిచట 5.

కం. నియమములు మీఱ హస్త
ద్వయమ్ములను బైకి నెత్తి తాపసు లన్యుల్
నయ సువ్రతు లాదిత్యుని
కయి పూజలు సేయు చుందు రాతత నయనా! 6.

కం. గాలికిఁ గదలం దరు శిఖ
రాలి దళ సుమాళి రాల నా నది కీ యా
మ్రోలల వైదేహీ! యా
శైల వరము నాట్య మాడు సరణి నగపడున్ 7.

తే.గీ. మణి నిభామల తోయము మనముఁ దోఁచు
నొకట సైకతము లొకచో నొసఁగుఁ గనుల
కింపు సిద్ధ జనులు విహరింప నొకటఁ
గనుమ మందాకినీ నదిఁ గమల నయన! 8.

తే.గీ. వాయు వూఁపంగ వెదచల్లఁ బడ్డ విరుల
గముల నింపుగ వైదేహి గనుమ తటుల
నీటి నడుమ దేలుచు నున్న నీరజమ్ము 9.

లబ్జ లోచన!  ముదమార నరయు మడరి

ఆ.వె. చక్రవాక పక్షి సంతతి తియ్యగఁ
గూయు ద్విజము లెక్కి కోమల సుమ
రాశిఁ గూయుచు మధురమ్ముగ నళినాక్షి
యలరు చున్న వచట నంచితముగ 10.

ఆ.వె. చిత్రకూట మింక శ్రేష్ఠ మందాకినిఁ
గనుట నగర మందుఁ గాపురమ్ము
కన్న మిన్న యగును నిన్ను జూచుచు నుండ
సీత నాకు నెంచఁ జిత్రముగను 11.

ఆ.వె. విగత కల్మషులు పవిత్ర తపో దమ
శమ గుణాన్వితు లనిశమ్ము మునుఁగ
సిద్ధ జనులు జలము చెదరి నట్టి నదిని
మునుఁగు నన్ను గూడి ముదము మీఱ 12.

ఆ.వె. మునుఁగుమ సఖి వోలె మూరి మందాకినీ
నిర్మల జల రాశి నెమ్మి తోడ
ముంచుచుఁ దగ నీటఁ బుష్కరములఁ గమ
ల నిచయమ్ము నెల్ల వనజనేత్ర! 13.

తే.గీ. కను మిచటి మృగములఁ బౌర జనుల భంగి
నురు గిరీంద్రము నగర మయోధ్య పగిది
నీ నదీ మతల్లిని సరయూ నది యనఁ
జిత్త మందు హర్ష మడర సీత! సతము 14.

కం. అనుకూలవు గాఁగ నవని
జ! నీవు ధర్మాత్ముఁ డుండ సౌమిత్రియె నా
కను సన్న లందు నా కిట
జనించు చున్నది కరమ్ము సంప్రీతి యెదన్ 15.

కం. మునుఁగుచు ముమ్మా రింపుగఁ 16.

దిన మధు మూలఫలము లనుదినముం బ్రీతిన్
మనమం దయోధ్య రాజ్య
మ్ము నేఁ దలఁప నుండ నీవు ముగుదా! చెంతన్

తే.గీ. లేళ్ల గుంపులు తిరుగాడ లీల తోడఁ
గోఁతు లేనుఁగు లేనుఁగు గొంగ లాన
నీరు విరిసిన పూవులు నిండ నగల
పగిది నశ్రమము సుఖము వడయ కున్నె 17.

కం. నది వర్ణించుచు రాముఁడు
పద జాలమ్ముల రఘుకుల వర్ధనుఁ డిట్లున్
సుదతీ మణి జానకితో
ముదమున నా చిత్రకూటమున విహరించెన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది యేనవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 96.

చిత్రకూట పర్వత ప్రాంతమున సీతతో విహరించి విశ్రమించు చుండ సైన్యపు ఘోష వినఁబడ లక్ష్మణునిఁ బరికింప మనఁగ నాతఁడు వృక్షము నెక్కి వచ్చెడిది భరతుని సైన్యముగా గుర్తించి రామునకుఁ దెలిపి తమను జంపుటకు భరతుఁడు స సైన్యము దండెత్తు చున్నట్టు లూహించి కోపముతో వానినిఁ జంప నుద్యుక్తుఁ డగుట.

ఉ. చూపుచు మైథిలీ సతికి సుందర నిమ్నగ నమ్మహాద్రికిన్
దాపున రాముఁ డింపుగను దద్గిరి దేశము నందుఁ బ్రీతి స
ద్రూపిణి కిద్ధ మాంసము నదూషిత వహ్ని సుతప్త మీయఁగా 1.

నా పల మారగించి ముద మారఁగ నిద్దఱు నిల్చి యుండఁగన్

చం. పెనఁగిన వంత నా భరతు భీకర సైన్య సరావ రేణువుల్
తనరుచు వచ్చు చుండగను దాఁకుచు నభ్ర పథమ్ము వింతగా
విని గజ యూధప వ్రజము భీతిలి యూథము గూడి వేగ ప
ర్వె నదరి యంత దిక్కులకు రేఁగి వనమ్ముంన సంభ్రమమ్ముంనన్ 2.

కం. వినె రాఘవుండు శబ్దము
లను సైన్యము సేయ భీకరముగ మఱియు చూ
చెను దిక్కులకుం బాఱెడు
ఘన భీత కరీంద్ర తతులఁ గానన మందున్ 3.

కం. కని విని విద్రావితులను
ఘన నిస్వనములను బల్కెఁ గాకుత్స్థుఁడు త
మ్ముని సౌమిత్రునిఁ దేజ
స్విని వీక్షించి వచనములు శీఘ్రమ యిట్లున్ 4.

తే.గీ. అచ్చెరువు సుమ్మి లక్ష్మణ యతి గభీర
తుముల నిస్వనములు కడు దుస్సహములు
భీకరమ్ములు వినఁబడె విస్తృతముగఁ
గాననమ్మున నిప్పుడు గాంచఁ దగును 5.

తే.గీ. కానలో నేనుఁగు గములు ఘన వనమ్ము
లోన దున్నలు సింగములు దఱుమంగ
నదరి పర్వులు పెట్టఁగ నరయు మిపుడు
లక్ష్మణ! దశ దిక్కులకును రవము లిడుచు 6.

ఆ.వె. రాజపుత్రుఁ డయిన రాజైన వేటాడఁ
దిరుగుచుండఁ దగును దివిరి వనిని
శ్వాపద మితరమ్ము సౌమిత్రి! కాదేని
తిరుగు నేమొ కనుమ తెల్లముగను 7.

తే.గీ. పులుఁగులకు నైన దుశ్చరము కద యిగ్గి 8.

రి వర మరయంగ లక్ష్మణ! రేఁపు చున్న
దియ్యది మనమం దనుమాన మియ్యెడల న
చిరము నిజము సేర వలయుఁ జెలఁగి నీవు

కం. నా విని లక్ష్మణుఁ డప్పుడు
పే వృక్షము నెక్కి విరులు విరిసిన దానిం
దా వీక్షణములు వఱపుచు
నావల నీ వలను దూర్పు నారసి మఱియున్ 9.

కం. కనుచుండి యుత్తరపు దిశ
ఘన సైన్యము రథ గజ తురగ పదాతి దళ
మ్మును సంసిద్ధ మరసి చె
ప్పె నన్న కా ధ్వజ విరాజి వేగమ యిట్లున్ 10.

తే.గీ. అగ్ని నార్పుమ యగ్రజ! యవనిజ గుహ
నుండ నిమ్ము భద్రమ్ముగ నుగ్ర చాప
మెత్తు సశరాళి నారిని నింపుగ కవ
చమ్ము నూని సంధింపుమ సమర వీర! 11.

కం. విని రాముఁ డనియె నంతం
గను మో లక్ష్మణ! త్వరితముగ నరవ్యాఘ్రా!
చను దెంచెడు సైన్యం బె
వ్వని దని తల్చెదవొ యెడఁదఁ బల్కుమ యనుజా! 12.

చం. రఘువరుఁ డట్లనంగ విని లక్ష్మణుఁ డప్పుడు పల్కె నివ్విధ
మ్ము ఘన త రాగ్రహం బడరఁ బ్లుక్షి విధమ్ముగ మీఱి మండుచున్
విఘటిత మానసమ్మున సుభీషణ సైన్యము నెల్ల నమ్మ హా
నఘ చరితుండు గాల్చు విధి నాగ్రహ దుస్సహ వీక్షణమ్ములన్ 13.

తే.గీ. నందనుండు కైకేయికి నంది రాజ్య
మెల్లఁ బరమ సంపన్నము నింపుగ నభి
షిక్తుఁడై మనలను జంపఁ జేరుచున్న
వాఁ డిచటకు నిక్కమ్ముగఁ బార్థి వేంద్ర! 14.

తే.గీ. అదె మహా కాంతి వెలుఁగు చున్న దట పెద్ద
బోదె తోఁ గోవిదారము భూరి తరువు
ధ్వజము నందు రథమ్ముకనఁ దనరు చుండి
సైన్యమునఁ బెక్కు కొమ్మలఁ జక్కగాను 15.

తే.గీ. వీరె వడిగాఁ జరించెడి వేగుల నధి
రోహు లయి రాగ స్వీయేచ్ఛ నాహ వీరె
వారణమ్ములపై ముద మార వచ్చు
చుండి రిచ్చోటున కడరి గండు మీఱ 16.

తే.గీ. వీర! మనము నిల్తుమె గిరి వింధ్ల నూని
యుద్దఱ మిపుడు లేదేని యెత్తి యాయు
ధ వరముల నింపుగ నిచట తనరి నిల్చు
వారలమె తివిరి యెదిర్ప వారి నెల్ల 17.

ఆ.వె. ఆజిఁ గోవిదార భూజ ధ్వజ మగునె
మనకు వశము భరతుఁ గనుచు నుంటి
నెవని వలన నీకు నవనిజకును నాకుఁ
గలిగె నిట్టి వ్యసనములు భృశముగ 18.

ఉ. ఎవ్వని చేత జాఱినది యిమ్మహి రాఘువ! శాశ్వతమ్ముగా
నివ్విధి నీకు నా భరతుఁ డిప్పుడు శత్రువు నాకు వధ్యుఁడౌ
యివ్విధ ధర్మ భంగమును నెత్తఱి నీయఁగఁ జాల దెన్నఁగా
నొవ్వు లొసంగి నట్టి నరు నొవ్వఁగఁ జేసిన దోషముండునే 19.

ఆ.వె. వీత ధర్ము భరతు విరివి మున్నపకార
ము మన కొసఁగి నట్టి మూర్ఖ చిత్తు
నీతని వధియించి యిద్ధరా తల మెల్ల
నేల నింక రామ! మేలు సుమ్ము 20.

కం. కరి కూల్చిన తరువు పగిది
మరణింపఁగ నావలనఁ గుమారు భరతునిన్ 21.

నరపుంగవ! కననీ కై
క రాజ్య కాముకను నేఁడు కలఁగుచు భృశమున్

కం. స భట సబాంధవముగఁ గై
క భయంకరముగ వధింతుఁ గానన మందున్
శుభముల నొసంగుదుఁ గలుషి
త భూతలమ్మునకు రామ! ధర్మాచారా! 22.

కం. అణఁచిన కోపం బెల్లను
రణమునఁ గాల్చి యహిత నికరమ్ము నరణ్యాం
గణమున విడిచెద ముదమున
గుణనిధి! యంగారము తృణ కూటముఁ బోలెన్ 23.

ఆ.వె. చిత్రకూట విపిన శేఖరమ్మును నేఁడు
నిశిత దివ్య విశిఖ నిచయ దారి
తారి గాత్ర సుస్ర వాస్ర పరీవృత
భాసితమ్ముఁ జేయు వాఁడ నడరి 24.

తే.గీ. నాదు శరముల చేత భిన్నము లయిన హృ
దయములు గల కుంజరముల హయముల నర
సంచయముల నీడ్వఁ గలవు శ్వాపదములు
ప్రీతి సెలగంగ నడవిని భీకరముగ 25.

కం. సమయించి శర శరారో
పములఁ జమూయుతము నటవి భరతాఖ్యుని బా
ణ మహాధనువుల నాదు ఋ
ణముఁ దీర్చెద శంక లేక నైపుణ్యమునన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది యాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 97.

ఆగ్రహముతో నున్న లక్ష్మణుని రాముఁ డనునయమున శాంతపఱచి భరతుని రాకకు కారణ మది కాక వోవునని పలుక లక్ష్మణుఁడు సిగ్గు సెందుట, భరతుని సైన్య మాతని పనుపునఁ జిత్రకూట పర్వతపు మూలమున విడియుట.

కం. కని సౌమిత్రిని సంర
బ్ధుని లక్ష్మణు నా యమర్ష మూర్ఛితు సంప్రీ
తి ననునయించి రఘూత్తముఁ
డనియెను  రాముఁడు వచనము లపు డిప్పగిదిన్ 1.

చం. ధనువున కింకఁ గత్తికిని దాలునకుం బని యేమి లక్ష్మణా!
పెను విలుకాఁడు ప్రాజ్ఞుఁడు వివేకుఁడు నా భరతుండె వచ్చినన్
జనకున కిచ్చి మాట నిటఁ జంపిన వచ్చిన యట్టి తమ్మునిం
గొని యపవాద మివ్విధిని ఘోరపు రాజ్యము నేమి సేయుదున్ 2.

ఆ.వె. ఏ ధనమ్ము కల్గు బాధింప బాంధవ
మిత్ర వర్గమును సుమిత్ర కెలమి
నొసఁగు పుత్ర! కోర విసపు టన్నము వోలె
యట్టి ధనము సెన్నఁ డవని సౌమ్య! 3.

చం. వెలసిన ధర్మ యుక్తములు విత్త స కామ ధరాతలమ్ములన్
వలచెద నెల్ల మీ కొఱకుఁ బల్కుదు నీ పయి నొట్టు నుంచియే
కలసి చరింపఁగా  ననుజ కాయము సౌఖ్యము నీయ నాయుధ
మ్ముల పయి నాన లక్ష్మణ! విమోహిని కాను నిజమ్ము రాఘువా! 4.

కం. గగన మగునె యిబ్భూమియుఁ
దగఁ గొన వనధి వసనమ్ము తలఁచిన నాకున్
విగతంపు ధర్మమునఁ బొం
దఁగ నెంచను శక్ర పదవిఁ దథ్యం బనుజా! 5.

తే.గీ. భరతు నిన్నును శత్రుఘ్ను నరయ కుండఁ
గల్గ నాకు సుఖము సుంతఁ గాల్ప నొప్పు
బూడిదగ నగ్ని చేత సమూలముగను
సందియంబు సుంతయు వల దిందు నింక 6.

చం. భరతుఁడు భాతృ వత్సలుఁడు వచ్చి యయోధ్య కెఱింగి నా బహి
ష్కరణము ప్రాణ వత్ప్రియుఁడు జానకి నిన్నును గూడి సజ్జటా
ధరు నను మానవర్షభ! సుతప్త మనమ్మున వంశ ధర్మ మెం
చి రతినిఁ గుంది మిక్కుటము స్నేహ పరమ్ముగఁ గాంచ వచ్చెనో 7.

కం. అంతియ గాక యితర మా
వంతయుఁ గా నేర దెంచ నంబను గైకం
బంతమునఁ దిట్టి రాజ్యం
బంత యొసఁగ వచ్చె నేమొ యర్చించి పితన్ 8.

కం. మనమం దించుక యేనిఁ జె
డును జేయఁ దలంపఁ డీతఁడు మనకు వీక్షిం
ప నడరి తగు కాలము వ
చ్చినఁ దా నరుదెంచి యుండు శీఘ్రమ యిటకున్ 9.

ఉ. చేసెనె పూర్వ మెన్నఁడును జిన్న యనిష్టపుఁ గార్య మెద్దియున్
వాసి గలట్టి రాఘవుఁడు భ్రాతయు నా భరతుండు నీకునున్
దోసము లేక శంక మదిఁ దోరము నుంచఁగ నేల లక్ష్మణా!
బాసల నింద లీయకుమ పల్కిన నన్నని నట్టు లెంచెదన్ 10.

చం. కలిగిన నెన్ని కష్టములు కాయజుఁ డెంచునె చంపఁ దండ్రినిన్
లలితునిఁ బ్రాణ తుల్యుఁ డగు భ్రాతను జంపునె సోదరుం డిలన్
వలసిన నీకు రాజ్య మిది పల్కుదు నబ్బరతుం గనంగ నీ
కిల నిడు మంచుఁ బ్రీతిని నరేంద్ర కుమారుని తోడ నింపుగా 11.

ఆ.వె. పలికినఁ గని భరతు వచనము లీ రాజ్య
మిమ్ము లక్ష్మణునకు నెమ్మి నంచు 12.

నాలకించి యట్లె యను నించుకయుఁ జింత
నూన కుండ నెడఁద నుత్తముండు

చం. లలితుఁడు ధర్మశీలి రఘురాముఁడు వల్కఁగ పల్కు లవ్విధిం
జెలఁగఁగ సిగ్గు గాత్రములఁ జేరి భృశమ్ముగ లక్ష్మణుండు నేఁ
దలఁచెద నగ్రజా! దశరథ ప్రవరుం డరయంగ వచ్చె నం
చు లలిని నం చిడెన్ బదులు శూర వరేణ్యుఁడు సంతసమ్ముగన్ 13.

కం. కని సిగ్గిలు లక్ష్మణు నను
జుని రాముఁడు పల్కె నంతఁ జూడఁగ మనలన్
ఘన బాహుఁడు జనకుఁ డిటకుఁ
చనుదెంచియె యుండనోపు సౌమిత్రి! తగన్ 14.

తే.గీ. లేక మనల సుఖార్థుల నాకటా య
రణ్య వాస కష్టము లెంచి రాడ్వరుండు
గృహ వరమునకుఁ గొనిపోవఁ గెరలి వచ్చె
నేమొ లక్ష్మణ! యా మాన వేంద్రుఁ డిటకు 15.

ఆ.వె. కాక యున్న సీతఁ గడు సుఖ సేవల
కర్హను జనకుఁడు మహాదరమున
వనము నుండి యిపుడు వైదేహిఁ గొనిపోవ
నెంచి వచ్చె నేమొ యంచితముగ 16.

తే.గీ. అవె వెలుంగు చున్నవి జాతి హయము లచట
రెండు వాయు వేగ సమ సన్మండితములు
సుందరము లెల్లరకుఁ గనువిందు గొలుప
వీర! వీక్షింపు వానిని గారవమున 17.

కం. అగపడె శత్రుంజయ నా
మ గజేంద్రము సేన ముందు మనుజపు ధీమం
తు గజ వరము వృద్ధేభము
ధగధగ మెఱయుచుఁ గడింది తను కాంతులతో 18.

కం. కన నేఁ దెల్లని ఛత్ర
మ్మును లోక నుతమ్ము దివ్యమును నచ్చోటన్
జనకునిది లక్ష్మణ! మహా
ఘనభుజ! సందియ మెడందఁ గల్గుచు నుండెన్ 19.

తే.గీ. మరలుము తరువు నుండి లక్ష్మణ రయమ్ము
న నని ధర్మాత్ముఁ డా రాముఁ డనఁగ నంత
లక్ష్మణుఁడు పాదపము దిగి రాము చెంతఁ
జేరి నిలిచె నింపుగ మోడ్చి చేతులు వడి 20.

ఆ.వె. భరతుఁడు నచట తన వారిని మూఁగ రా
దిచట వసతి చెంత నెవ్వ రనుచుఁ
దూర్ణ మంత నిలిపెఁ దోరంపు సైన్యము
శైల పార్శ్వములను జక్కగాను 21.

కం. కరి తురగ చయ స్యందన
వర యుత మిక్ష్వాకు సేనఁ బన్నుగ నంతన్
గిరి తటి యోజనము లొకటి
యర వ్యాపించి నిలిచెను మహానందమునన్ 22.

కం. అడరఁగఁ జేయుచు ధర్మము
విడిచి యెడఁద దర్ప మెల్లఁ బ్రీతునిఁ జేయం
గడు రాము భరతుఁడు నయ
జ్ఞుఁడు తెచ్చిన బలము మురియుచు విరాజిల్లెన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 98.

భరతుఁడు శత్రుఘ్నుని గుహుని నడవిలో రాముని యాశ్రమము నన్వేషింపఁ బనిచి తాను గూడ కాలి నడకను మంత్రులఁ గూడి వెదకుచు నాశ్రమపు నిప్పు పొగను గాంచి రాముని యాశ్రమ మని యెఱింగి సంతోషించుట.

కం. నిలువఁగఁ జేసి ధ్వజినిఁ బె
ద్దలఁ బూజించు భరతుండు దార్ఢ్యుండు పదా
తుల నడచుచుఁ దా నేఁగం
దలఁచెం గన రాఘవేంద్రుఁ దద్దయుఁ బ్రీతిన్ 1.

ఆ.వె. చెప్పి నట్టి రీతి సేనయె నిలువఁ జ
క్కఁగ భరతుఁ డనుజుని గాంచి యంతఁ
బల్కె నివ్విధముగఁ బల్కులు శత్రుఘ్ను
తోడ నగ్రజుండు పాడిగాను 2.

తే.గీ. సత్వరమ్ముగ నివ్వని సౌమ్య! వెదక
వలయు రాఘవు నాశ్రమ వరము పలువు
రెఱుకులను గూడి చక్కఁగ నెల్లెడలను
నర వరుల తోడ శత్రుఘ్న! నయవిచార! 3.

తే.గీ. గుహుఁడు స్వయముగ జ్ఞాతులఁ గూడి చాప
బాణ ఖడ్గములు ధరించి వనము నందు
నెల్లఁ గాకుత్స్థు వెదకంగ నింక నేఁగ
నొప్పు నిప్పట్టున నెడఁద నుత్సహించి 4.

ఉ. ఏఁగెదఁ గూడి మంత్రుల మహీసుర సద్గురు మండలమ్ము నుం
జాగఁగ పౌర సంచయము చారు వనమ్మునఁ గాంచ రామునిన్
వేగమ పాదచారి నయి ప్రీతి స్వయమ్ముగఁ గాన కింపుగా
నేఁ గను నంత దన్కఁ దమి నీరజ లోచను రాఘవేంద్రునిన్ 5.

తే.గీ. రాము సత్యపరాక్రము రాగ మలర
లక్ష్మణు సలక్షణు మహాబల ప్రవరుని
సీత నా మహాభాగ నీక్షించు తనుక 6.

సుంత యైనను బొందను శాంతి నేను

ఆ.వె. పద్మపత్ర నయను భ్రాతను చంద్ర స
న్నిభ శుభానను ఘన నీల వర్ణు
రాఘవుని జగ దభిరాముఁ జూచు వఱకు
సుంత యైనఁ బొంద శాంతి నేను 7.

ఆ.వె. రాజ లక్షణ సువిరాజి తేద్ధ చరణ
పద్మ యుగ్మ మేను బరఁగి నాదు
శిరము పైన భక్తిఁ జేర్చు నంత వఱకు
సుంత యైనఁ బొంద శాంతి నేను 8.

తే.గీ. రాజ్యము పితృపితామహరాజి దత్త
మందు రాజ్యార్హు నభిషేక మందు నీటఁ
దడియఁ జేయక యున్నంత దనుక నింక
సుంత యైనను బొందను శాంతి నేను 9.

తే.గీ. చంద్ర సన్నిభ నిర్మల చారు ముఖుని
రమ్య రాజీవ నేత్రుని రాముని ముఖ
పద్మ మరయుచు నున్నట్టి భాగ్య పురుష
వరుఁడు సౌమిత్రి కడు ధన్యుఁ డరయఁ బుడమి 10.

కం. కృతకృత్యురాలు జానకి
సతము మహాభాగ పతిని సాగర పర్యం
త తరళ భూభాగమ్మున
రతి ననుగమనమ్ము సేయ రామునిఁ జుమ్మీ 11.

తే.గీ. నందన వన మందుఁ గుబేరు చందము వసి
యింప రాజీవ లోచనుఁ డింపుగ గిరి
రాజ నిభ చిత్ర కూటాద్రి తేజరిల్లు
చుండు భాగ్యమ్ము వడయుచు మెండుగాను 12.

ఆ.వె. చేర రాని దైన ఘోర వని వసింప 13.

పులులు దిరుగు చుండి భూరి విక్ర
ముండు రాముఁ డుత్తముండు శస్త్ర ధరుల
నుండ భాగ్య మందె మెండుగాను

చం. పలుకుచు గొప్ప తేజుఁడు సువాక్యము లా భరతుండ యివ్విధిం
జెలఁగుచుఁ జొచ్చెఁ బాదముల శీఘ్రము భూరి వనమ్ము లోనికిన్
వలుఁద కరమ్ములన్ వెలుఁగు పార్థివ సూనుఁడు మేటి మానవుం
డల కన నెంచి యగ్రజుని నాశ్రమము మీఱఁగ మిక్కుటమ్ముగన్ 14.

కం. సానువు లందుఁ గుసుమముల
తో నిండిన చెట్ల మధ్యఁ దూఱుచు నాశం
దా నేఁగంగఁ దొడంగెను
గాననమున గిరల మేటి కాకుత్స్థుండే 15.

తే.గీ. చేరి పుష్పిత సాలము చెన్నుగ నటఁ
జిత్ర కూట గిరిని రఘుశేఖరు నన
లమ్ము నుండి పుట్టి పయికిఁ గ్రమ్మినట్టి
పొగను వీక్షించె ముదమారఁ బురుష వరుఁడు 16.

ఆ.వె. చూచి భరతుఁ డపుడు సుశ్రీయుతుండు ము
దమ్ము వడసె బంధు తతినిఁ గూడి
రాముఁ డచట నుండు రమ్యముగ నని త
లంచి నీటి దరి నరసిన యట్లు 17.

కం. కని రామాశ్రమ వర మ
ద్రిని దుర్గమ జిత్రకూట తీరమున బల
మ్మును నిలిపి యట్లె తానేఁ
గె నా గుహుని తోడ నచటఁ గెరల ముని వరుల్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది యెనిమిదవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 99.

భరతుఁడు పర్ణశాలలో జడలు నార బట్టలతో ముని వలె నున్న రాముని గాంచి విలపించుట, భరత శత్రుఘ్నులు పర్వునఁ జేరి రాముని పాదములపైఁ బడ రాముఁడు వారినిఁ గౌఁగిలించుకొనుట.

కం. నిలువఁగ నిజ సేన యచట
విలసిల్లఁ గుతూహలమ్ము వేగమ భరతుం
డల జూపుచుఁ దమ్మున కట
నలరి చనె నరయఁగ నన్న నవ్వన మందున్ 1.

తే.గీ. అన్నపైఁ బ్రేమ గలయట్టి యా భరతుఁడు
వేఁడి మౌని వసిష్ఠుని వేగ తనదు
మాతలఁ గొనితేరఁగఁ దాను బ్రీతి నంత
వెడలె ముందుగ రయమునఁ దడబడుచును 2.

ఆ.వె. సుంత దూర మందుఁ జూచి శత్రుఘ్ను సు
మంత్రుఁ డనుసరించె మనము నందు
రామునిఁ గన నా భరతుని పగిది నర్గ
లిక మపరిమితమ్ము రేఁగ నంత 3.

చం. భరతుఁడు గాంచెఁ జాగుచును భ్రాతృ వరాంచిత పర్ణశాలనున్
వరముని సంఘ వాసముల పంచను జిన్నకుటీర మన్యముం
బరఁగఁగఁ గాష్ఠ ఖండములు ప్రక్కనఁ గోసిన పూల గుంపులున్
విరివిగ ముందు భాగమున వీర వరేణ్యుఁడు సంభ్రమమ్ము నన్ 4.

తే.గీ. అచ్చ టచ్చటఁ దరువుల నానవాలు
న కయి రామలక్ష్మణులు వారి కుశ చీర
లుంచఁగను వారిఁ గను కాంక్ష యుద్భటముగ
నున్న భరతుఁడు వీక్షించెఁ గన్నన నట 5.

ఆ.వె. దున్న లింక లేళ్ల తోరంపుఁ బిడకల
ప్రోవు శీత కాలము కొఱ కుంచఁ
గాననమ్ము లోనఁ గాంచెను భరతుండు
భాతృ వత్సలుండు ప్రీతి మీఱ 6.

ఉ. పోవుచుఁ గాంతిమంతుఁ డతి భూరి భుజుండు ముదమ్ము మీఱఁగా
పే వలికెన్ ని జానుజుని వీక్షణ మొప్పుగఁ జేసి మంత్రులం
బావను లెల్లరం గనుచు వాక్యము లిట్టులఁ బ్రాప్త మయ్యెనే
యా వన దేశ మింపుగ మహాముని చెప్పిన యట్టి చొప్పునన్ 7.

కం. తలఁచెద నెక్కువ దూరము
న లేదు మందాకిని యను నది యిచ్చటికిం
బలికెఁ గద భరద్వాజుఁడు
లలితమ్ముగ నటుల నయ్యె రమణీయముగా 8.

ఆ.వె. కట్టఁ బడిన వివియె కానఁగ దారి న
కాల మందుఁ గనుఁడు మేలు గాను
పైన పైన నార బట్టలు లక్ష్మణు
ని వలన నని యెంతు నిశ్చయముగ 9.

కం. మెండుగ గర్జించుచు నీ
కొండ సరసనఁ బెను దంత కుంజరములు తా
మొండొంట వడి వడి పెనఁగు
చుండి తిరుగు నట్టి మేటి చోట్లివి తలఁపన్ 10.

కం. కనఁబడు చున్నది యదె దే
నినిఁ దాపసు లుంచఁ నెంత్రు నెమ్మిని వని న
ల్లని యట్టి నిప్పు దైన పొ
గను గనుఁడీ సంతసమున గ్రక్కున నచటన్ 11.

కం. చూచెద నార్యుని నచ్చటఁ
దోఁచు మహర్షి సదృశమ్ము దుర్జయుఁ డవనిం
జూచు గురు జనుల భక్తి య 12.

థోచిత మా రాముని రహి నుద జాంబకునిన్

కం. అని చని కొంత తడవు రా
జ నందనుఁడు చిత్రకూట శైల తటినిఁ జే
రెను మందాకినిఁ బల్కెను
జనుల నరసి యివ్విధమ్ము సంభ్రమ మడరన్ 13.

ఉ. ఈ యవనిం నరర్షభుఁ డహీన పరాక్రముఁ డుండఁ బ్రీతితో
నీ యతి వీర నిష్ఠితపు టిద్ధ వరాసన మందు రాముఁడే
యాయెను గాంచ నిచ్చట మహాత్యయ రీతిని నేలయే జగ
న్నాయకు నాసనం బకట నాయ దిసీ బ్రతు కింకఁ బుట్టువున్ 14.

ఆ.వె. నా వలననె లోక నాథున కిటఁ బుట్టె
దుర్భర వ్యసనము లర్భకుని వ
లన మహాద్యుతునకు ఘనుఁ డన్నియుఁ ద్యజించి
రాఘవుఁడు నిలిచె నరణ్య మందు 15.

కం. నిందింప నన్ను లోకము
వొందంగ దయను బడుదును బోయి వడి మహా
నందమున జానకీ రా
మేందు వదన లక్ష్మణుల యహీన పదములన్ 16.

మ. కనె నంతన్ విలపించుచున్ భరతుఁ డా కాకుత్స్థ వీరుండు నె
మ్మిని రమ్యంబగు పర్ణశాల నట సంవీతమ్ము పత్రమ్ములన్
ఘన తాళద్రుమ సాశ్వకర్ణ దళముల్ కార్చ్యచ్ఛ దౌఘమ్ములుం
గనిపింపం దన చుట్టు నింపుగను దత్కాంతార మధ్యమ్మునన్ 17.

చం. మృదుతర పత్ర సంవృతము మేటి కుశమ్ములు విస్తరింపఁగాఁ
జదునగు యాగ వేదికను జక్కగఁ బోలుచు వెల్గు దానినిం
బదపడి స్వర్ణ పృష్ఠ బహు భార రిపుక్షయ కార్ముకమ్ములన్
సదమల శక్ర చాప వర సన్నిభ సార యు తాయుధమ్ములన్ 18.

చం. రవి రుచి సన్నిభమ్ములు కరమ్ము భయంకరముల్ వెలుంగఁ దూ 19.

ణ వితతిఁ బోలి భోగి పుర నర్తిత సర్ప గణమ్ము దీప్తి తే
ద్ధ వదన యుక్త బాణములు దద్దయు వాడి కృపాణ యుగ్మమున్
ద్రవిణ మ యాంబరమ్ముల విరాజిల నింపుగ వెల్గు లీనుచున్

తే.గీ. పసిడి చుక్కల డాలులు పరఁగ రెండు
వ్రేలి తోలు తొడుగు లెల్ల వ్రేలఁబడఁగ
గోడ కట శాల వైరులకు చొఱ రాని
దానిఁ గనె జింకలకు హరి దరి విధమ్ము 20.

ఆ.వె. అతి విశాల మైన యగ్ని గుండమ్మును
గాంచెను భరతుండు మించ నెడఁద
నెలమి వంగి యుండ నీశాన్య దిశకుఁ బు
ణ్య రఘు రామ నిలయ మందు వెలసి 21.

తే.గీ. ఒక ముహూర్తము వీక్షించి యుటజ మందు
నగ్రజుని జటా ధారిని నబ్జనేత్రుఁ
బుడమి నాసీను రామునిఁ బుణ్యపురుషుఁ
భరతుఁ డెలమి నరసె భ్రాతృ వత్సలుండు 22.

తే.గీ. నల్లనౌ జింక తోలును నార బట్ట
లూని కూర్చుండ నగ్నిసమాన తేజు
సింహ సన్నిభ స్కందునిఁ జేతు లున్న
వాని మోకాళ్ల వఱకును బద్మనేత్రు 23.

ఆ.వె. కడలి దనుక వెలయు పుడమి నేలఁ గలట్టి
విభుని ధర్మచరితు విధినిభమ్ము
శాశ్వతుఁ బఱచిన కుశలపై నవనిజ ల
క్ష్మణుల తోడ రామ చంద్రుఁ గనెను 24.

చం. కని రఘు రాము భ్రాత నటఁ గైక కుమారుఁడు పొంగ దుఃఖమే
మనమునఁ బాఱె ధర్మ రత మానసుఁ డబ్భరతుండు కుందుచుం
గనులను నిండ భాష్పములు గద్గద సంయుత దీన వాక్కులన్
వనటను సైఁప నేరకయుఁ బల్కెను ధైర్యము నూని యివ్విధిన్ 25.

కం. ఎవ్వం డర్థుండై చను
నివ్వసుధను రాజ సభల నెలమిఁ గొలువఁగా
నివ్వర పౌర నికాయం
బవ్వానినిఁ గొల్చు చుండె నటవీ మృగముల్ 26.

ఉ. పెక్కు వరాంబరమ్ములను బ్రీతి ధరించు మహాత్ముఁ డిప్డు తా
నక్కట ధర్మ మూనుచు మృగాజిన యుగ్మము నూనె నక్కటా
చక్కని చిత్ర పుష్పములఁ జారు తరమ్ము వెలుంగు రాముఁడే
వెక్కస మైన యీ జడల విస్తృత భారము మోయ నెట్లగున్ 27.

తే.గీ. యుక్త రీతినిఁ జేసి యా గోత్కరముల
నడరి ధర్మ సంచయమున కర్హుఁ డైన
యీతఁ డందంగఁ దలపోయు నెడఁద ధర్మ
మును భృశమ్ముగ బాధించి తనదు మేను 28.

కం. చందనము తోడ నెవ్వని
యందంపుఁ దనువు వెలుంగు నా గాత్రం బే
చందమున ధూళి తో నేఁ
డిం దక్కట సేవ లందు నెన్నఁగఁ దరమే 29.

కం. నా కై సుఖార్హుఁడు వడసె
నీ కానన మందు రాముఁ డిప్పగిది నహో
యీ కష్టమ్ములె యిస్సీ
నా కేల బ్రతుకు నృశంసునకు దోషునకున్ 30.

కం కుములుచు నివ్విధి భరతుఁడు
చెమట ముఖాబ్జము తడియఁగ శ్రీ రామ పదా
బ్జములను జేరకయె పడెను
శ్రమ మీఱఁగఁ బర్వు లిడుచు సంతాపమునన్ 31.

కం. ఆర్యా యని భరతుఁడు వగ
వీర్యము చాలక పలుకఁగ వేచి తిరిగి తా 32.

నార్యా యనంగ రాముని
నార్యుఁ గని యవాక్కుఁ డయ్యె నశ్రువు లుండన్

ఆ.వె. ఆత్ర మడరఁ జేరి శత్రుఘ్నుఁ డేడ్చుచు
వందనము లొనర్చెఁ బదము లంటి
యన్న కంత రాముఁ డా యిద్దఱినీఁ గౌఁగి
లించె బాష్పము లవి మించి రాల 33.

తే.గీ. రామ లక్ష్మణు లిద్ద ఱరణ్య మందుఁ
గలసిరి సుమంత్ర గుహుల నాకసము నందు
సూర్య చంద్రులు వెలుఁగుచు శుక్ర గురువు
ల నిరువురఁ గలసిన యట్టి రమణ నెలమి 34.

కం. వన వాసు లెల్ల రప్పుడు
ఘన కరి రాజ నిభ రాజ ఘనుల నరణ్య
మ్మునఁ గలయఁ గాంచి హర్ష
మ్మును వీడి యెదల విడిచి రపుడు కన్నీటిన్ 35.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందుఁ దొంబది తొమ్మిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 100.

జడలతో నార బట్టలతో నున్న భరతుని రాముఁడు కలిసి జనకుని యితరుల కుశల ప్రశ్నముల నడిగి యయోధ్యా నగరమున భరతుని పాలనము గుఱించి తెలిసికొనుచు రాజ ధర్మములను బ్రస్తావించుట.

కం. భువిఁ గూలిన జడలను చీ
ర వసనముల నూని నట్టి ప్రళ యావసరం 1.

పు వనజ హితు సన్నిభుఁ గనె
నవలోకింపంగఁ గష్టు నల రాముఁ డటన్

ఆ.వె. తెల్ల నైన ముఖ మధికముగ సన్న న
యిన యనుజుని భరతుని నతి కష్ట
మున నెఱింగి చిత్తమున రాముఁ డాతనిఁ
గౌఁగిలించు కొనియె రాగ మడర 2.

చం. భరతు శిరమ్ము మూరుకొని పన్నుగ నంకము నందు నిల్పి క్ష్మా
వర తనయుండు రాముఁడు శుభమ్ముగ నిల్పి నిజాత్మనే నిజా
వరజుని తోడ నిట్లనియె వచ్చితి వీ విటు తండ్రి యేఁడి భూ
వరుఁ డిల నుండఁ గానలకు వచ్చుట కూడదు నీకు తమ్ముఁడా! 3.

తే.గీ. చాల కాలమునకుఁ గంటిఁ జాల చిక్కి
దూరమున నుండి కాన కేతేరు నిన్ను
భరత! దుర్గమం బయినట్టి వనికి నీవు
నేల వచ్చితి వయ్య! యకాల మందు 4.

ఉ. వచ్చితి వయ్య యిచ్చటకుఁ బార్థుఁడు పన్నుగ నుండెనే యటన్
నొచ్చుచు స్వర్గ మేఁగఁడు మనో వ్యథనుం గద! దీనుఁడై త్వరన్
విచ్చెనె సౌమ్య! రాజ్య మది పిన్నతనంపుఁ గతమ్మునన్ నృపున్
నిచ్చలు సత్యవిక్రముని నీ వటఁ దండ్రినిఁ గొల్తువే తమిన్ 5.

తే.గీ. రాజ సూ యాశ్వ మేధముల నొనరించి
నట్టి సత్య సంగరుఁడు నరాధి నేత
దశరథుండు నిరంతర ధర్మ నిశ్చ
యుండు నున్న వాఁడే కుశలుం డయి తగ 6.

తే.గీ. విప్రు విద్వాంసు నిక్ష్వాకు వీర గురుని
నిత్య ధర్మస్థుఁ దేజస్వి నెమ్మి తోడ
నాన్న! శ్రద్ధ నర్థ విధిని నర వరేణ్యుఁ
డడరి పూజించునే జనకుఁ డనయమ్ము 7.

తే.గీ. క్షేమమే కద కౌసల్య క్షేమముగ సు
మిత్ర మెలఁగు చున్నయదె సత్పుత్రవతియు
క్షేమమే కద కైకేయి చెప్పుమ ముద
ము వడయుచు నున్నదే దేవి పూర్ణముగను 8.

ఆ.వె. చాల యెఱిఁగి నట్టి సత్కుల జాతుఁ డ
సూయ లేని ముందు చూపు కల్గి
నట్టి మన పురోహి తాత్మజుఁ బూజింతె
విరియ భక్తి నీవు వినయ ధనుని 9.

తే.గీ. అగ్ని కార్యముల కొఱ కభగ్న మింపు
గ నొనరింప నుంచిన తాను గాల కాల
ములఁ దెలియఁ జేయునే హుతముల హుతార్హ
ములను నీకుఁ దిన్నని వాఁడు బుద్ధి యుతుఁడు 10.

చం. సురలను దల్లిదండ్రులను జూతువె యొజ్జల విప్ర వృద్ధులన్
గురు నిభులన్ నిజాత్మఁ దగు కూర్మిని వైద్యులఁ దండ్రి! చెప్పుమా
గురువు సుధన్వ శస్త్ర చయ గుప్తిని నర్థ సుశాస్త్ర నైపుణిన్
భరత! నిరంతరం బట నపారపుఁ బ్రీతిని గౌరవింతువే 11.

తే.గీ. మంత్రులుగ నుంచితె భరత! మనము గెల్చి
నట్టి వారి నన్ని చదివి నట్టి జనుల
నింగితజ్ఞుల శూరుల నెంచ నీకు
సరి యయిన వారలఁ గులీన సజ్జనులను 12.

కం. మూల మగు గుప్త మంత్రము
మేలుగ నృపులకు సచివులు మేటి తలంపుల్
లోలోనుంచఁ గలిగి స్వీ
యాలోచన లిడ జయమున కవనిన్ భరతా! 13.

తే.గీ. లోఁబడవు గద నిద్రకు లోలుఁడ వయి
మేలుకొందువె తగి నట్టి కాల మందు
నర్ధ రాత్రి యెప్పు డయిన నర్ధ శాస్త్ర 14.

ము నెద నడరి చింతింతువె ముఖ్యముగను

ఉ. చేయవు గాదె యొక్కడివి చింతనముల్ మఱి పెక్కు మందితోఁ
జేయక యుందువే భరత! చేసిన మంతన ముంతె గుట్టుగా
నీ యెద నిర్ణయించినది నేర్పున నల్ప పరిశ్రమంబుతో
నాయత లాభ కార్యము రయమ్మునఁ జేయుదె యాలసింపకే 15.

కం. పర రాజు లెఱుఁగుదురె నీ
దు రమ్య కృతములను లేక తూర్ణంబు తగం
బరిపూర్ణ మయ్యెడివి నే
రరు గద కర్తవ్యములను రాజ్యము నందున్ 16.

తే.గీ. వాదనల నైనఁ దమ యుక్తి వలన నైన
నేరరు గద నన్యమ్ముల నీదు గుప్త
నిర్ణయములఁ జెప్పక యున్న నీవు గాని
నీ యమాత్యులం దెవ రైన నిశ్చయముగ 17.

ఉ. పండితు నెన్నుదే యొకనిఁ బండితమాని సహస్ర సంఖ్యకున్
మెండుగఁ గూర్చు మే లతఁడు మీఱినఁ గ్లేశము లెన్నఁడేనిఁ బా
ర్థుండు వరింప నుండగను దోడుగ వే ల్పది వేల మూర్ఖులన్
దండ యొకింత యుండదు వృథాగతి నుంచిన యట్టులౌ నిలన్ 18.

తే.గీ. శ్రేయ మొసఁగు నొక్కఁ డయినఁ జెల్వముగను
మంత్రి మేధావి దక్షుండు మాన్య శూరుఁ
డత్యధిక విచక్షణుఁ డైన నవని పతికి
నింక రా జాత్మజునకు నహీనముగను 19.

ఆ.వె. పెద్ద పనులు గొప్ప భృత్యుల కొసఁగుదె
యల్పు లైన వారి కల్పకర్మ
ముల నొసఁగుదె మధ్యముల కిత్తె మధ్యమ
కర్మములను రాజ కార్య తతుల 20.

తే.గీ. తాత తండ్రుల క్రమ మందుఁ దనరు చున్న 21.

సన్మ తులను శ్రేష్ఠులఁ బరీక్షా విజయుల
మంత్రి వరుల నియోగించి మంచి పనుల
యందు వర్తింతువే రాజ్య మందుఁ దండ్రి!

కం. జను లుగ్ర దండనమ్ముల
ఘనతర ముద్వేజితు లయి కలఁగంగ నమా
త్య నరవ్రాతము రాష్ట్ర
మ్మున నూరక యుండదు గద పుణ్యాత్ముండా! 22.

కం. నిన్నవమానింపరు గద
యెన్నండు నతిగ్రహీత యీతం డనుచున్
మిన్నగ యాజకులు పతిత
లన్నా రులు విటులను వలె రట్టు లిడరుగా 23.

కం. కని యెవ్వఁడు చంపఁడొ వే
ద్యు నత్యుపాయముల నడరు దుష్టు భటుల కి
చ్చిన లంచము నాతని శూ
రుని భాగ్యమ్ముల నరయు నరు నతఁ డణంగున్ 24.

ఆ.వె. శూరు హృష్టు ధైర్యు శుచిని సద్బుద్ధుని
నెంచి యుంచితి గద మంచి కులపు
వాని సేనకు నధి పతిగ దక్షత యున్న
వాని రాజ భక్తి కానఁబడఁగ 25.

ఉ. బల్లిదు లైన ముఖ్యులను భండన నైపుణ వీర వర్యులన్
సల్లలితంపు రీతి ఘన శౌర్య జనాలిని సత్కరింతువే
యెల్ల చమూ సమూహమున కిత్తువె భక్తము వేతనమ్ములే
యెల్లి యనంతరం బనుచు నెన్నఁడు వల్కవు గాదె రాఘవా! 26.

తే.గీ. మించిన సమయ మీయంగ నంచితముగ
భక్త వేతనములు భృత్య వర్గమునకుఁ
బతిని నిరసింతు రూని కోపమ్ము చెడుదు
రది యొసఁగు నుపద్రవముల నధికముగను 27.

తే.గీ. తలఁతు నీకు నెల్ల రనురక్తు లని కుల త
నయ గణము విశేషమ్ముగఁ బ్రియముగ జను
లెల్ల సన్మతి నీ కొఱ కుల్లసిల్లి
ప్రాణములు విడువ గలట్టి వారె తండ్రి! 28.

కం. దూతగ నెన్నితె జాన ప
దాతత విద్వాంసు ఘను మహా మేధావిన్
వే తిరిగి చెప్ప నేర్చిన
యాతని దక్షత గలట్టి యత్యుత్తమునిన్ 29.

తే.గీ. స్వపర పక్షము లందలి పది యయిదుఁ బ
దునెనమండ్రను గమనింప ఘనుల ముగ్గు
రేసి మందిని నుంచితె యేరు నెఱుఁగ
నట్టి వారి వేగులుగ నీ వంచితముగ 30.

తే.గీ. విస్మరింపవు కద మున్ను వెడలఁ గొట్టి
నట్టి విద్వేషుల రిపుగణాలి దమన!
యల్ప బలు లని యెన్నండు నట్టి వారు
తిరిగి వచ్చిన వీక్షించి భరత! చెపుమ 31.

ఉ. కొందఱ నిత్య లౌకికులఁ గోరి భజింపవుగా యధర్ములన్
డెందము లందుఁ దమ్మిలఁ గడింది తలంతురు ప్రాజ్ఞు లన్న యా
చందము వీ రనర్థములఁ జాల నొసంగుచు ధర్మ శాస్త్ర స
ద్బృందము లింకఁ దర్కముల రిక్త గిరావళిఁ బల్కనేర్తురే 32.

ఉ. పేరుకుఁ దగ్గ పట్టణము పెద్దలు మున్ను వసించి రింపుగా
ద్వారము లుండ గొప్పగ రథవ్రజ హస్తి తురంగ కోటితో
మూరి ధరాసురద్విజ సమూహము వైశ్య జనాలి నిత్యమున్
వారక స్వీయ కర్మములు వావిరి సేయఁగ వెల్గు దానినిన్ 33.

తే.గీ. వేవు రుత్సాహు లార్యులు స్వీయ చిత్త
ముల జయించిన వారు విబుధులు నుండ 34.

బహువి ధాకార గృహములఁ బరఁగు పుర మ
యోధ్య ను దగ రక్షింతువె యున్నతమును

సీ. చైత్య శతమ్ములు సక్కఁగ భాసిల్ల సజ్జనవ్రాతమ్ము సంచరింప
దేవాలయమ్ములు దేదీప్యమానమై వెలుగఁగఁ జలిపందిరు లమరంగ
వర తటాకమ్ములు వఱలుచుండఁ గరమ్ము నుప్పొంగ నర నారు లుత్సవముల
వ్యవసాయ భూములు పశుసంపద లలర వీత హింసఁ బరిఢవిల్ల నెల్ల

తే.గీ. వరుణి వశము గాక పరఁగు శ్వాపద భయ
వర్జితమ్ము ధాతు సమృద్ధ భాసితం బ
పాప నర వృతము మమ పూర్వ జన పాలి
తమ్ము స్ఫీతమున జనులు నెమ్మిఁ గలరె 35.

తే.గీ. ఆల కాపు లందును గృషి యందు బ్రతుకు
వారు నీ కిష్టు లగుదురె భరత! సతము
లోక మందు వీక్షింపఁగఁ బ్రాకటముగ
వృద్ధి సెందు సుఖము తండ్రి! వీరి వలన 36.

కం. భరణం బిత్తువె వారికిఁ
బరి రక్షణ మొసఁగు చుండి పరిహారంబుల్
పరిశీలింతువె యాపద
ల రాజు రక్షింపవలయుఁ బ్రజలను సతమున్ 37.

ఆ.వె. ఊఱడింతువె తగ నువిదల రక్షింతు
వే కరుణ వహించి విరివి వారి
నమ్మవు గద యెపుడు నారీ జన గిరలు
వలుకవు గద మర్మములు మొగదల 38.

కం. గజ గృహములఁ గాపాడుదె
నిజ ధేనుకలు గలవే యనేకమ్ములు తృ
ప్తిజములు గావు కద తురగ
గజ సంఖ్యలు నీకు నెంచఁ గాకుత్స్థ వరా! 39.

కం. కనఁ బడుదువె లేచి యుదయ 40.

మున భూషితుఁడ వయి నర సమూహమ్ము నకున్
ఘన రాజ వీథి నిత్య
మ్మును రాజకుమార! యడరి మోదము తోడన్

ఆ.వె. సకల భటులు వీడి శంక నెల్లను రారు
కద మఱియు నిలుపవు కద సు దూర
మందు మధ్య మార్గ మందు నుండఁగ మేలు
రాజ పుత్ర! యెల్లరకును గరము 41.

కం. ధన శస్త్ర ధాన్య యంత్ర జ
ల నిచయముల తోడ నిండి రాజిల్లునె నీ
దు నిఖిల దుర్గములు మఱియు
దనుర్ధరుల శిల్పుల సముదాయము తోడన్ 42.

కం. హెచ్చగునె నీదు రాఁబడి
వెచ్చ మలంతియె రఘువర వీక్షింపంగన్
నిచ్చలు పోదుగ బొక్కస
మెచ్చోట నయోగ్య నరుల కెన్నం డైనన్ 43.

కం. పితృదేవ నిర్జ రాభ్యా
గత భూసుర మిత్ర యోధ కాయమ్ముల కం
చితముగ నీదు వ్యయంబు ల
లిత రీతి నగునె యభంగ లీలన్ భరతా! 44.

ఆ.వె. శుద్ధ చిత్తుఁ డధిక శుచి యైన యార్యుఁడు
నింద వడసి దోషి చంద ముండ
శాస్త్ర చయ నిపుణుల సంప్రదింపక చంప
రు గద యెన్నఁడేని లోభ మడర! 45.

కం. పట్టు వడఁగఁ గాలమ్మున
దట్టమ్ముగ నుండ నడుగఁ దగు కారణముల్
కట్టెదుట నున్న దొంగను
బెట్టిద మగు లోభ ముండ విడువరు గాదే 46.

కం. కడువిన్న నీ యమాత్యులు
బడుగుల ధనికుల నడుమున బాధల లోనన్
విడిచి యెదల రాగమ్మును
నడతురె సమ రీతి సెప్షు నరవర వర్యా! 47.

ఆ.వె. జేని ప్రీతిఁ బడయఁగా నెంచి శిక్షింపఁ
గపట రీతిఁ దప్పు గాంచి కినిసి
నేల రాలి నట్టి నిర్దోషు కన్నీరు
కాల్చు నృపు సుత పశు కాయము నిల 48.

కం. బాలుర వృద్ధుల చదువుల
మేలైన జనులను మూడు మేటి విధములన్
లాలన దానము లనురా
గాల గెలువ నేర్తువే తగ రఘువరేణ్యా! 49.

కం. గురు వృద్ధ తాప సామర
వరాతిథి ధరాసురప్రవర గణ చైత్యో
త్కర సిద్ధా ర్థాదుల కె
ల్లర కొసఁగుదె దండములు భరత! సద్భక్తిన్ 50.

తే.గీ. అర్థము కొఱకు ధర్మ లయమ్ము ధర్మ
మునకు నర్థ వినాశము మూరి రెంటి
నీదు కామ లబ్ధి కొఱకు మేదిని రఘు
వీర! లయము సేయవు గద ప్రీతిఁ గోరి 51.

తే.గీ. విజయు లందు మిన్న! సమయ వేత్త! వరద!
ఘనుఁడ! ధర్మార్థ కామములను దగ విభ
జించి కాలము ననయమ్ము నంచితముగ
భరత! సేవించు చుందువె భద్రముగను 52.

ఆ.వె. సకల శాస్త్ర చయ విశారదులు ధరణి
సురులు జానపదులు పుర నివాసు 53.

లెల్ల సంతతమ్ము నుల్లసిల్లుచు నీదు
సుఖము కోరుదురె వసుధను భ్రాజ్ఞ!

సీ. నమ్మమి దేవ గణముల నసత్యము కినుక యేమఱుపాటు పనుల దాఁపు
జ్ఞానులఁ గనకుంట జా గొనరించుట పంచేద్రియ వశత స్వయపుఁ జింత
యర్థము లందు ననర్థజ్ఞులను సంప్రదించుట పే నిర్ణయించి నట్టి
వాని ప్రారంభము వడయమి కావమి గుట్టు చేయమి శుభకోటి నడరి
తే.గీ. మార్కొనఁ జనుట యేక సమయము నందు
భ్రాత! యివి యెల్లఁ బదునాల్గు రాజ దోష
ము లనఁ బరఁగుచుండుఁ బుడమి మూరి చేయ
వు గద నీవు రాజ్యమ్మున భూప పుత్ర! 54.

సీ. ఔని పది చెడులు వాని కోట కయిదు కాపు లుపాయ యుక్తములు నాల్గు
సప్త రాజాంగ సంచయము దోషంబు లెనిమిది రతులు మూడు నిండు నరుల
విద్య లలరు మూడు వెలయు నాఱింద్రి యాకాంక్షలు నింకను గాంచ దైవ
మనుజ కృతమ్ము లయిన యుపద్రవములు మన్నియ లిరువది మంది యుండ్రు
ఆ.వె. మఱియుఁ బౌర వరులు తఱచుగ వసియింత్రు
యాత్ర లింక దండ యాత్ర లుండు
సంధి విగ్రహములు చక్క రెండు పరఁగు
నెఱిఁగి తగఁ జరింతువే నరవర! 55.

కం. భరతా! మంత్రి వరులు ము
గ్గు రేనియు నలుగుర తోడఁ గూడియు విడిగాఁ
బరఁగియు నాలోచింతె త
గు రీతి శాస్త్ర నిచయమ్ము కోరిన యట్లున్ 56.

ఆ.వె. ఫలితము లొసఁగినవె భరత! నీ వేద చ
యముల యెఱుక చేసినట్టి నీదు
పనులు నీదు సతుల వర సహచర్యము
నీదు శ్రుతుల చదువు మోదముగను 57.

కం. అనఘా నే నని నట్టుల
మన మున్నదె యాయువు ప్రవిమల కీర్తి ధరన్ 58.

ఘనముగఁ బెరుఁగఁగ ధర్మం
బును గామము నర్ధ సహితముగ నీకుఁ దగన్

ఆ.వె. తండ్రి! తగఁ జరింతె తాత ముత్తాతలు
నడచి నట్టి రీతి నయము తోడ
మంచి దారి నడచు మాన వోత్తముల మా
ర్గమ్ము ననుసరింతె రమ్యముగను 59.

ఆ.వె. రుచికరం బయిన సురుచి రాన్న మొక్కఁడ
వెప్పుడు తినవు గద యొప్పుగ వల
సిన జనులకు నింక స్నేహితులకుఁ బంచి
యిచ్చి భరత! సంతసింతువు గద 60.

తే.గీ. వసుధ నెల్లఁ బడసి తగఁ బార్థివుండు
బుద్ధిమంతుఁడు విబుధుండు పుర జనులను
దండ ధరుఁ డయి పాలించి ధర్మ యుతము
చేరు స్వర్గము భువి నుండి చెలువముగను 61.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 101.

భరతుఁడు రామునిఁ దిరిగి యయోధ్యకు రమ్మని వేఁడుట, తమ తండ్రి మరణము నెఱింగించుట.

కం. విని రాముని వాక్యమ్ములు
ఘనుండు భరతుఁ డొసఁగెం దగ బదులు నయ హీ
నునితో నక్కట వచియిం
ప నేల నృప ధర్మ కోటి భ్రాతా! నా తోన్ 1.

కం. నరశార్దూల! సనాతన
వర ధర్మము మన కులమునఁ బరఁగును సతమున్
నరపతి తాఁ గా నేరఁ డ
వరజుఁడు జ్యేష్ఠ సుతుఁ డుండ వసుధను రాజా! 2.

ఆ.వె. రామ! నన్ను గూడి రమ్య సమృద్ధపుఁ
బుర మయోధ్యకుఁ జనుము తమి మన కు
లమ్ము నుద్ధరింప రాజుగ నభిషిక్తుఁ
డ వగు మెలమి తోడ నృవర! లెమ్ము 3.

తే.గీ. రాజు నందురు కొందఱు రామ! మనుజుఁ
డంచు ధర్మార్థ వృత్తమ్ము నరయఁగా న
మానుష మని పలుకు చుంద్రు దానిఁ బ్రీతి
దేవుఁ డని యెంతు నేను నృదేవు నెప్డు 4.

ఆ.వె. కేక యావని కరిగి నిలువ నట నేను
గాన నాశ్రయింపఁగా నరేంద్ర!
నీవు దివికిఁ జనియె ధీవరుఁడు జనకుం
డార్యుఁ డవని ధవుఁడు యజ్ఞకర్త 5.

తే.గీ. చన వని సజానకీ సలక్ష్మణుఁడ వయి జ
గన్నుత రఘుప్రవీర! దుఃఖ పరి తప్త
చిత్తమున వసు ధాధిప శేఖరుండు
త్రిదివము నలంకరించెను దీనముగను 6.

ఆ.వె. లెమ్ము సంగఁ దర్పణమ్ములు తండ్రికిఁ
బురుష వృషభ! పుణ్య పురుషున కట
సలిలము లొసఁగితిమి శత్రుఘ్నుఁడును నేను
ము న్నయోధ్యలోన విన్నఁబోయి 7.

కం. అతి దయిత తనయుఁ డొసఁగినఁ
బితృ లోకము లందు సతము పెల్లు ననుచుఁ బం 8.

డితు లంద్రు రామ! నీవే
యతిప్రియుఁడవు గద తండ్రి కరయఁగ ధాత్రిన్

తే.గీ. నీ కొఱకు వగచుచు రాజు నిన్ను జూడఁ
గోరుచు నెడఁదఁ దా నిన్ను గూడిన మతి
ని మరలింప నేరక చెంత నిన్ను గనక
కుములుచుఁ దలఁచు చుండి దివమున కేఁగె 9.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట యొకటవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 102.

దశరథ మహా రాజు మరణమును విని సీతా రామ లక్ష్మణులు విలపించుట, మందాకినీ నదీ తీరమున రామ లక్ష్మణులు దండ్రికిఁ బిండ ప్రదానములు చేసి యాశ్రమమున రోదించు చుండ నెల్లరు నచటకు వచ్చుట

కం. అశని నిభ వాక్కులను విని
దశరథ సుత రాముఁ డంతఁ దప్తాత్ముండై
భృశముగఁ గోల్పోయెఁ దెలివి
దశరథు ఘోర మరణమ్ముఁ దలఁచిన యంతన్ 1.

చం. భరతుని ఘోర వాక్కులిశ పాతము వాసవ వజ్ర ఘాతమై
పరఁగఁ బరంతపుం డపుడు పార్థుఁడు రాముఁడు చూచు చుండఁగన్
ఖర రుచి మత్కుఠార ఘన ఘాత విఖండిత పుష్ప యుక్త త
త్తరు వినిపాత సన్నిభము ధారుణిఁ గూలెను జాచి చేతులన్ 2.

ఉ. కూలఁగ విశ్వనాథుఁ డిలఁ గూలము గూల్చి శ్రమించి పండు నా
భీల గజమ్ము భంగి ఘన వీరుఁడు రాముఁడు భ్రాత లందఱున్ 3.

జాలిగ సీత తోడుతను జల్లని నీటినిఁ జల్లి రంతటన్
వీలుగ మిక్కుటమ్ము విలపించుచు నాస్యము పైన నార్తినిన్

ఆ.వె. సంజ్ఞ నొంది కొంత సమయమ్మునకుఁ దిర్గి
కనుల రెంట నీరు కార్చు చుండి
భృశము జాలి గొల్పఁ బెక్కు వాక్యమ్ములు
వలుకఁ దొడఁగె నంతఁ బార్థ సుతుఁడు 4.

కం. విని తండ్రి పుడమి నాథుఁడు
సనె స్వర్గమున కని ధర్మ సంయుతముగఁ బ
ల్కెను ధర్మాత్ముం డబ్బర
తునితో వాక్యమ్ము లిట్లు దుఃఖం బడరన్ 5.

తే.గీ. ఎన్నఁగ నయోధ్యతోఁ బని యేమి నాకుఁ
దండ్రి! స్వర్గ మేఁగఁగ మన తండ్రి యిట్లు
రాజవర్య హీ నాయోధ్య నోజ నెవ్వ
రెంత్రు పాలింప నెదల యం దిప్పు డకట 6.

తే.గీ. దుష్ట జాతుండు నైన సుతుండ నైతి
నిద్ధరణి ధవుఁడు దివికి నేఁగె నేన
యేఁచ సంస్కార మేఁ జేయ నోఁచ లేదు
నా వలన నుపయోగ మున్నదె నరవర! 7.

ఆ.వె. సత్కరించి రేరు సత్కృత ప్రేత కా
ర్యముల నవని ధవుని నట్టి మీ రు
భయులు ధన్యు లయిరి భరత శత్రుఘ్ను లా
ర! ధరఁ దలఁచి చూడ రాజపుత్ర! 8.

కం. ముగిసిన నీ వన వాసము
విగత నృ పాయోధ్య రాజ వీత పుర మనే
క గతుల నిత్యమ్ము మెలఁగు
నగరముఁ జేరంగ నొల్ల నరవర వర్యా! 9.

ఆ.వె. వన నివాస మణఁగఁ బార్థివుఁ డేఁగ లో
కాంతరమ్ము ద్విష నికాయ దమన!
పుర మయోధ్య యందు మూరి నా కెవ్వ రి
త్తు రుపదేశములను గరుణ మీఱ 10.

కం. మున్నరసి నా సువృత్తము
నన్ననురక్తి నను చుండు నరనాథు గిరల్
మిన్నగ ముదం బొసఁగెడివి
యన్నెఱి చెవి కింపు లిప్పు డరయఁగ నగునే 11.

కం. అని యివ్విధి భరతునితో
ఘన శోకమున నిజ దారఁ గదిసి శశి ని భా
స్యను దుఃఖిత రాముండు వ
చనమ్ము లిట్లంగిఁ బల్కె సంతాపమునన్ 12.

ఉ. వింటివ సీత యౌర పృథివీపతి ధీనిధి నీదు మామయున్
మింటికి నేఁగె లక్ష్మణుఁడు మేదినిఁ దా పితృ హీనుఁ డయ్యెనే
వింటిని చెప్పఁగా నిపుడు వేఁగుచు నీ భరతుండు రాఘవుం
డంట వినంగ నిప్పగిది నశ్రులు నిండెఁ గుమార కోటికిన్ 13.

ఉ. అంతట నూఱడించి తగ నన్నను దమ్ములు మువ్వు రాత్రుతన్
శాంతి వహించి తండ్రికిఁ బ్రశాస్త కొనర్పుమ తర్పణక్రియల్
సుంత యెడంద నూని ధృతి శూరుఁడ యంచు వచించి రింపుగా
నింతికి నిండ నశ్రులు నిజేశునిఁ గాంచఁగఁ జాల దత్తఱిన్ 14.

కం. విలపించు చున్న జానకి
లలితమ్ముగ నూఱడించి రాముం డంతం
బలికెను దమ్ముని లక్ష్మణు
సులక్షణు విచారుఁ గాంచి శోకమున నిటుల్ 15.

ఆ.వె. ఏఁగి లక్ష్మణ! వడి నింగుది తెలిక పిం
డి మఱి నార బట్ట విమల చరిత!
తెమ్ము నేను తండ్రి కమ్మహాత్మునకు జ 16.

లక్రియ లొనరుపఁ దరలఁగ వలయు

కం. చన వలయు నీవు ముంగలఁ
జన నీ జానకిని వెనుకఁ జను వాఁడను నే
ను నెలంత సీత పిమ్మట
తనరును మన కియ్యె దిప్డు దారుణ గతియై 17.

చం. సతతము వెంట వచ్చు వర సన్మతి ప్రాజ్ఞుఁడు దాంత శాంత చి
త్తత మృదు భాషణుండు వితతమ్ముగ రాముని యందు భక్తి ని
ల్పి తనరు నా సుమంత్రుఁ డట శ్రీపతి సూనుల తోడ రామునిన్
నుతగుణు నూఱడించి సుమనోజ్ఞత నాపగ డిగ్గ తోడ్పడెన్ 18.

మ. మనుజ శ్రేష్ఠులు తీవ్ర కష్టమున నా మందాకినీ తీర్థమున్
ఘన పుష్పాంచిత కాననమ్ము జలవేగ భ్రాజిత ప్రోదినిం
గన నిష్పంకము పుణ్యవంతము యశః కాంతా సుసంశోభితుల్
జనకా కొమ్ము జలమ్ము నిత్తు నని సచ్చారిత్ర రాముం డనెన్ 19.

ఉ. వారి సుపూరి తాంజలినిఁ బార్థివ సూనుఁడు వల్కె నేడ్చుచుం
దీరుగ దక్షిణాభి ముఖ దీప్త ముఖుం డయి యిట్లు స్వర్గముం
జేరిన యన్నరర్షభునిఁ జెన్నుగ నక్షయమై భృశమ్ముగాఁ
జేరును గాక నా యిడిన శ్రేష్ఠ వ రామల నీర మెల్లనున్ 20.

చం. వర వహ తీర మెక్కి తన భ్రాతల నెల్లరఁ గూడి రాముఁ డం
త రఘు వరుండు పిండములు తండ్రి కొసంగఁగ నింగుదీ సు భా
సుర బదరీ సుమిశ్రములు శోభిత దర్భల నుంచి పల్కె నీ
గిరలు విచార తప్త ముఖ కీలిత హస్త సరోరుహుండునై 21.

కం. ఇదె మా యన్నము భూ మీ
శ దయం గొని యారగింపు చక్కఁగ నిట యె
య్యది నరులు తిందురో య
య్యది యిత్తురు దేవతలకు నానందముగన్ 22.

తే.గీ. అంత నది యొడ్డు నుండి వా రందఱు తగ 23.

వచ్చిన గతిని వెడలుచుఁ బర్వతమ్ము
రమ్య సాను విలసితమ్ము గమ్య మెక్కి
స్వీయ పర్ణకుటీరము చేరి రపుడు

ఆ.వె. చేరి రాఘవుండు చింతతో భరత ల
క్ష్మణులఁ గౌఁగిలించె మాఱు మ్రోఁగె
సీత భ్రాత లంత సింహ గర్జన భంగి
నేడ్వ శైలరాజ మెల్ల ధ్వనుల 24.

తే.గీ. బల్లిదులు తండ్రి కిడిరి తర్పణము లంచు
నెఱిఁగి నార్త నాదమ్ములు తఱచు వినిన
కతన భరత సైనికు లంతఁ గ్రన్న నప్ర
మత్తు లైరి యెల్ల రచట నుత్తలమున 25.

చం. పలుకుచు నంత నొండొరుల భ్రాత నటన్ భరతుండు కాన లో
పలఁ గని యుండుఁ దథ్యముగఁ బార్థుని యస్తమయార్తి ఘోషణ
మ్ములు విన నయ్యె నిప్పు డని పోవఁ దొడంగిరి శబ్ద దిక్కునం
గలసి గుడారముల్ వదలి గ్రక్కున వారు ధృఢైక చిత్తులై 26.

చం. తురగము లందుఁ గొందఱును దొడ్డ గజమ్ములఁ గొంద ఱుండఁగా
నరదము లందు భూషితము లందుఁ జరింపఁగఁ గొంద ఱుద్ధతిం
దరుణులు పాదచారు లయి ధాత్రినిఁ జాగిరి పర్ణశాలకై
చిరముగఁ దోఁచు నయ్యచిర సేవిత గోత్రునిఁ జూడఁ గోరుచున్ 27.

తే.గీ. సోదర సమాగమముఁ గాంచ మేదిని ఖుర
నేమి రావము లడరె ననేక యాన
రాజముల నెక్కి తరలఁగ రయము మీఱ
నభ్ర ఘన సమాగమ నిస్వ నాభముగను 28.

ఆ.వె. కరి కరేణు వర నికాయమ్ము గంధమ్ము
ను వెదచల్లుచును ధ్వనులు వినంగ
భీతిఁ బాఱఁ దొడఁగె వేగముగ వ నేత
రమున కప్పు డయ్యరణ్యము విడి 29.

ఆ.వె. వృక నికాయ మహిష పృషత శార్దూల వ
రాహ సర్ప వానర మహిష చయ
గో గణాదు లెల్ల ఘోర భయమ్మునఁ
బర్వు లెత్తినవి యభద్ర మెంచి 30.

కం. బాతులు హంసలు నెమళులు
భీతినిఁ గారండవములు బిసకంఠికలుం
బోతు పికమ్ములు కొంగలు
వీతస్పృహలన్ దిశలకు వేగమ పాఱెన్ 31.

కం. విత్రాసి తాఖిల విధ ప
తత్రి నికాయమ్ము తోడఁ దారాధ్వము నా
ర్తి త్రాస జన గణముతో
ధాత్రియు వెలుఁగొందె నరయఁ దత్సమయమునన్ 32.

ఉ. ఆనరు లెల్లఁ గాంచి రట నంత యశస్విని శత్రుఘాతు నా
సీనుని భూమి పైన నర శేఖరు రాముని రాఘవేంద్రునిన్
మానిని కైక నమ్ముదుక మంథర నెల్లరు మీఱి దూఱుచుం
గానఁగ రాము నవ్విధము కన్నుల నింపిరి నేత్ర తోయముల్ 33.

కం. కని యా జనులను బాష్ప న
యనుల భృశ విచార ముఖుల నమ్మయుఁ బోలెన్
జనకుని వలె ధర్మజ్ఞుం
డిన కులుఁడు పరిష్వజించె నెలమిని వారిన్ 34.

తే.గీ. కొందఱినిఁ జేర్చె నక్కునఁ గూర్మిని రఘు
రాముఁ డతనికి మ్రొక్కిరి యా మనుజుల
గొంద ఱపుడు మిత్రుల బంధుగులను దగిన
రీతి సత్కరించెను జేరి నృపసుతుండు 35.

కం. గొప్ప మనస్వుల యేడుపు
లప్పుడు భువి దివుల యందు నద్రుల గుహలం 36.

గప్పఁగ నెల్ల దిశలఁ గన
నొప్పె మృదంగ స్వనమ్ములో యన వనిలో

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట రెండవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 103.

కౌసల్యాది దశరథ పత్నులు వసిష్ఠ మహర్షి వెనుక రాముని఼ గాంచ నడచుచు మందాకినీ తీరమున రాముఁ డర్పించిన నిందుగి పిండములను గాంచి కౌసల్య సవతులకుఁ జూపుచు విలపించుట, మాతలను జూచి లేచి సీతా రామ లక్ష్మణులు పాదాభి వందనము చేయుట, వసిష్ఠ మహర్షి చరణము లంటి రాముఁడు చెంతఁ గూర్చొనిన భరతుఁడు మంత్రులు మున్నగు వారితో నన్న పార్శ్వమున నాసీనుఁ డగుట.

కం. మునిచంద్రుండు వసిష్ఠుఁడు
చన ముందు దశరథు ధర్మ సతు లాత్మజ ద
ర్శన తర్షిత లద్దేశ
మ్మునుఁ జేరఁ నడచిరి మందముగ ముని వెంటన్ 1.

ఆ.వె. మెల్లగ నడచుచు సమీప మందాకినీ
తీర్థము దశరథ సతీమణు లట
రామలక్ష్మణ వర రాజ కుమార సే
వితముఁ గాంచి రపుడు వెడల వెడల 2.

కం. కన్నుల నశ్రులు నిండఁగ
మిన్నగ నెండ వదనము సుమిత్రా సతితో
నన్నుల మిన్న లితరులం
గన్నఁ గని పలికెను దీన కౌసల్య గిరల్ 3.

తే.గీ. తీర్థ మిది యభాగ్యులకు నతి సులభముగఁ
బనులు సేయఁ గలట్టి నృవరులు రామ
లక్ష్మణులకు వివాసితుల కవనిజకు
వనికిఁ దూర్పున నున్న దపతుల కకట 4.

కం. పుత్త్రుఁడు రామున కిట నీ
పుత్త్రుఁడు నీరము సుమిత్ర! పుణ్యుం డా సౌ
మిత్రి గొనితెచ్చు నిత్యం
బాత్రపడక సుజన మిత్రుఁ డానందముగన్ 5.

చం. తగ దిట దూఱ నీ సుతునిఁ దానొన రించిన హీన కార్యమున్
సగుణ విరాజితమ్ము సుమి చక్కఁగ నన్నకుఁ జేయ మేలునుం
దగఁ డితఁ డెట్టి బాధలకుఁ దప్పక యీతఁడు నేటి కైననుం
దగనివి యైన కార్యములఁ దక్క వలెం దగ నంచుఁ గోరెదన్ 6.

చం. దక్షిణ దిక్కు దర్భలను దద్ధరణీపతి దార గాంచి భ
ర్త్రక్షయ మింగుదీ కశిపు వాత్మజుఁ డీయ ధరాధి నేతకున్
భక్షణ మెంచి మిక్కుటము బాధ సెలంగ నెడంద నంత సే
ణాక్షుల తోడఁ బల్కెను ధరాధిప భార్యల తోడ నిర్విధిన్ 7.

మ. ఇది యిక్ష్వాకు నరేంద్రు భోజనము ధాత్రీ శాత్మజుం డీయఁగన్
స దసద్విజ్ఞుఁడు రాముఁ డారయుఁడు సచ్ఛాస్త్రోక్త రీతిం దమిన్
సుదతుల్ వల్కుఁడు భుక్త భోగునకు నీ చోద్యంపు టాహార మె
ట్లు దగుం బార్థున కమ్మహాత్మునకు నాలోచింపఁ జిత్తమ్ములన్ 8.

కం. నుత చతురంభోధి పరీ
వృ తావనీ భుక్త నృపతి పిణ్యాకమ్మున్
విత తేంగుదీ సుసంక్షో
భిత చూర్ణము నెట్లు తినును బితృలోకమునన్ 9.

ఆ.వె. తండ్రి కొసఁగె సంపదల వృద్ధిఁ జేయు రా
ముండు వట్టి గారపిండి యింత
కన్న మిక్కుటంపుఁ గాఱియఁ గాంచను 10.

నేను లోక మందు నెలఁత లార!

తే.గీ. ఇచట నింగుదీ పిణ్యాక మీయ రాఘు
వునకుఁ దండ్రికి రాముండు దనరి దాని
నకట వీక్షింప హృదయమ్ము వెకలి వేయి
ముక్కలుగఁ గాక నిల్చెను ముదిత లార! 11.

ఆ.వె. నరున కెయ్యది యశనం బగు నది యగు
భోజనము సురలకు మున్ను కలదు
లౌకికంపు సూక్తి నా కిప్పు డయ్యది
సత్య మంచుఁ దెలిసెఁ జామ లార! 12.

ఆ.వె. ఇవ్విధి విలపించు నింతి కౌసల్యను
సవతు లూఱడించి చాగి యాశ్ర
మమ్ము నందుఁ గనిరి మాన్యు రాముని దివి
చ్యుతుఁ డయిన దివిజుని జోక నెలమి 13.

ఆ.వె. సుఖములు త్యజియించి యఖిలమ్ములను నిల్చి
నట్టి రామునిఁ గని యంబ లెల్ల
నంత దుఃఖ మడర చింతఁ జిక్కిన యట్టి
వారు విడిచి రశ్రు వారి నఱచి 14.

కం. చరణము లంటెను జననుల
నరసి నరవ్యాఘ్రుఁ డప్పు డట లేచి వడిన్
వర శుభతరముల భక్తి య
లరంగ డెందమ్ము నందు రాముం డెలమిన్ 15.

కం. సుదతులు తల్లులు ప్రీతిని
మృదువు లయిన వ్రేళులు గల మెత్తని యఱచే
తఁ దగం దాఁకి సుతుని వీ
పు దుమ్ము దులిపి రనురాగమున సుఖ మొదవన్ 16.

కం. కని యెల్ల మాతలను వగ 17.

పున లక్ష్మణుఁ డన్న పిదప మోడ్చి కరమ్ముల్
విన యాసక్తులు మీఱఁగ
ఘనుండు మెల్లగను మ్రొక్కె గారవ మొప్పన్

ఆ.వె. కాంత లెల్లరు గుణవంతుఁడు రాముని
రమణ లక్ష్మణు శుభ లక్షణు దశ
రథ తనయునిఁ గూడ రమ్య రీతినిఁ బ్రేమ
తోడఁ గాంచి రంత వేడుకగను 18.

తే.గీ. సీత యశ్రుపూర్ణాక్షియు నాత తాను
శోక జేరి యత్తల నెల్ల సువ్రత చర
ణమ్ము లంటి యొసఁగి వందనములు నిల్చె
వారి ముందు వినయ మది మూర నపుడు 19.

కం. వన వాసము వలన కృశిం
చిన దుఃఖార్త నతి దీన సీతను వీక్షిం
చి నయమునఁ బల్కె నక్కున
నునుచుచుఁ గౌసల్య యమ్మయో యన నిట్లున్ 20.

తే.గీ. కూతురు విదేహ భర్తకు కోడలు దశ
రథ నరేంద్రునకును రఘురాము పత్ని
సీత నిర్జన వనిఁ జేరి యాతతంపు
దుఃఖమును బొంద నెట్లగు దుర్భరమ్ము 21.

ఉ. ఆతప తప్త పద్మ నిభ మర్దిత ముత్పల సన్నిభమ్ము సం
వీత రజోభ్ర తుల్యము సువృత్త ఘ నాబ్ధిజ తాదృశమ్ము భూ
జాత! తవాస్య మారయ విచార ఘనాగ్ని దహించు చున్నదే
యాతత రీతి నా మది మహారణి సంభవ వహ్ని భంగినిన్ 22.

కం. ఈ విధి విలపింపఁగ నా
భూవిభు దారలు రఘుపతి భూమిప తనయుం
డావలఁ గాంచి వసిష్ఠునిఁ
దా వడి రాముండు మ్రొక్కెఁ దత్పదములకున్ 23.

తే.గీ. అగ్ని నిభ పురోహితుని మహా ప్రభా వి
రాజితు చరణమ్ముల నంటి రాఘవుండు
చెంత నాసీనుఁ డయ్యెను దాంతుఁ డా బృ
హస్పతి చరణములను సురాధిపు వలె 24.

ఆ.వె. పిదప భరతుఁడు తన వెనుక మంత్రి పురప్ర
ముఖ జన సహితమ్ము నఖిల సైని
కులు నిలువఁగ ధర్మకోవిదు లగ్రజు
చెంతఁ గూరుచుండె నంత నడరి 25.

కం. ముని వేష ధారు రాముని
ఘన తేజస్విని భరతుఁడు కాకుత్స్థుం గాం
చి నిలిచెఁ గృతాంజలి సురా
ధినాథు భంగినిఁ బ్రజాపతి సరస భక్తిన్ 26.

కం. వచనమ్ము లేమి వల్కునొ
యచిరమ్ముగ నాచరించి యన్నకుఁ బ్రణతుల్
రుచిరముగ గౌరవించి త
లఁచు చిట్లు కుతూహల మడర నిలిచిరి నరుల్ 27.

తే.గీ. సత్య ధృతి మూర్తి రాముండు సన్మహాను
భావుఁ డౌ లక్ష్మణుండు ధర్మావతారుఁ
డు భరతుఁడు చెలు లుండ తోడుఁగ వెలిఁగిరి
హవ సదస్యుల తోడ మూడగ్నుల వలె 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట మూడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 104.

భరతుఁడు రాముని నయోధ్యకు వచ్చి రాజ్యము నేలు మని పరిపరి విధములఁ బ్రార్థింప రాముఁ
డంగీకరింపక తండ్రి దశరథుఁడు వనవాసము, రాజ్యపాలనము కుమారులు రామ భరతులకు
నొసఁగెను గావున జనకుని యాజ్ఞ యిద్దఱకును దాట రాని దని పలుకుట.

కం. గురు వత్సలు ననుజు భరతు
గురుతరముగ నాశ్వసించి కూరిమి మీఱన్
నరపుంగవ రాముఁ డనుజ
వర లక్ష్మణ సహిత మిట్లు బలుకఁ దొడంగెన్ 1.

కం. వినఁ గోరుదు నేను భరత!
వనమున కిట కేల నీవు వచ్చితి జట ల
ల్లి నరవరేణ్యా! ధరియిం
చి నార బట్టలు వచింపు శీఘ్రమ నాకున్ 2.

ఆ.వె. జిష్ణు సుప్రసిద్ధ! కృష్ణాజిన జటా ధ
ర! వర రాజ్య మకట ప్రవిమలాత్మ!
వీడి వచ్చి తిటకుఁ బృథివీశ నందన!
కార డవికిఁ జెప్పు కారణమ్ము 3.

చం. పలుక మహాత్ముఁ డివ్విధము పల్కులు రాముఁడు కైకయీ సుతుం
డలమటఁ బట్టి గట్టిగఁ గరాబ్జ యుగమ్మును బల్కెఁ బ్రాంజలిన్
లలితుఁ ద్యజించి నందను ధరాపతి దుష్కర కార్య మివ్విధం
బలవడఁ జేసి యేఁగె దివి కయ్య కుమార విచార తప్తుఁడై 4.

ఉ. చేసెను ఘోర పాప మొక చేడియ కైకయె నాదు మాతయే
యాస వహించి పల్కగనె యాత్మ యశో విలయంపుఁ గార్యమే
వీసము రాజ్య లాభ మరి వీర వినాశక! పొంద కుండయే
రా సతి తప్పు కవ్విధవ రౌరవ మేఁగును శోక తప్తయై 5.

ఆ.వె. అట్టి నన్ను దాసు నగ్రజ! కరుణఁ జూ
చి యభిషిక్తునిగ నచిరము కమ్ము 6.

నేడ రాజ్య మందు నిర్జర నాథుని
భంగి నుత్సహించి పార్థివేంద్ర!

కం. పౌరులు విధవలు తల్లులు
నో రాఘవ!వచ్చి రెల్ల రొద్దకుఁ గనుమా
గారవమున వీ రందఱి
నారయఁ గృప నర్హుఁడవు మహాత్మ! భృశముగన్ 7.

తే.గీ. ఉర్వి వంశపారంపర్య యుక్త మిద్ది
గౌరవమ్ము లొసంగు రాఘువ! కడింది
నీకు యుక్తంపు ధర్మంపు నేలఁ గొమ్ము
కోరికలు నీ సుహృదులకుఁ దీర నిమ్ము 8.

కం. భూమిని సనాథఁ జేయుమ
గోముగ నెల్లం దమిని రఘుప్రవర! దయన్
భూమీశుగ నిన్ను బడయ
రామా! శారద నిశ వలె రాజునిఁ బడయన్ 9.

కం. స సచివ నిచయము తల వాం
చి సదమలాత్మ! నిను భక్తిఁ జేరి యడుగఁగా
నొసఁగుమ భ్రాతకు దాసున
కు సురుచిరపు శిష్య వరునకు దయేక్షణముల్ 10.

ఉ. పన్నుగ శాశ్వతం బయిన వంశ సమాగత రాజ్య మేలఁగా
నిన్నర సంచయం బడుగ నింపుగ దాని నతిక్రమింప రా
దెన్నఁడు నీకు రామ యని యివ్విధిఁ గన్నుల నీరు నిండఁగా
నన్న పదాబ్జ యుగ్మమున కాతఁడు మ్రొక్కెను వంచి మూర్ధమున్ 11.

తే.గీ. మత్త మాతంగము పగిది నత్తఱి భర
తుండు నిశ్వసించుచు నుండ మెండుగఁ గని
కౌఁగిలించి రాముం డప్డు కరము ప్రీతిఁ
బలికెఁ దమ్మునితో మేటి భాషణములు 12.

తే.గీ. సువ్రతుండును సత్త్వ సుశోభితుండు
ఘన కులీనుండు తేజస్వి కాంచఁ బాప
మెట్టు లాచరింపఁ గలఁడు దట్ట మైన
రాజ్యమునకు నీ వంటి నరప్రవరుఁడు 13.

ఉ. కాంచను బాప మించుకయు గాదిలి తమ్ముఁడ! నీదు చేతలం
గాంచను మాత యందును నృకాంతుని పత్నిని దూఱ నీకు సే
యించుక యేని కూడ దయ! యిట్టులు బాలుని భంగి సెన్నఁ డే
సెంచఁగ దైవ కృత్య మిది యివ్విధి సేరఁగ నొప్పు రాఘవా! 14.

ఆ.వె. అనఘ! వినుము ప్రాజ్ఞ! యందిన దారల
యందు పుత్రు లందు నరయ గురులు
తా మెదఁ దలఁచిన విధమ్ముగఁ జేయ న
ర్హు లగుదు రని విందు మర్వ్విలోన 15.

కం. ఏ విధి సాధులు నుడివిరొ
యా విధి మన మెల్ల దార లాత్మజ శిష్యుల్
భూ విభు సొత్తులమే యని
నీ వెఱుఁగ వలయును సౌమ్య! నిక్కం బెంచన్ 16.

ఆ.వె. నల్లతోలు గుడ్డ నార బట్టల నన్ను
వనము నందు సైనఁ బార్థివుండు
రాజ్య మందు సైన రాఘవ! వాస ముం
డు మని బంచ నగును విమల చిత్త! 17.

తే.గీ. తండ్రిని జగన్నుతుని సెంత తత్పరత సె
లంగ గౌరవింతువొ ధర్మ రతుల యందు
మిన్న! తల్లిని నట్టులె యెన్న వలయు
భరత! ధర్మజ్ఞు జనకుని భంగి సెపుడు 18.

ఆ.వె. వనికి నరుగు రామ యని తల్లి దండ్రులు
ధర్మశీలు రనఁగఁ దత్సమయము
నందు నాలకించి యన్యమ్ము సే సెట్లు 19.

సేయఁ దలఁతు భరత! చింత యేల

ఆ.వె. లోక సత్కృతమ్ము కాకుత్స్థ! రాజ్యమ్ము
నీకుఁ బ్రాప్త మయ్యె వీఁక నేల
నార చీర లడర నా కిట్లు దండ కా
రణ్య మీయఁ బడెను రాజు వలన 20.

కం. చేసి విభాగం బిట్టులు
వాసి గల నరేంద్రుఁ డపుడు పన్నుగ లోకా
వాసులు వీక్షింపంగన్
భాసురముగ నేఁగె దివికిఁ బార్థివ సూనా! 21.

కం. నీ వర్హుఁడవు జగన్నుత
భూవర ధర్మాత్ముఁడు ముదముగ శాసింపన్
వావిరి విభాగ మందఁగ
నా విధి నీ వనుభవింపు మలరుచు భరతా! 22.

కం. పదునాలు గేండ్లు సౌమ్యా!
యదరక పితృ దత్త దండకారణ్యమునున్
విదితాత్ముని నానతి నేఁ
బదిలముగా ననుభవింతుఁ బాయక భరతా! 23.

కం. ముల్లోక పూజ్యుఁ డెయ్యది
సల్లలితముగ నుడివె నది శక్రాభుండే
యుల్లమున నెంతు హిత మని
యొల్లను లోకేశ్వర పద మొసఁగిన భరతా! 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట నాల్గవ సర్గము.

## అయోధ్యా కాండము

# సర్గము 105.

భరతుఁడు తనకుఁ దండ్రి యిచ్చిన రాజ్యమును దల్లి గైక యనుమతితోఁ దిర్గి రామునకు నిత్తును గ్రహించి యయోధ్య కేతెంచి పాలింపు మనిన రాముఁ డంగీరింపక తండ్రి యానతి యిద్దఱికిని మీఱ రాని దని పలుకుట.

కం. పురుష వ్యాఘ్రులు సంవృత
వర మిత్ర శ్రేణు లట్లు వందుచు నుండం
బరితాపము నిండ భృశము
గ రజని వీక్షించు చుండఁ గడచిన దయ్యేన్ 1.

చం. చని నిసి తెల్లవాఱఁగను సల్లలితమ్ముగ భ్రాత లత్తఱిన్
ఘన నది కేఁగి స్నానము సుఖమ్ముగఁ జేసి సమిత్ర బృందమున్
మనముల పే జపించి జన మాన్యుని రాముని జేరి యెల్లరున్
మినుకులు లేక నిల్వ ననె మెల్లగ నా భరతుండు భ్రాతతో 2.

ఉ. మాతను నూఱడించితిని మానవ నాథుఁడ! దత్త రాజ్యముం
బ్రీతిని నీకు నిత్తు నిఁక వీత శితాగ్రమ యేలు రాజ్యమున్
భ్రాత! జలాగమంబునఁ బ్రవాహపు నీటిని యాపఁగాఁ దరం
బే తెగఁ గట్ట నీకుఁ బరుఁ డెట్లు భరించును రాజ్యఖండమున్ 3.

తే.గీ. అశ్వ వేగము గాడిద కౌనె తరము
వైనతేయు వేగము గాంచఁ బక్షి కగునె
నిన్ననుసరింపఁ దగు శక్తి చిన్న మైన
నీదు గతిలో మహీపతి! లేదు నాకు 4.

కం. జను లెవ్వని యాశ్రయమును
మనుగడకై యెంత్రు వాని మన్కి సుఖ మగున్
జనుఁ డెవ్వం డాధార ప
డు నన్య జను లందు నాతఁడు గను నసుఖమున్ 5.

చం. తరువును నాఁటి పెంపఁ దగఁ దద్దయుఁ బెర్గినఁ బూసి ఘోర మి 6.

త్తరువు ఫలమ్ము లీయక సతమ్ము కనం బడ ప్రాస్వ దుస్సహం
పు రమణఁ బెంచి నట్టి ఘన పూరుషుఁ డొందఁడు ప్రీతి నెన్నఁడున్
నరవర యెర్గు మీ యుపమ  నా నుడి మమ్మిల నేల కున్నచో

కం. పొడిగ వణిజుల నితరులఁ
జూడఁగ నిమ్ము జ్వలియింప సూర్యుని భంగిన్
వాడలవాడల రాజ్యము
తోడుత నిన్ను బరవీర దుర్జయ!  రాజా! 7.

ఆ.వె. మత్త వారి దాభ మాతంగముల ఘీంక
రింప నిమ్ము రామ యెలమి వెంట
డించి నిన్ను గలసి యంచయానల నంతి
పురము నందు నుండి మురియ నిమ్ము 8.

కం. నుతియించి రాలకించి భ
రతు వాక్యములు తగ వేఁడ రాముని నట్లున్
వితతముగ నాగరికులు భ
రతుని వివిధ జనులు గిరలు రమ్యము లనుచున్ 9.

కం. కృత నిశ్చయుండు రాముఁడు
మతిమంతుఁడు దుఃఖతప్త మను జోత్తమునిన్
నుత కీర్తుఁ దన యనుజుని  భ
రతుని ననునయించె మృదు గిరల నిబ్భంగిన్ 10.

ఆ.వె. తగ నిజేచ్ఛఁ జేయ ధరఁ బురుషునకు రా
దస్వతంత్రుఁడు సుమి యతఁడు సతము
దైవము నడపించు  ధాత్రి నెల్ల జనుల
నిటు నటు నెటు లయినఁ బటుతరముగ 11.

తే.గీ. అరయ సర్వసంపదలు లయాంతము లగు
నధిక వృద్ధు లన్నియుఁ  బతనాంతము లగు
నడరు కలయిక లవి విరహాంతము లగు
నకట జీవితం బగు మరణాంత మరయ 12.

ఆ.వె. పండి నట్టి దైన పండున కుండుఁ బ
తన భయమ్ము కరము తరువు నుండి
పుట్టి నట్టి యెల్లఁ బూరుషులకు నుండు
మరణ భయము మూరి ధరణి యందు 13.

తే.గీ. గట్టి కంబము లడరంగఁ గట్టి నట్టి
భవనము నశించు జీర్ణించి పగలు రేలు
ముదిమి చావుల బారినిఁ బుడమి జనులు
పడి నశింతు రెల్లరు నట్ల వారకుండ 14.

ఆ.వె. కడచి నట్టి రాత్రి పుడమిలో నెన్నండు
తిరిగి వచ్చు టెల్ల నరయఁ గల్ల
నీరు నిండ యమున నిర్గమించు మరలు
టరుదు నీటి కుప్ప యబ్ధి నుండి 15.

కం. రే పవళులు వడిఁ గడచుచు
నాప కడరి ప్రాణి కోటి యాయువు లణఁచుం
జూపక దయ నీటిని ను
ష్ణోపగమ కిరణముల వలె నుర్విని భరతా! 16.

కం. నిలిచినఁ జరించినను నీ
కిల నాయువు తఱుఁగు చుండు నివ్విధి నుండం
దలఁపుమ యించుక నీ కయి
తలఁపఁగ నేల పరుల కయి తాపము తోడన్ 17.

ఆ.వె. చనును సంతతమ్ము చావు నీ తోడుతఁ
గూర్చొనంగ నీవు కూరుచుండు
దూర మేగిన కడుఁ దోడు వచ్చి మరలు
చుండు నిన్ను గూడి యండ నుండు 18.

తే.గీ. ముడుత లెల్ల గాత్రమ్ములఁ బడయు చుండ్రు
నల్లగ మెఱయు కురు లెల్లఁ దెల్ల వగును 19.

ముదిమిఁ గృశియింత్రు తప్పక పురుషు లెల్ల
నే పనినిఁ జేసి తగ వాని నాపఁ గలరు

కం. సూర్యోద యాస్తమయము ల
వార్యమ్ము లరసి ముదమ్ము వడయుదు రకటా
వార్యము కాని తమ లయము
నార్య జనులు నెఱుఁగ రెదల నాశ్చర్యముగన్ 20.

కం. ఋతువులఁ గొంగ్రొత్తగ నా
గతముల వీక్షించి జన నికాయం బిల నా
తతముగ హర్షం బందును
ఋతుభ్రమణము జన కోటి కేర్చు నసువులన్ 21.

ఉ. కట్టెల రెండు నొక్క తఱిఁ గాంచమె చేరఁగ నూర్మి మాలినిన్
నెట్టన నన్యకాలమున నేరమె దూరము కాఁగ వేగమే
యట్టుల దార లింకఁ దన యాదులు బంధులు విత్త రాసులుం
జుట్టును జేరి దట్టముగఁ జూడఁగ జాఱుట తథ్యమే చుమీ 22.

కం. ధర నే ప్రాణియుఁ దన కి
ష్ట రీతిఁ జరియింప లేదు సామర్థ్యము దా
నరయండు మృతుని కొఱకై
పరితప్తుండు నిల మరలుపఁ దనదు మృతినిన్ 23.

ఉ. పథిక సమూహ మారయఁగ బాటను నిల్చిన వాఁ డొకండు మీ
పథి నరుదెంతు మీ వెనుక పాంథులు! నా వచియించి యేఁగఁడే
పృథివిని వీడి చన్న మన పెద్దల మార్గము తప్ప దట్టులే
వృథ లగు శోక తాపములు వెంటఁ జరింపఁగఁ దప్ప దేరికిన్ 24.

కం. గతియించు వయో ధారను
బతన మగు విమల జలప్రవాహము నెవ రే
గతి నైన మరల్పఁ దరమె
మతి నుంచినఁ గడు సుఖముగ మనుజులు సుఖులే 25.

తే.గీ. దానము లొసంగి క్రతువులు దా నొనర్చి
పెక్కు ధర్మాత్ముఁ డా పృథివీ ధవుండు
దశరథుఁడు మన జనకుండు తరలె దివికి
భృత్యుల కొసఁగి భరణమ్ము లత్యధికము 26.

కం. పాలించి ప్రజలఁ జక్కఁగ
మేలుగ నరి స్వీకరించి మించిన నీతిం
గాలానుగుణము సనె భూ
పాలుఁడు ఘనుఁడు మన తండ్రి స్వర్గమ్మునకున్ 27.

కం. మంచి పను లెన్నియో నొన
రించి సవన రాజము లొనరించి ధరణిలో
మించి యొసఁగి దక్షిణలన్
పేంచేసెను స్వర్గమునకుఁ బితృ దేవుండే 28.

తే.గీ. జన్నములు పెక్కు లొనరించి మిన్నగ భువి
భోగముల నంది భూపతి పుష్కలముగ
నుత్తమంపు టాయువు నొంది యుచిత రీతి
స్వర్గమున కేఁగె మన తండ్రి సద్గుణుండు 29.

కం. తగదు వగవంగ బుధ నుతుఁ
డు గౌరవము లందె నిలఁ బటుతరం బాయు
స్సు గనెఁ దగు భోగములు ఘన
ముగఁ గని చనెఁ దండ్రి స్వర్గమునకుం దండ్రీ! 30.

చం. అఱిగిన యట్టి దేహమును ద్యాగ మొనర్చి ఘనమ్ము దివ్యమౌ
యఱిముఱి లేని దట్టి దగు నబ్జజ లోక విహార యోగ్యమౌ
తఱ చగు బుద్ధి నందె మన తండ్రియె యర్థులు కారు ప్రాజ్ఞు లం
ద ఱిటుల బుద్ధిమంతులును దల్పఁగ నీవును నేను గుందఁగన్ 31.

కం. ఈవిధి శోకములు వగపు
తో వచనమ్ములు సతతము తొలగింపఁ దగున్
ధీవరుల ధైర్య వంతుల 32.

చే వివిధమ్ములు వహించి శీఘ్రము ధృతినిన్

తే.గీ. చేకొనుమ స్వస్థత మది శోచింప వలదు
వెడలి నిల్వు మయోధ్యలో వీరవర! ని
జేంద్రియ జయు జనకుని చే నిట్టు లాన
తీయఁ బడితివి వాక్యజ్ఞ! యెలమి నీవు 33.

కం. ఎక్కడ నే నా పుణ్యుని
వాక్కుల శాసింపఁ బడితి వసియింపంగా
నక్కడ నివసింతు భరత!
తక్కను బిత్రాజ్ఞ నేను దథ్యం బిదియే 34.

ఆ.వె. కా దతిక్రమింపఁ గార్యము నీతియు
నా కరిందమ! తగ నీకు నరయ
మాన్య మగును సతము మనకుఁ దండ్రియు నింక
బంధు వయ్య! మఱియుఁ బార్థివుండు 35.

కం. వనవాస ముండి పాలిం
తు నరేంద్రుని మన జనకుని తోరపు ధర్మా
త్ముని సమ్మతంపు వాక్యము
లను నే ననివార్యములను రాఘవ! వినుమా 36.

కం. పర లోక వాస మెంచిన
గురు పూజ్యుఁడు నిత్య ధార్మికుఁ డహింసుండున్
నరవరుఁడు కావలెం జుమి
నరపుంగవ! నిక్క మెంచ నర లోకమునన్ 37.

కం. మన పిత దశరథు సచ్చరి
తను గాంచి సముచిత రీతిఁ ద దనుగుణముగా
నినకుల నందన! నడవ మ
ది నెంచుమ స్వభావ గరిమ ధీర వరేణ్యా! 38.

కం. అనుజుని భరతుని తో ని 39.

ట్లని పితృ వాక్య పరిపాల నార్థముగ విభుం
డు నరర్షభుఁ డర్థ యుతము
గ నాగె రఘు రాముఁ డొక్క క్షణమున నంతన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట యేనవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 106.

అన్న మాటలు విని భరతుఁడు తిరిగి యనేక విధముల వేఁడుకొనుచుఁ దండ్రి స్త్రీ కారణముగాఁ జేసిన తప్పును సరిదిద్ద వలయు నని యయోధ్య కేతెంచి రాజ్యమును బాలింప మని వేఁడ రాముఁడు తండ్రి మాటను నెరవేర్ప నిశ్చయముగ నుండుట.

కం. విరమింపఁగ సహజప్రియు
డు రాముఁడు నదీ తటిని నుడువు లబ్బంగిం
బర మార్థ వంతముల నని
భరతుఁడు ధర్మ గిర లనెను వర ధార్మికుతో 1.

ఉ. కాంచము నిన్ను బోలు నరుఁ గాఱియ నీయదు నీకు చింత హ
ర్షించుట సౌఖ్య మబ్బ విపరీతము వృద్ధుల గౌరవింతు వీ
వంచిత రీతి సంతతము నందఱు మెత్తురు నిన్ను మిక్కిలిన్
మంచివి సందియమ్ములను మాన్యులఁ బ్రశ్నము సేసి నేర్తువే 2.

ఆ.వె. చావు పుట్టుకలను సమముగఁ గనఁ గల్గు
మంచి చెడుల నొక్క మాడ్కి నరయు
నట్టి బుద్ధి కలుగ నట్టి వాఁడు తపింపఁ
గాన నగును బుడమి దేని చేత 3.

తే.గీ. ఎవఁడు భూత భవిష్యత్తు లెఱుఁగు నట్టి 4.

నరుఁడు నీవంటి వాఁడు నెదు రయిన వ్యస
నమ్ములు విచార మంద మనమ్ము నందు
నెన్నఁ డర్హుండు కాదు నరేశ వర్య!

చం. అమర నిభుండ! సత్త్వమున నన్ని యెఱింగిన వాఁడ! సత్య వా
గ్విమల మహాత్మ! సర్వ వర వీక్షణ! రాఘవ! బుద్ధిమంతుఁడా!
స మరణ జన్మ కోవిదుఁడ! సద్గుణ భాసిత! దుస్స హోగ్ర శో
కములను బొంద నర్హుఁడవు కాదు సుమీ పురుషర్షభా! యిటుల్ 5.

ఉ. నే నల నుండ దూరమున నీచయె నా కొఱ కెన్నె మాతయే
యే నెదఁ గోర నట్టి పని నీ దురితమ్ము క్షమింపు మింపుగా
నే నిట ధర్మ బద్ధతను నిల్చితి నందులకే వధింప నీ
మానిని నెంచి ధర్మమును మాతను బాపిని దండ నార్హనున్ 6.

ఆ.వె. రోఁత పనిని నెట్లు జాతుఁడు దశరథ
నృపునకు నొనరించు నేరి నేరి
ధర్మమును నెడఁద నధర్మ కార్యమును స
ద్వంశ శుద్ధ కర్మ భాసితుండు 7.

కం. సభలో దూఱ నమర స
న్నిభు జనకుని స్వర్గతు ధరణీపతిని వయో
విభవుని సత్కార్య నిచయు
నభయదునిం దగదు నాకు నావంతైనన్ 8.

ఉ. ఎవ్వరు సేయ నెంతు రయ యెర్గియు ధర్మము నర్థ ధర్మముల్
నవ్వుల పాలు గా నిల ననర్థపుఁ గార్యము నివ్విధమ్ముగా
నవ్వనితా హి తార్థమునకై యఘ కార్యము ధర్మ కోవిదా!
యివ్వసుధేశు వీడి కలరే యిల నన్యులు మానవర్షభా! 9.

ఆ.వె. మూర నంత్య వేళ మోహితు లౌదురు
సకల జను లని కల దొక పలు కిల
మున్ను దాని సత్య మిన్నరేంద్రుఁడు సేసెఁ
జెన్నుగ నిట నిట్లు సేసి పనిని 10.

తే.గీ. దేనిని నతిక్రమించెనో యీ నృవరుఁడు
మన జనకుఁడు కోపమున నయినను మోహ
మున నయిన నిజ సాహసమ్మున నయినను
దాని సరిదిద్దఁ దగు నీకు మానవేంద్ర! 11.

తే.గీ. తండ్రి సేసిన దగు దుష్కృతమ్ము నాత్మ
జుండు సాధు వొనర్ప నతండు సత్య
మైన సుతుఁ డగు విపరీత మైన నాతఁ
డన్య విధ మగు నిజ మెంచ నవని యందు 12.

తే.గీ. కమ్ము రాఘవ నీ వట్టి సమ్మతంపు
నందనుండవు ధీరులు నింద సేయు
దుష్కృతమ్ము నీ వొప్పకు దొడ్డ మనము
నూని నిజ జనక కృతము మానవేంద్ర! 13.

కం. కైకను నన్ను మన జనకు
వీఁక సుహృద బంధు పౌర వితతిని నింకం
గాకుత్స్థా! జానపదుల
పే కావుమ సర్వుల నిల వీర వరేణ్యా! 14.

ఉ. ఎక్కడి ఘోర మైన వన మెక్కడి వయ్య జటాజినమ్ములే
యెక్కడి నీచ కర్మములు నెట్టుల నిట్టివి యొప్పు నీ కిలం
జక్కని క్షాత్ర ధర్మము ప్రజా పరి పాలన కర్త మైన యీ
చిక్కిన దట్టి దైన యభిషేకము ప్రప్రథమంపుఁ గార్యమౌ 15.

చం. ఎదురుగ నున్న ధర్మము నరేశ్వర క్షత్రియుఁ డైన వాఁడహో
వదలి చరించునే కొని యవాంఛిత లక్షణ మున్నదూర మం
దుఁ దనరు సంశయాత్మకపుఁ దోరపుఁ జంచల ధర్మ మెన్న నం
గద నిడు కార్య మీవు కను కష్టము వర్ణ చతుష్క శిష్టినిన్ 16.

తే.గీ. ఆశ్రమమ్ములు నాల్గింటి యందు ధర్మ
వేత్త! గార్హస్థ్య మగ్ర్యము పృథ్వి యందు 17.

నని పలుకుదురు ధర్మజ్ఞు లని యెఱుఁగమె
దాని నీ వర్హుఁడవె వీడ మానవేంద్ర!

ఉ. బాలుఁడ జ్ఞాన జన్మముల భ్రాత! పదమ్ముల నిన్ను బోల్వఁగం
బాలన మెట్లు సేయఁ గల వాఁడను రాజ్యము నీవు నుండఁగం
జాలను బుద్ధి నల్పుఁడను స్థాన గుణమ్ముల మించి బాలుఁడన్
లాలితుఁ గాక యున్న నికఁ బ్రాణము లూనఁ దలంప రాఘవా! 18.

చం. జనకు సమస్త రాజ్య మవిచార మకంటక మిద్ది యింపుగా
ఘన నిజ ధర్మ మూని యవికారము పాలన మింకఁ జేయు మ
య్య నరవరేణ్య! బంధు యుత మందుమ ప్రీతి వసిష్ఠ ఋత్విౙుల్
జనచయ మంత్రి సంయుతము చక్కఁగ నీ వభిషేక మిచ్చటన్ 19.

ఆ.వె. లోకముల జయించి వీఁక వాసవుఁడు మ
రుత్సహితము దివికి నుత్సహించి
యేఁగి నట్లు నీవు నిచ్చట యభిషిక్తుఁ
డ వయి చను మయోధ్య కవని నాథ! 20.

ఉ. తీర్చి ఋణత్రయమ్ము రిపు ధీరుల పే పరిమార్చి చక్క చే
కూర్చి సుఖమ్ము తృప్తి సమకూరఁగ మిత్రుల కెల్లఁ బాలనం
దేర్చుట యొప్పు హర్షమునఁ దేలుదు రెల్ల సఖుల్ మునుంగఁగా
నార్చుచు శత్రు వీరులు మహాపద లందు సభీతిఁ బాఱుదుర్ 21.

ఆ.వె. ఆర్య! నాదు తల్లి యాక్రోశన మడఁచి
జనకుని దురితమును దునుము నేఁడు
మ్రొక్కుదుఁ దల వంచి భూత రాశిని నీకు
వలె దయఁ గనుము నను బంధు జనుల 22.

కం. విన్నప మెల్ల వెనుక నిడి
చన్న వనికి నీవు దలఁచి సంచారమునే
క్రన్నన నీ తో వచ్చెద
నన్నా! వెన్నంటి యింక నానందముగన్ 23.

తే.గీ. కుంది భరతుండు కడు పేఁడ వందనమ్ముఁ
లిడుచు శిరము వంచి యటుల సెల్ల గతుల
రాముఁడు బలుఁడు నృపుఁడు దలఁపఁడు పెడల
నిలువ నెంచెఁ బిత్రు వచనముల దృఢముగ 24.

తే.గీ. స్థైర్య మద్భుతమును గాంచి తద్రఘు వరు
నందు హర్ష దుఃఖమ్ముల నందిరి సమ
ముగ నయోధ్యా పురికి రామి మూర వగపు
హర్షము స్థిర ప్రతిజ్ఞకు నడరె మదుల 25.

కం. జనులు యాజకులు వణి
గ్జన వల్లభు లెల్ల నశ్రు కణములు నిండం
జన సంజ్ఞలు మెచ్చి భరతు
ఘన గిరలకు పేఁడి రెరఁగి కాకుత్స్థ వరున్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట యాఱవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 107.

భరతునితో రాముఁడు తమ తండ్రి తాత యగు కేకయ రాజునకును, దల్లి కైకకు నిచ్చిన మాటలను నిజము సేయుటకే తనకు వనవాసము భరతునకు రాజ్యము నొసఁగెను గావున తండ్రిని సత్యవంతునిఁ జేయుట తమ యిద్దఱి కర్తవ్య మని పలికి యయోధ్య కేఁగి రాజ్యమును బాలింపు మని భరతునకుఁ జెప్పుట, యయోధ్యలో నరులను నీవు పాలింప నడవిలో మృగాదులను నేను పాలింతును గనుక విచారము వల దనుట.

కం. భరతుం డవ్విధిఁ బలికినఁ
దిరిగి గిరలు బదు లొసంగె దీఁటుగ నిట్లున్
నరవరుఁడు లక్ష్మ ణాగ్రజుఁ 1.

డు రాఘవుఁడు బంధువుల నడుమ మన్ననలన్

ఆ.వె. రాజసత్తముండు రాఘవుండు దశర
రథ నరర్షభునకు రమణి కైక
కు నుదయించి నట్టి తనయుండ వీవు నీ
వచనములు భృశముగ నుచితము లవి 2.

ఉ. పూర్వము పెండ్లి యాడు తఱి భూపతి నీ జననిన్ ఘనమ్ముగా
సర్వము స్వీయ రాజ్యమును జక్కఁగ నిచ్చెను రాజ్య శుల్కమున్
ఖర్వము గాని వాక్యము నృకాంతుఁడు కేకయ భర్త కప్డు రా
ట్పర్వము సూచుచుండఁగను భ్రాత! సమంచిత రీతిఁ దండ్రియే 3.

ఉ. అంతియ కాదు నిర్జర గ ణాసుర యుద్ధము నందు భర్తకున్
స్వాంతము నందు సంతసము పన్నుగఁ గల్గఁగఁ జేయ మాతయే
దాంతున కిచ్చి గౌరవము తద్దయుఁ దా వర యుగ్మ మిచ్చె నా
యింతికి నిచ్చ మెచ్చి వసుధేశుఁడు సత్య వచోనురక్తుఁడే 4.

చం. వరదుని సత్య సువ్రతునిఁ బార్థు యశస్విని నీదు మాతయే
తరుణము గాంచి తా నడిగె ధర్మ వరద్వయ మివ్విధమ్ముగా
భరత! నరోత్తమా! పుర వివాసము నా కొసఁగంగ నింకయున్
నరపతిఁ జేయ నిన్ను నర నాథుఁ డొనర్చెను దా నియుక్తుఁడై 5.

ఆ.వె. అవ్విధి నర వర్య! యడవినిఁ బదునాలు
గేండ్లు వాసము వర మిచ్చి నట్లు
సలుప వలయు జనకు వలన నిట్లేను ని
యమితుఁడ నయితి మన యధిపు వలన 6.

తే.గీ. కాన వచ్చితి తప్పక కాన కేను
గూడి సీతను లక్ష్మణు తోడ నిర్జ
నమ్మునకుఁ దండ్రి నుంచంగ నెమ్మి సత్య
పథము నందు నెదురు లేని వాని ననుజ! 7.

ఆ.వె. అవ్విధమ్ము నీవు నయ్యవని పతిని 8.

సత్యవాదిగ నిల నిత్య ముంచఁ
దగుదు వయ్య! మీఱి తత్క్షణం బభిషిక్తుఁ
డ వయి రాజ వర్య! యవని నేలు

కం. జనకు ఋణ విముక్తినిగా
జననాథుని నా కొఱ కయి సదమల చిత్తా!
యొనరింపుమ ధర్మజ్ఞుని
ఘనముగ జననీ జనకులఁ గనుమా భక్తిన్ 9.

ఆ.వె. గయుఁడు మున్ను బాడెను యశస్వి గయ లోనఁ
దండ్రి! గీత మొకటి తండ్రుల కయి
తా యజించు చుండి తద్దయు భక్తిని
వేద మందుఁ గలది వినమె దాని 10.

తే.గీ. రయముగ ఘన పున్నామ నరకము నుండి
యెవఁడు తరియింపఁ జేసి రక్షించుఁ బితరు
ల నతఁడు పిలువఁ బడుఁ దగఁ దనయుఁ డంచు
లోకమున సార్థకమ్ముగ రుచిర రీతి 11.

కం. కోరఁ దగుఁ బెక్కు మంది కు
మారుల గుణవంతుల బుధ మాన్యుల ధరలో
వారల సుతుఁ డొక్కఁ డయినఁ
జేరఁ గలం డని గయఁ గలసి సహోదరులన్ 12.

తే.గీ. ఎల్ల రాజర్షు లివ్విధ ముల్లములను
సమ్మతించిరి నిజ మంచు చక్రవర్తి
తనయ! రక్షించు నరకమ్ము దాఁటఁ దండ్రి
ఋణము తీర్చుకొనుమ నరశ్రేష్ఠ తివిరి 13.

కం. పురవర మయోధ్య కేఁగుమ
భరతా! శత్రుఘ్నుఁ గూడి వరనుత వీరా!
ధరణి సురులతోఁ బ్రజ లె
ల్ల రంజిలెడు భంగిఁ జూడు రాజవరేణ్యా! 14.

ఆ.వె. జాగు చేయ కేను జానకీసతి లక్ష్మ
ణుని నుభయుల గూడి ఘన వనమ్ము
దండకావనమున నుండ నేఁగుదు నర
వ్యాఘ్ర చింత లేక శీఘ్రముగను 15.

తే.గీ. భరత! రాజు వగుము నీవు నర వరులకు
వన్య మృగముల కేను రాజన్యు నగుదుఁ
జను వర పుర మయోధ్యకు సంతసమున
మురిసి దండకావని కేను దరలువాఁడ 16.

తే.గీ. ఛత్ర మెండను దొలఁగించి చల్లగ నొన
రించు నీదు శిరమ్మును మించి భరత!
కానన ద్రుమ చ్ఛాయల నేను శ్రమ దొ
లంగ విశ్రమించుచు నుందు రహి చెలంగ 17.

కం. ఘన ధీనిధి శత్రుఘ్నుఁ డ
గు నీకు లక్ష్మణుఁడు నా కగును దో డరయన్
మనము తనయులము సత్యము
న నిలిపి జనకు నడతుము వనర వల దనుజా! 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట యేడవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 108.

భరతుని నూఱడించు చున్న రామునితో జాబాలి యను నొక బ్రాహ్మణుఁడు ధర్మ విరుద్ధము లగు వాక్కులఁ దండ్రి యానతినిఁ బాటింప వలసిన పని లేదని యభిషిక్తుఁడవై రాజ్య భోగముల ననుభవింపు మని బోధించుట.

కం. భరతు ననునయించుచు ను
న్న రాము నటఁ గాంచి బ్రాహ్మణ మహా కుల శే
ఖరుఁ డనె జాబాలి సుధ
ర్మ రతునితో నయ విరుద్ధ మలిన గిర లిటుల్ 1.

తే.గీ. చాలు రాఘవ! సద్బుద్ధి! మేలి మనము
పరఁగు వాఁడ! పామరు భంగి వ్యర్థ మైన
యిట్టి బుద్ధి వహింపఁగ నేల యిత్త
రుణము నందుఁ గాకుత్స్థ! సద్గుణవరేణ్య! 2.

ఉ. ఎవ్వఁడు ధాత్రి నెవ్వనికి నెవ్విధి బంధువు రాఘవోత్తమా!
యెవ్వఁడు వొందు నెట్టిదియు నెవ్వని నుండి తలంచి చూడఁగాఁ
నెవ్వఁడు నైన నొంటరిగ నిద్ధరఁ బుట్టును నిక్క మెంచఁగా
నెవ్వఁడు నైన నొంటరిగ నెన్నఁడు నైన నశింపఁ కుండునే 3.

ఉ. కావున నెవ్వఁ డైనను వికారము నొందిన దండ్రి యీతఁ డం
చీ వనితా మతల్లి యగు నింపుగఁ దల్లియె యంచు డెంద మం
దా వరుసం దలంపఁగ మహాత్మ! యతం డిల వెట్టివాఁడు సూ
యే విధి నేరి కైనఁ గన మిద్ధర రాఘవ! యెట్టి బంధమున్ 4.

కం. అన్యగ్రామమునకు న
ధ్వన్య పురుషుఁడు పయనించి వసియింపఁగ రా
జన్య! యొక యెడఁ దిరిగి గ్రా
మాన్యమున కపరపు దినము మరలి చను గతిన్ 5.

కం. నరులకు జననీ జనకులు
వరూథములు కాంచనములు వాసమ్ములె యి
ద్ధర బంధమ్ములలోఁ జి
క్కరు సజ్జను లెన్నఁ డేని కాకుత్స్థ వరా! 6.

ఆ.వె. నిజ జనకుని నృపతి నిఖిల రాజ్యంబును
వీడి దుఃఖతరము విషమము బహు 7.

కంట కావృతమ్ము కాపథమ్ముఁ బరిగ్ర
హింప నెంతు వేల యినకులాగ్ర!

తే.గీ. అతి సమృద్ధ మయోధ్యను వితత వైభ
వమున నభిషిక్తుఁడ వగుమ పార్థివేంద్ర!
యొక్క జడ నూని నగరమ్ము చక్కఁగాను
నీ కొఱకు వేచు చున్నది నీరజాక్ష! 8.

కం. ఘన భోగములు మహార్హము
ల ననుభవించుచు నయోధ్య రమణన్ విహరిం
పు నరవరేణ్య! దివమ్మున
ననిమిష భర్త విహరించు నట్లు మహీశా! 9.

తే.గీ. దశరథుండునీ కెవ్వండు దలఁప నెడఁద
నీవు నెవ్వఁ డాతనికిని నిజము నెంచ
నన్యుఁడవు నీవు దశరథుఁ డన్యుఁ డయ్య
కానఁ జేయుమ యుక్తమ్ము మానకుండ 10.

తే.గీ. బీజ మాత్రుఁడు జీవికి విశ్వ మందుఁ
దండ్రి తెల్లని రుధిరము తల్లి యందు
ఋతిమతి యయి నట్టి తఱి మిళితము కాఁగఁ
బురుషుఁ డుదయించుఁ బన్నుగఁ బుణ్యపురుష! 11.

ఆ.వె. ఏఁగ వలయు గతికి నేఁగె నరేంద్రుఁడు
మర్త్యుల కిది యగును మానవేంద్ర!
సంతత ప్రవృత్తి సత్యమ్ము నెన్నిన
వంతఁ బొందు దీవు వ్యర్థముగను 12.

తే.గీ. ఎవ్వ రెవ్వరు న్యాయమ్ము నింక ధర్మ
మునను రక్తి నుంతురొ యట్టి జనుల కొఱకుఁ
గరము చింతింతుఁ బరులకు కాదు వెతలఁ
బడసి యిట వారు నశియింత్రు విడువ మేను 13.

ఆ.వె. శ్రాద్ధము పితృ దేవ చయమునకుఁ జలుప
సెంత్రు జనులు పుడమి నెల్ల నకట
యన్నమవ్విధమ్ము వ్యర్థ మౌటఁ గనుమ
యేమి తినును మృతుఁడు భూమి మీద 14.

తే.గీ. పరుఁడు తిన్నట్టి యన్నమ్ము నరవరేణ్య!
యన్యు దేహమ్ము సేరంగ నగుసె యేని
శ్రాద్ధ మప్పు డొసఁగ వచ్చు నిద్ధచరిత!
చేరి యశన మది యగుసె దారి లోన 15.

తే.గీ. కొనుమ దీక్ష యిమ్ము యజింపు మొనరుపుమ త
పమ్ము త్యజియింపుమ యనుచుఁ బండితు లిట
భువినిఁ బ్రోత్సహింప జనుల ముడుపు లీయ
గ్రంథముల నొనరించిరి గాదె తలఁప 16.

ఆ.వె. లేదు పర జగమ్ము మేదినీశ్వర! యిట్టు
లెంచి డెంద మందు నంచితముగ
గోచరమ్ము నెల్లఁ గూర్పుము మొదట న
గోచరము వెనుకకుఁ గూల్పు మయ్య! 17.

తే.గీ. బుధుల మతి గౌరవించి సముచిత రీతి
జగములకు నీయఁ దగు నిదర్శనము రామ!
భరతుఁ డిచ్చిన రాజ్యమ్ము పార్థి వేంద్ర!
యందుకొనుమ సమ్మదమున నిందు వదన! 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట యెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 109.

జాబాలి యట్లు నాస్తికుని రీతిఁ బలుక విని రాముఁడు చలింపక యా వచనముల నాదరింపక సత్యము యొక్క గొప్పతనము నుగ్గడించి పలికిన యాతని కోపమును దిలకించి జాబాలి తాను నాస్తికుఁడు కాదని యయోధ్యకు రాజుగా నిన్ను మరలింప నట్లు పలికితి నని యనుట.

కం. గిరలను సత్యాత్ములలో
వరుండు రఘురాముఁడు విని భక్తిని జాబా
లి రతిం బలుకఁ జలింపక
యరసి తనదు బుద్ధిఁ బలికె నపు డిట్బంగిన్ 1.

చం. ప్రియములు వల్క నెంచుచు నికృష్టపుఁ బల్కులు మీర లివ్విధిన్
నయ మగు నెట్లు పల్కఁగను న్యాయపు రీతిని నున్న నింద్య వా
క్చయములు కార్య యుక్తములుగా ధరఁ దోఁచు నకార్యముల్ గద
య్య యడరఁ బ్రీతి నా పయి ననాదర వాక్కులు వల్క వచ్చునే 2.

ఉ. ఎల్లల నెల్ల దాఁటి కడు హీన చరిత్రఁ జరించి పాపముల్
కొల్లలుగా నొనర్చుచును గ్రూరపుఁ గార్యము లెల్లఁ జేయఁగా
నుల్లము నుంచి సంతతము నుత్తము లొల్లని వర్తనమ్ముతోఁ
గల్లలు వల్కు మానవుఁడు గౌరవ మందునె యెన్నఁ డైననున్ 3.

ఉ. ఉత్తమ వంశ మందును ననుత్తమపుం గుల మందుఁ బుట్టినన్
సత్త గలట్టి వాని మఱి సత్తువ నెంచెడు వాని నైననున్
నిత్తెము శుద్ధుఁ డైన మఱి నిండుగఁ దా నశుచుండు నైననున్
సత్తెముగా వచించు నిలఁ జల్పెడు వాని చరిత్రమే కనన్ 4.

సీ. శిష్టునిగ నటించు దుష్టుని శుచి హీనుఁ డతి శుచుని నిభమ్ము నగుణుఁడు గుణు
భంగిఁ దనర శీలవంతుని వలె శీల హీనుఁడు నీతిగ హీన నీతిఁ
గలవర పఱప జగమ్ముల నీతి హీనంపు బనుల నెల్ల నింపఁ బుడమి
నందంగ సంతత మధమంపు ధర్మము దూషింప లోకమ్ము దొడ్డ రీతి
ఆ.వె. నట్టి చెడ్డ నడత నడరు వానిని మంచి
చెడు లెఱిఁగిన వాఁడు చేతనమ్ము
గల నరుండు నన్ను గౌరవింపఁ గలఁడె
యింత యేని యెన్నఁ డేని యకట 5.

ఉ. వర్తిలు చుండ హీన నయ భంగిని నే నిల నేరి కిత్తు సం
వర్తన మెట్టు లందుదు దివమ్ముఁ బ్రతిజ్ఞకు భంగ మీయ భూ
భర్త చరించు రీతిఁ గని పౌరులు వర్తిలు వారు గాదె సం
పూర్తిగ లోకు లిచ్ఛ మెయి మూరి చరింతురు సంతతమ్మునున్ 6.

ఉ. సత్య మహింస రాజులకు సంతత మాచరణీయముల్ ధరన్
సత్యమె యాత్మగా నునుపఁ జక్కఁగ లోకము వెల్గు చుండు నీ
సత్యము నంద దేవతలు సంయమి వర్గము నెమ్మి నమ్మి రీ
సత్యము సత్యవాది తతి సద్గతు లందుట నిక్క మెప్పుడున్ 7.

చం. అనృతము లాడు నా నరుని నారసి సర్పము భంగి భీతిఁ గం
పనములు గల్గు నెల్లరకు వావిరి ధర్మము సత్య మీ జగ
మ్మున దివి నంద మూల మగుఁ బూర్వులు సెప్పిరి యివ్విధమ్ముఁ ద
ల్ప నిజమె యీశ్వరుండు వర లక్ష్మి వసించును సత్య మందునే 8.

ఉ. మూలము సత్య మన్నిటికి భూతల మందు నిజమ్ము కన్ననున్
మేలగు వస్తు వెద్దియు సమీక్షణ మింపుగఁ జేయఁ గానమే
వేలిమి యింక దానములు వెన్తపముల్ హుతముల్ శ్రుతుల్ ధరన్
వ్రాలును సత్య మందునె శుభప్రద సత్యము మిన్న యన్నిటన్ 9.

తే.గీ. జగతిఁ బాలించు నొక్కఁడు చక్కగాను
గులముఁ బాలించు నొక్కఁడు కూర్మి తోడ
మునుఁగు నరకమ్ములో మఱి జనుఁ డొకండు
తేలు స్వర్గమున నొకండు దివ్యముగను 10.

ఆ.వె. నిజపుఁ బ్రతిన నూని నిజమునకే బద్ధుఁ
డ నయి నట్టి నేను జనకుని ప్రతి
నను నిలుపక యేల నడయాడుదుఁ బరిపా
లింతుఁ దప్పకుండ సంతసమున 11.

చం. అరయక లోభ మోహముల నజ్ఞత నందక చీఁక టింతయున్
నరవరు సత్య వాక్యములు నా వర సేతువు గూల్ప నెన్నఁడున్ 12.

ధర నిజ మాడు వాఁడఁ బిత్రు దైవత వర్గ మసత్యవాదికిన్
నిరత మనిశ్చయాత్మునకు నెమ్మది సమ్మతి నీమి విందుమే

ఆ.వె. స్వయము నేను గాంతు సత్యంపు ధర్మము
ను బరమాత్మ యంచు నుత జన గణ
మెంచు రీతిఁ గాన నిబ్బారము వహింతుఁ
జింత లేక సుంత నంత రాత్మ 13.

కం. త్యజియింతు క్షాత్ర ధర్మముఁ
గుజను లధర్మమును ధర్మ గుణ యుక్త మనం
గఁ జరుప వెలుంగునది నీ
చ జన నృశం సాఘు లుబ్ద జన సేవితమున్ 14.

చం. మనమునఁ జింత సేసి మును మానవుఁ డొక్కటి నిశ్చయమ్ముగం
దనరును దానిఁ జేయ మెయిఁ దత్పరుఁడై కడు సంతతమ్ము దా
నన్నతము నాడు జంకకయె యాత్మను సుంతయు నివ్విధమ్ముగా
జనుఁ డొనరింపఁ బాపములు సాగు నఘమ్ములు మూడు భంగులన్ 15.

తే.గీ. పురుషుని వరించుఁ గద కీర్తి భూమి సంప
దలు ప్రసిద్ధియు నిత్యమ్ము ధాత్రి యందు
స్వర్గ మందును గూడ ననర్గళముగఁ
గాన నిజమును సేవింపఁగఁ దగు నెపుడు 16.

తే.గీ. శ్రేష్ఠముగను భద్రమ్ముగఁ జెలువముగను
నిర్ణయించి వాక్యమ్ములు కర్ణ పేయ
ములుగ మీ రన్న వెల్లను మునివరేణ్య!
యగు ననార్యములు దలంప నాత్మ లోన 17.

ఉ. మాట నొసంగి తండ్రి కట మౌనివరా! చని వాస ముందు ఘో
రాటవి నంచు నీ భరతుఁ డాడిన యిచ్చట నివ్విధమ్ములౌ
మాటల నెట్టు లొప్పుదును మాన్యుఁడు భూపతి తండ్రి యన్న యా
మాటల నెల్ల నొల్లక యమానుష రీతినిఁ జేయ నేర్తునే 18.

ఆ.వె. జనకు సన్నిధిని విశంకఁ జల్పితి నేను
సుప్రతిజ్ఞ నపుడు క్షిప్రముగను
సంతసించెఁ జక్క నంతరంగము నందు
దేవి కైక యెడఁదఁ దేటపడఁగ 19.

చం. వనమున శుద్ధ చిత్తమున వాసము సల్పుదు క్లృప్త భోజినై
తనుపుచు మూల పుష్ప ఫల తండములం బితృ దేవ కోటినిం
దనిసి నిజేంద్రియమ్ములను ధర్మ యుతమ్ముగ నమ్మకమ్ముతోఁ
గని తగ మంచి చెడ్డల సుఖమ్ముగ నేఁ జరియింతు నిత్యమున్ 20.

చం. పనులు చెలంగు నేల యిల ప్రాప్తము గాఁగ నొనర్ప నొప్పు వా
నిని మది శ్రద్ధ నూని తగ నిత్యము వాని ఫలమ్ము లింపుగా
ననలుఁడు వాయు వబ్ధిజుఁడు నంది ముదమ్మును బొంది యుందురే
యనిశము తచ్ఛుభప్రద సమంచిత కర్మము లాచరింపఁగా 21.

కం. శత యాగమ్ము లొనర్పఁగ
శతమన్యుం డేఁగె దివికి సదమల రీతిన్
సుతపము లుగ్రములం జే
సి తాపసు లరిగిరి దివికి శ్రేష్ఠమ్మునకున్ 22.

కం. విన నా నాస్తిక వాక్యము
ల నుగ్ర తేజుఁడు సహింప రాక నృవర నం
దనుఁ డా నింద్యమ్ములఁ దా
ననె రాముం డిట్లు తిరిగి యమ్ముని తోడన్ 23.

చం. పలుకుట సత్య మెప్పుడును బన్నుగ ధర్మ పరాక్రమమ్ములన్
నిలుచుట యుంట భూత దయ నెమ్మదిఁ బల్కుట మంచి మాటలం
జలుపుట భూసు రానిమిష సంచయ సాతిథి పూజ లెల్ల దా
రు లనుచుఁ బ్రాజ్ఞు లందు రిలలోఁ ద్రిదివమ్మున కెల్ల వారికిన్ 24.

తే.గీ. ఎఱిఁగి దాని నిజమ్ముగ గుఱిని నుంచి
ధర్మ మంద చరింపఁగఁ దగిన భంగి
విప్రు లప్రమత్తులునై భువి నరయంగ 25.

నున్నత పదమ్ములను గోరు చుందు రెదల

తే.గీ. ధర్మగతి విడిచిన వానిఁ దద్ద చెడ్డ
బుద్ధి నున్న వానిని దైవము పయి సుంత
నమ్మకమ్ము నుంచని వాని నరుని నిన్ను
గొన్న తండ్రి పనిని నొల్లఁ గొంచ మయిన 26.

తే.గీ. దొంగ భంగి విద్వాంసుని సంగతుండు
కా నదైవ మతిని నాస్తిక పురుషుఁ డని
ప్రజల కనుమానమై నట్టి వాని కెదురు
చనరు బుద్ధిమంతు లయిన జనులు ధరణి 27.

కం. వర జనులు నీకు పూర్వులు
పరము నిహమ్మును గెలిచిరి వర కార్యమ్ముల్
ధర నొనరింపఁగ హుతములు
విరివి జన హితార్థ మడరి విప్రవరేణ్యుల్ 28.

కం. ఘన ధర్మ బద్ధు లమలులు
తను తేజస్వులు వితరణ తత్పరులును స
జ్జన గణ సహితు లహింసక
మునిప్రధానులు సమధిక పూజ్యులు సుమ్మీ 29.

తే.గీ. పలుక నివ్విధి రాముఁడు వడసి కినుక
కని మహాత్ము నదీన బలుని వచించెఁ
దిరిగి విశ్వాస యుత సత్య గిరలు విప్రుఁ
డనునయముగ రాముని తోడ నంత నిట్లు 30.

తే.గీ. నాస్తికుఁడు పల్కు మాటల నననుు నేను
కాను నాస్తికుఁ డను సుంత నేను రామ!
యొక్కొ కపు డాస్తి కుఁడ నౌదుఁ జక్కఁగ మఱి
యొక్క తఱి నాస్తికుఁడ నౌదు నుర్వి గిరల 31.

తే.గీ. అట్టి తఱి వచ్చె నిపుడు నే నిట్టి నాస్తి 32.

క వచనమ్ములు భాషింపఁగ నిట రామ!
నిన్ను మరలింపఁ బ్రార్థింప నిన్ని వాక్కు
లిట్టు లంటి నంతియ  యన్య మెద్ది లేదు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట తొమ్మిదవ  సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 110.

జాబాలిపైఁ గోప మూనుట సెఱింగి వసిష్ఠ మహర్షి రామునితో నీ జాబాలి లోక గతులు బాగుగఁ దెలిసిన వాఁడే ననియు ని న్నయోధ్యకు రప్పింప నట్లు పలికె నని చెప్పి యిక్ష్వాకు వంశ క్రమమును పేర్కొని యందు జ్యేష్ఠ సుతుఁడే రాజ్యమును బొందుట యాచారమని పలికి రాముని నయోధ్యకు వచ్చి పాలింపు మని పలుకుట.

కం. రాముని కోప మెఱింగి మ
హా మునివృషభుఁడు వసిష్ఠుఁ డనియె బదులుగా
రామా! యీ జాబాలికి
నీ మహి గతు లెల్ల సెఱుకయే భృశ మనుచున్ 1.

తే.గీ. నిన్ను రప్పింప వని నుండి యన్నగ వర
మున కయోధ్య కింపుగ నెంచి మునివరుండు
పలికె జాబాలి యవ్విధి నలరి వినుమ
విశ్వపతి! జగ దుత్పత్తి విధము నుడువ 2.

చం. సలిల మయమ్ము కానఁ బడె సర్వము నిర్మిత మయ్యె నందు భూ
వలయము పుట్టె విష్ణు వటఁ బన్నుగ నంత స్వయంభువుండునై
లలిత సురాళి తోడుత వరాహపు రూపము దాల్చి భూమినిన్
సలలిత మెత్తి స్వీయ సుత సంతతితో సృజియించె లోకముల్ 3.

ఉ. ఆకస మందు నవ్యయుఁడు నైన సనాతనుఁ డైన బ్రహ్మ ని
త్యైక వపుండు పుట్టెను మహాత్ముఁడు వానికి నా మరీచి నా
మైకుఁడు సంభవించె సుతుఁ డాతని కయ్యెను గశ్యపుండు భూ
లోకములో వివస్వతుని రొచ్య సుతుం గనెఁ దా మనుం గనెన్ 4.

తే.గీ. మనువు వైవస్వతుండు దాఁ దనరి ముని ప్ర
జా పతిగఁ బ్రసిద్ధుండు ప్రజా పతికిఁ గు
మారుఁ డిక్ష్వాకుఁడు మొదటి మగఁడు పుర మ
యోధ్య కతని కింపుగఁ గుక్షి యుద్భవించె 5.

సీ. కుక్షికిఁ బుట్టె వికుక్షి శ్రీమంతుఁడు నతనికి బాణుం డమిత బలుండు
బాణునకుఁ బ్రతాపవంతుఁ డగు ననరణ్యుండు తేజస్వికి నుద్భవించెఁ
బృథు వాతని సుతుండు వీర త్రిశంకువు దుందుమారుండు సుతుం డతనికి
యువనాశ్వుఁ డాతఁడె యుర్వీధవుండు మాంధాత యతని కయ్యెఁ దనయుఁ డెలమి
తే.గీ. ఘనుఁడు మాంధాతకు సుసంధి తనయుఁ డాయె
నతనికి ధ్రువసంధి ప్రసేనజితుఁ డనంగ
నిద్దఱు సుతులు ధ్రువసంధి కెలమిఁ బుట్టె
భరతుఁ డసితుఁడు నందన వరుఁ డతనికి 6.

చం. అసితున కైరి శత్రువులు హైహయు లా శశిబిందు తాళ జం
ఘ సహిత శూర పుంగవులు కానలు సేరి పరాజితుండు నా
యసితుఁడు మంచుకొండ దరి కల్పబలుండు సభార్య మంత్రి వ
ర్గ సహిత ముండె నా పుడమి కాంతుఁడు భీతి భృగూత్స వాటినిన్ 7.

తే.గీ. దార లిద్ద అపుడు గర్భ ధారిణు లని
విదిత మొక సతి సవతికి విష మొసంగెఁ
జ్యవన నాముఁడు భార్గవుఁ డవని సురుఁడు
హిమనగం బాశ్రయించి యుండె ముని వరుఁడు 8.

కం. ఒక సతి దారల లోన సు
త కాంక్ష భార్గవు సురనిభుఁ దపసి మహా భా
గ కొలువ మృగలోచన య
న్య కాంత కాళిందియు సుతు నందఁగఁ గొలిచెన్ 9.

చం. ముని యనె దేవి తోడ వగపుం గొన కమ్మ మహా బలుండు దా
జననము నొందు శీఘ్రమున సన్నుత శూరుఁడు నీకు నా వ రా
నన పతి శోక తప్త ఘన నందను బట్టపు రాణి దాఁ గనెన్
ఘన విష సంయుతమ్ముగ సుఖమ్ముగఁ దాపసి పల్కి నట్టులన్ 10.

ఆ.వె. సవతి యీయ విషము చంపఁ బిండమ్మును
గరము తోడఁ బుట్ట వరసుతుండు
సగరుఁ డంచు నామము గనె సార్థకముగ
రాజ సుతుఁడు ఘన పరాక్రముండు 11.

ఆ.వె. క్రతువును నొనరించి రతిఁ బర్వ దినమున
భయము నందఁ బ్రజలు పార్థివుండు
సాగరమ్ము భువినిఁ జక్కగఁ ద్రవ్వించె
సగర చక్రవర్తి చారుతరము 12.

సీ. అసమంజసుఁడు సగ రాత్మజుం డంశుమంతుఁ డతని సుతుఁడు పుత్రుం డతనికి
నా దిలీపుఁడు దిలీ పాత్మజుఁడు భగీరథుండు కాకుత్స్థుఁ డుద్దండ సుతుఁ డ
తనికిఁ గాకుత్స్థుని తనయుఁడు రఘువు నరాదక కల్మాషపాదుఁడు రఘు
నందనుం డతని తనయుఁడు శంఖణుఁ డితనికి సుదర్శనుఁ డితనికిఁ గుమారుఁ
తే.గీ. డగ్ని వర్ణుఁడు శీఘ్రగుఁ డతని సుతుఁడు
శీఘ్రగు సుతుఁడు మరువు ప్రసిద్ధుఁ డితని
పుత్రుఁడు ప్రశుశ్రుకుఁ డితని పుత్రుఁ డంబ
రీషుఁ డితనికి నహుషుఁడు రిపు దమనుఁడు 13.

తే.గీ. నహుషునకు యయాతి జనించె నందనుఁడు య
యాతి పతికి నాభాగుఁడె యాతని సుతు
లిర్వు రజుఁడు సువ్రతుఁ డన నియ్యజునకు
దశరథుండు ధర్మాత్ముఁడు తనయుఁ డయ్యె 14.

ఆ.వె. ఆ దశరథ నృపున కగ్ర జన్ముఁడ వీవు
రాఘవేంద్ర! యివ్వర సుతులందు
నీదు రాజ్య మీవు నెమ్మి గ్రహించి కా 15.

వుమ పురుష వరేణ్య!  పుడమి జనుల

ఆ.వె. జ్యేష్ఠ నందనుండ యిక్ష్వాకు కులమున
నగును రాజు సతత మవరజుండు
జ్యేష్ఠుఁ డుండఁ గాఁడు జ్యేష్ఠుఁడే యభిషిక్తుఁ
డగును రాజ్య మందు నవని నాథ! 16.

తే.గీ. రాఘు వాన్వయ ధర్మము రమ్య తర స
నాతనమ్మును ద్యజియింప నరవరేణ్య!
తగదు బహురత్నవర భూషితమ్ము భూమి
నేలుము ఘన రాష్ట్రము తండ్రి వోలె రామ! 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పదవ  సర్గము.

# అయోధ్యా కాండము

# సర్గము 111.

వసిష్ఠ మహర్షి యింకను నీకును నీదు తండ్రికి గురువు  నైన నా మాటలు విని భరతుఁడు కోరిన విధముగా నయోధ్యకు రమ్మని వేఁడఁగ రాముఁడు తన తండ్రి కిచ్చిన మాటను దప్ప లేనని పలుక భరతుఁడు తాను నిరాహారముగ నచట నుందు నన నది క్షత్రియ ధర్మము కాదన భరతుఁడు తాను రాముని మారుగ నడవిలో నుందు నన నంగీకరింపక రాముఁడు వన వాసము పూర్తి యైన పిమ్మట నయోధ్యకు వత్తు ననుట.

కం. పలికి వసిష్ఠుఁడు రాఘవ
కుల భవ్య పురోహితుం డకుంఠిత వచన
మ్ము లటుల ధర్మ యుతమ్ములు
వలికెఁ దిరిగి రామునిఁ గని వాక్యము లిట్లున్ 1.

మ. గురులన్ ముగ్గురఁ బొందు మానవుఁడు కాకుత్స్థ ధరం బ్రీతినిన్ 2.

గురు వాచార్యుఁడు తండ్రి యౌ గురువు సంకోచమ్ము లేదిందుఁ ద
ల్లి రఘూర్వీపకు లోద్భవా! గురు వగున్ లీలన్ సుతుం బెంపఁగా
గురు వౌ నొజ్జ కరమ్ము జ్ఞాన మిడఁ గాఁ గోదండ వీరాగ్రణీ

కం. గురువును దండ్రికి నీకును
బరంతపా! యే వచింపఁ బన్నుగ దానిం
బరగంగఁ జేయ దాఁటవు
వర విబుధుల గతిని నీవు పరికింపంగన్ 3.

కం. పరిషద్వర్తక భూసుర
వరార్థ మొనరింప ధర్మ వత్కృత్యమ్మున్
నర పుంగవ విను దాఁటవు
వర విబుధుల గతిని నీవు పరికింపంగన్ 4.

కం. వర ధర్మశీల! కడు వృ
ద్ధురాలు దల్లి విడువ దగదు సుమీ సేయన్
గిరలు జనని యన దాఁటవు
వర విబుధుల గతిని నీవు పరికింపంగన్ 5.

కం. కడు దీనముగ నడుగఁ ద
మ్ముఁ డాతని పలుకులు సేయ ముదముగ రామా!
యడరు నుచితం బగుచు నీ
యెడఁదను దాఁట వరయంగ నినవంశమణీ! 6.

కం. తియ్యగ నిట్లుడివిన విని
యయ్యతి పుంగవు వసిష్ఠు నారసి యంతం
జయ్యన సమీప సంస్థితు
నయ్యెడ పురుషర్షభుఁడు మహాత్ముఁ డనె నిటుల్ 7.

ఉ. తల్లియుఁ దండ్రియుం బణపు దార్ఢ్యము నారసి యీాయ వస్త్రముల్
సల్లలితమ్ము పెంపఁగను జక్కఁగ నిద్దుర పుచ్చు చుండఁగా
నుల్లము హర్ష మందు వచ నోత్కరముల్ వలుకంగ నిత్యముం
జల్లగ వారి కౌసె యిలఁ జల్పఁగఁ బ్రత్యుపకార మేరికిన్ 8.

తే.గీ. జన్మ మిచ్చిన తండ్రి దశరథ నృపుఁడు
నన్ను బంచిన వేళలో నా యొసంగి
నట్టి మాట యెట్టి విధమ్ము నయిన దేవ!
కాదు వ్యర్థమ్ము తథ్యముగను మునీంద్ర! 9.

చం. పలికిన రాముఁ డిట్లు తన ప్రక్కన నున్న సుమంత్రు సూతునిం
గలవర మంది చిత్తమునఁ గాంచి యనెన్ భరతుండు సూత! వే
యిలఁ గుశ తల్పముం బఱపు మింపుగ నిల్చెద నన్న సన్నిధిన్
లలితు ప్రసాద మే నిట వరమ్మును బొందని యంత కాలమున్ 10.

కం. శయనింతు శాల మ్రోలనె
నయోధ్య కయి యన్న మరలు నంత వఱకుఁ దా
దయ నూని విప్ర నరు పగి
ది యధనుఁ డనశనుని భంగి దిట్టతనమునన్ 11.

ఆ.వె. కలఁత మనము తోడఁ గాంచి సుమంత్రుని
నగ్రజుని ముఖమ్ము నరయు వానిఁ
దానె యరిగి యంత దర్భ తృణమ్ములు
స్వయము తెచ్చి వేగ పఱచె వాని 12.

చం. కని నృవరర్షి రాముఁడు సగౌరవ మేమి టిదెల్లఁ దండ్రి! యం
చు నిచట నేను చేసినది సుంతయు సెయ్యది పల్కు మయ్య నీ
వు నిలువ నేక పార్శ్వమున భూసుర కోటికి నొప్పు నిల్వఁగా
ఘన నృప కోటి కొప్పదు సుఖమ్ముగ రాజ్యము నందు వారికిన్ 13.

ఆ.వె. చక్క లెమ్మిఁక నర శార్దూల! మాను మీ
వ్రత మయోధ్యకుఁ బుర వరమున కరు
గుమ త్వరితముగను రఘువరేణ్య! మూర్ధాభి
షిక్తులకుఁ దగ దిది యుక్తి గాదు 14.

కం. భరతుఁడు కూర్చొని యుండియె
పుర జనులను గాంచి దుఃఖమునఁ బల్కెను మీ 15.

రరి దమను రాము శాసిం
ప రేల నొక్కండు నైనఁ బల్కుఁడు మీరల్

ఉ. నా విని పౌరు లంత రఘు నందను రాముని మే మెఱుంగమే
తా వర భాషణమ్ములను దద్దయు నీతినిఁ బల్క వింటిమే
భూవరు తండ్రి వాక్యములఁ బుత్రుఁడు రాముఁడు నిల్ప నెంచఁగా
నే విధి మాకు నెల్లరకు నీతని రమ్మని పల్క శక్యమౌ 16.

తే.గీ. అట్టు లన వారి పల్కుల యర్థ మెఱిఁగి
రాఘవుం డిట్లు పలికె భరతునిఁ గాంచి
ధర్మ చక్షులు వీరల ధర్మ యుక్త
వచనముల నేరు మింపుగ భరత! యెలమి 17.

కం. వింటివి యుభయుల మాటల
నొంటరి మదిఁ జింతఁ జేయు మొప్పుగ లెమ్మా
యంటుమ నన్నును జలమును
గంటికి విం దొసఁగు మయ్య కాకుత్స్థ వరా! 18.

చం. అన విని యన్నమాటలు మహాత్ముఁడు నీరము నాని యంతఁ బ
ల్కెను బరిషద్వణిగ్జన వరేణ్యుల మంత్రుల తోడ నిట్లు తం
డ్రి నకట రాజ్య మే నడుగ లే దటఁ దల్లి యనుజ్ఞ నొల్ల న
న్నను వర ధర్మవేదిని వనమ్మున కంపఁగ నీయ సమ్మతిన్ 19.

చం. జనకుని పం పవశ్య మనఁ జల్ప నరణ్యము నందు నుందు నే
న నెఱి చతుర్ద శాబ్దములు నన్నకుఁ దోడుగ నుండ నన్న త
మ్ముని గిర లీయ వింత జనముం గని రాముఁడు వల్కె నివ్విధిన్
జనకుని మాట దాఁటఁగ నశక్యము తమ్మున కింక నాకునున్ 20.

ఆ.వె. అమ్మ నట్టిది మఱి న్యాస మిడినది దె
చ్చినది యైన నేమి జనకుఁ డుండఁ
జేసి నట్టి దానిఁ జెఱుప లేము భరతుఁ
డైన నే నయినను గాని వినుఁడు 21.

తే.గీ. నాకు మారుగ నుంచ వనమ్ము నందు
నితరు గర్హితం బగును నే నిట్టిది యొన
రింప నొల్లను వచియించె నింపుగ నటఁ
గైక జనకుఁడు సేసెఁ జక్కని దగు పని 22.

కం. నేరుదు భరతునిఁ జక్కటి
యోరిమి గల యట్టి వాఁడె యుంచు గురులపై
గౌరవము మహాత్ముఁన కగు
ధారుణి శుభములు నిజమునఁ దనరు నరునకున్ 23.

కం. తిరిగి నరుదెంచఁగా నే
నరణ్య వాసమ్ము నుండి యనుజుని తోడన్
వర ధర్మశీలు తోడన్
ధరకు నగుదు నుత్తమ పతిఁ దప్పక భరతా! 24.

కం. వర మడిగెఁ గైక తండ్రిని
గిరలను బాటించితి నరిగి వనమ్మునకున్
భరతా! మహీపతి యన్నృత
నరుండు గాని పగిదినిఁ గన వలయు నీవున్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పదునొకండవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 112.

తాపసు లెల్లరు భరతునితో రాముని మాటల నంగీకరింపు మని పలుక రాజ్యము నేలు శక్తి తనకు లే దన రాముఁడు భరతుఁడు రాజ్య భార మూన సమర్థుఁడే యని పలుక భరతుఁడు సమ్మతించి రాముని పాదుకలను దమకు రక్షగా నిమ్మని యడిగి పుచ్చికొని వన వాసము పూర్తియైన తత్క్షణము రాముఁ డయోధ్యకు రాకున్న నగ్ని ప్రవేశము చేయఁ గల వాఁడ నని తెలుపుట.

రాముఁ డంత నందజినిఁ బంపి పర్ణశాలలోనికిఁ బ్రవేశించుట.

ఉ. వచ్చిన మౌనిపుంగవులు పార్థ కుమారుల సంగమమ్ము నా
యచ్చపు రోమహర్షణము నారసి డెందములన్ భృశమ్ముగా
నచ్చెరు వంది రెల్ల రట నప్రతి మాంశుల రాఘవేంద్రులన్
మెచ్చిరి వార లిద్దజిని మిక్కిలి యాడఁగ ధర్మ వాక్యముల్ 1.

చం. కనుల కగోచ రాకృతి సకాశులు సిద్ధ మహర్షి సంఘముల్
ముని వరు లెల్లఁ గాంచి నృప పుత్రుల భ్రాతల నమ్మహాత్ములన్
మనముల మెచ్చి పంక్తి రథ మానవ నాథుఁడు ధన్యుఁ డయ్యె నా
తనయులఁ బొందఁగా ననిరి ధర్మ పరాక్రమ ధర్మవేత్తలన్ 2.

కం. మన మెల్లరమ్ము బంధ
మ్మునఁ జిక్కితిమి యనురక్తిఁ బుత్రద్వయికిన్
ఘనులగు రాజ కుమారుల
ఘన నయ వాక్కులు వినంగఁ గమనీయముగన్ 3.

తే.గీ. అంత క్షిప్రముగ మహర్షు లంతరంగ
మందు దశముఖ వధ నెంచి యరసి భరతు
నిట్లనిరి కూడి వినఁదగు నీ మహా కు
లజుని రాముని గిరలు దలఁచినఁ బితను 4.

కం. కనఁ గోరుదుము ఋణ విము
క్తునిగా రఘు రాము దశరథున కనిశమ్మున్
ఘనుఁ డీ దశరథ పతి యేఁ
గెను దివికి ఋణమ్ముఁ దీర్చి కేకయి కట్లున్ 5.

ఆ.వె. పలికి యింత దనుక వచనము లరిగిరి
తమ తమ గృహములకుఁ దరలి రాజ
ఋషుల గూడి బ్రహ్మ ఋషులు గంధర్వులు
నంద అంత వచ్చి నట్టి దారి 6.

ఆ.వె. ముదము సంతరింప ముఖమునం దా శుభ 7.

దర్శనుండు వాక్య తతిని వినఁగ
రాఘవుండు ప్రీతి రాముఁడు పూజించె
వారి నెల్ల మీఱ భక్తి యెడఁద

తే.గీ. వణఁక గాత్రము భరతుండు పదిలుఁడు నయి
కొంత శిరమున కేలూని యంతఁ దిరిగి
పలుకఁ దొడఁగె వాక్యమ్ములు భ్రాతను రఘు
రాముని నరసి యిబ్బంగి రాఘవుండు 8.

మ. కుల ధర్మమ్మును రాజ ధర్మమును గాకుత్స్థేంద్ర! పాటింపఁగా
నిల నర్హుండవు నావి నా జనని వౌ యీ కోర్కులన్ యాచిత
మ్ముల భద్రమ్ముగఁ దీర్పఁగా వలయు నీ భూ భార మే నూనఁగాఁ
గలనే రక్షులు పౌరు లెల్లర నహో కాపాడ శక్యుండనే 9.

తే.గీ. నిరతిఁ బర్జన్యుని కొఱకు నిత్య మెదురు
జూచు కర్షక సంఘమ్ము చొప్పు నిన్న
జ్ఞాతులు సుహృదులు  సుయోధ చయము నీదు
సఖులు  కాంక్షింతు రెల్లరు సుఖము లంద 10.

కం. నిలుపుమ యీ రాజ్యమును వి
దు లందు నుత్తముఁడ వీవు తోరమ్ము మహా
బలవంత! పాలన క్రియ
లలో నతి సమర్థుఁడవు నిల నరసి చూడన్ 11.

తే.గీ. పలికి భరతుఁ డివ్విధముగఁ బడెను రామ
చరణముల పైనఁ బ్రార్థించె నరవరేణ్యు
రామునిఁ బ్రియ వచనుఁడు నరవర నంద
నుం డెడఁద దుఃఖ ముప్పొంగ మెండుగాను 12.

ఉ. అంకము నందు నిల్పి యపు డబ్భరతుం దగ రాముఁ డిట్లనెం
బంకజ పత్ర నేత్రుఁ గని బంధుర సన్నిభ సుస్వరమ్మునం
బొంకము మీఱ నేర్పఁగను బుద్ధులఁ దండ్రి! ధరాతలమ్ము నే
యంకిలి లేక పాలనము నద్భుత రీతినిఁ జేయు వాఁడవే 13.

ఆ.వె. పుడమి నేలు మయ్య బుద్ధిమంతుల మంత్ర
విదుల సంప్రదించి పదిలముగను
సర్వ కార్యములను సఖులను మంత్రి వ
రులను గష్ట మైన నలరి భరత! 14.

తే.గీ. చందురుని నుండి సెలవెల్గు జాఱుఁ గాక
మంచు కొండ వీడును గాక మంచు తివిరి
కడలి చెలియలి కట్టను గడచుఁ గాక
తండ్రి పంపు నే నెన్నఁడు దాఁట నయ్య 15.

తే.గీ. కామ మెదలోనఁ గడు మీఱఁగా నయినను
డెంద మందు లోభమ్మును బొందియైనఁ
దల్లి నీ కొఱ కొనరించె దాని నుంచఁ
దగ దెడఁద లోనఁ గాంచుమ తల్లి వోలె 16.

కం. విని పలుక నట్లు భరతుఁడు
ఘను నాదిత్య నిభు రాముఁ గౌసల్యా నం
దను నవ్యేందు సదృశ ద
ర్శను వీక్షించి వచియించె రమ్యముగ నిటుల్ 17.

చం. పసిడి విభూషితమ్ములను బాదుక లూనుమ నీ పదమ్ములన్
వసుధను యోగ భద్రములు భ్రాత! కనుంగొను నివ్వియే యనం
గుసుమ నిభమ్ము లంఘ్రులను గూర్చియుఁ దీసియుఁ బావకోళ్ల నం
త సుమతి యిచ్చెఁ దమ్మునకుఁ దద్దయుఁ బ్రీతిని రాముఁ డింపుగా 18.

చం. పలికె నమస్కరించి తమిఁ బన్నుగ నా భరతుండు జోళ్లకున్
ఫలముల నింక మూలముల వల్కలముల్ ధరియించి వేణులే
వెలయఁ జతుర్ద శాబ్దములు వీటికి నావలఁ బావకోళ్లపై
నిల యఖిలంపు భార మిడి యింపుగ వేచెద నీదు రాకకై 19.

ఆ.వె. నిండినఁ బదునాలు గేండులు నిండుగ
రఘువరేణ్య! నిన్నరయక యున్న 20.

నిచటఁ దత్క్షణంబ యేను బ్రవేశింతు
నగ్నిగుండ మందు నార్తి తోడ

తే.గీ. అట్ల యగుఁ గాక యని రాముఁ డతని కొసఁగి
మాట భరతుని శత్రుఘ్ను మన్న న యెద
నిండఁ గౌఁగిలించికొని రాముండు ప్రీతిఁ
బలికె భరతునితో నిట్లు భాషణములు 21.

చం. జననికిఁ గైక కిమ్ము కడు చక్కని రక్షను రోష మామె పై
న నిడకు మొట్టు సీత పయి నాపయి నంచు వచించి కళ్లలో
ఘనముగ నిండ నశ్రువులు కంపిత చిత్తుని వీడె నంతఁ ద
మ్ముని రఘు రాముఁ డింపుగను మూర్కొని యౌదల సంభ్రమమ్ము నన్ 22.

తే.గీ. కడు నలంకృతములు పాదుకలకుఁ బూజ
సేసి ధర్మ విదుఁడు చక్కఁ జేసి తగఁ బ్ర
దక్షిణము రాఘువునకు నుత్తమ గజంపు
శిరముపైఁ బావకోళ్లను జేర్చె భక్తి 23.

తే.గీ. రాఘు వాన్వయ వర్ధన రాముఁ డప్డు
నిలిచి నిజ ధర్మ మందు నచల హిమాద్రి
భంగి గురు మంత్రి నిజ పౌర వర్గ మనుజు
లను యథారీతిఁ బూజించి రతిని విడిచె 24.

తే.గీ. మరల ననుమతి గొనలేక మాత లెల్లఁ
గంఠముల నీరు నిండఁగఁ గరము నిలువఁ
దానె వందనమ్ము లొసఁగి తల్లులకు వ
గచుచు నుటజమ్ము లోనికిఁ గదలె నంత 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పండ్రెండవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 113.

భరతుఁడు రాముని పాదుకలను దన దలపై నూని శత్రుఘ్నునితో రథ మెక్కి తరలి మార్గమున
భరద్వాజుని యాశ్రమములో నా మహర్షినిఁ గలసి నమస్కరించి రాముని దీక్ష నెఱిఁగించి
యయోధ్యను శృంగిబేర పురము సేరఁగ వీక్షించుట.

కం. శిరమున నా పాదుకలను
భరతుఁడు శత్రుఘ్నుఁ డుండఁ బ్రక్కనఁ దనకుం
గర మనురక్తి నునిచి స్వీ
య రథ మధిష్ఠించె నంత నానందమునన్ 1.

ఆ.వె. ముందు చనిరి సకల మునులు వసిష్ఠ జా
బాలి వామదేవ పరమ పావ
నులు సమంత్రి గణము నుతు లంది నిజ మంత్ర
ములకు నెల్ల రపుడు కలసి మురిసి 2.

తే.గీ. వలనుగా దిర్గి సద్భక్తి వారు చిత్ర
కూట శైలమునకుఁ బ్రాఙ్ముఖు లయి యంతఁ
గదలి పుణ్య మందాకినీ నదిని కదియఁ
బయన మైరి యెల్లరు నతి భద్రముగను 3.

చం. స బలము శైల పార్శ్వమున సంచిత ధాతు సహస్ర చిత్రముల్
ప్రబలఁగఁ గాంచుచుం దమిని రమ్య తరమ్ములఁ జాగి యంతటన్
గబగబ గాంచె నగ్గిరి సకాశము నందు మహాశ్రమమ్మునుం
దబిసి యుతథ్య సూను నిజ ధామము నా భరతుండు ప్రీతినిన్ 4.

కం. కదిసి భరద్వాజ మఠ మ
రదమ్ము నుండి దిగి యబ్భరతుఁడు రయమునం
బద పద్మములం దాఁకి త
గఁ దాపసికి మ్రొక్కె భక్తిఁ గాకుత్స్థుండే 5.

కం. మురిసి కడు భరద్వాజుఁడు
భరతుని వీక్షించి యడిగెఁ బని సఫలంబై
పరఁగెనె యింపుగఁ గూడితి
పె రాముని సలక్ష్మణు నట నెలమిన్ భరతా! 6.

కం. అన ధీనిధి యవ్విధముగ
మునీంద్రుఁడు బదు లొసఁగె వర ముని కిబ్బంగిన్
ఘన ధర్మవత్సలుండు వ
చనమ్ములు రఘూద్భవుండు సత్వర మంతన్ 7.

చం. అడుగ మునీంద్ర! రాఘవుని నచ్చట నేను వసిష్ఠ మౌనియుం
గడు దృఢ విక్రముం డనియె గారవ మొప్పగ నివ్వసిష్ఠుతో
నడరి ముదమ్మునం బలుకు లప్పుడు రాఘవుఁ డివ్విధమ్ముఁగా
నడవిఁ జతుర్ద శోర్వటము లబ్బ కొసంగితి నుండఁ మాటనున్ 8.

తే.గీ. దాని నింపుగఁ బాటింతు నేను నిక్క
ముగ ననంగ రాముఁడు విని మునివరేణ్యుఁ
డరసి వాక్యజ్ఞుఁడు పలికె నంత వాక్య
కుశలు రామునిఁ జక్కగఁ గూర్మి తోడ 9.

శా. ఈ నీ పాదుక లభ్ర భూషితము లిమ్మింపారఁ గాకుత్స్థ! రా
మా! నిత్యం బిడఁ బట్టణమ్మునకు క్షేమం బిద్ధ యోగమ్ముతో
నా నైపుణ్యము మూరు వాని కిల నా నాతండు ప్రాగ్దిక్కునుం
దా నీక్షించియుఁ దొడ్గి యిచ్చె జన వాత్సల్యుండు రాజ్యార్థమై 10.

ఆ.వె. కొని మహాత్ము నాజ్ఞఁ గూర్మిఁ గైకొని పాదు
కల నయోధ్య కరుగఁ గదలినాఁడఁ
దిరిగి తాపసేంద్ర! స్థిరపు డెందమ్మున
రాముఁడు నిలువఁగ నరణ్య మందు 11.

తే.గీ. పలుక విని ముని భరతు శుభవచనమ్ము
లట్లు శుభతర వాక్యము లిట్లనె ముని 12.

యిట్టి వృత్తము నీయందు నిట్టు లుండఁ
జిత్రమె జలము పల్లముఁ జేరుఁ గాదె

తే.గీ. దశరథుండు ధర్మజ్ఞుండు ధర్మ వత్స
లుండు నయిన నీ యట్టి పుత్రుఁ గనె నట్టి
భాగ్య మందంగఁ గడు దీర్ఘ బాహుఁ డమరుఁ
డిద్ధరాతల మందు నరేంద్ర వరుఁడు 13.

చం. ముని వరుఁ డట్లనంగ విని మూర్ధ కరస్థుఁడు నంజలించి తా
ననుమతి నంటి పాదముల నారసి చేసి ప్రదక్షిణమ్ములన్
వినయముతో నయోధ్య కయి పేగమ మంత్రుల నెల్లఁ గూడుచుం
జన దొడఁగెన్ నరేంద్ర వర సన్నుత సూనుఁడు కూడి యెల్లరన్ 14.

తే.గీ. మరలి పెడలఁ జాగెను వడి భరతుని రఘు
వీరు విస్తీర్ణ సైన్యము పెన్ను నంటి
బళ్ల నరదమ్ములను మద వారణమ్మ
ల హయముల నెక్కి పన్నుగ రాజసమున 15.

ఆ.పె. అంత వారు దాఁటి యమునా నదిని నూర్మి
మాలినిఁ దగ గంగ మేలి నీటి
నలరు దాని నప్పు డందఱు గాంచిరి
సంత సాంతరంగ సంయుతు లయి 16.

తే.గీ. దాఁటి రమ్యోద కాపగఁ బాటవమున
బంధు జన సంయుతము మహాబల యుతమ్ము
శృంగిబేర పురముఁ బ్రవేశించి రమ్య
నగరిఁ గాంచి రయోధ్యను నగర వరము 17.

కం. విగత పితృ భ్రాతృ యుగ్మము
నగరమ్మును గాంచి రాజ నందన భరతుం
డు గడు విచార మనముతో
జగపతి సారథినిఁ గని వచనము లనె నిటుల్ 18.

కం. లయపు టయోధ్యం గనుమా
ప్రియసారథి! నగరము నట విర హానందం
బయి భృశముగ నిశ్శబ్దం
బయి వికృ తాకార మంది పరఁగెడు దానిన్ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట బదుమూడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 114.

భరతుఁ డయోధ్యా పురముఁ జేరి తండ్రి యన్నయు లేని యా పురము కళావిహీనమై యెట్లున్నదో చూడమని సుమంత్రునితో దుఃఖమున వర్ణించి చెప్పుట.

కం. పయనించి సాంద్ర నిస్వన
చయ రథమునఁ దద్విభుండు సత్వర మంతన్
సుయశస్వి భరతుఁడు పురం
బయోధ్యఁ జేరెను దశరథుఁ డగపడని పురిన్ 1.

ఉ. పిల్లులు గ్రుడ్లగూబలును బిట్టు చరించెడి దాని నింక నే
యెల్లెడ నేనుఁగుల్ మగలు నెవ్విధి నిల్వని యట్టి దానినిం
బెల్లగు చీకటిన్ మునిఁగి వేఁగుచు మిక్కిలి యున్న దానినిన్
నల్లని రేయి మైనమున నల్గడ వెల్గులు లేని దానినిన్ 2.

తే.గీ. తనదు కాంతుల వెల్గెడు తార రోహి
ణీ సతియె రాహు విద్వేషి నిజ సతీ మ
తల్లి క్రూర గ్రహము పట్ట ధవునిఁ గుములు
చుండ నట్టి తారను బోలుచున్న దాని 3.

తే.గీ. గోరు వెచ్చని యల్లాడు నీరు పాఱఁ 4.

గాఁక వేఁగెడు నా విహగముల తోడఁ
గ్రుంగిన మొసలి చేపల గోడు తోడఁ
గొండ నది భంగి మిక్కిలి క్రుంగు దాని

చం. మును పొగ లేక బంగరపుఁ బోడిమి కాంతుల వెల్గు చుండియున్
మునుఁగఁగ సేతి నాఋ క్రతు ముఖ్యపు టగ్ని విధంపు దానినిం
జనిగిన వర్మ సన్నిభము చీలిన టెక్కెములన్ హయేభ రా
శి నిహత వీర సంఘ రణ శేష చమూ సదృశంపు దానినిన్ 5.

తే.గీ. నురుఁగుల రవమ్ములం గూడి కరము పైకి
లేచి యుప్పొంగి జలనిధి వీచు లంత
వీచి నట్టి మారుతమున వెన్క కరిగి
సమయ నట్టి యలల భంగిఁ జనెడు దాని 6.

తే.గీ. యాగ సాధనము లరుగ యాజకులు బు
ధులు సురా పానము ముగియఁ దూర్ణ మేఁగ
వీడి జన్నము నెల్లరు వీత వేద
ఘోషల క్రతు వేదినిఁ బోలు ఘోర పురిని 7.

ఆ.వె. ఆలమంద నడుమ నలమటించు వృషభ
రాడ్విసర్జిత బహుళ యట సుంత
యేని పచ్చ కసువు నానక తమి నున్న
దాని పగిది నున్న దానిఁ బురిని 8.

ఆ.వె. నున్నకాంతు లూని మిన్నగ జ్వలియించు
మంచి జాతి పైన యంచితంపుఁ
బగడములు మొదలగు పరమ మణులు లేని
ముత్యముల సరమును బోలు దాని 9.

ఆ.వె. వడి చలించి కాంతిఁ బాసి తన దగు స్థా
నమ్ము నుండి తత్క్షణమ్ము స్వీయ
పుణ్య లయపుఁ గతన భూమిపైఁ బడు నట్టి
తార వలె కనఁబడు దానిఁ బురిని 10.

తే.గీ. విరులతో నిండి ఘన మత్త భృంగ నాద
విలసితమ్ము వసంతర్తువు లయ మైనఁ
గారు చిచ్చు రగల మండి క్లాంత మైన
వన లతా నిభముగ నున్న పట్టణమ్ము 11.

తే.గీ. చేష్ట లుడిగిన వర్తక శ్రేణి తోడ
మూసి యుంచిన యంగళ్లఁ బోలె నుండు
దాఁప నంబుదములు శశి తారలను వె
లుంగ నేరని నభముఁ బోలు నగరమును 12.

ఆ.వె. తఱిఁగి నట్టి మదిర విఱిగిన పాత్రల
తోడఁ గూడి మిగుల తూలి నట్టి
లొట్టిముచ్చు లున్న యట్టె యూడ్వక యున్న
పానశాలఁ బోలు పట్టణమ్ము 13.

ఆ.వె. పగిలి నట్టి నేల పగిలిన కుండ లె
ల్లెడల చెదరి యుండ నెల్ల నీర
మచ్చట నుపయుక్త మై కూలిన చలిపం
దిరినిఁ బోలు చున్న పుర వరమ్ము 14.

ఉ. బల్లిదుఁ డెక్కుపెట్టి యరి బద్ధపు వింటిని బాణ మేయఁగాఁ
బెల్లున నారి యంతఁ దెగి పృథ్వినిఁ గూలిన యల్లెఁ బోలెడిం
దల్లడ మందు పట్టణముఁ దద్ద పరాక్రము గుట్టి మాజిలోఁ
గల్లరి శత్రుచేఁ బుడమిఁ గ్రాలిన దానినిఁ బోలు వీటినిన్ 15.

ఉ. ఎండిన నీటి తో ననిమిషేంద్ర గణమ్ములు కూర్మ రాసులున్
మెండుగ సంచరింపఁగ నమేయ తటమ్ములు కాగ భగ్నముల్
పండిన పత్ర జాలముల వాడిన యుత్పల పద్మ షండముల్
దండఁ చెలంగఁ గన్పడెడుఁ దమ్ముల యింటి విధంపు వీటినిన్ 16.

ఆ.వె. అంగ లేపనమ్ము లాదరింపక నప్ర
హృష్ట జనము లుండ కష్టమునఁ ద 17.

పించుచు నగ లూన కించు కేనియుఁ గఱ్ఱి
వోని నరుల తోడ నాను పురిని

ఆ.వె. దట్ట మైన వాన తరుణ మందుఁ గదిసి
యభ్ర మండలమ్ము నభ్ర రాశిఁ
జిక్కి మిక్కుటముగఁ దక్కిన రవి కాంతిఁ
బోలు చుండు నట్టి పురవరమ్ము 18.

తే.గీ. చేరి భరతుండు స్యందన శ్రేష్ఠ మంద
నిలిచి దశరథ పుత్రుండు సెగడ సెడఁదఁ
గడు విచారమ్ము రథమును నడపుచున్న
సారథినిఁ గాంచి పల్కె వచనము లిట్లు 19.

చం. వినఁబడ వేల వాద్యములు పెల్లుగ గీతము లెందు నిప్పురిన్
మునుపటి భంగి మూర్ఛిలఁగ మూరవు మద్యపు మత్త గంధముల్
కనఁబడ పెట్టి ధూపములు కమ్మని మాలల వాస నాదు లి
ష్టు నగర మందు నే యగరు పూరిత వాయువు వీవ దెచ్చటన్ 20.

ఉ. యాన వ రోగ్ర రావములు స్యందన నిస్వనముల్ హయధ్వనుల్
గానము మత్త కుంజర నికాయ రవమ్ములు రాముఁ డేఁగఁగా
నీ నగరమ్ము నందు నరు లిప్పుడు పూయరు చంద నాగరుల్
మేన ధరింప నొల్ల రిట మేలగు మాలల నూతనమ్ములన్ 21.

చం. అరుగరు బాహ్య యాత్రలకు నందపు మాలల నూను పౌరులే
పరఁగవు రామ శోకమునఁ బండుగ లెట్టివి పట్టణమ్మునన్
గురుతర కాంతి నీ పురము కోల్పడె యేఁగఁగ భ్రాత కానకుం
గురియగ వాన మిక్కుటము కూలిన వెన్నెల రాత్రి చందమై 22.

తే.గీ. ఎన్నఁ డరుదెంచు నుత్సవ మన్న విధము
నాదు భ్రాత యయోధ్య కానంద మెప్పు
డు కలుగుఁ బుర వరమున కుష్ణకము నందు
వచ్చు ఘన నీల మేఘమ్ము పగిది నరయ 23.

కం. తరుణులు నుత్తమ వేషులు
నరవరు లున్నత గమనులు నగ సమ ధీరుల్
వర రాజ వీథు లందు న
లరిన వెలుఁగ దెట్టి గాంతులను బుర మరయన్ 24.

ఆ.వె. సింహ హీనపు గుహ చెలువంపు రాజ హీ
న గృహ రాజ మందు నరవరేణ్యుఁ
డు భరతుం డిటులు కడు విచారమున ననే
క విధముల వచించి కాలి నుంచె 25.

కం. సురలు విడిచి నట్టి ప్రభా
కరుండు లేని దినము వలెఁ గాంతిరహితమున్
వర రా జాంతఃపురమును
నరసి వివిక్తమును భరతుఁ డశ్రులు రాల్చెన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట బదునాల్గవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 115.

అయోధ్యను జేరి భరతుఁడు మాతల నచట నిలిపి వసిష్ఠాది గురువులతోఁ దాను నందిగ్రామమున వసింతు నన వా రంగీకరింప శత్రుఘ్నునితో మంత్రి వర్గ సైన్య సమేత మేఁగి యచట రామ పాదుకలను రాజలాంఛనములతో సింహాసనమున నుంచి పాలనా కార్యములను వానికి నివేదించుచుఁ బరిపాలించుట.

కం. మాతల నయోధ్యను నిలిపి
యాతత సువ్రతుఁడు భరతుఁ డారసి గురులన్
నీతి సమేత వచనములు
నా తఱి వచియించె నిట్లు నందఱి తోడన్ 1.

తే.గీ. ఎల్ల రిప్డు నందిగ్రామ మెంచి యేఁగ
నాకు నానతిం డిఁక రఘు నందనుండు
లేని దుఃఖ మట వసించి నేను సైప
నేర్తు నార్యు లార యణఁగు నార్తి కొంత 2.

తే.గీ. ఏఁగె నక్కట దివికి నరేంద్రుఁ డార్తి
నడవి నాశ్రయించెను ఘనుఁ డన్న యిప్పు
డెదురు చూచెద నన్నకై యింక నేను
రా జగును నిక్క మెంచఁగ రాముఁ డవని 3.

చం. పలికిన నట్టు లబ్బరతు వాక్యము లెల్లరు నాలకించి మం
త్రులు గురు వా వసిష్ఠుఁడును దోరపు మన్నన కర్మముల్ దగం
బలికిరి యంత నెల్లరును బన్నుగ నిట్లన నీక శక్యమౌ
నిలుపఁగఁ బ్రేమ నన్న పయి నిత్యము రాఘువ! బంధు వత్సలా! 4.

ఉ. ఎవ్వరు గౌరవింపరు నరేశ్వర! ధర్మపు టిట్టి మాటలన్
దవ్వుల నున్న నన్న నెదఁ దల్చుచు నెన్నుచు నార్య మార్గమే
యివ్విధి నీవు వర్తిలఁగ నింపుగ నంచును వారు పల్కఁగా
నవ్వుచుఁ బిల్చి సారథిని నా రథమున్ వడిఁ బోయి తెమ్మనెన్ 5.

తే.గీ. హృష్ట వదనుఁడై భరతుండు ప్రీతి మాత
ల కిడి వందనముల నెల్లరకు నరదము
నెక్కి శత్రుఘ్ను తోడుత మిక్కిలి తమి
మంత్రులు పురోహితులు రాఁగ మరలి చాగె 6.

చం. అరిగిరి తూర్పు దిక్కునకు నందఱు నంత వసిష్ఠు తోడుతం
బురవర మైన నంది యను పుణ్యపు గ్రామము వెల్గు చోటికిం
దరలెను స్వీయ సైన్యము రథమ్ములు వాజులు నేన్గు లుండఁగా
భరతుఁడు సాగఁ గోరకయె పట్టణ వాసులు సర్వు లవ్విధిన్ 7.

తే.గీ. తలపయి నిడి పాదుకలను ధర్మరతుఁడు
భాతృ వత్సలుఁ డా తేరు పైన నుండి 8.

తూర్ణముగ నరుగుచు భరతుండు చేరి
పురము నసె నిట్లు దిగి తేరు గురువులఁ గని

చం. కుదువగ నిచ్చె రాజ్యము రఘుప్రవరుండు వనమ్ము నందు నా
కుఁ దనరి పాదుకా యుతము కోరఁగఁ బౌరుల భద్ర యోగముల్
వదలక కాంచుఁ బాదుకలె భర్మ మయమ్ములు పల్కి యివ్విధిం
దదుచిత పాదుకల్ తలను దాల్చి వచించె నిటుల్ జనాలితో 9.

తే.గీ. నిలుచు ధర్మము సుస్థిర మిలఁ గొలువఁగ
నన్న చెప్పుల నిచ్చట మిన్నగ నిడి
రాజ్య మందు నీ రాజ ఛత్రమ్ము పట్టుఁ
డింక రామ పాదుకలకు శంక వీడి 10.

చం. ఉనిచె మహానురాగమున నుత్తముఁ డీ రఘు నందనుండు దీ
నినిఁ దిలకింప నా పయిన నెమ్మి వహించి ధరింతు భార మే
ననఘుఁడు వచ్చు నంత వఱ కార్యుని రాకకు వేచు చుండి యి
త్తును గని నంత రాజ్యమును దూర్ణము భద్రముగా సపాదుకల్ 11.

తే.గీ. రామ నిక్షిప్త భారము రామ చరణ
పద్మముల పయి నుంతును వనము నుండి
తిరిగి రాఁగ నింపుగఁ గూడి గురువు సేవ
లందుఁ దరియింతునిత్యము డెంద మలర 12.

ఆ.వె. విగత కల్మషుండ నగుదును నా వద్ద
నుంచి నట్టి యీ మహాంచితములు
బాదుకల నొసంగి నీ దుర్భరంపు రా
జ్యమ్ము తోడ నింక నెమ్మి నుందు 13.

ఆ.వె. అడరుచు నభిషిక్తుఁ డైనఁ గాకుత్స్థుఁడు
రాజ్య మందు నెల్లఁ బ్రజలు సంత
సింత్రు ప్రీతి యశము సేరు నాలుగు రెట్లు
నన్ను రాజ్యపాలనమ్ము కన్న 14.

మ. స్థిర చిత్తుండు సుదీనుఁ డవ్విధము నందిగ్రామ మందుండి రా
జ్య రమా పాలన మార్తి సెందుచు నమాత్యాచార సంఘంబుతో
గురు భక్తిం దనరించె వల్కల జటా గుచ్ఛప్రకాశమ్ముతో
వర భట్టారక సన్నిభమ్ముగను దుర్వారోగ్ర సైన్యమ్ముతో 15.

తే.గీ. పట్టముం గట్టి భరతుండు పావుకోళ్ల
కపుడు భ్రాతృ వత్సలుఁడు జక్కఁగ గ్రహించి
యన్న చెప్పిన మాటను గ్రన్ననఁ దన
ప్రతిన నిలుపంగఁ గాంక్షించి భ్రాత రాక 16.

ఆ.వె. ఆతపత్ర మింక నా చామరము నూని
స్వయముగ భరతుండు శాసనముల
నెల్లఁ బాదుకలకు నెలమి నివేదించు
చు సతతమ్ము నుండెఁ జోద్యముగను 17.

కం. అభిషేకించి వినయ మూ
ని భరతుఁ డా పాదుకలను నెమ్మిఁ ద దాజ్ఞౌ
ఘ భరిత చిత్తత రవి స
న్నిభ తేజుఁడు పాలనమ్ము నెగడఁగఁ జేసెన్ 18.

ఆ.వె. చిన్నకార్య మైనఁ జేరఁగ గొప్పవౌ
కానుకలును బాదుకలకు మున్ను
తగ నివేదనమ్ము తాను జేసి పిదప
తగిన రీతిఁ జేయుఁ దథ్యముగను 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట బదునేనవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 116.

తపోవనములో నున్న రాముఁడు భయ సంభ్రమములతో నున్న మునులను వీక్షించి కారణ మడుగ నొక వృద్ధ ముని తమను ఖరుఁ డను రాక్షసుని యనుచరులు బాధించు చుండఁగఁ దాళ లేక పోవుచున్నా మని పోవ ననుమతి యడుగ వారికి ననుమతి నొసఁగి తాను తన పర్ణశాల యందుఁ కొంద ఱార్ష చరితు లగు మునులు తనతో నుండ నిలుచుట.

కం. అరుగ భరతుఁ డా విధముగ
ను రాముఁడు తపోవనిని ఘనుఁడు వీక్షించెం
గర ముత్కంఠ బెగడువడు
వర ముని సంఘమును బద్మ పత్రాక్షుఁ డటన్ 1.

ఆ.వె. ఎవరు మున్ను దలఁచి యింపుగ రా మాశ్ర
యమ్ము నుండ నెంచి రద్రి చిత్ర
కూట మందు నెలమి ఘోరమ్ముగా నుత్సు
కు లయి రిపుడు వీడఁ గలఁత వారు 2.

చం. మును లట కన్ను లింకఁ గను బొమ్మల శంక వహించి రామునిం
గని తమ లోనఁ దాము పలుకం గని రాముఁడు సందియమ్ముతో
మునిపతిఁ గాంచి మోడ్చి కరముల్ దగఁ బల్కె నయంపు వాక్యముల్
ఘన మగు వారి సంభ్రమము గాంచి మనమ్మునఁ జింత మూరఁగా 3.

ఆ.వె. కంటిరే మహాత్మ! యుంట నావృత్తము
నందు మార్పు కొంచె మైన వికృత
మేని మునులు గాంచి దేనిఁ గలవరమ్ము
నందు చుంటి రిట్టు లంద ఱిచట 4.

తే.గీ. ఋషులు గాంచిరే యించుక యేని నా య
నుజుఁడు లక్ష్మణు నందు  ననుచిత మతని
కిం దగని యట్టి దెట్టిది యెందు నైన
నప్రమత్తమునఁ బలుకుఁ డార్య! దయను 5.

తే.గీ. నాదు సేవ లగ్నం బయిన నెద తోడ
జానకీ సతి మీకు నర్చనల నొసఁగు 6.

సమయ మందు నెప్పు డయినఁ జామలకుఁ ద
గని దయిన భంగి నడవదు గద మునీంద్ర!

ఉ. వృద్ధుఁడు రెంటినిం దపపుఁ బేర్మి వయస్సునఁ గంపితుండునై
యద్ధరణీ సురుం డనె మహాత్ముని రాముని తోడ నింపుగా
నిద్ధర నున్న భూతముల నెల్ల దయం గను వాని ధర్మ సం
బద్ధుని తోడ నివ్విధము పన్నుగ వాక్య విదుండు పల్కులన్ 7.

తే.గీ. సీత కల్యాణి కల్యాణ చేష్టలం ద
భిరుచి మిన్నయయిన నారి వికృత మెట్టు
లుండు మునుల నిమిత్తము నువిద యందు
నింత యేని రఘూత్తమ యెంచఁ దండ్రి! 8.

తే.గీ. రక్కసుల వలని భయము రామ! నీదు
కతనఁ దాపసులు దలఁచి కథలను దమ
లోనఁ దా మెల్ల రడరి పలుకుచు నున్న
వార లచ్చట యాత్రమ్ము వడసి యెదల 9.

ఉ. దీనులఁ దాప సోత్తముల దిట్టతనమ్మునఁ గ్రూరుఁడై జన
స్థాన నివాసులన్ ద్విజుల సర్వుల రావణ సోదరుండు నౌ
దానవ దుష్టుఁడౌ ఖరుఁడు ధ్వంసము సేయుచు నుండె నిత్యమున్
మానవ భోజనుం డఘుఁడు మానఁడు హింస నిడంగ నీకునున్ 10.

ఆ.వె. ఈవు రామ! వచ్చి యీ యాశ్రమము నందు
నున్న నాఁటి నుండి యుత్సహించి
రక్కసు లమితముగ నిక్కట్టు లొసఁగు చుం
డిరి తపస్వులకు బెడిదముగ నిట 11.

తే.గీ. క్రూరు లతి భీష ణాకృతిఁ గూర్ప భయము
వివిధ రూపముల విరూప వికృత దర్శ
నములఁ గనిపింతురు దనుజ నాథు లిచట
ఘోరముగను రఘువరేణ్యా! కుటిల రీతి 12.

ఆ.వె. చెడ్డవి మలినములఁ జేర్తు రాశ్రమముల
దనుజు లెల్లఁ దనరి తాపసులను
గొంద అంత వచ్చి ఘోరముగాఁ జంపు
దురు నిలఁబడి యెదుటఁ దూర్ణముగను 13.

తే.గీ. అచ్చ టచ్చట దాఁగుచు నగపడకయె
యాశ్రమము లందు దానవు లశ్రమమునఁ
దాపసేంద్రుల సమయించి దారుణముగ
నల్ప చేతస్సు లానంద మందు చుంద్రు 14.

తే.గీ. జన్నపు గరిఁటెల నితర గిన్నెల వడి
విసరి పైతురు పేలిమి వెలయు చుండ
నిప్పుపైఁ గుమ్మరింతురు నీరు కినిసి
కుండలను గాంచి నంతనె చెండు చుంద్రు 15.

చం. విడువక యా దురాత్ము లిటఁ బెట్టఁగ బాధలు మిక్కుటమ్ముగం
గడు భయ మంది తాపసులు గ్రక్కున శాలల వీడఁ గోరి వీ
రెడఁదల నన్య దేశమున కేఁగఁగ వేగిర పెట్టు చుండి రి
య్యెడ నను దల్లడిల్లుచు నహీన పరాక్రమ రాజసత్తమా! 16.

ఆ.వె. మిన్నగ మము వీరు మున్నొడళుల బాధ
పెట్టు చుండి రకట బెట్టిదముగ
దుష్ట రాక్షసు లిటఁ దూర్ణము త్యజియింతు
మాశ్రమమును భద్ర మరసి రామ! 17.

కం. విరివిగ ఫల మూలమ్ములు
దొరకెడు రమ్యాటవి యవిదూరము నందుం
బరఁగును బురాత నాశ్రమ
వర మొక్కటి యుందు మందు భయ రహితముగన్ 18.

ఆ.వె. ఖరుఁ డనుచిత రీతిఁ గాకుత్స్థ! నీ యందు
వర్తిలఁ గలవాఁడు పరమ పురుష!
యిష్ట పడుదు వేని యెలమి మా తోడుత 19.

నేఁగు మిచట నిలువ నేల నీకు

కం. అతి సామర్థ్యము కలిగిన
సతి తోడ వసింప రామ! సందేహ మగున్
సతతము దుఃఖమ్ము లకుం
గతం బగును వాస మిచటఁ గాకుత్స్థ వరా! 20.

తే.గీ. వెడల నుత్సాహవంతుని నుడువు లట్లు
పల్కి నట్టి వానిఁ దపో విభాసితుఁ గని
యుత్తరం బీయ మాటల నుర్విప తన
యుండు రాముఁ డాపఁగ నేర కుండె నపుడు 21.

ఆ.వె. నతు లొసంగియు ననుమతి గొని యూరార్చి
రాఘ వోత్తమునిఁ బరమ ముని విడి
యాశ్రమమును గూడి యాత్మ జనుల నెల్ల
వెడలె నా కులపతి వేగముగను 22.

తే.గీ. చని వెనుక కొంత దూరము మునులఁ జాగ
నంపి కులపతి కిడి నతు లంత వారి
భావము గ్రహించి బాగుగఁ బర్ణశాల
కరిగె వసియింపఁగా నెంచి యవ్విభుండు 23.

కం. ముని హీనమైన యాశ్రమ
మును వీడఁ డొక క్షణమయిన పుడమిపు డెపుడున్
ఘను లార్ష చరితులు విడువ
రు నరేంద్రునిఁ గొందఱు మునులు ధృత గుణాఢ్యుల్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పదునాఱవ సర్గము.

## అయోధ్యా కాండము

# సర్గము 117.

మును లట్లేఁగిన పిదప రాముఁడు పెక్కు కారణముల నూహించి యచట వాసము చేయుట కిష్ట
పడక బయలుదేరి యత్రి మహర్షి యాశ్రమమును జేరుట, యత్రి మహర్షి వారి కాతిథ్య మొసఁగి తన
భార్య యనసూయను బరిచయము చేసి సీత నామె వద్దకు పంప మన రాముఁడు పంపఁగా
ననసూయా దేవి సీతకు పతివ్రతా ధర్మముల నుపదేశించుట.

కం. మును లరిగినఁ జింతించుచు
మన మందున్ రాఘవుండు మనుజ వరేణ్యుం
డు నగ తటమ్మున నిలువం
గ నిష్ట పడకుండెఁ బెక్కు కారణములచేన్ 1.

చం. భరతుని నేను గాంచితిని భ్రాతను మాతల తోడ నిచ్చటం
బుర జన సంఘ సంయుతము మూరుచు నున్నవి జ్జప్తు లెల్ల భూ
వరు బల ముండ నిచ్చటను బాడయి యుండెఁ బ్రదేశ మెల్లనున్
విరివిగఁ గుంజ రాశ్వముల పెండలఁ గూడి తలంచి యివ్విధిన్ 2.

తే.గీ. పలికి రాముఁడు కావునఁ బయన మయ్యె
ద మితరపు దేశమున కని దార సీత
నింక భ్రాత లక్ష్మణుఁ గూడి యింపుగఁ జనఁ
జాగె రయమున వదలి యాశ్రమము నంత 3.

ఆ.వె. అత్రి యాశ్రమమ్ము నంతఁ గదిసి మహా
యశుఁడు రాముఁ డరసి యంజలించి
మునికి మ్రొక్క నత్రి మునిపుంగవుఁడు పుత్రు
భంగి నారసె భగవంతుఁ డతని 4.

చం. స్వయముగ సత్కరించెను సుసత్కృతు రాఘవ వంశ వర్ధనున్
దయితునిఁ గాంచి లక్ష్మణుని ధార్మికు జానకిఁ బుణ్యశీలనుం
బ్రియ వచనమ్ములం దగిన రీతినిఁ బల్కుచు గౌరవించె నం
త యమి గణాఢ్యుఁ డిద్దఱినిఁ దద్దయు వేడుక సంతరింపఁగన్ 5.

ఉ. ఆ ముని సర్వ భూత హితుఁ డయ్యనసూయను బిల్చి దారనున్
వామను వృద్ధ సత్కృతను బల్కెను ధర్మ విదుండు శ్రద్ధతో
నీమము లాచరించు సతినిం గని పుణ్య తపస్వినిం దగన్
భూమిజఁ జూపి యీమెఁ గొని పోవుమ లోనికి నంచుఁ బ్రీతినిన్ 6.

కం. తాపసిని ధర్మచారిణి
నా పడతిని స్వీయ దార నా నర వరుఁడౌ
భూప తనయ రామునకుం
దాపసుఁ డెఱిఁగించె నిట్లు తద్దయుఁ బ్రీతిన్ 7.

తే.గీ. కలుగఁ బుడమి ననావృష్టి కానకుండఁ
దెలిపి పది వత్సరమ్ములు కఠివు నణఁచె
మూల ఫలములు సృష్టించి పుణ్య గంగ
నునిచె ధర ననసూయ తగిన విధముగ 8.

తే.గీ. నియమముల నెల్లఁ బాటించి నెలఁత యుగ్ర
తపము నొనరించెఁ బదివేల దారు ణాబ్ద
ము లనిమిషులకై నాటంకములను బాపెఁ
బది నిశల నొక్క రాత్రిగఁ బరఁగఁ జేసి 9.

తే.గీ. అట్టి యనసూయ వ్రతముల నవభృధమ్ము
నాచరించిన యట్టి మహాత్మురాలు
నీకు మాతృ సమానము నీరజాక్ష!
రఘు కులాన్వయ పూర్ణచంద్ర! నర వృషభ! 10.

ఉ. జానకి నేఁగ నిమ్మిపుడు చక్కఁగ నీ యనసూయ వద్దకుం
దా నగు నర్హురాలు వసుధం గల ప్రాణుల మ్రొక్కు లందఁగ
న్మానును కోప మింపుగను నా ననసూయగ ఖ్యాతిఁ జెందె లో
కానఁ గడింది వృద్ధయు సుఖమ్ముగ పంపుమ రాఘవోత్తమా! 11.

కం. ఇట్లనిన యమ్ము నీంద్రున
కట్లె యని వచించి రాముఁ డతి ధర్మజ్ఞుం
డిట్లనియె సీత నారసి 12.

బోట్లకుఁ దగు వాక్యములను బురుషోత్తముఁడే

కం. వింటివి కద రాజాత్మజ!
వెంట నరుగుమ ముని యన్న విధి రయముగ వా
ల్గంటి! యనేక శ్రేయము
లంటు నిను దపస్విని కడ కరిగిన యంతన్ 13.

కం. తన హితముఁ గోరు నా రా
ముని మాటల నాలకించి భూమిజ యంతం
గని ముని పత్నిని ధర్మ
జ్ఞను జేసెఁ బ్రదక్షిణమ్ము చక్కఁగ భక్తిన్ 14.

చం. కని యనసూయ నా గృశను గంపిత నారి నరంటి భంగిఁ దె
ల్లని వగు వృద్ధ కేశములు రంజిలు వృద్ధను పే వళుల్ చెలం
గిన సుమహా పతివ్రతను గీర్తిత పుణ్య సతీ మతల్లినిం
దన యభిధానముం బలికి తజ్జన కాత్మజ మ్రొక్కె మెల్లగా 15.

తే.గీ. మ్రొక్కి తాపసి కనసూయ కక్కళంక
హీన కంజలి ఘటియించి హృష్ట చిత్త
త నడిగె ననామయమ్మును ధరణిజ ముని
పత్ని నింపుగ రఘురామ పత్ని యపుడు 16.

తే.గీ. అంత సీతమహాభాగ నరసి ధర్మ
చారిణిని నూఅడించుచు సమ్మదమున
సీత! భాగ్యవశమ్మునఁ బ్రీతి దర్మ
మాచ రించి తని మఱియు నా ముని సతి 17.

ఆ.వె. విత్త గర్వములను విడిచి బంధు జనుల
వీడి యనుసరించి విపిన బద్ధు
రాముని నిజ భర్తఁ బ్రమదమున నరుదెం
చితివి భాగ్యముననను సీత! నీవు 18.

కం. పురమున నున్న వసించిన 19.

నరణ్యమునఁ బాపి యయిన నంచితుఁ డైనం
గర మే స్త్రీలు తమ పతుల
నరయఁ గలరు ప్రీతి వారి కగు శుభ గతులే

కం. ధన హీనుఁ డైన దుష్టుఁ డ
యినఁ గాముకుఁ డైన భర్త యే దైవం బై
తనరు సతతమ్ము స్త్రీలకు
ఘన పూజ్య చరితల కెల్లఁ గమలదళాక్షీ! 20.

కం. కన నేను దగఁ బరీక్షిం
చిన వైదేహి! పతి కన్న శ్రేష్ఠుం డగు బం
ధుని యోగ్య మవ్యయం బై
న నిజ తపః ఫలము భంగి నలిన దళాక్షీ! 21.

తే.గీ. నింద్యపుం గామ చిత్తలు నిజపతులకు
నాథ లౌ చెడ్డ వారైన నారు లెల్ల
మంచి చెడుల నెన్నండును ఎంచ లేరు
యశము ధర్మముఁ బడయ లే రట్టి వారు 22.

తే.గీ. సుగుణ యుక్తలు మంచి చెడుగుల నేరు
వారు నీవంటి వారలు పన్నుగ నెటు
ల నొనరింత్రు నయపుఁ బనుల నటులనె చ
రింత్రు స్వర్గమున కరిగి యెలమి సీత! 23.

ఆ.వె. భర్తకు ననుకూలవతివై పతివ్రత
ల నియమమ్ము లెల్ల లలన యనుస
రించి యగుమ పతికి మంచి సతివి యశో
ధర్మములను బొందఁ దగుదు వనెను 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పదునేడవ సర్గము.

# అయోధ్యా కాండము

## సర్గము 118.

అనసూయా సతి యుపదేశము నంగీకరించుచు సీత యొసఁగిన ప్రత్యుత్తరమునకు సంతోషించి దివ్యమైన కానుక లొసఁగి రాముని వివాహ మాడిన విధ మెల్ల వినఁ గోరిన వివరముగా నా కథను జానకీ దేవి వివరించుట.

కం. అనసూయ సీత సతి యా
యనసూయా దేవి పల్కు నవ్విధ మంతన్
విని పూజించి పలుకఁ దొడఁ
గెను మందమ్ముగ నుచితపు గిర లిబ్బంగిన్ 1.

తే.గీ. పూజ్యురాలివి యిట్టి సముచిత వచన
ము లన నీ వబ్బురం బేల కలుగు దేవి!
యెఱుఁగుదును నేను నబలల కెల్లఁ బూజ్యుఁ
డగును నిజ భర్త సంతత మంచు భృశము 2.

ఉ. నా పతి హీన వృత్తుఁ డయినన్ ధర మిక్కిలి సంతతమ్మునుం
బ్రాపున నాదు సేవలకుఁ బాత్రుఁ డనంగను వీత శంకతో
నీ పురుషోత్తముండు విజితేంద్రియుఁ డిద్ధ గుణుండు సద్దయా
భూప సుతుండు ధర్మరతి పూజ్య తముం డనఁ జెప్ప నేలనో 3.

ఆ.వె. సుస్థి రానురాగ శోభితుండు ప్రియుండు
తల్లి వోలె నింకఁ దండ్రి వోలె
రఘుకు లాన్వయుండు రాముండు నిశ్శంక
నాకు గౌరవింతు వీఁక నేను 4.

మ. ప్రసరించున్ నిజభక్తి రాట్సతులఁ దుల్య లంచుఁ గౌసల్య కీ
యసమానుండు మహాబలుండు రఘు వంశానంద సంవర్ధనుం
డు సతీ రత్నము నొక్కతిం దమిని రాట్పూజ్యుండు వీక్షించినన్
వెస నా పంక్తిరథుండు తల్లివలెఁ దా వీక్షించు నిర్గర్వియై 5.

ఆ.వె. విజనము భయద మడవికి నరిగెడు వేళ
యత్త నా కొసఁగిన యట్టి సదుప
దేశ మింకను మది స్థిరముగ నిల్చి యు
న్నయది నాకు దేవి లయము గాక 6.

ఆ.వె. పెండ్లి నాఁడు తల్లి ప్రేమ తోడుత నగ్ని
సన్నిధిఁ బలికిన వచనము లింక
నాదు డెంద మందు నష్టము కాక సు
స్థిరముగ నిలిచినవి దేవి! నిజము 7.

తే.గీ. అవి యిపుడు తిర్గి క్రొత్తవియై చెలంగు
చున్న విట నీదు మాటల మిన్నగాను
భర్త సేవకు మించిన పడతి కెంచఁ
దపము లేదన్న మెట్టిది ధాత్రి లోన 8.

తే.గీ. పతిని సేవించి సావిత్రి పన్నుగ ధర
గౌరవింపఁ బడెఁ దగ స్వర్గమ్ము నందు
నవ్విధము నూని సేవించి యాత్మనాథు
దేవి! వడయు దీవు దివినిఁ దెల్లముగను 9.

ఆ.వె. నారు లందు మిన్న నాక దేవత రోహి
ణీ సతీ మతల్లి నిజ పతి శశి
వీడి నిమిష మైన వీక్షింపఁ బడునె సె
న్నండు నైన నింగి నరుల చేత 10.

కం. ఈవిధి వరాంగనలు పతి
సేవించి పతివ్రత లతి శీలవతు లటం
బావన నిజ కృత కృత్యము
లే పెలయ పెలుఁగుదురు దివిసే సన్నుతులన్ 11.

కం. విని యా సీత పలుకులను
ముని పత్ని ముదమ్ము నంది మూర్కొని శిరమున్ 12.

జన కాత్మజఁ గాంచి ముద
మ్ము నీయ వచియించె నిట్లు మునుకుల నంతన్

చం. నియమము లాచరింపఁగ ననేకము లింపుగఁ బొంది నట్టి పె
న్నియు కల విప్లు నా కడను నిక్కపు దివ్య తపోబలమ్ముతోఁ,
బ్రియముగ నిత్తు నీకు నిటఁ బ్రీతి వహింపఁగ నీ పెడంద సే
నయితిని నీదు పల్కుల ముదాత్మను గోరుమ యెద్ది యేనియున్ 13.

తే.గీ. విని తపశ్శాలిని గిరలు విశ్మయమ్ము
నంది యంతరంగమ్మున నంత సీత
యిచ్చితివి కాదె దేవి! యిట్లింపుగ ననె
నవ్వు ముఖ మూని మెల్లగ నలిన నేత్ర 14.

చం. పలుకఁగ సీత యవ్విధము వాక్యము లింపుగ నాలకించి యా
లలితపు ధర్మ వేత్త నికరమ్ముగ హర్షము నూని డెంద మం
దు లలనఁ గాంచి సంతసము తోరము వొందితి నీదు పల్కులన్
ఫల యుత మే నొనర్తు నిట వానిని నంచు వచించి యిట్లనెన్ 15.

ఉ. ఏణ నిభాక్షి! గైకొనుమ యింపగు మాలను వస్త్ర భూషణ
శ్రేణులు గాత్ర తైలములు లేపన ముఖ్యము లీ మహార్ఘముల్
త్రాణము లంగ సంతతికిఁ దద్దయు వీ లగు వాడ వెప్దు క
ల్యాణి! యొసంగ నే నిచట నంద మొసంగును నీదు మేనికిన్ 16.

తే.గీ. అలఁద వైదేహి! దివ్యపు టంగరాగ
మీవు నీ భర్త కతి శోభ నిత్తు వెప్పు
డవ్యయుం డగు విష్ణున కాది లక్ష్మి
సంతత మొసంగు భంగినిఁ జారునేత్ర! 17.

తే.గీ. అంత మైథిలి వస్త్రము నంగరాగ
ముల స్రజమ్ముల భూషణములను దత్త
ములను శ్రేష్ఠముల గ్రహించెఁ బుణ్యశీల
ప్రీతి మునిపత్ని యానతి పేర్మి నూని 18.

కం. కొని ప్రీతి సీత దానము
ల నా యశస్విని ఘటించి రమ్యాంజలినిన్
వినయమునఁ గూర్చొనెఁ దప
స్విని యనసూయా వరసతి చెంత ముదమునన్ 19.

కం. ఆసీన యైన జానకి
నా సతి సుదృఢవ్రత తగ నారసి దొడఁగెన్
బాసలు వలుకంగ వినుట
కోసము ప్రియ కథల నెల్లఁ గూర్మి సెలంగన్ 20.

చం. అవనిజ నీ స్వయంవరము నందు యశస్వి రఘూత్తమున్ శ్రుతం
బవు నిటఁ గాంచి నట్టుల మహాత్ముని పేడుక యయ్యె నాకిటన్
వివరముగా నెఱుంగ నది విస్తృత రీతిని మైథిలీసతీ!
చెవులకు నింపు గూర్పగను జెప్పుమ నీ యనుభూతు లన్నిటిన్ 21.

కం. అడుగంగ ధర్మ చారిణి
కడు నాసక్తి నిటులఁ బలుకఁ దొడఁగె నంతం
బుడమి తనయ వచియింతు వి
నుఁ డంచు నా గాథ నెల్ల నోరార నిటుల్ 22.

ఆ.వె. మిథిలకు నధినేత మేటి వీరుఁడు జన
కాఖ్యుఁ డభిరతుండు క్షాత్ర ధర్మ
మందు ధర్మ విదుఁడు న్యాయముగఁ బరిపా
లించుఁ బుడమి నెల్ల నెలమి తోడ 23.

ఆ.వె. లాంగలమ్ము కర తలమ్ము నందుంచి పు
డమిని దున్ను చుండఁ దమిని నృపతి
ధరను జీల్చి నేను దనయగ రాజున
కుద్భవించితి వెఱఁ గొంద జనులు 24.

తే.గీ. పుడమిఁ గాంచి యబ్బుర మందె భూధవుండు
నన్ను నవ్విధిఁ దా విత్తనమ్ములు వెద
చల్లుచుండఁగ నంగంబు లెల్ల ధూళి 25.

తోడ నిండఁగఁ గన్పట్టఁ దోరముగను

ఉ. పిల్లలు లేని పైనమున విట్పతి యంకము నందుఁ జేర్చి తా
మెల్లగ నీమె నా తనయ మేదినిఁ గాంచితి నంచు పల్కుచుం
జల్లని ప్రేమ నా పయినిఁ జక్కఁగ జూపె నభమ్ము పల్కె ని
ట్లెల్లరు గాంచ నీకు సుత యిమ్మను జేతర ధర్మ రీతినిన్ 26.

చం. నరపతి యంతరిక్ష వచనమ్ముల నింపుగ నాలకించి సం
బరమున నన్ను గైకొనియె మాతకు నిచ్చెను బ్రీతిఁ బెంపఁగా
వర మహిషీ మతల్లికి నపార రతిన్ నను బెంపఁ దల్లియై
కరము ముదమ్ము నంది నృప కాంతయు నవ్విధి వృద్ధి నెందితిన్ 27.

ఆ.వె. పెండ్లి యీడు రాఁగ పృథ్వీశ్వరుఁడు గాంచి
నన్ను జింత మునిఁగె నన్ను గన్న
తండ్రి విత్త లయ మధనునకు నేర్పడి
నట్టి విధము భృశము పట్టి కొఱకు 28.

ఆ.వె. శక్ర నిభుని నైన సదృశులు నల్పులు
కూడ జులుకఁదనము తోడఁ జూతు
రవనిఁ గన్య తండ్రి నందఱు నిత్యము
వొందు నతఁ డవమతి నెందు నైన 29.

ఆ.వె. అట్టి ధర్షణమ్ము నందుట కెంతొ దూ
రమ్ము లే దనుచు నర వరుఁ డెఱిఁగి
యెడఁద భృశముగఁ దపియించె దుఃఖాబ్ధి పా
రమ్ము నప్లవుని సరణిఁ గనండు 30.

చం. సము ననుకూలుఁ డైన పతి క్ష్మాజను నాకు లభింపఁ జేయ నెం
చి మనుజ నాథుఁ డాత్మఁ దగ చింతనఁ జేసి యెఱుంగ కుండె న
ట్టి మగని సంతతమ్మును బటిష్ఠముగా నెదఁ దల్చె నంతటన్
సముదము నే స్వయంవరము సల్పుదుఁ బుత్రిక కంచు ధీరతన్ 31.

ఉ. మున్ను మహాధ్వరమ్మునను భూపతి కా వరుణుం డొసంగెఁ నా 32.

సన్నుఁడునై ధనుర్మణి నిషంగము లక్షయ సాయకమ్ములున్
మన్నన తోడ భారమున మర్త్యుల కెత్త నశక్యమే ధను
స్సెన్నఁగ స్వప్నమం దయిన నిద్దర సేరికి వంగఁ దీయఁగన్

ఉ. వింటిని నంది భూవరుఁడు పేరిమి పిల్చి నరేంద్ర కోటినిన్
మింటిని నంట సంతసము మేలుగ నిట్లనె సత్యవాదియే
కంటిరె వింటి నిచ్చటను గ్రన్నన నెవ్వఁడు దీని నెత్తి యీ
వింటికి నారిఁ గూర్చు నిట వీరత వానికి  నిత్తుఁ బుత్రికన్ 33.

తే.గీ. బరువు నందు కొండకు సరి నరసి చాప
రాజమును బన్నుగ నచట రాజ సుతులు
ధనువు నెత్తఁగ లేక యత్నమ్ము సేసి
వెనుదిరిగిరి నమస్కరించి నర వరులు 34.

మ. చిర కాలమ్మున కేఁగుదెంచెను రఘుశ్రేష్ఠుండు తేజస్సుతో
వర వీరుం డిట కధ్వరమ్ముఁ గన విశ్వామిత్ర మౌనీంద్రుతోఁ
బర మాసక్తిని సత్యవిక్రముఁడు సంభావ్యుండు సౌమిత్రితోఁ
గర మిష్టుం డగు భ్రాత తోడ ఘనుఁడౌ కాకుత్స్థుఁ డింపారఁగన్ 35.

చం. జనకుని పూజ లంది ముని సంఘ వరేణ్యుఁడు కౌశికుండు ప
ల్కె నపుడు రామ లక్ష్మణులఁ గీర్తిత వీరులఁ జూపి యివ్విధిం
దనయులు వీర లద్ధశరథ క్షితి భర్తకుఁ జూడ నెంత్రు విం
టిని నృవరేణ్య! రామునకు డెందము సంతస మందఁ జూపుమా 36.

చం. విని ముని భాషణమ్ములను వింటినిఁ దెమ్మన రాజు వచ్చినన్
ధనువును వంచి యొక్క త్రుటిఁ ద్రాటినిఁ గూర్పఁగ రాఘవుం డటన్
ఘన బల వీర పుంగవుఁడు కార్ముక మప్పుడు విర్గె మధ్యకుం
దన రయ పూరణమ్మునకుఁ ధ్వానము రేఁగెను బిడ్గు భంగినిన్ 37.

ఉ. అంతట సత్య సంధ జనకాధిపుఁ డింపుగ నిత్తుఁ గూఁతునిన్
స్వాంతము నందు నిశ్చితుఁడ సత్వర మంచు గ్రహింప నీరు ధీ
మంతుఁడు సమ్మతింప నన మానుగ సేరక తండ్రి యిష్టమే
యింతిని నన్నొసంగె నృపు నింపుగ వృద్ధునిఁ బిల్చి పట్టికిన్ 38.

తే.గీ. జనకుఁడు స్వయమ్ముగ నొసఁగె సాధ్వి యైన
నాదు చెల్లెలి నూర్మిళ నలిన నేత్ర
సురుచిర ప్రియదర్శను దరుణి భార్య
గాను లక్ష్మణునకు భూమి కాంతుఁ డెలమి 39.

కం. రామున కిట్లు స్వయంవర
నామమున నొసంగఁ బడితి నాఁడు మొదలుగా
నీమమున రక్తి నుంటిని
యీ మనుజర్షభుని పైన నిర్వీరునిపై 40.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పదునెనిమిదవ సర్గము.

## అయోధ్యా కాండము

## సర్గము 119.

అనసూయా దేవి సీత పల్కులకు నానందించి రాత్రి కాఁగ రాముని వద్దకుఁ దా నిచ్చిన యాభరణాదులఁ దొడుఁగఁ జేసి పంపుట, రామునకు మునిపత్ని యొసఁగినవి సీత చూపించుట, ప్రభాత మయిన మునుల ననుమతిఁ గొని సీతారామలక్ష్మణులు వారు చెప్పిన దారిని దండకారణ్యము వైపున కేఁగుట.

కం. అనసూయా సతి గొప్ప ద
యిన యా కథ నాలకించి యింపుగ ధర్మా
ర్థ నిపుణ, మైథిలి పలుకం
గను, మూర్కొని శిరము సీతఁ గౌఁగిలి నుంచెన్ 1.

చం. మధురము గాను స్పష్టముగ మానిని! చెప్పితి స్వీయ గాథ ని
ట్లు ధరణిజా! ముదమ్ము నిడ లోల విలోచన! చెప్పినట్టి యీ
విధ మరయంగ సంతసము బెల్లుగఁ గల్గెను డెంద మందు నీ 2.

యధర యుగమ్ము నుండి యిటు లక్షర పంక్తులు రాల నిచ్చటన్

చం. రవి గనెఁ బశ్చి మాచలము రాత్రి శుభమ్ముగ నేఁగుదెంచు నా
దివమున భోజ నార్థ మయి తిర్గి విహంగ నికాయ మిప్డు సం
ధ్య వఱల విశ్రమింపగను దద్ద రయమ్మున నిద్ర కేఁగఁగన్
వివిధము లైన శబ్దములు విన్పడు చున్నవి మిక్కుటమ్ముగన్ 3.

ఆ.వె. మరలు చుండి రెల్ల మౌని పుంగవు లార్ద్ర
గాత్రు లుదక కలశ కరులు కరము
తడిసి నట్టి బట్ట లడరంగఁ దను లందు
నందఱు కలసి ముద మంది హృదుల 4.

తే.గీ. ఋషుల యగ్నిహోత్రము లందు నెలమి హోమ
మొనరుప యథావిధిఁ బరమ ముని నికాయ
మెగసిన కపోత వర్ణంపు టిద్ధ ధూమ
మగపడుచు నుండె వీవఁగ ననిల మచట 5.

కం. కొలఁది దళమ్ములతోఁ దరు
లలము కొనఁగ నెల్లెడల దిశాంతరములలో
వెలుఁగులు మటుమాయంబ జ
నుల కిత్తఱి ఘోరముగఁ దనుతర విలగ్నా! 6.

కం. తిరుగుచు నున్నవి యెల్లెడ
ల రాత్రి చరియించు జంతు రాజము లెల్లన్
దరి జేరి తిన్నెలకు నిటఁ
బరుండెను దపోవన మృగ పర్వము లెల్లన్ 7.

ఆ.వె. నభము దనరె నిశను నక్షత్ర భూషల
విలసితం బయి విరివిగను వెన్నె
ల తన చుట్టు విరియ రాత్రిమణి నభో త
లమ్మున నుదయించె రామ దయిత! 8.

తే.గీ. చనుమ జానకి రా మానుచరివి యై మ 9.

సలుమ యనుమతించితి నేఁగి సంతతమ్ము
మధురమైనట్టి కథ విని మనము నందు
సంతసించితి మిక్కిలి చారునేత్ర!

ఆ.వె. రమణి సీత! తగ నలంకరించు కొనుము
నా యెదుట నొసఁగిన నగల నెల్ల
దివ్యములను బ్రీతిఁ దిట్టముగ నొసఁగు
వత్స! నాకు నీకు భద్ర మగును 10.

కం. సుర సుత సన్నిభ జానకి
వరాభరణముల ధరించి వరముని సతికిన్
శిరమును వంచి ప్రణతు లిడి
వరాస్య చనె రామునిఁ గనఁ బరమప్రీతిన్ 11.

తే.గీ. అంత భూషిత వైదేహి నరసె వాక్య
విద వరుఁడు రాఘవేంద్రుండు ముదము వడసె
నా తపస్విని యిచ్చిన యట్టి దాన
ములను గాంచి యినకులాబ్ధి పూర్ణ విధుఁడు 12.

కం. వసనము లాభరణమ్ములు
నసమాన స్రజము లీయ ననసూయా దే
వి సతీమతల్లి సంప్రీ
తి సర్వమును బతికి సీత దెలిపె ముదమునన్ 13.

ఆ.వె. మనుజ మాత్రుల కిలఁ గన దుర్లభమగు నా
గౌరవమ్ము నందఁ గాంత సీత
హర్ష మంది రట మహారథి రాముండు
నింక లక్ష్మణుండు నెంత యేని 14.

కం. కడపెను బుణ్యపు టా నిశ
నుడుపతి నిభ వదనుఁడు మను జోత్తమ రఘు వీ
రుఁడు సిద్ధు లింకఁ దాపసు
లిడంగ ఘన పూజ లంది యెలమిని నచటన్ 15.

కం. రాతిరి గతింప రాఘువు
లే తెలవాఱంగ స్నానమేపారఁగ వా
రా తాపసుల హుతాగ్నులఁ
బ్రీతి ననుజ్ఞ నిడ మనిరి పెడలుట కంతన్ 16.

కం. పలికిరి యా ధర్మాచా
రులు తాపస వరులు వనచరులు దనుజుల ఘో
రుల సంచారం బా వనిఁ
గల దంచుఁ దెలుపుచు నింకఁ గాకుత్స్థులతో 17.

తే.గీ. రాక్షసులు పురుషాదులు రాఘవేంద్ర!
వివిధ రూపధారులు వని భీకరముగఁ
దిరుగు చుంద్రు నిరంతరము రుధి రాశ
నములు వ్యాలాది ఘోర మృగములు నడరి 18.

ఆ.వె. తినుచు నున్న వారి ముని పుంగవుల నప్ర
మత్తుల నయ రతుల నిత్తె మసుర
వరు లరణ్య మందుఁ బట్టి తిందురు వారి
నెల్ల నాపు మయ్య యిన కులేంద్ర! 19.

తే.గీ. వర మహర్షులు నిత్యము వనము నందు
ఫలముల కొఱకు నేఁగెడు పథ వర మిది
యీ గతి నరుఁగ దుర్గమ మీ వనమున
కిపుడు క్షేమ మగును మాన వేంద్ర! నీకు 20.

కం. ఘనులా శీస్సులు సాంజలి
మును లీయంగను బరంతపుఁడు రాముం డేఁ
గెను గూడి సతిని లక్ష్మణు
ఘనములఁ దూఱు రవి వోలెఁ గాననమునకున్ 21.

మ. రఘు వంశాబ్ధి శశాంక! కోప జిత పారావార! కోదండ పా
ణి! ఘనాకార విరాజితా! కపి వరానీకైక సద్రక్షకా! 22.

యఘు దూరీ కృత భక్త సంచయ! దశాస్యప్రాణ విధ్వంస! సూ
ర్య ఘృణివ్రాత నికాశ సద్విమల దేహా! రామ! సీతాపతీ!

కం. రామ! భవాఘ విరామా!
శ్యామల తను రుచి లలామ! సద్గుణ ధామా!
రామా! సత్య పరాక్రమ!
భామావనిజ హృదయాబ్ధి భాసిత సోమా! 23.

మాలిని. జగ దనుపమ ధానుష్కా! ధరా నంద నేశా!
నిగమ నిచయ వేద్యా! నీరజాక్షా! నరేశా!
భృగు ముఖ ముని వంద్యా! పీత కౌశేయ వాసా!
యగణిత కరుణా మగ్నాంతరంగా! మహాత్మా! 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున నయోధ్యా కాండ మందు నూట పందొమ్మిదవ సర్గము.

శ్రీమదాంధ్ర రామాయణము నందు నయోధ్యా కాండము సంపూర్ణము.